# నిర్వచనరామాయణము

## అయోధ్యాకాండము

గ్రంథకర్తలు :
కవిరాజహంస, కవికులాలంకార
శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు




ప్రచురణ :
శ్రీ పిహెచ్. వేంకటపతిరాజు, ఐ. ఏ. ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
1988

NIRVACHANA RAMAYANAMU - Ayodhyakandamu

*By*:

Kavirajahamsa, Kavikulalamkara

Sri Venkata Parvatheeswara Kavulu

Edited by:

Mudivarthi Kondamacharyulu

T. T. D. Religious Series No. 331

First Edition 1988.

Copies - 2,000.




Published by:

Sri CH. VENKATAPATI RAJU, I. A. S.,

Executive Officer,

T. T. Devasthanams,

Tirupati.




*Printed at:*

Tirumala Tirupati Devasthanams Press,

Tirupati-517507.

# ముందుమాట

వేద వేద్యే పురే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షాద్రామాయణాత్మనా.

వేదములచే ఎరుగదగిన పరాత్పరుడే దశరథపుత్త్రుడై పుట్టగా వాల్మీకి వదనారవిందం నుంచి వేదమే సాక్షాత్ రామాయణంగా వెలువడిందని మనవారి నమ్మకం.

భారతీయులకు రామాయణ భారత భాగవతాలు ప్రమాణగ్రంథాలు; నిత్య పఠనీయాలు; ఐహికాముష్మిక సుఖప్రదాలు. శ్రీమన్నారాయణుడు నరుడుగా రాముడుగా అవతరించి భూభారం తగ్గించి ఆదర్శమూర్త్తియై మెలగుతూ ఆచరణ రూపంలో ధర్మాన్ని ప్రబోధించినాడనుట సర్వజనసంవిదితమే. అట్టి రామాయణం భారతీయ భాషలందే కాక యావత్ప్రపంచ భాషలలోనికి అనువదింపబడి బహుళవ్యాప్తిలో ఉండడంవల్ల దాని ప్రాశస్త్యం వేఱుగా ఉగ్గడింప నవసరం లేదు.

రామాయణం ఆదికావ్యమనీ, వాల్మీకియే ఆదికవియనీ విమర్శకుల నిశ్చితాభిప్రాయం. సంస్కృతంలో ఛందోబద్ధమైన శ్లోకరచన ఈ కవితోనే ప్రారంభమైన దనడంకూడా నిశ్చయమే. సంస్కృతములో అధ్యాత్మ దుర్వాసో వాసిష్ఠ ఆనందాది రామాయణాలు కొన్నిఉన్నప్పటికీ వాల్మీకి రామాయణమునకే బహుళ వ్యాప్తి, పూజ్యత, పారాయణార్హత ఎక్కువ. దేశభాషలలో తులసీదాసరామాయణం, కంబరామాయణం ప్రశస్తరచనలు. తెనుగులో భాస్కర, రంగనాథ మొల్ల, గోపీనాథ రామాయణాలు పేర్కొనదగినవి. అధునాతనములు అనల్ప సంఖ్యలో ఉన్నవి.

ప్రస్తుతము ప్రచురితమవుతున్న ఈ నిర్వచన రామాయణ గ్రంథకర్తలు కవిరాజహంస, కవికులాలంకార బిరుదభాసురులు కీ.శే. శ్రీవేంకటపార్వతీశ్వర కవులు.

ఈ నిర్వచన రామాయణము మూలానుగుణముగా సులభశైలీశోభితంగా సర్వజన హృదయంగమంగా, అనవరత పఠన పాఠనయోగ్యంగా ఉన్నదని మా అభిప్రాయం.

తిరుమల తిరుపతి దేవస్థానములవారు బహుకాలంగా ధర్మప్రబోధమునకు ప్రచారమునకు ఉపయుక్తములైన ఎన్నో గ్రంథాలను అచ్చొత్తించి పాఠకులకు అందజేస్తున్నారు. మానవుడు తన ప్రవర్తనను చక్కబఱచుకొనుటకు, ఆదర్శ మానవుడుగా వెలుగొందుటకు, దాన దయా సత్యధర్మాది సద్గుణసంపత్తి అల వఱచుకొనుటకు రామాయణం ఎంతగానో ఉపకరిస్తుందని చెప్పవచ్చు. మానవ ప్రవర్తనలో మంచిపరివర్తనవస్తే అది దేశాభ్యుదయానికే పెట్టనికోట అవుతుంది.

రమారమి పదుమూడువేల పద్యసంఖ్యగల ఈ మహాగ్రంథంలో ఇప్పుడు అయోధ్యాకాండము ప్రచురిత మవుతున్నది. మిగిలిన కాండములుగూడ త్వరిత గతిని ముద్రితాలై ఆంధ్రపాఠకుల నలరింపగలవనీ, మంచిని పెంచగలవనీ ఆశి స్తున్నాము.

తిరుపతి
19–2–87

సి.హెచ్. వేంకటపతిరాజు
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# నిర్వచన రామాయణము

* * *

# అయోధ్యాకాండము

## 1-వ సర్గము

### దశరథుఁడు రాముని యువరాజుగాఁ జేయవెంచుట

### రాముని గుణగణములు

క. భరతుఁడు మాతులగృహమున
కరుగుచుఁ గొనిచనియె నఘుఁడగు శత్రుఘ్నున్
నిరత సమద శత్రుఘ్నున్
బరమానందమునఁ దనకు బాసట గాఁగన్. 1

గీ. అశ్వపతియైన మాతులుం డాదరించి
యాత్మజస్నేహమున నిత్య మరయుచుండ
భ్రాత శత్రుఘ్నునిం గూడి భరతుఁ డచట
సర్వసత్కారసత్కృతుం డగుచు నుండె. 2

ఆ. అచట నెల్లసుఖము లందుచు నుండియు
నతిసమర్థులైన య య్యనుజులు
ధరణివిభుని వృద్ధు దశరథుఁ దమతండ్రి
నాత్మ దలఁచుచుండి రనవరతము. 3

ఆ. అమితతేజుఁ డైన యవనినాథుఁడు గూడఁ
దన్ను నెడసిచనిన తనయవరుల
స్మరణచేయుచుండె భరతశత్రుఘ్నుల
నింద్రవరుణసముల నెల్లవేళ. 4

ఆ. దేహమందుఁ బొడము బాహుచతుష్కంబు
నేకభావమున గ్రహించురీతిఁ
బురుషఋషభులైన పుత్త్రుల నల్వుర
నొక్కలాగె చూచుచుండె విభుఁడు. 5

ఆ. ఐనవారిలోన నమితతేజుండగు
రాముఁ డొకఁడె విభుని ప్రేమరాశి
యఖిలభూతముల స్వయంభువుఁ డొక్కఁడే
యధికగుణగరిష్ఠుఁ డైనయట్లు. 6

క. వరగర్వితుఁ డగు రావణుఁ
బరిమార్పఁగ సురలు తన్నుఁ బ్రార్థించుటచే
నరజగతి సనాతనుఁడగు
హరి యా రాముఁడయి జనన మందుట వినమే. 7

గీ. అమితతేజస్వి యగునట్టి కొమరుఁ గాంచి
సుభగసౌశీల్య కౌసల్య శోభఁగాంచెఁ
బరమతేజోల్లసిత వజ్రపాణియైన
యమరనాయకునిం గన్న యదితిఁ బోలి. 8

క. వీరాగ్రణి యనసూయుం
డా రాముఁడు సౌమ్యసుందరాకారుం డీ
ధారుణి నుపమారహిత కు
మారుఁడు గుణదశరథోపమానుఁడు తలఁపన్. 9

చ. అతఁడు ప్రశాంతమూర్తి మృదులామృతభాషి కటూక్తి కెన్నఁడున్
ప్రతివచనంబునీని మతిమంతుఁడు స్వల్పకృతోపకార హ
ర్షితుఁ డపకారకోటిని స్మరింపని ధీరుఁడు పూర్వభాషి యా
యతబలశాలి వీర్యనిధి యయ్యును నిర్మదుఁడై విరాజిలున్. 10

గీ. అతఁ డస్త్రాభ్యసనసమయములఁ గూడ
జ్ఞానశీలవయోవృద్ధులైనయట్టి
సాధుసజ్జనులం గూడి సంతతంబు
శాస్త్రచర్చల నింపుమై జరపుచుండు. 11

గీ. అనృత మాడనివాఁడు ప్రియంవదుండు
బుద్ధిమంతుండు గురువృద్ధపూజకుండు
ప్రజలఁ బ్రేమించి ప్రేమింపఁ బడెడువాఁడు
మధురభాషి విద్వాంసుఁ డా మహీపసుతుఁడు. 12

గీ. శుచి దయాళుఁ డక్రోధుండు సువ్రతుండు
నవనిసురపూజకుండు దీనావనుండు
నాభిజాత్యుండు క్షత్రధర్మాభిమాని
క్షాత్ర మతఁ డెంచు సద్యశ స్స్వర్గద మని. 13

ఆ. అతఁడు వేత్త యగుట నశుభంబు పలుకఁడు
వికృతవచనములను వినఁగఁబోఁడు
దుత్తరోత్తరప్రయుక్తసూక్తుల బృహ
స్పతిని బోలునట్టి చతురవక్త. 14

గీ. రూపవంతుండు తరుణుఁ డారోగ్యశాలి
క్రమసంభాషణుఁడు దేశకాలవిదుఁడు
పురుషహృదయం బెఱింగిన ప్రోఢ యతఁడు
సారధర్ముండు జగదేకసాధుమూర్తి. 15

క. రాముఁడు సద్గుణమణిగణ
ధాముఁడు దశరథనృపాలతనయుండు ప్రజా
స్తోమబహిఃప్రాణంబై
ప్రేమనిధానుఁడయి వెలయుఁ బ్రియగుణములచేన్. 16

క. అతఁడు విద్యావ్రత సు
స్నాతుండై సాంగవేద సంవేదియునై
శాతాస్త్రశస్త్రవిద్యో
పేతుండై తండ్రి మించి పేరు వహించెన్. 17

క. శుభసంపత్కరవంశ
ప్రభవుఁడు ధర్మార్థవిదులు బ్రహ్మజ్ఞులచే
నభిబోధితుండు ఋజుగతి
యభయుఁడు సూనృతుఁడు రాముఁ డనఘుం డెందున్. 18

గీ. ధర్మకామార్థసమయతత్త్వజ్ఞుఁ డతఁడు
స్మృతియుతప్రతిభాన్వితమతి యతండు
సామయిక లౌకికాచార చతురుఁ డతఁడు
వివిధవిద్యారహస్యకోవిదుఁ డతండు. 19

గీ. వినయశీలుండు భావగోపనుఁ డతండు
సత్సహాయుండు మంత్రరక్షకుఁ డతండు
అనితరనివర్తితామర్షహర్షుఁ డతఁడు
త్యాగసంయమకాలవిద్వర్యుఁ డతఁడు. 20

ఆ. సుదృఢభక్తియుతుఁడు సుస్థిరప్రజ్ఞుండు
దుష్టదుర్వచనవిదూరగుండు
నప్రమత్తచిత్తుఁ డాలస్యరహితుండు
స్వపరదోషవిదుఁడు నృపసుతుండు. 21

ఆ. మేలు మఱపఁబోఁడు మేలైన చదువరి
యొరులకొలఁదిగొప్ప లెఱుఁగువాఁడు
తగినవారిఁగొనఁగఁ దగురీతి దండింపఁ
దెలివిగలిగినట్టి దిట్ట యతఁడు. 22

ఆ. శిష్టసంగ్రహమును దుష్టనిగ్రహమును
స్థాన మెఱిఁగి సేయఁజాలువాఁడు
నాయసత్క్రియల నుపాయజ్ఞుఁ డగువాఁడు
సముచితముగ వ్యయముసలుపువాఁడు. 23

ఆ. వివిధశాస్త్రసారవిత్సార్వభౌముండు
సాహితీసమష్టిచక్రవర్తి
యర్థధర్మసంగ్రహాలసత్వములేని
కామపూరుషార్థగామి యతఁడు. 24

గీ. లలితశిల్పాది చిత్రకళావిదుండు
ధనచయవిభాగపంచ విధానవేది
వాజివారణారోహణవశ్యగతుల
జాణయగువాఁడు శ్రీరామచంద్రమూర్తి. 25

గీ. శ్రేష్ఠుఁ డాతండు ఘనధనుర్వేదవిదుల
నతిరథానేకవీరపూజిత పదుండు
భండనోన్ముఖుఁ డరివీరభంజనుండు
సైన్యవిన్యాసరచనా విశారదుండు. 26

క. అతఁ డనసూయుఁ డగర్వుఁడు
జితమన్యుఁడు కాలగతికిఁ జిక్కని ధీరుం
డితరుల నవమానింపని
మతిమంతుఁ డనుత్తముఁడు నమత్సరుఁ డవనిన్. 27

ఉ. రాముఁడు వీర్యసంపద సురప్రభుఁబోలి క్షమాగుణంబునన్
భూమినిఁబోలి బుద్ధి గురుఁబోలి ప్రజాభిహితంబులున్ బిశ్వ
ప్రేమవిధాయకంబులగు శ్రేష్ఠగుణాళిఁ ద్రిలోకరంజకుం
డై మహితప్రదీప్తుల సహస్రమయూఖునిఁ బోలి రాజిలున్. 28

గీ. ఆశ్రితావనవ్రతుండైనవాని
నప్రధృష్యపరాక్రముండైన వాని
నఖిలలోకపాలోపముండైనవాని
రాజుఁగాఁ గోరె ధరణి యా రామవిభుని. 29

## దశరథుఁడు రాముని రాజుగాఁ జేయనెంచుట

గీ. శత్రుదమనుండు దశరథేశ్వరుఁడు సుతుని
రాము ననుపమసుగుణాభి రాముఁ గాంచి
వృద్ధ చిరజీవి తాను జీవించియుండ
నతని ప్రభుఁ జేయఁ జింతసేయంగఁ దొడఁగె. 30

క. "నాకూర్చు రామచంద్రుని
నీ కువలయపట్టభద్రు నెపు డొసరిచి నే
నా కన్నులారఁ గాంచెద
నోకదె" యనుచింత నృపతి యుల్లము నిండెన్. 31

ఆ. "అఖిలభూతకోటి ననుకంపఁ గనువాఁడు
ప్రజలవృద్ధిగోరు భద్రమూర్తి
లోకులకుఁ బ్రియుఁడు నాకంటె రాముండు
వాన గురియు వారివాహుఁ బోలి. 32

గీ. విక్రమబలంబులను యమ శక్రసముఁడు
దేవదేశికతుల్యుండు ధీబలమున
ధైర్యసంపద ఘనమహీధరనిభుండు
నన్ను మించిన సుగుణ సంపన్నుఁ డతఁడు. 33

గీ. ఉర్వియెల్లను బాలించుచున్న రాముఁ
గన్నులారంగ నీముప్పుకాలమందు
సుఖముగాఁ గాంచి స్వర్గంబుఁ జూఅలాడఁ
గలుగు భాగ్యంబు నే నందఁగలనె" యనుచు. 34

చ. ఇతరనృపాల దుర్లభసమిద్ధమనోజ్ఞ గుణాభివంద్యు ను
న్నతుని ననన్యశోభనగుణప్రకరాన్వితు రామచంద్రునిన్
సుతుఁగని యౌవరాజ్యపదశోభితుఁ జేయ నరేంద్రుఁ డెంచి న
న్మతియుతులైన వారల నమాత్యులఁ బిల్వఁగఁ బంచి యిట్లనున్. 35

గీ. "అవని నంతరాళమ్మున నాకసమున
దారుణోత్పాతములు భయదంబు లయ్యె;
జర భరం బయి నామేను నసి దొఅంగె
రామునిం జేయఁదగు యువరాజుగాఁగ. 36

క. నా కొడుకు బుద్ధిమంతుఁడు
రాకాబ్జముఖుండు మత్సరంబును దాల్పన్
లోకప్రియుఁడగు నతని మ
హీకాంతునిఁ జేయఁ బ్రజల కిష్టంబె యగున్." 37

క. అని నృపుడు తనకుఁ బ్రజలకు
ననుపమశుభకరము ప్రియము ననియెంచి లభిం
చిన సుముహూర్తముననె రా
మునకున్ బట్టంబుగట్టు ముచ్చట పడియెన్. 38

ఆ. అంత దశరథేశుఁ డఖిలదేశస్థులఁ
బౌరజానపదులఁ బ్రజలనెల్ల
భూమిపాలవరుల సామంతులను నెల్ల
వారిఁ బిలువ నంపె వేఱువేఱ. 39

ఆ. అనవకాశ మగుటు నతిదూరమం దుంట
జనక కేకయులకు జనవిభుండు
వార్త నంపఁడయ్యె వార లీ శుభవార్త
వెనుక నాలకింతు రని తలంచి. 40

ఆ. ఆ మహోత్సవమున కరుదెంచువారిని
విడుదు లిచ్చి యర్హవిధులఁ దనిపి,
జనవిభుండు గాంచె సమలంకృతులఁ వారి
బ్రజలఁ నెలమిఁ గాంచు బ్రహ్మ బోలి. 41

ఆ. అపుడు శత్రుదమనుఁ డా రాజు కొలువుండ
నటకు వచ్చియున్న యవనినాథు
లధిపదత్తములగు నర్హాసనంబుల
నధివసించి రతని కభిముఖముగ. 42

గీ. వినతులును బూజితులు నుపవిష్టులైన
పార్థివులు చారులును జానపదులు గొలువ
శోభిలుచు నుండె దశరథక్షోణినాథుఁ
డమరసేవితుం డగు సహస్రాక్షుఁ బోలి. 43

# 2–వ సర్గము

## దశరథుఁడు తన నిశ్చయమును కొలువుదీర్చియున్న సచివ సామంతులకు ప్రజలకుఁ దెల్పుట

క. క్షితిపతి పరిషజ్జన సం
తతి నాదరణావలోకనములఁ దనుపుచున్
హితములు ప్రథితములు ముదా
న్వితములు నగు పలుకు లిట్లు వినుపఁ గడంగెన్. 44

చ. జనపతి యట్లు రాజులను సభ్యులఁ గాంచి గభీరదుందుభి
స్వననిభమున్ మనోజ్ఞమును సత్త్వభుఁలక్షణలక్షితంబు న
త్యనుపమమున్ రసాంచితము నైన స్వరం బొలయన్ దిశాప్రతి
ధ్వనిత నినాదపూర్ణజలదంబును బోలి వచించె నీ క్రియన్. 45

క. "నాకుంగల యీ రాజ్యము
నా కులజులు పూర్వనృపులు నందనులీలన్
జేకొని పరిపాలించుట
మీకున్ లోకులకు విదితమే యగుఁ గాదే! 46

గీ. పావనేక్ష్వాకువంశనృపాలురెల్ల
నెన్నొ సదుపాయములఁ గూర్చి యేలినట్టి
యీ సుఖార్హరాజ్యంబున కిపుడు నేను
శ్రేయమునుఁ గూర్ప మదినిఁ గాంక్షించియుంటి. 47

ఉ. చన్న నృపాలసత్తముల సత్పథముంగని నేను నట్టులే
కన్నుల వత్తివెట్టుకొని కాచితి శక్తికొలంది రాజ్య; మిం
దున్న ప్రజావళిం దనుపుచుండు హితక్రియలందె చెల్లె నా
కున్నవయస్సు; వృద్ధుఁడయియుంటిని నీవెలియెల్లనీడనే. 48

చ. వరనృపసత్త్వభావ పరివర్ధనశీల మనిర్జితారి దు
ర్భరమగు ధర్మరాజ్యపరిపాలనసేయుచు డస్సినాఁడ; ని
ట్లురువది వేలవత్సరము లాయువుఁ గాంచి; విశీర్ణదేహినై
జరితుఁడనైతిఁ గష్టపడఁజాల నిఁకన్ విరమింపఁ గోరెదన్. 49

గీ. ఈ సభాస్తారులైయున్న యెల్లవిభుల
ద్విజవసిష్ఠాదులను సమ్మతింపఁజేసి
యిఁకఁ బ్రజాహితకార్యంబు లెల్లఁదీర్పఁ
బుత్త్రు నియమించి విశ్రాంతిఁ బొందువాఁడ. 50

గీ. అఖిలగుణముల నను బోలి యవతరించి
పేరుగాంచినవాఁడు నా పెద్దకొడుకు
రామచంద్రుండు వైరిపురంజయుండు
వరపరాక్రమమునఁ బురందరనిభుండు. 51

ఆ. పరమధర్మరతునిఁ బురుషవరేణ్యుని
బుష్యయుక్తచంద్రుఁ బోలువాని
రామచంద్రు యౌవరాజ్యాభిషిక్తుని
జేసి చూచి ప్రీతిఁ జెందువాఁడ. 52

క. అనురూపనాథుఁడగు మీ
కనఘశ్రీయుతుఁడు లక్ష్మణాగ్రభవుఁడు పా
వనచారిత్రుఁడు రాముఁడు
ఘనత జగత్త్రయము నేలఁగల సాధుండౌ. 53

క. ఆ రామునిభుజములపై
నీ రాజ్యభరంబునెల్ల నిపుడు నిలిపి నే
ధారుణిఁ బ్రజలకు శ్రేయము
గూరిచి శ్రమవాయ విరతిఁగొనువాఁడ నిఁకన్. 54

క. ముదుసలినై యుండిన నా
కిది యనురూప్యమగు కార్యమేని సుమంత్రం
బిది యగునేని వచింపుం
డిది మీ యనుమతిని గొనక యె ట్లొనరింతున్? 55

గీ. నా ప్రియం బిది నేఁ దెల్పినాఁడ నైన
వేఱు హితమున్న మీ రెంచి వినుపఁ దగును;
తన తలంపునకంటె మధ్యస్థచింత
యధికఫలదంబు నుత్తమం బగునుగాదె." 56

క. అని యుక్తముగా దశరథ
జననాథుఁడు దెలుప సంతసంబున రాజున్
వినుతించిరి. వర్షఘనా
ఘనముం గని కూయు బర్హిగణముల మాడ్కిన్. 57

క. ఆ రాజవరుల యంగీ
కారధ్వనితోడ హర్షకలితాత్మసభా
స్తారగణసాధువాద మ
హారవము సెలంగె నా సభాంగణ మద్రువన్. 58

గీ. అర్థధర్మవిదుండగు నా నృపాలు
భావము నెఱింగి బ్రాహ్మణుల్ పార్థివులును
పౌరులును జానపదు లేకభావమతిని
మంతన మొనర్చి యని రిట్లు మహిపుఁ గాంచి. 59

ఆ. "ఓ నరాధినాథ! వేనవేలేడు లీ
పుడమి నేలి ముదిసి బడలినావు;
రామచంద్రు ధర్మరతు యౌవరాజ్యాభి
షిక్తుఁ జేయుటింకఁ జెల్లుఁగాదె. 60

గీ. అమితబలుఁడు మహాబాహుఁడైనవాని
వరగజారూఢుఁడై వేడ్కవచ్చువాని
ననఘు రఘువీరు ఛత్రావృతాననేందు
రాము దర్శింపఁ గోరుచున్నాము మేము." 61

క. అని సభ్యు లేకముఖముగ
వినుపింపఁగ నాలకించి విపులేశ్వరుఁ డా
జనుల మనఃప్రియ మెల్లం
గనియుం గన నట్లు వారిఁగని యిట్లనియెన్. 62

ఉ. "మీ మనమున్ గ్రహింపనెలమిన్ బలుకాడిన యంతలోనె శ్రీ
రామకుమారు వేగ యువరాజును జేయఁగఁ గోరుచుంటి రే
మీ? మఱి సంశయంబొదవె; నేను స్వధర్మము దప్పకుండఁగా
నీ మహి నేలలేదొ? దొసఁగేమి యొనర్చితినో వచింపరే. 63

## సభ్యులు శ్రీరాముని గుణగణంబులను గీర్తించుట

గీ. జనవిభుం డిట్లు పల్క నా సభ్యు లెల్ల
"నధిప! నీ పుత్త్రుఁ డఖిలకల్యాణగుణుఁడు
త్రిదశతుల్యుఁ డా ధీమంతు ప్రియగుణముల
వినుతు మానందకరములు వినుము వాని. 64

గీ. రామచంద్రుండు సత్యపరాక్రముండు
దివ్యగుణగణంబుల సురాధిపసముండు
సదమ లేక్ష్వాకు వంశసంజనితులైన
రాజులం దుత్తముండు ధరాతలేంద్ర! 65

గీ. జగతిలో రాముఁ డొక్కఁడే సత్పురుషుఁడు
రాముఁడే సత్యధర్మపరాయణుండు
సంపదయు ధర్మమును రామచంద్రునందె
తోడునీడలై జనియించి కూడియుండె. 66

గీ. సర్వజనరంజనంబునఁ జంద్రునకును
క్షమ ధరిత్రికి మతి సురాచార్యునకును
వరపరాక్రమప్రౌఢిని వాసవునకు
సాటియగువాఁడు శ్రీరామచంద్రమూర్తి. 67

సీ. సత్యవ్రతరతుండు సర్వధర్మజ్ఞుండు
సుభగశీలుం డనసూయుఁ డతఁడు
సమధికక్షాంతుండు సాంత్వనగుణరాశి
ప్రియవాది నిర్జితేంద్రియుఁ డతండు

నిఖిలభూతహితుండు నిశ్చలచిత్తుండు
పరమకృతజ్ఞుండు భవ్యుఁ డతఁడు
నిర్జరాసురనరనిఖిలాస్త్రనిపుణుండు
వేదవేదాంగసంవేది యతఁడు

గీ. వృద్ధులు బహుశ్రుతులు నైన ద్విజులసేవ
సలిపి యనుపమకీర్తి తేజములఁ గన్న
సమ్యగధ్యయనవ్రతస్నాతుఁ డతఁడు
రమ్యగుణధాముఁడు జనాభిరాముఁ డతఁడు. 68

గీ. అభిజాత్యసంపద్యుక్తుఁ డైనవాఁడు
జ్ఞానశీలుం డదీనాత్ముఁ డైనవాఁడు
గానవిద్యావిశారదుం డైనవాఁడు
నా మహామతియగు భరతాగ్రజుండు. 69

క. ధర్మార్థశాస్త్రవిద్యా
మర్మజ్ఞులు శ్రేష్ఠులైన మహివిబుధులచే
నర్మిలి సుబోధితుండగు
నిర్మలచరితుం డతండు నృపకులతిలకా! 70

గీ. అనికి గ్రామపురార్థమై యరిగి నపుడు
జయముఁ గనకుండరాఁడు లక్ష్మణునితోడ
వాహనము నెక్కి విజయియై వచ్చునప్పు
డడుగకయపోఁడు ప్రజలశ్రేయంబు గూర్చి. 71

గీ. అఖిలపౌరుల నాత్మీయు లట్లుగాంచి
వారియగ్నుల శిష్యుల దారసుతుల
క్షేమలాభాదికములఁ బ్రశ్నించుచుండుఁ
దనయులసుఖం బరయు కన్నతండ్రి యట్లు. 72

గీ. నిత్యసత్క్రియాస్వాధ్యాయనిష్ఠు లగుచు
వినయభయభక్తియుక్తి నేవేళ మీకు
సేవగావింతురే కదా శిష్యు లెల్ల
ననుచు రాముండు మ మ్మెప్పు డడుగుచుండు. 73

క. జనములకష్టసుఖంబులు
దనవిగఁగని చింతయును ముదంబును గాంచున్
వినుతాత్ముండగు రాముఁడు
తనయులఁ గని యనుభవించు తండ్రియ పోలెన్. 74

ఆ. పలుకుదిరుగఁబోఁడు బలితంపువిలుకాఁడు
మొలకనవ్వ చిలుకఁబలుకువాఁడు
నిర్జితేంద్రియుండు నిత్యధర్మాత్ముండు
చారుకీర్తి రామచంద్రమూర్తి. 75

గీ. కొలుచువారలకును మేలుగూర్చువాఁడు
పొరితముగూర్చు నుడు లాడఁబోనివాఁడు
నొప్పునుడికారమున వేల్పుటొజ్జఁబోలి
సరికిసరి పల్కఁగల నుడువరి యతండు. 76

క. ఆయత తామ్రాక్షుఁడు సు
భ్రూయుగ్మఁడు వీర్యశౌర్యభుజబలయుక్తిన్
శ్రీయుతుఁ డగు సాక్షా న్నా
రాయణుఁ డఖిలాభిరాముఁ డగు రాముఁ డిలన్. 77

గీ. స్వప్రజావనధర్మతత్త్వజ్ఞుఁ డతఁడు
రాగవిద్వేషరహితాంతరంగుఁ డతఁడు
త్రిజగముల నేలగాఁ జాలు దిట్ట యట్టి
రామునకు భూమిఁ బాలించు టేమిలెక్క? 78

క. ఈ రాము దయాకోపము
లూరక పోవంగ నేర వొక్కపు డైనన్
గ్రూరుల వధ్యులఁ జంపియె
తీరు నతఁ డవధ్యులను మదిం గనఁ డలుకన్. 79

క. శ్రీరామచంద్రదవిభుని కృ
పారసపరిపూర్ణదృష్టిఁ బడు ధన్యునకున్
గోరిన యభిమతములు చే
కూరుం దక్షణమ కుప్పఁగూరలు గాఁగన్. 80

క. శాంతంబులు త్రిభువనజన
కాంతంబులు నగు ప్రమోదకరగుణముల భా
స్వంతుఁడు రాముఁ డలరు ద్యుతి
మంతుండై వెలయు నంశుమంతుని పోల్కిన్. 81

గీ. అట్టి కల్యాణగుణధాముఁడైనవాని
నఖిలలోకపాలోపముఁ డైనవాని
ననుపమామోఘ విక్రముఁడైనవాని
రామవిభుఁ గోరుచున్న దీ భూమికాంత. 82

గీ. దశరథేశ్వర ! నీ పుణ్యవశమువలన
శుభకరుండైన యీ తనూజుండు గలిగెఁ;
బుత్త్రగుణములను మరీచిపుత్త్రుఁడైన
కశ్యపుంబోలి నీ భాగ్యగరిమఁ జేసి. 83

మ. సురగంధర్వమహోరగాసుర ఋషిస్తోమంబులున్ మౌనులున్
బరు లాత్మీయులు పౌరజానపదులున్ బాహ్యాంతరప్రస్థితుల్
నరులు న్నారులు గోరుచుండిరి సువిజ్ఞాతాత్మునిన్ రామునిన్
జిరమాయుష్య మనామయంబు బలమున్ శ్రేయంబులుం జెందఁగన్.
84

క. ఆబాలవృద్ధయువతులు
పూఁబోణులు నెల్లవేలుపులను వరదులన్
రేఁబవలు గొలుతురుశుభ
ప్రాబల్యముఁగూర్చి రామభద్రునిఁ బ్రోవన్ 85

ఆ. ఇట్టి మేము రాము నిందీవరశ్యాము
నిర్జితారివీరు నీకుమారు
యౌవరాజ్యయుక్తు నరయఁ గోరుచునుంటి
మధిప! కరుణఁగూర్ప నగును మాకు. 86

ఆ. నీ కుమారు నట్టిలోకహితాసక్తు
నత్యుదారగుణుని హరిసమాను
నతిముదమున వేగ మభిషిక్తుఁజేసి మా
వాంఛితంబు దీర్పు వరద! యనిన." 87

## 3–వ సర్గము

### వసిష్ఠ వామదేవులను రాముని యౌవరాజ్యాభిషిక్తునిఁ జేయుటకువలయు యత్నములు చేయవలసినదిగా దశరథుఁడు కోరుట

ఆ. ధరణినేత సభ్యవరుల కేల్దామర
మోడ్పులను గ్రహించి ముదము గాంచి
యపుడు వారలకుఁ బ్రియంబులై హితములై
యింపునింపు నుడుల నిట్టు లనియె. 88

ఆ. "నాకు మెచ్చువచ్చె నా యగ్రసుతుఁ బ్రియు
రాము మీరు యౌవరాజ్యమందు
నిలుపఁగోరుచుంట నేను ధన్యుఁడ నైతి
సాటిలేని భాగ్యశాలినైతి. 89

చ. అని సభవాదిదన్ని నృపుఁ డంత వసిష్ఠుని వామదేవునిం
గనుఁగొని సభ్యులెల్ల వినఁగా "నిదె చైత్రము శ్రీకరంబు పా
వనము సుపుష్టితోపవనవైభవ మీ మధుమాసమందె రా
ముని యువరాజుఁ జేయఁదగుఁ బూని సమస్తముఁ గూర్పుఁడీ"యనన్ 90

గీ. క్షితిపుఁ డీ ట్లానతిచ్చి ముగింపఁగానె
ప్రజల యానందరావ ముప్పరముఁ దాఁకె
మెల్లమెల్ల నా రవళి శమించినంత
ముని వసిష్ఠునిఁ గాంచి యిట్లనియె విభుఁడు. 91

ఆ. "సంయమీంద్ర! రామచంద్రుని పట్టాభి
షేకమునకు నేమి చేయవలెనొ
యెట్టి పరికరంబు లిటఁ గూర్పవలయునో
యిపుడె మీర లానతీయవలయు." 92

క. అని జనపాలుండు వచిం
చిన విని ద్విజసత్తముఁడు వసిష్ఠుం డెదుటన్
వినతులయియున్న మంత్రులఁ
గని యానతిచేసె నిట్లు కార్యక్రమమున్. 93

చ. "అలఘుమణుల్ సువర్ణరజతాదులు కాన్కలు నోషధీతతుల్
తెలివిరి పూవుదండలును దేనెలు లాజలు గోఘృతంబు లు
జ్జ్వలనవధౌతవస్త్రములు స్యందనమున్ సకలాయుధంబులన్
వెలిగొడుగున్ సితధ్వజము వీజనమున్ సమకూర్పఁగాఁ దగున్. 94

ఆ. స్వర్ణశృంగవృషము చతురంగబలమును
భవ్యలక్షణాఢ్యభద్రగజము
సావయవవిశిష్టశార్దూలచర్మంబు
వడిగ సిద్ధపఱుప వలయు మీరు. 95

ఆ. మఱియు వలయునట్టి పరికరంబుల నెల్ల
స్వీకరించి వేగఁ బోకమున్న
యుర్వివిభుని యగ్నిహోత్రగృహము చెంతఁ
బదిలపఱుపవలయు భద్రగతిని. 96

క. పురతోరణముల నంతః
పురముల ద్వారముల గంధములఁ జల్లఁడు క్రొ
వ్విరిదండలఁ గైసేయుఁడు
సురభిళధూపంబు లిడుఁడు శోభనలీలన్. 97

గీ. వ్యంజనాదులతోఁ బరమాన్నములను
శతసహస్రద్విజాళి కాయితముచేసి
ఘృతము దధిలాజలధికదక్షిణల నొసఁగి
రేపకడ భూసురుల సత్కరింప వలయు. 98

గీ. నరిగ రేపు సూర్యోదయసమయమునకె
స్వస్తివాచనాదికములు జరుగఁగాన
ద్విజులఁ బ్రత్యేకముగ నిమంత్రితులఁ జేసి
పరిషదుచితాసనంబు లేర్పఱుపవలయు. 99

గీ. ఎడనెడఁ బతాక లెత్తింపుఁ డిందునందు
మేటిబాటల నిడుఁడు పన్నీటిజల్లు
గరగరికఁదేఱు నట్టువమెఱుఁగుఁబోండ్లఁ
గుదురుకొల్పుఁడు రెండవకోట వీట. 100

క. దేవాలయచైత్యంబులఁ
బావన మధురాన్నభక్ష్య బహుధనములతోఁ
బూవులతో నిలుపందగు
దేవబ్రాహ్మణులఁ దనుప దృఢధార్మికులన్. 101

ఆ. ఉడుపు లొప్పమీఱ నిడువాలు మొల్లవేల
గడుసుమేనిముఱువు దొడిగికొన్న
జోదు లెచ్చరికల నూఁది మన్నీని మో
సాల నిలువవలయు సంబరమున." 102

ఆ. ఆ వసిష్ఠవామదేవులు నైష్ఠికు
లట్లు మంత్రివరుల కానతిచ్చి
తక్కుకార్యములను ధరణీశునకుఁ దెల్పి
చేయుచుండి రతనిచెంతనుండి. 103

ఆ. ఆర్యు లంత నెల్లకార్యంబులను దీర్చి
యెలమి దశరథునకుఁ దెలుపుటయును
ననఘు రాము వేగ మరిగి తోడ్కొనిరాఁగ
నా సుమంత్రుఁ బంపె నధిపుఁ డపుడు. 104

## రాజాజ్ఞనుగొని సుమంత్రుఁడు రామునిసభకుఁ గొనితెచ్చుట

క. రాజాజ్ఞఁ గొని సుమంత్రుఁడు
రాజితగుణు రామచంద్రు రథికవరేణ్యున్
భ్రాజద్రథాధిరూఢునిఁ
దేజస్విని వెంటఁ దోడితెచ్చుచు నుండన్. 105

గీ. అపుడు పూర్వోత్తరాపరయామ్యభూమి
పతులు మ్లేచ్ఛులు వనశైలపాలకులును
వాసవునిగొల్చు దేవతావళిని బోలి
యొలసియుండిరి దశరథు నోలగమున. 106

ఆ. నృపులనడుమ రాజఋషి యయోధ్యేశుండు
మరుతులందు వెలయుమఘవుఁబోలి
హర్మ్యమున వసించి యరయుచుండె రథస్థుఁ
జిన్నికొమరు రాముఁ గన్నుదనియ. 107

సీ. కమనీయ మధుర రాకాచంద్ర వదనుని
సత్యసంపన్ను నాజానుబాహు
రమణీయ గంధర్వ రాజోపమానుని
విశ్వవిశ్రుతమహావిక్రమాఢ్యు
మహనీయ మదమత్త మాతంగ గమనుని
సత్యప్రసన్నునిఁ బ్రియదర్శనీయు
వరణీయభువనసుందరరూపగుణయుక్తిఁ
బురుషదృక్చిత్తాపహరణమూర్తి

గీ. నలఘుఘర్మప్రతప్తప్రజాళి కెల్ల
నంబుదముఁబోలి యాహ్లాదియైనవాని
రాము నిందీవరశ్యాముఁ బ్రేమధాముఁ
దనివితీరక కనుచుండె దశరథుండు. 108

ఆ. అపుడు తేరుడించి యా సుమంత్రుఁడు గూడ
నంజలించి వెంటనంటిరాఁగ
వెండికొండఁ బోలు విభునిసౌధము రాముఁ
డధిగమించె జనకు నరయువేడ్క. 109

క. కేలుందమ్ములు మొగిడిచి
ఫాలంబునఁ జేర్చి రామభద్రుఁడు చని భూ
పాలుఁడగు తండ్రిపదముల
వ్రాలి స్వనామమ్ము దెలిపి వందనము లిడెన్. 110

ఆ. ఇట్లు వినతుఁ డగుచు నెదుట నిల్చిన కూర్మి
పట్టి మోడ్పుఁగేలుపట్టి దిగిచి
కౌఁగిలించి దివ్యకాంచనమణిపీఠిఁ
బ్రేమ నిలిపె రాము భూమినేత. 111



క. శ్రీరఘువరుఁ డా కనకో
దారాసనమున వసించి తనురుచి దానిన్
నీరజహితుఁ డుదయప్రభ
మేరువు నలతించినట్లు మెఱయంజేసెన్. 112

ఆ. నృపుని సభ వెలింగె నపు డభిరామమై
ప్రేమధాముఁడైన రాముచేత
నమృతధాముచేత విమలతారాగ్రహ
భరితశారదాభ్రపదముఁ బోలి. 113

క. క్షితిపతి నిజాత్మజునిఁ బ్రియ
సుతుఁ గాంచుచు హర్షపరవశుం డయ్యె నలం
కృతుఁ డాత్మాదర్శగత
ప్రతిబింబము గనుచు సంబరముఁజెందు క్రియన్. 114

గీ. కశ్యపబ్రహ్మ దేవేంద్రుఁ గాంచినట్లు
సస్మితానను సుతు రామచంద్రుఁ గాంచి
పుత్త్రవంతులలో నుత్తముండు నృపుఁడు
మృదుమధురభాషితంబుల నిట్టు లనియె. 115

క. "నా పత్నుల సహచరియగు
నా పట్టపురాణి కీవు నందనుఁడవు న
న్నేపోలు రూపగుణములఁ
జూపట్టెదు మత్ప్రియాత్మజుండవు రామా! 116

గీ. మముఁ బ్రజలఁ దన్పు సద్గుణమణివి నీవు
యౌవరాజ్యంబు గొనుము పుష్యమిని తేపు;
అఖిలగుణనిధి వగుదు పీవైన నీకు
నేను బిత్రువత్సలతఁ దెల్పు హితము వినుము. 117

క. శ్రీమహితవినయసుగుణా
రాముఁడ వింద్రియజయాభిరాముఁడ వగుచున్
కామక్రోధవ్యసన వి
రాముఁడవై మెలఁగు మయ్య రామకుమారా! 118

క. ప్రత్యక్ష పరోక్షంబుల
నిత్యప్రక్రియల నెల్ల నెఱపుచు భృత్యా
మాత్యప్రకృతుల నెల్లర
నత్యంతప్రీతిఁ దనుప నగును కుమారా! 119

చ. అతులిత ధాన్యకోష్ఠ వివిధాయుధగేహసమృద్ధితోడ నం
తత ధనకోశవర్ధన మొనర్చుచుఁ దృప్తులు సానురక్తులున్
హితులగు స్వప్రజల్ గొలువ నిమ్మహినేలు నృపాలకున్ సుహృ
త్తతి గని సంతసించు నమృతంబును గన్న సురాళికైవడిన్. 120

ఉ. కావున నాత్మసంయమము గల్గి చరింపుము పుత్త్ర!" యంచు ధా
త్రీవిభుఁ డానతిచ్చుటయు శ్రీరఘురామహితార్థులైన మి
త్రావళు లా నుడుల్ విని ప్రహర్షమతిన్ వడి నేగి పట్టపుం
దేవికిఁ గౌసలాత్మజకుఁ దెల్పిరి తచ్ఛుభవార్త నింపుగన్. 121

క. ప్రమదంబునఁ గౌసల్యా
ప్రమదోత్తమ యట్లు ప్రియముఁ బలికిన హితులన్
సమధిక కాంచన మణిధన
సముదయముల గోధనముల సమ్మానించెన్. 122

ఆ. అవనిపతికిఁ దండ్రి కభివాదనముచేసి
రథము నెక్కి చనుచు రాఘవుండు
ప్రజలు దనకుఁజేయు ప్రతిపూజ లందుచుఁ
దన మనోజ్ఞధామమునకు నరిగె. 123

ఆ. ప్రభుని పల్కు లెంచి పౌరు లిష్టార్థంబుఁ
బడయఁ గంటి మంచుఁ బ్రమద మంది
సెలవు లంది వేగ నిలయంబులకు నేగి
తనియఁ గొలిచి రిష్టదైవతములఁ. 124

# 4–వ సర్గము

## దశరథుఁడు సభ చాలించి యంతఃపురి కేగి తిరిగి రాముని దోడితె మ్మనుట

ఆ. మతియుతుండు రాజు మంత్రులతో నప్పు
డెల్లి పుష్యతారనే కుమారు
నంబుజాక్షు రాము నభిషిక్తుఁ జేయంగ
నగు నటంచు నిశ్చయంబుచేసె. 125

గీ. అవనివిభుఁ డంత నంతర్గృహంబుఁ జేరి
సూతుఁ గనుఁగొని "శ్రీరాముఁ జూడఁదలఁతు
నతని గ్రమ్మఱఁ దోడితె" మ్మని వచింపఁ
జనె నతఁడు వేగ మా రామునదనమునకుఁ 126

ఆ. ద్వారచరులవలన శ్రీరాముఁ డింతలో
నా సుమంత్రు రాక నాలకించి
లోన సంశయించి లోనికిఁ బిలిపించి
"రాకకతము వినుతుఁగాక" యనియె. 127

ఆ. అనిన నా సుమంతుఁ డా రాముఁగని "రాజు
నిన్నుఁ జూడఁగోరుచున్నవాఁడు;
నీకుఁ దెల్పుకొంటి నీవె కర్తవుగదా
రాకపోకలకును రాకుమార!" 128

క. అని సూతుఁడు వచియించిన
విని రాముఁడు సత్వరముగ వెడలి సరేంద్రుం
జనకుని గ్రమ్మఱఁ గనుఁగొనఁ
జనియెన్ దగురీతి రాజసౌధంబునకున్. 129

క. ఆ రామాగమనము ను
ర్వీరమణుఁడు దశరథుం డు విని యంతికమున్
జేరఁ బిలిపించె నతని ను
దారప్రియభాషణములఁ దనుపు తలఁపునన్. 130

క. శ్రీరాముఁడు పితృభవనముఁ
జేరుచు దూరంబునందె చేమోడ్చి నమ
స్కారముచేయుచు వినయం
బారఁగ దర్శించెఁ దండ్రియగు దశరథునిన్. 131

ఆ. తనకుఁ బ్రణతుఁడైన తనయుని నల్లన
లేవనెత్తి కౌఁగిలించుకొనుచు
రాజు రుచిరహేమరత్నాసనంబున
నధివసింపఁజేసి యనియె నిట్లు. 132

## దశరథుఁడు తనకొదవిన యపశకునంబుల రామునకుఁ దెల్పుచు నభిషేకమునకు రాముని సత్వరము దీక్షఁబూను మనుట

చ. "అతిజరితుండ నైతిని; జిరాయువుఁ గాంచితి; నిష్టభోగ సం
తతి సుఖియించితిన్; విపులదక్షిణ లన్నసమృద్ధముల్ శత
క్రతువులొనర్చితిన్; బ్రియుని గాంచితి; నిన్నతులున్ సుతున్; బఠిం
చితి శ్రుతులన్; యజించితినిఁ; జేసితి దానములెల్లఁ బుత్త్రకా! 133

సీ. అనుభవించితి ధర్మావిరుద్ధములైన
యాత్మాభిలషితసౌఖ్యముల నెల్ల;
క్రతువులఁ దీర్చి దేవతలఋణంబు, న
ధ్యయనంబుచేసి బ్రహ్మర్షిఋణము,
సుతుల నల్వురఁగాంచి పితరులఋణమును
దానంబు లిడి విప్రతతులఋణము,
నఖిలసౌఖ్యములంది యాత్మఋణంబును,
గొనముట్టఁగాఁ దీర్చికొన్నవాఁడ

గీ. నీకుఁ బట్టాభిషేకంబునెఱపుకంటె
నాకుఁగర్తవ్య మింక నన్యంబు లేదు;
కాన నో రామ! నీవు నా కౌతుకంబు
దీర్ప నా పల్కుఁబడిన వర్తింపవలయు. 134

ఆ. ఇపుడు నిన్ను ప్రకృతులెల్ల నృపాలుగాఁ
గోరుకొనుచు నున్నవారు గాన
నో కుమార! నిన్ను యువరాజ్యపట్టాభి
షిక్తుఁ జేసి ప్రీతిఁ జెందువాఁడ. 135

ఆ. అంతెకాక యిప్పు డశుభదారుణసూచ
కములు దోఁచుచుండెఁ గలల నాకు
భీషణారవములఁ బిడుగులు నుల్కలు
పడుచునుండె గగనపథమునుండి. 136

క. నా జన్మతార సర్పా
ర్వీజ రవిక్రూరఖేట వేష్టితమై ని
స్తేజతఁ గనె నని గ్రహవి
ద్రాజులు వచియించినారు రామకుమారా! 137

గీ. తనయ! యిటువంటి దుర్నిమిత్తములవలనఁ
ప్రభునిమరణంబొ ఘోరవిపద్భయంబొ
సంభవింపకపోదు నిశ్చయ మటంచు
వినుచుచున్నారు దూరదర్శనులు బుధులు. 138

ఆ. ఓ కుమార! రామ! నా కిప్పు డొదవిన
బుద్ధి మఱల మాఱిపోకమున్నె
యౌవరాజ్యమునకు నభిషిక్తుఁడవు గమ్ము
చంచలములు గావె జనులమతులు. 139

గీ. కూడియున్నాఁడు నేఁడు లేఁడేఁడు పుష్య
తార పూర్వపునర్వసుదారతోడ
నెల్లి నిశ్చితమైన పుష్యేందుయోగ
మొదవు ననుచున్నవారు జోస్యులు కుమార! 140

గీ. నన్ను నా మది త్వరపెట్టుచున్నయట్టు
లయ్యె నభిషిక్తుఁడగుము పుష్యమిని దండ్రి!
పరపురంజయ! నీకు రేపటిదినంబె
చేసెదను యౌవరాజ్యాభిషేచనంబు. 141

క. కావున నిదియే మొదలుగ
నీవీ నిశ సీతతోడ నియతాత్ముఁడవై
కావింపఁదగు నుపానము
పావన కుశశయ్యయందె పండి కుమారా! 142

గీ. సుమహితములైన యిట్టికార్యముల కెల్ల
నంతరాయపరంపర లగును గాన
నప్రమత్తమై నీ సుహృదాళి యిపుడు
కూర్మి నిన్నెందు రక్షించుకొనునుగాక. 143

పరదేశంబున కరిగిన
భరతుం డెందాఁక రాఁడొ పట్టణమున క
త్తఱియే నీ యభిషేకము
నెఱపఁ దగిన యద నటంచు నే నూహింతున్. 144

భరతుఁడు నీ తమ్ముఁడు ధ
ర్మరతుఁడు జ్యేష్ఠానువర్తి మహనీయదయా
నిరతుఁడు సద్వృత్తసదా
చరితుఁడు జితవైరి యనుట సత్యంబె కదా! 145

ఐన నగుఁగాక మానవ మానసములు
నిరత చపలంబు లనియె నా నిశ్చయంబు;
అనవరతధర్మతత్పరు లగు నభిజ్ఞ
జనులు మాత్రమె సుకృతశోభనులు తనయ!" 146

అని జనకుఁ డెల్లి యభిషే
చన మని సెలవీయ రామచంద్రుఁడు పితృవం
దన మాచరించి యాతని
యనుమతిగొని చేర నరిగె నాత్మభవనమున్. 147

## శ్రీరాముఁడు స్వీయభవనమున కరిగి శుభవార్త తెలుప కౌసల్యాభవనమున కరుగుట

తన యగారంబు చొచ్చుచేఁ దడవుగాఁగ
క్షితిపతి వినిశ్చితస్వాభిషేకవార్త
విన్నవింపఁగవలె నన్న వేడ్కఁజేసి
జనని నగరికిఁ జనె రామచంద్రమూర్తి. 148

గీ. ప్రవిమలంబగు పీతాంబరము ధరించి
మౌనము వహించి ధ్యాననిమగ్నుఁ డగుచు
నర్థి శ్రీదేవి సేవించు నంబఁ గనియె
రాముఁ డచ్చటు దేవతాధామమందు. 149

గీ. రామపట్టాభిషేకవార్తను గ్రహించి
యా సుమిత్రయు లక్ష్మణుం డటకు మున్నె
వచ్చి ప్రియమైన యా శుభవార్తఁ బంపి
వేగ సీతనుగూడ రావించుకొనిరి. 150

సీ. ఆ సమయంబున నామీలితాక్షియై
యోగాసనారూఢియున్నదాని
ధరణిజచే సుమిత్రాలక్ష్మణులచేత
నుచితసేవల నందుచున్నదాని
పుష్యయోగంబున బుత్త్రాభిషేక మ
హోత్సవం బని వినియున్నదాని
నాయతభక్తిఁ బ్రాణాయామమునఁ బూరు
షోత్తము ధ్యానించుచున్నదాని

గీ. నుచిత నియమోపవిష్టయై యున్నదాని
మాతఁ గౌసల్యఁ గాంచి నమస్కరించి
విపులహర్షరసాంబుధి వెల్లివిరియ
నర్కకులసోముఁ డగు రాముఁ డనియె నిట్లు. 151

సీ. "స్వప్రజారక్షణక్షమ వహింపఁగ నాకు
జనకుండు ముదల యొసంగె నమ్మ!
యువరాజపదమునం దుంచి ఱేపే నాకుఁ
దండ్రి పట్టముఁగట్టఁ దలఁచె నమ్మ!

నా ధర్మపత్ని జానకితోడ నేఁడు నా
కుపవసించుట విధియుక్త మమ్మ!
గురుబుత్విజుల నిండుకొలువున రాజు నా
కీ రీతి నానతి యిచ్చె నమ్మ!

ఆ. తల్లి! యెల్లి జరుగఁ దగు యౌవరాజ్యాభి
షేకమునకు నాకు సీత కిపుడె
మహిత విహిత సకల మంగళాచరణంబు
లాచరించి పంపు మమ్మ!" యనిన. 152

క. చిరకాలాకాంక్షిత శుభ
కర వార్తాశ్రవణమాత్రఁ గౌసల్య ప్రమో
ద రసోదిత బాష్ప కల
స్వరమున నిట్లనియె రామచంద్రునితోడన్. 153

గీ. "నాయనా! రామభద్ర! చిరాయు వగుము;
హతరిపుబలుండ వగుము; రాజ్యరమగూడి
ప్రమదముం గూర్పు మయ్య! మద్బాంధవులకు
నాప్తులకును సుమిత్రదాయాదులకును. 154

గీ. బళిర! చిన్నికుమార! సౌభాగ్యతార
నీవు నా గర్భమున జనియించినావు;
స్వగుణములచేత నిత్యసేవనముచేత
జనకు దశరథు మెప్పింపఁ జాలినావు. 155

గీ. ఋతము లయ్యె బళారె! నా వ్రతము లెల్ల
పురుషోత్తముఁ గొల్చు నా పూజ లెల్ల;
నీ మహేక్ష్వాకువంశ రమామతల్లి
యిప్పుడో వత్స! ని న్నాశ్రయించుకతన." 156

క. అని జనని సంతసింపఁగ
నను జు వినయవినమితున్ గృతాంజలి నా సీ
నుని లక్ష్మణునిన్ రాముఁడు
గని యెలన వ్వాలయఁ బ్రియముగా నిట్లనియెన్. 157

గీ. "తమ్ముడా! నీవు ని మ్మహీతలమునెల్ల
నెలమి నాతోడునీడవై యేలుకొమ్ము;
అస్మదీయద్వితీయాంతరాత్మవైన
నిన్ను నీ రాజ్యరమ వరించినది సుమ్ము. 158

గీ. లక్ష్మణా! సర్వరాజ్యఫలంబు లంది
యనుభవింపు మభీష్టభోగాళి నెల్ల;
నాత్మజీవితమైన రాజ్యంబునైన
నేను గోరుట నీ కోసమేగదయ్య!" 159

క అనుజు నిటు దనిపి యిరువురు
జననులకున్ బ్రెుక్కి వారి సమ్మతిగొని సీ
తను దోడ్కొని శ్రీరాముఁడు
చనియెన్ సెలవంది యాత్మసౌధంబునకున్. 160

## 5-వ సర్గము

### శ్రీరాముఁడు సీతాసమేతుఁడై యాత్మసౌధమున కరుగుట వసిష్ఠుఁడు దీక్ష నొసఁగుట

చ. క్షితిపతి జే పొనర్చు నభిషేకవిధుల్ రఘురామమూర్తి కం
చితమతిఁ దెల్పి యంతట వసిష్ఠుఁ బురోహితుఁ బిల్వ నంపి "సు
వ్రత! యిపు డేగి రామునికి రాజ్యయశోవిభవోపలబ్ధికై
క్షితిసుతతోడఁ దా నుపవసింపఁగ జేయుము సక్రమంబుగన్." 161

సీ. అని విభుండు వచింప నట్టులేయని భగ
వానుండు వేదవిద్వర్యుఁడునైన
య వసిష్ఠమునీంద్రుఁ డాగమజ్ఞుఁడు దృఢ
వ్రతుఁడు గావున సమంత్రకముగాఁగ
నుర్విజతో రాము నుపవసింపఁగఁజేయ
విప్రోచితరథోపవిష్టుఁ డగుచు
సితజలద ప్రభాసిత రామభవనంబు
చెంతకుఁ జని మౌనిశేఖరుండు

గీ. స్యందనముతోనె కక్ష్యాత్రయంబుదాఁటి
వచ్చుచుండంగ న మ్మునివరునిగాంచి
యతనిఁ బూజార్హుఁ దోడ్తేర నా క్షణంబ
రాముఁ డెదురేగెఁ దనమందిరంబు వెడలి. 162

క. త్వరితముగ రాముఁ డీ గతి
నరదముకడ కేగి వినతుఁడై స్వయముగ నా
గురు నవతరింపఁజేసెన్
గర మూతఁగ నిచ్చి భక్తిగౌరవములతోన 163

గీ. వినయసంపన్నుఁ బ్రియవార్త వినుపఁదగిన
రాముఁ గని యప్పు డాతని సేమ మడిగి
సుప్రసన్నాత్ముఁ గావించి సుముఖుఁ జేసి
యెలమి వెలయఁ బురోహితుం డిట్టు లనియె. 164

గీ. "కన్నతండ్రి నీ యెడలఁ బ్రసన్నుఁ డయ్యె;
యౌవరాజ్యపదంబు నీ వందఁ గలవు;
రాఘవా! నేఁడు నీవు నీ రమణియైన
సీతతో నుపవాసంబు చేయవలయు. 165

గీ. రమ్ము శ్రీరామచంద్ర! ధరావరుండు
పంక్తిరథుఁడు నీ తండ్రి తెపకడ నిన్ను
యౌవరాజ్యాభిషిక్తుఁ జేయం గలండు
ప్రీతితో నహుషుండు యయాతిఁ బోలి." 166

## వసిష్ఠుఁడు రామభవనంబు వీడుట_రాజపథంబుల సందడి

చ. అని మునిమౌళి రాజగురుఁ డప్పుడు మంత్రనియుక్తి రామభ
ద్రుని మహిజాతతో నియతితో నుపవాస మొనర్పఁజేసి యా
తని ప్రియపూజనంబుల యథావిధిగా గ్రహియించి వీడుకో
ల్గని పయనించె రానుతు నగారమునుండి సగౌరవంబుగన్. 167

ఆ. మిష్టవచనులైన మిత్రులతో సుఖా
సీనుఁడైన రాజసూనుఁ డంత
హర్షకలితుఁ డగుచు నందఱియనుమతి
నల్లనల్ల నరిగె నంతిపురికి. 168

క. ప్రముదిత నర నారీ జన
సముదంచితమైన రామసదన మపుడు స
ప్రమద ద్విజగణ విస్ఫుట
కమలాకరమైన కొలనికైవడి నలరెన్. 169

గీ. రాజభవనోపమానమై తేజరిల్లు
రామచంద్రుని శుభమందిరంబు వీడి
చనుచున్న వసిష్ఠసన్మునివరేణ్యుఁ
డధ్వమెల్ల జనాకీర్ణ మగుటఁ గాంచె. 170

గీ. అపుడు శ్రీరామచంద్రుు పట్టాభిషేక
దర్శనోత్సుక బహుజనోత్కరముచేత
రాజపథము లయోధ్యాపురమున నెందు
నెడతెఱపి లేక నిండి క్రిక్కిఱిసియుండె. 171

క. జన గణ తరంగ సంఘూ
ర్ణనముల హర్షస్వనముల రంజిల్లు పురి
ఘనరాజపథం బప్పుడు
స్వన దంబునిధానవైభవంబున మొరసెన్. 172

గీ. గంధజలసిక్తమిష్టమార్గముల మించి
క్రముక కదళికావన మాలికల రహించి
ప్రతిగృహోద్ధృత కేతనతతి వహించి
చూపు దనియించె నాఁ డయోధ్యాపురంబు. 173

ఆ. రామచంద్రు యౌవరాజ్యాభిషేకంబు
నెప్పుడెపుడు గాంతు మే మటంచు
నాఁ డయోధ్యనుండు నరనారు లాబాల
వృద్ధు లెన్నుచుండి రినునిరాక. 174

గీ. సుప్రసన్న ప్రజాగణశోభితంబు
జననుతంబు నానందవర్ధనము నైన
య య్యయోధ్యామహోత్సవ మరసి తనియ
నెంతయో యిచ్ఛపడుచుండి రెల్లవారు. 175

క. మునివరుఁ డిటు జనఘట్టన
నెనసిన ఘనరాజమార్గ మీక్షించుచు నా
జనసంఘము మొనయించెడి
యనువున మెలమెల్ల నరిగె నధిపు నగరికిన్. 176

క. సితగిరిశిఖరముకరణిన్
సితజలదంబట్లు వెలయు క్షితిపతిసౌధం
బతఁ డధిరోహించి బృహ
స్పతి శక్రుంబోలి నృపునిసన్నిధిఁ జేరెన్. 177

క. మునివచ్చుటఁ గని సింహా
సనముం దిగి లేచి రాజు సంప్రశ్నింపన్
"జనవర! యాజ్ఞాపాలన
మొనరించితి" నని వసిష్ఠుఁ డొయ్యనఁ దెలిపెన్. 178

క. జననాథుఁడు మునినాథునిఁ
గని నిల్చినయప్డె సభ్యగణములు నైజా
సనములను వీడి లేచిరి
ఘనరాజపురోహితులకు గౌరవ మెసఁగన్. 179

క. గురునికడ సెలవుగైకొని
పరిషజ్జన నివహమునకుఁ బంపక మిడి యా
నరవరుఁ డపు డంతఃపురి
కరిగెన్ గిరికందరమున కరుగు హరివలెన్. 180

గీ. అనుపమాలంకృత ప్రమదాకులమయి
యమరవిభు మందిరముఁబోలు నంతిపురము
నపు డలరఁజేసె నృపుఁడు తారావళీ స
మాకుల నభఃపథంబు సుధాంశునట్లు. 181

---

* పాఠాంతరము :

చ. సురుచిర వస్త్రభూషణ విశోభితమౌ రమణీగణంబుతో
సురవరమందిరంబువలె సొంపులునింపెడు రాణివాసమున్
మెఱయఁగఁజేసె నప్పు డవనీతలనాథుఁ డుదారతారకో
త్కరవిలసన్నభంబును సుధారసశీతమయూఖు వైఖరిన్. 181

# 6 వ సర్గము

## సీతారాములు రాత్రి వ్రతదీక్షఁ బూనుట

క. శ్రీరాముండు పురోహితు
గారవమున వీడుకొని సుఖస్నాతుండై
దార నుదారన్ సీతా
నారీమణిఁ గూడి కొలిచె నారాయణునిన్. 182

సీ. రాముఁ డప్పుడు యథార్థముగ హవిష్య పా
త్రముగొని యుత్తమాంగమునఁ దాల్చి
దైవతోత్తము విష్ణుదేవుని గూర్చి సా
జ్యముగ దీప్తాగ్ని హోమము నొనర్చి
శిష్టహవ్యంబు భుజించి ప్రియార్థియై
నారాయణుని నెమ్మనమున నిలిపి
శ్రీమంతమగు దేవతామందిరంబున
స్వరచితవరకుశాస్తరణమందు

గీ. మౌనము వహించి నిశ్చలమానసుఁ డయి
దేవి వైదేహితోడ నిద్రించి రాత్రి
వేగుజామున మేల్కాంచి వేశ్మమెల్ల
సదమలాలంకృత మొనర్ప ముదల యొసఁగి. 183

గీ. సూతమాగధవంది సంస్తుతులు వినుచుఁ
బ్రమదమున లేచి శ్రీరామభద్రుఁ డపుడు
సమయకృత్యంబులను దీర్చి సంధ్యవార్చి
విపులనిష్ఠతో గాయత్రి జపముచేసి. 184

క. క్షితిపతిసుతుఁ డప్పుడు మధు
జితుని న్నుతి నుతుల నెఱిఁగి సితకౌశేయా
న్వితగాత్రుండై ద్విజసం
తతిచేఁ బుణ్యాహవాచనము సేయించెన్. 185

క. ఆ రీతిన్ మధురములు గ
భీరంబులునై యెసంగు పృథివీసుర వే
దారవములు మంగళ తూ
ర్యారవములతోడ నెనసి యలమె నయోధ్యన్. 186

క. అపుడు విదేహాత్మజతో
నృపసుతుఁ డుపవాసదీక్ష నెఱపుట విని తా
మపరిమితానందరస
ప్రపూర్ణమతులయి రయోధ్యఁ బౌరజనంబుల్. 187

## పౌరులు శ్రీరామపట్టాభిషేకమునకు అయోధ్యను మంగళాలంకృతముగఁ జేయుట

గీ. ఆ పుర జనంబులెల్ల రామాభిషేక
హర్షసూచకశుభవార్త నాలకించి
రేయి వేగుటఁగాంచి పురీవరంబు
మంగళాలంకృతముగఁ జేయం గడంగి. 188

సీ. శరదభ్రశిఖరబంధుర గోపురములందు
వివిధ పణ్యాపూర్ణ విపణులందు
రమణీయసువిశాల రాజమార్గములందు
కమనీయశృంగాటకములయందు

బహుళసంపత్కుటుంబనికేతనములందు
సమధికామోదచైత్యములయందు
అరిజనగణభీషణాట్టాలకములందు
సకలసభానివేశములయందు

గీ. ఘన సమున్నత పాదపాగ్రములయందు
మఱియు ముఖ్యాఖిలస్థలాంతరములందు
ధ్వజపటలి నిల్పి చిత్రపతాక లెత్తి
పురము నలరించి రెల్లెడ సురుచిరముగ. 189

క. జనసుత నర్తకగణ వ
ర్తనములు గాయక సుకీర్తితసుధామధుర
స్వనములు నుతులన్ శ్రుతులన్
దనియించుచునుండె నిండి నగరినలుగడన్ 190

క. రామాభిషవ ముహూర్తము
సామీప్యం బగుట సదన చత్వరముల నా
రీమణులు నరులు తత్కథ
నామోదితు లగుచునుండి రన్యోన్యంబున్. 191

గీ. ఆ మహోత్సవ సందర్శ నాభిలాష
నిండ్లముంగిళ్ళలోన వాకిండ్లలోన
గుంపుగుంపులుగాఁ గూడికొనెడి బాలు
రానుడులె యాడుకొనుచుండి రాటలందు. 192

గీ. సుమములను జల్లి సురభిధూపములు వైచి
శ్రీ లలర రాజవీథి రాజిల్లఁజేసి
పౌరులు నిశాగమనశంకఁ బ్రతిపథముల
దీపవృక్షముల్ నిలిపిరి తేజ మెసఁగ. 193

ఆ. పురజనమ్ము లిట్లు పురముఁ గైసేసి రా
మాభిషేక దర్శనాభిలాష
నంఘములుగఁ గూడి సభలు గావించుచుఁ
బొగడఁ దొడఁగి రపుడు పుడమిపతిని. 194

క. "ఆ యైక్ష్వాకుఁడు వృద్ధుం
డైయుండు టెఱింగియే మహాత్ముఁడు గానన్
శ్రీయుతు రాముని రాజుగఁ
జేయం దలపెట్టె నిది విశేషముగాదే! 195

## యువరాజు గానున్న శ్రీరాముని గుణగణములు పౌరులు కీర్తించుకొనుట

గీ. ఘనుల నల్పుల నొకరీతిఁ గాంచువాఁడు
రామవిభుఁడు రక్షకుఁడును రాజు నగుట
మన చిరాకాంక్షితంబు సంపన్న మయ్యె
నేఁడు దేవుఁడు కృపఁ జూచినాఁడు మనల. 196

క. అతఁడు భ్రాతృవత్సలుఁ
డాతండు నిగర్వి పండితాగ్రణి రాముం
డాతండు ధర్మశీలుఁడు
భ్రాతలవలె మనల నెపుడుఁ బరిపాలించున్. 197

గీ. అఖిలగుణధాము రాముఁ బట్టాభిరాము
నిందఱము వేడ్కఁ గను భాగ్య మిడినయట్టి
ధర్మమూర్తి మహారాజు దశరథుండు
చిరతరాయుష్కుఁడై విరాజిల్లుఁ గాక." 198

చ. అని పురవాసు లిట్లు కొనియాడుచునుండ సమస్తలోక రం
జన శుభవార్తలన్ వినిన జానపదుల్ వివిధోత్సవావలో
కనమతి దిక్కుదిక్కునను గల్గిన పల్లెలనుండి యొయ్యనొ
య్యనఁ జనుదెంచి యన్నగరమంతట నిండిరి సంతసంబునన్. 199

క. అన్నగరమహోత్సవములఁ
గన్నులఁ గని పొగడుచున్న ఘనజనరవ మా
పున్నమఁ గని పొంగారెడి
మున్నీటిరవంబుఁబోలి ముద మిడుచుండెన్. 200

చ. సురపతిపట్టణంబునకుఁ జోడగు నా నగరంబు గ్రామ పా
మరజన సమ్ముదారవ సమాకులమై జలజంతుసంగ భం
గురము దిగంతసంకలితఘోషమునై చెలరేఁగుచుండు సా
గరజలరాశికైవడిని గానఁగనయ్యెఁ గలంగి పొంగుచున్. 201

# 7-వ సర్గము

## శ్రీరామ యౌవరాజ్యపట్టాభిషేకవార్త మంథర వినుట

గీ. ఎచట నే రీతిఁ బుట్టెనో యేమొకాని
కైకతోవచ్చియున్నట్టి జ్ఞాతిదాసి
రామపట్టాభిషేకపూర్వదిన మందె
చంద్రకాంతమౌరాణి ప్రాసాద మెక్కి. 202

క. క్రొన్ననలుసల్లి యంతటఁ
బన్నీటం దడుపు రాజపథములుగల సం
పన్నగర మయ్యయోధ్యన్
గన్నారం గైకదాసి కనుఁగొని కడకన్. 203

*సీ. ఉన్నతధ్వజపతాకోజ్జ్వలంబగు దాని
హర్షజనాకీర్ణమైన దాని
ధవళితదేవాయతన రమ్యమగుదాని
అఖిలవాద్యమనోజ్ఞమైన దాని
పావనజనపదప్రతి పథంబగుదాని
మానితశ్రుతిఘోషమైన దాని
మాల్యమోదకహస్తమహీసురంబగు దాని
ఆశీర్నినాదితమైన దాని

గీ. హస్తితురగగర్జాహేషమైన దాని
హర్షగర్జితగోవృషమైన దాని
హస్తకేతనాంచితపౌరమైన దాని
నపుడు మంథర గాంచె హర్మ్యంబునుండి. 204

---

* పాఠాంతరము:

సీ. భాసురధ్వజపతాకా సముత్కరముతో
సంప్రీత జనసమాజములతోడ
సురుచిరదేవమందిర గోపురములతో
వివిధమంగళవాద్య రవముతోడ
స్నాతకజనయోగ్య శాఖాపదములతో
సముదీర్ణ వేదఘోషములతోడ
మాల్యమోదకహస్త మహీసురగణముతో
సముచితస్వస్తి సూక్తములతోడ

గీ. ప్రముదిత గజాశ్వవృషభ స్వనములతోడ
ధ్వజకలితహస్త పౌరసంతతులతోడ
రమ్యమైన యయోధ్యాపురంబునెల్ల
నపుడు మంథర గాంచె హర్మ్యంబు నుండి. 204

క. కని యా చెంత ధరిత్రిన్
జనుచున్న ప్రహర్షవికచ సారసనేత్రన్
వినుతదుకూలసుగాత్రన్
ఘనజననుతిపాత్ర ధాత్రిఁగని యి ట్లనియెన్. 205

ఆ. "ధాత్రి! రామమాత ధనపరాయణ గదా
యింత సంతసమున నీ విధముగఁ
ధారవోయుచుండె ధనము తృణంబుగా
నెల్లవారిఁ బిలిచి యెందుచేత? 206

క. నరపతి యొడ లెఱుఁగని సం
బరమున నే సుకృతమునకొ పనిగొన్నాఁడీ
పురజను లిటు హర్షంబులు
మెఱయెన్ దిరుగాడుటకు నిమిత్తము చెపుమా?" 207

చ. అను మఱుగుజ్జు గాంచి హృదయంబునఁ బొంగులువారు కౌతుకం
బును వెలికి న్వెలార్చుచును భూపతి పంక్తిరథుండు పుష్యతా
రను యువరాజుఁ జేయు రఘురాము వినిర్జితకాము రేపటం"
చును వచియించె దాది వెనుజూడక వేఁడుక ముమ్మరింపఁగన్ 208

క. ఆ పల్కు విన్నయంతనె
కోపము నాపంగ లేక కుబ్జయుఁ గైలా
సోపమమగు నా ప్రాసా
దోపరితల మెదలి యొక్క యుదుటున దిగియెన్. 209

క. పాపాత్మురాలు మంధర
కోపంబున నట్లు మండి కుములుచుఁ జని శ
య్యోపరిఁ బరుండియుండిన
యా పడఁతిన్ గైక గాంచి యదలిచి పలికెన్. 210

## మంథర కైకకు దుర్బోధ చేయుట

ఆ. "కొంప మునుఁగు చుండ కూరుకుపాటులా?
లెమ్ము లెమ్ము తెలివిలేనిదాన!
తలఁపరాని వెతలు తలమీఁదఁ బడుచుండ
నోడ లెఱుంగనట్టు లుంటి వేల? 211

క. పతి క్షత్రియ వైయుండియు
నతిరూపగుణాఢ్యనంచు నతిసౌభాగ్యా
న్వితనంచుఁ బొంగి తవి క్రమ
గతి వేసవియేటినీటిగతి గనియెఁ జుమా!" 212

గీ. పాపదర్శినియును, గోపపరవశయును
నైన యా కుబ్జపరుషోక్తు లాలకించి
యప్పుడు విషాదవిచలితయైన కైక
యడలు గడలుకొనంగ నిట్లని వచించె. 213

క. "ఓ మంథర చెప్పవె నీ
మోమున వగమిగులు చిహ్నములు దోఁచెడి; నా
కేమైన ననిష్టము ల
క్షేమము లగు నిడుమ లడరి చెడుగిడవు గదా!" 214

క. చేఱెంచి కైక యిట్లనఁ
బాటించి విశేషదోషపరవశ యగుచున్
మాటలు నేర్చిన మంథర
నూటిగ నా దేవిమనసుఁ జూఱచుఱ వెట్టన్. 215

ఆ. కైక మేలు గోరు కామిని దా నోట
దిగులుపడుచు నేడ్పు మొగమువెట్టి
యామె నేడిపించి యనఘు రాముని యెడ
మనసు విఱుగఁ జేయ మఱల ననియె. 216

క. "తీరఁగ నేరని మహాదప
కార మొకటి జరిగిపోయెఁగద కైకమ్మా!
భూరమణుఁడు దశరథుఁడా
శ్రీరాముని పట్టభద్రుఁ జేయునఁట సుమీ॥ 217

గి. అంతులేనిభయంబున నడలి యడలి
దుఃఖశోకానలంబునఁ దూలి దూలి
చాలఁ బరితాపపడుచు నీ మేలుగోరి
పరుగులో వచ్చి నీ కంతుఁ బడితినమ్మ! 218

క. నాకున్ సర్వస్వము వగు
నీ కష్టము కనులఁజూడ నే నోపుదునే?
నీ కెనలేని యదృష్టము
చేకూరుట నాకు భాగ్యసిద్ధియ కాదే! 219

క. రాజకులజాతవై రా
రాజునకుం బ్రియముఁగూర్చు రాజ్ఞీమణివై
రాజోగ్రధర్మమర్మో
త్తేజనములఁగూర్చి యేల తెలియవు దేవీ! 220

గి. వనిత! నీ వల్లభుఁడు ధర్మవాదిగాని
సత్యము వచింప నాతండు శఠుఁడు సుమ్ము
క్రూరుఁ డాతని తీయపలుకులను నమ్మి
మత మెఱుంగక మోసపోయితివి నీవు. 221

క. ఆతండు వట్టిమాటల
చేతన్ ని న్నుల్లసిల్లఁ జేయుఱె గానీ
చేఁతలఁ గౌసల్యకె నం
ప్రీతి నొసఁగుచున్నవాఁ డభీష్టార్థములన్. 222

క. దురితాత్ముఁ డతఁడు నీ సుతు
భరతుని తన తాతకడకుఁ బదమని తేపే
ధరణీరాజ్యము రాముని
కరమున నిడుచున్నవాఁ డకంటకితముగన్. 223

గీ. కలుచు నను కోక యొడి నిడి కరుణఁ బెంచి
తన్ను తల్లిచే గరళంపుఁ ద్రాచుఁబోలి
రిపుఁడని యెఱుంగ కీ వాదరించుకతనఁ
బతియ హృతుఁ డయ్యెఁ నీచేతఁ బతినెపమున. 224

క. పగతుఁడు పాము నుపేక్షన్
దిగవిడిచిన నెట్టి కీడు దెచ్చునో యట్లే
మగఁడగు రా జొనరించెను
మగువా! నీయెడల నీ కుమారుని యెడలన్. 225

క. మెఱమెప్పుల నిను బాలన్
మరగించిన మగనిచేత మమతన్ రామున్
దొరఁజేయు దుష్టవిభుచేఁ
బరమసుఖముఁ గోలుపడితి బంధుయుతముగన్. 226

క. ఎన్నందగు ప్రతిభా సం
పన్నవు వెస నేదొ వెరవు పరికించి హితం
బు న్నెఱపి యిప్పుడే నీ
కన్నకొడుకు నిన్ను నన్నుఁ గాచికొను"మనన్. 227

## శ్రీరామాభిషేకవార్త విన్న కైక మంథరను బహూకరించుట

ఉ. ఆ నుడు లాలకించి రుచిరాననయై ఘనహర్షవిస్మయా
ధీన మనస్కయై ద్రుతగతిన్ శయనంబుననుండి శారద
శ్రీనభమందుఁ జంద్రకళ చెల్వునఁ దోఁచుచు లేచి కైక స
న్మానముగాఁగ నొక్క మణిమండన మామెకునిచ్చి మెచ్చుచున్. 228

క. "ఓ మంథర! నా మదికి మ
హామోదముఁ గూర్చువార్త నందించిన నా
రీమణికి నీకు నే నిఁక
నే మీయం జాలుదునె? గ్రహింపుము దీనిన్. 229

క. రాముఁ డన భరతుఁ డనఁగా
నేమెయి భేదంబు నా కొకింతయుఁ గలదే?
భూమిపతి రాజుఁ జేయును
రాము ననుచు వినుట మిగులఁ బ్రమదం బయ్యెన్. 230

క. ప్రియవచన వింతకంటెన్
బ్రియవార్తం దెలిపి మదికిఁ బ్రియమిడఁ గలవే?
ప్రియపడి యొసఁగెద మఱియుం
బ్రియ మైనది కోరుకొను మభీష్టం" బనిన్. 231

# 8–వ సర్గము

## మంథర బహుమానమును తిరస్కరించి కైకమనసు విఱచుట

క. ఆ పలుకుల కులికి యసూ
యాపరవశ యగుచుఁ గుబ్జ యా నగ నచటున్
ద్రోపాడి యంత నాఁగక
కోపము దుఃఖంబు ముంచుకొన నిట్లనియెన్. 232

క. "ఓ మూఢురాల! నీ కిది
యామోదం బందు సమయమా? దారుణ దుః
ఖామేయభంగసంఘో
ద్దామాబ్ధి నిమగ్న వగుట తలపోయవుగా? 233

క. ఇంతటి దుఃస్థితిఁ బడి ర
వ్వంతయుఁ జింతింపకుండ హర్షంబునఁ బ్రదు
ళ్లింత లిడు నిన్నుఁ గన నా
కెంతో న వ్వొదవుచున్న దేడుపుతోనన్. 234

గీ. అవమతిని నిన్నుఁ గన దుఃఖ మయ్యె నాకు
భయదమృత్యుస్వరూపియై పగతుఁ డైన
సవతికొడుకు సౌభాగ్యవైభవము గాంచి
బుద్ధియున్న యే యాఁడుది పొంగిపోవు? 235

గీ. అవనిరాజ్యంబునకు సమానార్హుఁ డగుట
భరతుఁ డనిన రామునకెంతొ భయము గలదు;
భీతుఁ డగునాతఁ డపకృతినే తలంచు
ననుచుఁ దలపోసి తలపోసి యడలుచుంటి. 236

గీ. ఘనధనుర్ధారియైన లక్ష్మణుఁడు రాము
నెల్లవిధములఁ దా నాశ్రయించియుండు;
నట్లె శత్రుఘ్నుఁడును దన యన్న భరతు
విడువ కెప్పొద్దు భక్తి సేవించుచుండు. 237

క. జననక్రమమున రాజ్యము
మన భరతునిదే యగున్ గ్రమప్రాప్తంబై
విను లక్ష్మణశత్రుఘ్నులు
కనిష్ఠు లది వారు వడయఁ గడు దూర మగున్. 238

గీ. తెలివిగలవాఁడు రాజనీతిని ఘనుండు
సమయ మెఱిఁగి కార్యముఁదీర్చు సాహసుండు
నైన రామునివలన నీయాత్మజునకు
నెప్పు డే మగునో యని యేడ్చుచుంటి. 239

గీ. భూసురోత్తమగణముచేఁ బుష్యతార
యందు రేపటిదినమున యౌవరాజ్య
యుక్తు నభిషిక్తుఁ గావింప నున్నరాముఁ
గన్న కౌసల్య యెంత సంపన్నురాలొ? 240

గీ. సుమహితైశ్వర్యవతి హతవిమతి యగుచు
జనవినుతి కెక్కునట్టి కౌసల్య కీవు
దాసివై పల్లటిల్లుచు దోసిలొగ్గి
యూడిగంబులు చేయుచు నుండవలయు. 241

ఆ. ఇదియె జరుగునేని ఈవు మాతోఁగూడ
నామె పాదదాసి వగుట నిజము;
భాగ్యహీనుఁడైన భరతుఁ డా రాముని
బానిసీఁడుగాక మానఁ డింక. 242

ఆ. అపుడు రాము నుత్తమాంగనాజన మెల్ల
నిష్టహృష్టకలన నెసఁగఁ గలరు;
భరతుఁ డంతిపురపుఁ బడఁతులతో నసం
తృప్తి గుందవలయు నీవు నేను. 243

క. ఈ పగిది నప్రియములె ప్ర
లాపించెడు కుబ్జ నపుడు లక్షింపక ప్రే
మోపేత కైక సుగుణో
ద్దీపితుఁడగు రాము సన్నుతింపఁ దొడంగెన్. 244

## మంథర యెంతచెప్పినను వినక కైక శ్రీరామునే కొనియాడుట

క. ఎంతయు ధర్మజ్ఞుఁడు శుచి
దాంతుడు సత్యవ్రతుఁడు కృతజ్ఞుఁడు ధరణీ
కాంతాగ్రసుతుఁడు రాఘవుఁ
డింతీ! పితృరాజ్య మాతఁ డేలం దగఁడే? 245

క. రాముఁడు భ్రాతల భృత్యుల
సేమ మరయుఁ దండ్రిఁబోలి చిరజీవనుఁడై;
రామాభిషేచనంబన
నేమి మునిఁగె కుబ్జ! యింత యేడ్చెద వేలే? 246

క. నూటేండ్లదాఁక రాఘవుఁ
డా రాజ్యము నేలుఁగాక యవల భరతుఁడున్
బారంపర్యక్రమమున
భూరమణుం డగునుగాక పురుషర్షభుఁడై. 247

గీ. వర్తమానంబు శుభదమై వఱలుచుండె
భావి కల్యాణదాయి కాఁబోవుచుండె
రామునికి భరతునికి నింకేమి కొదవ?
యింతగాఁ దల్లడిల్లెద వేమె కుబ్జ? 248

క. ఆ రాముఁ డనిన నాకుం
గారాబము గలదు భరతుకంటెను మిగులన్
శ్రీరాముఁడు నను భక్తిన్
గౌరవమునఁ గొలుచుఁ దల్లికంటె ఘనముగన్. 249

గీ. రాముఁ డిప్పుడు పట్టాభిరాముఁడైన
భరతుఁ డా వెన్కనే పట్టభద్రుఁ డగును;
రామచంద్రుండు నెంతయో ప్రేమతోడఁ
దనవలెనె తమ్ములనుఁ జూచుకొనును గాదె?" 250

ఆ. అనుచు నిట్టిమాటలాడు కైకంగాంచి
యధికదుఃఖపరవశాత్మ యగుచు
నిడుద వేఁడియూర్పు లడరించి మంథర
పట్టరాని కిన్క నిట్టు లనియె. 251

## కైక తెలివిమాలినతనమునకు మంథర కినిసి కైకకు అసూయ రేకెత్తించుట

క. "మేలుంగీడు నెఱుంగని
గోలా! మూఢమతి శోకకుటిలవ్యసనో
ద్వేలమహోఫజ్జలనిధిఁ
గూలియు నినః నీవె తెలిసికొనవైతి గదా! 252

క. రా జయ్యెనేని రాముఁడు
రాజగు నాతనిసుతుండు రామునివెనుకన్
రాజకులంబున నిఁక నే
యోజను భరతుండు నిలిచియుండును చెపుమా! 253

క. రాజసుతులైనయంతనె
రాజు లగుచు నేల నెల్లరకు నర్హంబే?
యోజింపు భామినీ! య
ట్లే జరిగిన నీతి నిలుచునే రాజ్యమునన్? 254

క. కావున జ్యేష్ఠసుతునకే
భూవల్లభు లాత్మరాజ్యమును గూర్తురు; సు
శ్రీవిలసిత గుణగణ యుతు
లౌ వేఱుకుమారు లున్ననైన శుభాంగి! 255

క. కరుణామయి! నీ కొడుకగు
భరతుఁడు సుఖవంచితుఁడు నభాగ్యుండు నగున్;
ధరణీంద్రునిసుతుఁ డయ్యును
నరనాథుఁడుగాక యిఁక ననాథుండు నగున్. 256

ఆ. ఇంత యెఱిఁగి తెలుపఁ జెంతకు నే రాఁగ
నీ వాకింత నను గ్రహింపలేక
యా సపత్నివృద్ధి కానందపడుచు నా
కీవు లీయ వచ్చి తెంత తెలివి? 257

క. ధరణీరాజ్యంబును ని
ర్భరము నకంటకముఁజేయ రాముఁడు రాజై
భరతునికిఁ గూర్చు దేశాం
తరమో లోకాంతరంబొ తథ్యంబు సుమీ! 258

గీ. పసితనమునుండియును మనభరతు నీవె
తండ్రి కెడఁజేయుచుంటి తాతకడ కంపి;
సన్నిహితవర్తనమున వృక్షముల కైనఁ
బ్రబలుఁగాదె స్నేహంబు పరస్పరంబు. 259

గీ. అన్నభరతున కనువశుఁ డాప్తుఁడైన
యట్టి శత్రుఘ్నుఁ డిటనుండు నన్న, నతఁడు
భరతుతో వెనువెంటనే యరుగుచుండుఁ
గలసి రామునితోడ లక్ష్మణుఁడు వోలె. 260

గీ. ఉవిద! శత్రుఘ్నుఁడే తండ్రియొద్దనున్న
యన్నభరతునిఁ గాపాడ ననువుపడదె?
కట్టెలను గొట్టి జీవించుకఱకునుండి
చెట్లు నా చుట్టుపొదలు రక్షించునట్లు. 261

క. రాముఁడు లక్ష్మణునకు నా
రామునకున్ లక్ష్మణుండు రక్షకు లగుటన్
శ్రీమహితు లశ్వినులవలె
రాముఁడు లక్ష్మణుఁడు సోదరప్రేమయుతుల్. 262

అ. అట్లుగాన రాముఁ డా లక్ష్మణునియెడ
నించుకైనఁ గీడు నెంచఁబోఁడు
భరతు నెడల నతఁడు పాపచింతనముల
నే యొనర్చుచుండు నిది నిజంబు. 263

క. ఏమైన నీ సుతుఁడు మా
తామహపురినుండి వనికిఁ దరలి బ్రదుకుటే
క్షేమ మని తోఁచుచున్నది
నా మదికిన్; నీకు నిది మనఃప్రియమె కదా! 264

క. జనకుని యనుమతి భరతుఁడు
ఘనరాజ్యముఁ బడయు నదవకాశము చేకూ
రునయేని నీకు నీ ప్రియ
జనమునకు లభించుఁగాదె సర్వశుభంబుల్. 265

గీ. ప్రాప్తకాముఁడౌ రాముని పజ్జనుండి
యాతనికి సహజామిత్రుఁడైన భరతుఁ
డధికసుఖభోగి సుకుమారుఁ డక్కటకట!
భాగ్యహీనుఁడై యే రీతి బ్రదుకు నబల! 266

గీ. దారుణారణ్యమున మృగేంద్రంబువాతఁ
బడగనుండిన గజయూథపతి విధాన
బలయుతుండగు రాముని బారిఁబడిన
భరతు నిప్పుడు నీవు కాపాడవలయు. 267

గీ. పూర్వమం దీవు సౌభాగ్యగర్విత వయి
పరిభవించితి వామెను బహువిధాల;
నేఁడు శ్రీరామమాత యౌ నీ సపత్ని
కినిసి నీ యెడఁ బగదీర్చుకొనకయున్నె? 268

చ. సురుచిరరత్నకాంచన విశోభితశైలపురాఢ్యయౌ వసుం
ధర సకలంబు రామునకు దక్కుటు నిక్కమయేని నీవు దు
ర్భరతర దుఃఖసాగరతరంగపరంపరఁ దూలి దీనవై
భరతునితోఁ బరాభవముపాలయి పోవుదుగాదె భామినీ! 26

గీ. అవనినాథుండు రాముఁడే యయ్యెనేని
భరతునకు వినాశంబు తప్పనిదిగాన
నీ కొడుకు భూమిపతిఁ జేయ నీ సపత్ని
కొడుకు నెడఁజేయఁ గావించుకొనుము తెరువు." 27

## 9-వ సర్గము

### మంథర దుర్బోధవలన కైకరాఁబోవు చెడుగు నెఱుంగుఁ శ్రీరామాభిషేకభంగ నిశ్చయము.

క. అని మంథర పురికొల్పిన
విని కైకయుఁ గలుగుచెడుగు విస్పష్టముగాఁ
గని క్రోధజ్వలితాస్యం
బునఁ బొగులుచు వేఁడియూర్పు పొగ లెగయ ననెన్. 27

క. "ఇపు డీ క్షణమున రాముని
విపినంబుల కనుపుదాన వేగమె భరతున్
విపులావనితలమునకున్
నృపతిగఁ బట్టాభిషిక్తునిం గావింతున్. 27

క. ఓ మంథర! మనభరతుం
డీ మహి రా జెట్టు లగునొ యిపు డెట్లయినన్
రాముండు గాకయుండునొ
యా మార్గ మెఱుంగఁ జెప్పుమా శీఘ్రముగన్." 27

## మంథర కైకకు దశరథుఁడు మున్నిచ్చిన వరద్వయము నెఱింగించుట

క. ఈ రీతిఁ గైక పలుకన్
శ్రీరామునివైభవంబుఁ జెఱుపఁదలఁచు పా
పారంభ కుమతి మంథర
యా రాణిం గాంచి యిట్టు లనియె ముదమునన్. 274

ఆ. "దేవి! మేలు మేలు దెలిపెద నిప్పుడే
భరతుఁ డొకఁడె ప్రభుతఁ బడయు వెరవు;
నీవు మఱచినావొ యెఱుఁగవో దాఁచితో
నేను దెలుప వినఁగ నిచ్చగింతొ? 275

క. నాచేతనె పలికించుట
నీ చందంబయిన నట్లె నేఁ జెప్పెద నా
లోచింపుము విని తదుపరి
నీ చిత్తముఁ బట్టి చేయనే యగుఁ జతురా!" 276

ఆ. అనినఁ గైక యపుడు నునుఁబట్టుపాన్పున
నించుకంత యొనరిల్లి లేచి
"ఏది యేది! చెప్పవే శీఘ్రముగ నాకు
శ్రేయమైన యా యుపాయ" మనిన. 277

క. మఱచితివొ దేవి! దేవా
సురఘోరరణంబు జరుగుచో నర్థితుఁడై
సురవరునకు నీ పతియగు
నరవరుఁడు సహాయపడిన నాఁటిచరితమున్? 278

ఆ. నేను చూడలేదు గాని యొకప్పుడు
నీవె దాని తెలిపినావు నాకు;
నిదియె పనికివచ్చు నెప్పటికైన నీ
కనుచు మనసునందె యునుచుకొంటి. 279

సీ. తొల్లి సామంతులతో యోధగణముతోఁ
దరలి నీ విభుఁడైన దశరథుండు
దక్షిణాపథమున దండకాటవిఁ దిమి
ధ్వజుఁడైన శంబరదైత్యుపురికి
వైజయంతమునకు వాసవుపక్షానఁ
బోయి ఘోరరణంబుచేయునపుడు
నూఱుమాయ లెఱుంగు నా రాక్షసేశ్వరు
సేన దేవతల కజేయ మగుచు

ఆ. సమరరంగ మెడలి క్షతవిక్షతాంగులై
యలసి నిద్రఁ జెందు నమరవరుల
గుట్టుటెంగి చుట్టుముట్టి వారలనెల్ల
రేయిఁ జిత్రవధము చేయుచుండ. 280

క. వారిన్ మార్కొని నీ పతి
దారుణముగఁ బోరి డస్సి దగ మూర్ఛిల్లన్
దేరు మరలించి తేరిచ్చి
సారథ్య మొనర్చి నీవు సాఁకితి వతనిన్. 281

ఆ. అట్లు రెండుసారు ల మ్మహాహవమున
నతని రక్షసేయుకతన నీకు
రాజు హృష్టుఁడై వరద్వయ మిచ్చుట-
స్మృతికి వచ్చినదియె యిప్పుడైన? 282

క. దేవా! కావలసినయపు
డా వరములఁ గోరుకొందు నని నీ వనఁగాఁ
గేవలసత్యవ్రతుఁడగు
నీ విభుఁ డా వరముగూడ నీ కిచ్చెఁ గదా! 283

గీ. రాము నభిషేకకార్యమున్ రాజు నిలిపి
భరతు నభిషిక్తునింజేయఁ బ్రథమవరము
రామునిం బదునాల్గు వర్షములు వనికి
ననుప రెండవ వరముగా నడిగికొనుము. 284

క. అడవులఁబడి పదునాల్గేం
డ్లెడమై రాముండు దిరుగునెడ రాజగు నీ
కొడుకు పయి నెల్లప్రజలకుఁ
గడుభక్తియు గౌరవంబు గలిగి దృఢపడున్. 285

ఆ. కాన నిపుడె నీవు కార్యంబు సాధింపఁ
గోపగృహముఁ జేరి కుపిత వగుచు
మైలఁగట్టి వట్టినేలఁ బరుండుము
పంతమూని యశ్వపతికుమారి! 286

క. ఱేఁడు నినుఁ జూడవచ్చినఁ
జూడకు మా విభునివంకఁ జూచి పిలువ మా
ఱాడకుము నేలపైఁబడి
యేడువఁగాఁ దొడఁగు మతని హృదయము గలఁగన్. 287

గీ. వల్లభునకు నీయం దెంతవలపు గలదొ
నే నెఱుంగుదు నిందు సందియములేదు;
నీ ప్రియముదీర్ప నా ధరణీతలేంద్రుఁ
డగ్గి నుఱుకుటకును వెనుకాడఁ బోఁడు. 288

క. కన్నెత్తిచూడఁ జాలఁడు
ని న్నలుగఁగఁజేసి ఱేఁడు నీ వలిగినచో
వెన్నిచ్చి చనఁడు నీ పతి
యెన్నఁడు; నీ కొఱకు ప్రాణమే యర్పించున్. 289

చ. తెలియవుగాని నీ చెలువుతీరును తీయము వెట్టిదాన! నీ
పలికినపల్కు రాజు పొరపాటుననైనను దాఁటునేర్చునే
కలధనముల్ మణుల్ నగలు గైకొను మిచ్చెద నంచు వచ్చి నీ
యలుకను దీర్పవేఁడు నిపు డాతఁడు; నీ కవియా ప్రియార్థముల్? 290

ఆ. అతఁడు వచ్చి నిన్ను బతిమాలి బతిమాలి
కోరు మేమియైనఁ గూర్తు నన్న
నాడి తప్పకుండ నానలు వెట్టించి
యా వరద్వయంబె యడుగ వలయు. 291

చ. మఱవకుమీ భయార్తనయి మాటికి మాటికిఁ జెప్పుచుంటి స
త్వరముగ రాము నెల్లయిన వత్సరముల్ పదునాల్గు కాన పా
ల్పఱచు వరంబుమాటయును భామిని నీ సుకుమారుఁడైన యా
భరతునికిన్ ధరాభరణపట్టము గట్టు వరంబు మాటయున్. 292

క. ఆ రాముఁడు పదునాల్గేం
డ్లారణ్యకుఁడై చరించునప్పుడు భరతుం
డారూఢి నెల్లకాలం
బీ రాజ్యము బలిమికలిమి నేలం గలుగున్. 293

క. భరతునకు పట్ట మిడఁగా
వర మడిగెదు వేడ్క రామువనవాసంబున్
మఱవకుమీ వెఱవకుమీ
భరతుని కా వరముగూర్చు పరమార్థములన్. 294

క. అడవుల కేగిన రాముని
యెడ ననురాగం బడంగు నెల్లప్రజలకున్;
పుడమిని హతశత్రుండై
యొడయుండై భరతుఁ డేలుచుండుఁ దిరముగన్. 295

క. రాముండు పదియునాల్గేం
డ్లామెయిఁ దిరుగాడి వచ్చునంతకు మున్నే
ధీమంతుఁడు మన భరతుఁడు
శ్రీమంతుఁడు హితజనుండు సిద్ధార్థుఁ డగున్. 296

గీ. ఇదియె సమయంబు దాఁటిపోనీయవలదు
భయపడక భర్తనెట్లొ నిర్బంధపఱచి
రామపట్టాభిషేకకార్యములనుండి
తెగువ నాతని మరలించితీరవలయు." 297

చ. అని యిటు మేలు గీడుగ ననర్థము నర్థముగాఁగ నుగ్గడిం
చిన మఱుగుజ్జుమాటలను జేటుతలంపఁగ కైక విభ్రమం
బును గని తప్పుదారిపడిపోయెడు గోడిగరీతి నెమ్మనం
బునఁ బ్రమదంబునిండుకొనఁ బొంగుచు మంథరగాంచి యిట్లనెన్.

## మంథర బోధను విని యామెను గొనియాడుట

క. ఇంత సమయజ్ఞురాలవు
నింతటి ప్రియవచననిపుణ వీ వనుచును నే
నింతవఱ కెఱుఁగఁ గుబ్జల
మంతున కెక్కితివి నీవు మానితమతివై. 299

క. నీ వొకతెవె నా హితముం
గావింపఁగ నాకు గార్యగతు లెఱిఁగింపన్
గా వలఁతి వీవు తెలుపక
యే వలతినె విభు కుతంత్ర మిట్లెఱుఁగుటకున్? 300

గీ. అతివికృతవక్రవికలాంగు లైనవార
లెందఱో కుబ్జ లున్నార లీ జగాన
కమ్మగాలికి వంగిన తమ్మివోలె
నాకు నీ వెంతొ ప్రియదర్శనవు గదమ్మ! 301

గీ. నీ భుజంబు లున్నతములై నెగడుటఁ గని
కనలి నీ ఱొమ్మెగసి వాని గాలఁద్రొక్కెఁ;
మూఁపులును ఱొమ్ము పైఁబడు టోపలేక
పొన్నపూబొడ్డు నీ బొజ్జ సన్నగిల్లె. 302

క. నిండుకొనియుండెఁ గటి; పా
లిండులు గుత్తములు చెండులే యనవచ్చున్;
నిండునెలఁ బోలి నీ మో
ముండిన దింకేమిచెప్ప నొప్పులకుప్పా! 303

క. మొలనూల్గంటల రవళిన్
గలకల నలరారుచుండెఁ గటితటు మోహో!
తులకించెడు నీ జంఘల
చెలు వడుగులనిడివి కెంతొ చెన్నొనఁ గూర్చెన్. 304

క. నున్న నిడుద తొడనిగ్గులు
సన్నని వెలిపట్టుచీరచాటున మెఱయన్
సన్నిధి నడయాడుచు నా
కన్ను దనుపు రాజహంసిగతి నుంటిగదే! 305

క. వే మాయల శంబరునే
నీ మాయలచేత గెలువ నేర్తువు గాదే!
నీ మేనిగూనులో నె
న్నో మాయలు నీతు లూహ లున్నవి సుమ్మీ. 306

ఆ. భరతుఁ డెలమి పట్టభద్రుఁడై నంతనే
యడవిఁబట్టి రాము డరిగి నపుడె,
బండికుంచమట్టు లుండు నీ గూనికి
కుందనంపుగొలుసుఁ గూర్తుఁ కుబ్జ! 307

క. ఉరుసంపత్కరములు నా
వరములు ఫలియించి మేలు వర్ధిలినపుడే
పరమానందంబున నీ
పొఱడున బంగారుపూఁత పూయించెదనే. 308

గీ. ఉదిరివన్నెల తిలకంబు నుదుట నుంచి
కనకమయభూషణము లంగకములఁ దొడిగి
మేలివలిపట్టుచీర నెమ్మేనఁ దాల్చి
తిరుగఁ జూచెద నిను వేల్పుఁదెఱవఁ బోలె. 309

ఆ. చందమామ నెదిరి చౌకళింపఁగఁ జాలు
నందమైనమోము నల్లనెత్తి
నీవు తిరుగుచుండ నీ పగవా రెల్ల
శిరమువంచుకొనరె సిగ్గుఁజెంది. 310

ఆ. కుబ్జ! నన్ను నీవు కొల్చుచున్నట్టులే
భూరిరత్నమయవిభూషలైన
కుబ్జలెల్లఁ జేరి కొల్చుచుండెదరు నీ
పాదపద్మములను బ్రతిదినంబు. 311

చ. అతిముదమార నిట్లు కొనియాడుచుఁ బానుపునందు వేదికన్
హుతవహుకీలఁబోలి వెలుఁగొందుచునుండెడి కైకఁ గాంచి యీ
కుతుకము లేల లెమ్ము పనిగొమ్ము విభుం డిటువచ్చులోననే
గతజలసేతుబంధనముగాఁ జెడనాడకు మున్నుకార్యమున్." 312

## కైక మంథరబోధ నాలించి కోపగృహము చేరుట

సీ. అని కుబ్జ బోధింప నాయత నయనయుఁ
గమనీయసౌభాగ్యగర్వితయును
నంగనారత్నంబు నైన మహారాజ్ఞి
యా కైక కోపగృహంబుఁ జొచ్చి

మూల్యంబు లిడరాని ముత్యాలసరులను
వరణీయమంగళాభరణములను
చెలువంపుమెయినుండి తొలఁగించి పడవైచి
చెలువంబుమాసిన చీరఁగట్టి

గీ. వగపు మితిమీరినట్లుగా వట్టినేల
బంగరుశలాకయుంబోలెఁ బవ్వళించి
కూడ పీడక వచ్చిన కుబ్జఁ గాంచి
నిట్టుసురుగుట్టు దోఁపంగ నిట్టు లనియె. 313

క. ఏ నిట మరణించుటయో
కానకు రాము నెడలించి ఘనరాజ్యము నా
సూనున కిప్పించుటయో
కానగు నిందేదొ యొకటి కడపటి నుడిగన్. 314

క. ఈ వెంట నేదొ యొకటి ధ
రారమణుండైన పంక్తిరథునకొ మఱి నా
కూరిమి జనకునకో నీ
వోరిమిఁ దెలుపంగవలసియున్నది కుబ్జా! 315

క. ఒల్లను బంగారము మణు
లొల్లను; భూషణములొల్ల; నొల్లను సిరి నా
వల్లభుఁడు రాము ధరణీ
వల్లభుఁ గావింప బ్రతుకువలనే యొల్లన్. 316

క. ఈ విధముగ దశరథవిభు
దేవి భరతమాత కైక తెగువఁ బలుక మా
యావచన కుబ్జ రాణికి
శ్రీవొందగ రాముఁ గీడు చెందఁగ ననియెన్. 317

ఆ. "ఇపుడు పట్టభద్రుఁడే రాముఁ డైనచో
నుడికి మిడుకవలయుఁ గొడుకు నీవు
నిది యెఱింగి భరతుఁడే విభుం డగునట్టి
వెరవుతెరువు విధిగ వెదకికొనుము. 318

ఆ. మాటిమాటి కిట్లు మంథర విరఁజిమ్మ
ములుకు నుడులఁ గైక యులికి యులికి
విభునిసేఁత కలిగి విస్మయంబునఁ జేతు
లెద గదించి మఱల నిట్టు లనియె. 319

గీ. "మంథరా! విను మిచటి నా మరణవార్త
వేగ మీవేగి వినుపింప విభుఁడు వినుటో
వనికి రాముండు చనఁగ నీవసుధ కెల్ల
భరతుఁ డీశుండు నగుటయో జరుగుఁగాక. 320

ఉ. కోరను స్నానపానములఁ; గోరను హారవిభూషణంబులన్;
గోరను భక్ష్యభోజ్యములఁ; గోరను చందనగంధధూపముల్;
గోరను పుష్పశయ్యలను; గోరను జీవితమేని కుబ్జ! నా
కోరికదీఱ రాఘవుఁడు గొబ్బునఁ గానకుఁ బోవకుండినన్" 321

క. అతిదారుణముగ నీ గతిఁ
బ్రతిజ్ఞఁగొని భూష లొలిచి పాఱ వయిచి భూ
పతిత యగు కిన్నరాంగన
గతిఁ దలఁ గట్టుకొని నేలఁ గైక పరుండెన్. 322

గీ. భర్మమణిభూషలను దీసి పాఱవైచి
కోపతమమాననము ముంచుకొనఁగ నపుడు
విగతతారకమును దమోవృత్తమునైన
యాకసముఁబోలి కానంగ నయ్యెఁ గైక. 323

# 10-వ సర్గము

గీ. పాపమతియైన యా కుబ్జపలుకు నమ్మి
కుత్సిత కుబోధనలఁ జిక్కుకొన్న రాణి
కైక పడియుండె నప్పుడు కటికనేల
గరళశరవిద్ధయైన కిన్నరినిఁ బోలి. 324

గీ. ఆ విధి వివేకమహితాత్మయైన కైక
నెమ్మదిగ నట్లు కార్యంబు నిశ్చయించి
"మంథరా! నీవు గఱపిన మార్గ మెల్ల
ననువుగా నున్న దనుచు నల్లన వచించె." 325

చ. మునుకొని మంథరావచనముగ్ధయు దీనయునైన కైక చిం
తనము నొనర్చి చిత్తమునఁ దాఁకిన శోకము న్యాకవెట్టి నా
గినివలె నుష్ణనిశ్శ్వసనకీలల దీర్ఘముగా వెలార్చి స్వా
ర్థనిరతిఁ జిక్కెఁ; నైజసుఖ తత్పరయై కృతనిశ్చయాత్మయై 326

క. చెలియై యెప్పుడు రాణికిఁ
గలపనులం దీర్చు కుబ్జ కైక దృఢమతిన్
దెలిపిన నిశ్చయమున్ విని
ఫలించినది కార్య మనుచుఁ బ్రమదం బందెన్. 327

సీ. ఆ రీతిఁ గృతనిశ్చయాత్మయై యా దేవి
బొమముడిపాటు మోమున గదించి
రోషసంకలితయై రుచిరమాల్యంబులు
దివ్యభూషణములు దీసివైచి
గగనంబునందుండి తెగిపడ్డ చుక్కల
తెఱఁగున నవి నేల మెఱయుచుండ
నెడనెడఁ బ్రిదిలిన యేకవేణి బిగించి
నలఁగిన మలినంపు వలువగట్టి

గీ. కిమ్మనక యుండె యా కోపగృహమునందు
చిట్టిచాపైన లేనట్టి పట్టినేల
కైక పడియుండె నసిదప్పి కళ దొఱంగి
గళితసత్త్వయౌ కిన్నరాంగనను బోలి. 328

గీ. రామపట్టాభిషేకకార్యములు దీర్చ
సచివవరుల నియోగించి సభ ముగించి
యపుడె వెలువడ్డ ప్రియమైన యా సువార్త
వినఁదగు ప్రియార్హ కైకకు వినుతు ననుచు. 329

### దశరథుఁడు శుభవార్తను దెలుపుటకు కైకభవనమునకు వచ్చుట

గీ. కీర్తిమంతుండు దశరథ క్షితివిభుండు
రాహుయుక్తంబు పాండురాభ్రంబునైన
గగనముం బోలియున్న యా కైకగృహము
శీతభానునివలెఁ బ్రవేశించె నపుడు. 330

సీ. శాలికా కీర మయూర సంతతులచే
రాజహంసక్రౌంచరవముచేత
మంగళ సంగీత మధురవాక్యములచే
సకలదాసీజనసమితిచేత
లీలావిచిత్రకేళీమందిరములచే
చంపకాశోకకుంజములచేత
సతత ప్రసవ ఫలాన్విత లతా తరులచే
ప్రకటాంబుపూరదీర్ఘికలచేత

గీ. షడ్రసోపేతభక్ష్యభోజ్యములచేత
స్వర్ణమణివేదికాసనసమితిచేత
సమధికాలంకృతాంగనా జనముచేత
నలరి స్వర్గంబుబోలు న య్యంతిపురిని. 331

గీ. తమకమునఁ జొచ్చి శయ్యాగృహమును జేరి
పాన్పుపైఁ గైకఁ గనక విభ్రాంతుఁ డగుచు
కామపీడితుఁడైన భూకాంతుఁ డప్పు
డనుఁగుసతిఁ బిల్చి ప్రతిలేమి నార్తిఁ గుందె. 332

ఆ. ప్రియుఁడు వచ్చుసరికిఁ బ్రేయసి యా కైక
యెదురుకొనకయుండు టెపుడు లేదు;
సుదతి కైకలేని శూన్యమందిరమున
నృపతి యడుగువెట్టు టెపుడు లేదు. 333

ఆ. ఇప్పు డిట్టు లగుట కెంతయో చింతించి
తెలివిలేమి స్వార్థకలితయైన
కైక మది నెఱుంగలేక దౌవారిక
నడిగె "రాణి యెచట" ననుచు ఱేఁడు. 334

క. భూవిభుఁ డిటు ప్రశ్నింపఁగ
దౌవారిక కేలుమోడ్చి తత్తరపడుచున్
"దేవా! కోపగృహమునకు
దేవి చనియెఁ గ్రోధభావతీవ్రత" ననియెన్. 335

క. ఆ పలుకు విని మఱింతగ
క్ష్మాపతి మతి చెదరి వికలసకలేంద్రియ సం
తాపితుఁడై కనె రాణిన్
గోపగృహమ్మందు నేలఁ గుములుచునుండన్. 336

సీ. చిదిమివేయఁగఁ బడ్డ చిన్నితీవనుబోలి
క్షితిమీఁదఁబడ్డ దేవతనుబోలి
గెంటివేయఁగఁబడ్డ కిన్నరాంగనఁ బోలి
తెరఁజారిపడ్డ యచ్చరనుబోలి

భ్రాంతిగొల్పఁగఁ జేయఁబడ్డ మాయనుబోలి
యరికట్టుగాఁబడ్డ హరిణిఁబోలి
వేఁటకాని విసంపుటీటెపోటునఁ దూలి
గతిఁ దప్పఁగాఁబడ్డ కరిణిఁబోలి

గీ. కటికనేలనుబడ్డ యా కాంతఁ దరుణిఁ
బాపచిత్తఁ బ్రాణప్రియ భార్యఁ గాంచి
వృద్ధుఁ డనఘుఁ డా ప్రభుఁడు భావింపరాని
యధికదుఃఖవిహ్వలచిత్తుఁ డయ్యె నపుడు. 337

## దశరథుఁడు కైక ననునయించుట

ఆ. అడవిఁ గూలఁబడిన హస్తిని గజపతి
తమిఁ దలిర్ప మేను దడవినట్లు
కమలనయనమేను నిమురుచు నరపతి
కామ వశతఁ బలికెఁ గడుభయమున. 338

ఆ. "ఇప్పు డింతకోప మేటికిఁ గలిగెనో
తెలుపు దేవి! నాకుఁ దెలియకుండె;
నెగ్గులాడినారె యితరు లెవ్వారైనఁ
బరిభవించినారె పరులు నిన్ను? 339

ఆ. మంగళాంగి ధూళి బ్రుంగి యిట్లున్న ని
న్నరయ నెంతొ దుఃఖ మయ్యె నాకు;
నీకు మేలుగూర్ప నీ కోరికలఁ దీర్ప
నేను గలుగ దుఃఖమేల నీకు? 340

క. భూతము సోఁకినరీతి ని
లాతలమున నొరఁగి ననుఁ గలంపఁగ నేలా?
కాతరపడ నేటికి? నీ
చేతమునం దున్నదానిఁ జెప్పుము తన్వీ! 341

గీ. కలదె యేదే ననారోగ్యకారణంబు?
తెలుపు మారోగ్యభాగ్యంబుగొలుపు వెజ్జు
లెన్నఁదగు నేర్పరులు మన కున్నవారు
భామినీ! యిట్టు లుత్తలపడెద వేల? 342

గీ. ఎవరి కపకృతిసేయంగ నెంచినావొ?
వేరు నీ కప్రియంబు గావించినారొ?
ఇంతి! యెవనికి మేలుసేయింప నెంతొ?
యెవ్వనికిఁ గీడుసేయింప నెంతొ? చెపుమ. 343

ఉ. ఎవ్వఁ డవధ్యుఁడైన వధియించెద నాతని; దండ్యుఁడైన వాఁ
డెవ్వఁడుగాని వాని విడియించెద; భాగ్యనిధిన్ దరిద్రుఁ గా
గవ్వయులేనివాని నలకాపతిగా నొనరింతు; నిప్పు డి
ట్లి వ్వగఁ గంది కుంది కృశియించుటమాని వచింపు మానినీ! 344

క. నా వారు నేను గూడన్
నీ వశులము; నీ తలంపు నేఁ జెఱుపుదునే
జీవితమైన నొసంగెద
నీ వలసిన దడిగినంతనే లలితాంగి! 345

గీ. ఇంతి! నీయెడ నాప్రేమ యెంతగలదొ
యంతయు నెఱింగి యింత శంకింతు వేల?
తెలుపు మిప్పుడె నీకోర్కిఁ దీర్చువాఁడ
నాన యిడి చెప్పుచుంటిఁ బుణ్యంబుమీఁద. 346

గీ. మంగళాంగివై యుండియు మంటి నేల
నిట్టు లా యాసపడియెద వేల బేల!
ఆర్తి నెఱిఁగింపు మిపుడె నే నపనయింతు
నరుణకిరణుండు మంచుఁ బో నడఁచినట్లు." 347

గీ. ఉర్వీపతి యిట్లు వేఁడుచు నూఱడింప
నప్రియములాడ సంసిద్ధయైన కైక
భర్త నింకను నెంతయో బాధపెట్టఁ
బట్టు పంతంబుఁ దెలుప నుపక్రమించి. 348

# 11-వ సర్గము

## కైకకు దశరథుఁడు కోపకారణ మెఱిఁగించిన తీర్తునని బాస యిచ్చుట

గీ. అసమబాణశరాహతుఁ డైనవాని
నధికతమ కామవిహ్వలుం డైనవాని
లోలుఁడగువాని న మ్మహీపాలుఁ గాంచి
యెంతొ దారుణముగఁ గైక యిట్లు లనియె. 349

గీ. "దేవ! నామేన నెట్టి వ్యాధియును లేదు
పరు లెవరు నన్నుఁ బరిభవపఱుప లేదు
కలదు మదిలోన నా కొక్క కామితంబు
తెలిపెదను నీవె దానినిఁ దీర్ప వలయు. 350

గీ. తీర్పఁ దలఁచితివేని ప్రతిజ్ఞసేయు
మపుడు తెలిపెద నీకు నా యభిమతంబు"
నాఁగఁ గాముకుఁ డగు రాజు నగుచు నామె
ముంగురులఁ బట్టి యనె నగుమోముఁ గనుచు. 351

గీ. "గరువమునఁ గానకున్నావు; కాంతలందు
లేదు ప్రియురాలు నీకంటె లేదు నాకు:
పురుషులం దార్యుఁడైన రాముని మించి
లేఁడు ప్రియుఁ డెవ్వఁడును నాకు లేఁడు లేఁడు. 352

గీ. అజితుఁ డాఢ్యుండును మహాత్ముఁడైనవాఁడు
ప్రాణములకంటె నా కిష్టమైనవాఁడు
నైన రామునియాన నే నడుగుచుంటిఁ
జెప్పు మే కోర్కిగలదొ నీ చిత్తమందు. 35

గీ. కాంత! నే నెవ్వని నొకింత గానకున్న
నొక్కత్రుటియైన జీవించియుండలేనొ
యట్టి రామునిపై నొట్టువెట్టుకొంటి
చెప్పు మే కోర్కిఁ గలదొ నీ చిత్తమందు. 35

క. నాకంటెను భరతాదులు
నా కొమరులకంటెఁ బ్రియజనంబుల కంటెన్
నాకుఁ బ్రియుఁడు రామునిపైఁ
జేకొంటిఁ బ్రతిజ్ఞఁ; గోర్కి చెప్పుము తీర్తున్. 35

ఆ. నా మనంబునెంచి నా బాసల గ్రహించి
నా కలంత గాంచి నను గుఱించి
యిష్టమేమి గలదొ యిప్పుడైన నెఱిఁగించి
మనిచికొనుము నన్ను మంగళాంగి! 35

క. ఓ కరుణామయి! నీ పయి
నాకుం గల ప్రేమ యెఱిఁగి నను శంకింపం
బోకుము; నా సుకృతముపై
నాఁకయిడి వచింతు శపథ; మడుగుము ప్రియమున్." 35

క. అని తన తలఁపున కనువుగ
ననిన మహారాజుపలుకు లాలించి ముదం
బును గాంచి మధ్యవర్తుల
యునికిఁ గనక కైక యతని నొప్పించుమతిన్. 35

ఆ. అభిమతంబుఁ దీర్తు నని విభుఁ డాడిన
బాస లెల్ల దిట్టపఱచుకొనఁగ
గట్టెదుటను దోఁచు కాలమృత్యువుకంటె
భయద మగు దురుక్తిఁ బలికె నిట్లు. 359

ఆ. కన్నకొడుకుమీఁదఁ బున్నెంబుమీఁద నీ
వానవెట్టి చేసినట్టిబాస
త్రిదశకోటిసంఖ్య దివిజులు శుచిముఖు
లాలకింత్రుఁగాక! యవనినాథ! 360

సీ. ఆదిత్యుఁడు సుధాంశుఁ డాకాశము గ్రహంబు
లహములు రాత్రులు నఖిలదిశలు
దైత్యయుక్తంబు పాతాళంబు ప్రత్యక్ష
దైవతంబైన యీ ధాత్రిదేవి
సిద్ధ గంధర్వ ప్రసిద్ధమౌ స్వర్గంబు;
బొగడంగఁ దగు నెల్లభువనములును
కులదేవతలు రాక్షసులు పంచభూతంబు
లితరంబులైన దేవతలుఁ గూడి

గీ. నిత్యసత్యవ్రతుఁడు ధర్మనిశ్చలుండు
సిద్ధతేజస్వియును సమాహితుఁడునైన
యీ విభుఁడు నాకు వర మీయ నిడిన బాస
కిపుడు మీరెల్ల సాక్షు లయ్యెదరుగాక! 361

గీ. అని మహాధన్వి దశరథమనుజవిభునిఁ
గైవసముఁ జేసికొని యరికట్టి పొగడి
యతని వరదుని గామమోహితునిఁ జూచి
పాపమతి కైక యిట్లు లుపక్రమించె. 362

క. "ధరణీశ! పురావృత్తము
సురాసురరణంబు తలఁపుఁ జొచ్చినదే! యా
దురమున దనుజేశుఁడు నినుఁ
గొరప్రాణముతోడ మూర్ఛగూర్చెనుఁ గాదే! 363

గీ. అపుడు నీ ప్రాణములు నిల్పినట్టి నాకు
నెలమి రెండువరంబుల నిచ్చినావు;
దాఁచితిని నీ కడనె కాని ధర్మనిరత!
దేవ! నా కిప్పు డవి ప్రసాదింపవలయు." 364

కైక దశరథుని వరద్వయ మడుగుట

క. అడుగు మొసంగెద నని యొ
ట్టిడుకొంటివి; ధర్మ మెడలి యిడవే నిపుడే
విడుతు నుసురు; నీ నికృతిం
బడి యింకను బుడమి నేను బ్రదుకం గలనే?" 365

ఆ. అనిన నెలుకుపాటు విని వచ్చి యురిలోనఁ
దగులుకొన్న యడవిమృగములాగు
చెలువమాటమాత్రఁ జె లెఱుంగక రాజు
ధర్మపాశముననుఁ దగులుకొనియె. 366

గీ. అట్లు వలఁబడ్డ వరదు న య్యధిపుఁ గాంచి
దేవ! నీకడదాచిన నా వరముల
నే విధంబుగ నా కిపు డీవలయునో
వినుతు విను మని కైక యిట్లని వచించె. 367

గీ. "మహిప! రామాభిషేకసామగ్రితోనె
భరతు నభిషిక్తుఁజేయుట ప్రథమవరము;
ఆ రణావని నాఁడు నీ వలరి యిడిన
వరములన్ రెండవదియు నీవలయు నేఁడు. 368

క. కోరెద నది; పదునాల్గేం
డ్లా రాముఁడు దండకావనాంతరసీమన్
జీరాజినధారి జటా
ధారియునై యుండవలయుఁ దాపసి యగుచున్. 369

క. భరతుఁ డకంటకముగ యౌ
వరాజ్యమును బడయవలయుఁ బరమములగు నీ
వరములు మునుపటివే; నే
నరయ వలయు నిపుడె రాముఁ డడవి కరుగుటన్. 370

చ. కులమును శీలమున్ దలఁచుకొమ్ము; భవమ్మును సార్థకంబుగా
నిలుపుము: సూనృతవ్రతమునే వెలయింపుము; రాజరాజ! ని
ర్మలమగు సత్యమే యిహపరంబుల నుత్తమమార్గమంచుఁ బె
ద్దలు ఋషిసత్తముల్ పరమధార్మికు లన్నది విన్నదేకదా!" 371

# 12-వ సర్గము

## కైక దారుణవచనములకు వరద్వయమునకు దశరథుఁడు చింతించి మూర్ఛిల్లి తెలివినందుట

గీ. కైక యతిదారుణముగ నీ గతి వచింప
నధిపుఁ డాలించి దుఃఖాకులాత్ముఁ డగుచు
నెంతొ చింతించి చింతించి యెఱుకదప్పి
యట్టులె మూర్ఛిల్లి కొంతసేపటికిఁ దెలిసి. 372

క. "ఏమిది కల గనుచుంటినొ!
నా మది విభ్రమమొ! తొంటి నా భవఘటనం
బేమైనఁ దోఁచెనో! చి
త్తామయమో! కాక యిది యథార్థం బగునే?" 373

సీ. అని యిట్లు చింతించి యనుతాప మందుచు
నా కైకమాటల కడలు గన్న
వసుధాధిపుఁడు కొంతవడికిఁ దెల్విం గాంచి
యాఁదుబెబ్బులిగన్న లేడిఁబోలి
విపులదుఃఖార్తిచే వేధితుఁడై నిరా
స్తరణమౌ నేలపైఁ జదికిలఁ బడి
వరమంత్రబలముగ్ధగరళసర్పములాగు
వేఁడినిట్టూర్పులు విడిచి కనలి

గీ. యెంత దారుణ మెంత దురంత మనుచు
నధిక శోకోపహతచిత్తుఁడై కలంగి
వర్ణనాతీతమైన యవస్థ నంది
తల్లడిల్లుచు మరల మూర్ఛిల్లి పడియె. 374

క. భూపాలుఁ డంత నెంతో
సేపటికిన్ దెలిసి మనసుచెడి దుఃఖితుఁడై
కోపాగ్నిశిఖలఁ జిమ్మెడి
చూపులతోఁ గైకవంకఁ జూచుచుఁ గనుచున్. 375

ఆ. "ఓసీ క్రూరురాల! యో కులనాశినీ!
యోసి దుశ్చరిత్ర! యోసి కుమతి!
ఏమి కీడుచేసెనే? నీకు రాముఁ డే
నేమి చేసినానె యెగ్గు నీకు? 376

క. తన కన్నతల్లికంటెన్
ఘనముగ నిన్నెంచి సేవఁ గావించెడి రా
మునికా యింతటి యపకృతి
నొనరింపఁ దలంచుచుంటివో దుష్టమతీ! 377

ఆ. గరళకలితతీవ్రకాలసర్పిణివి నీ
వగుదు వని యొకింత యరయలేక
నృపకుమారి వనుచు నిను నమ్మి తెచ్చి నా
చేటుకొఱకె యింటఁ జేర్చుకొంటి. 378

ఆ. జీవలోకమెల్ల శ్రీరామచంద్రుని
సుగుణగణము నెంచి పొగడుచుండ
నిష్ఠురైన కొమరు నే యపరాధంబు
నెంచి విడుచువాఁడనే పిశాచి! 379

గీ. నేను గౌసల్యను సుమిత్రనైన విడుతు
నేను రాజ్యేందిరను ప్రాణమైన విడుతుఁ
గాని పితృవత్సలుఁడు ప్రియుఁడైన యట్టి
వినుతగుణధాము రాముని విడువఁ జాల. 380

క. తనయాగ్రణి నారామునిఁ
గనుచున్నకొలందిఁ గౌతుకము వర్ధిల్లున్
కనుదోయి కాతఁ డెడమై
చనినంతనె మేను వీడి చను నా యుసురుల్. 381

ఆ. సవితలేకయుండ జగము నిల్చునుగాక
సస్యముండుగాక జలములేక
కాని రాము నెదుటఁ గనకున్న నామేన
నుసురు నిమిషమైన నుండఁబోదు. 382

గీ. చాలుఁ జాలును బాపాత్మురాల! యింక
నైనవీడుము నీ నికృష్టాభిలాష;
పాదములఁ బట్టియైనను బ్రణతు లిడుదు
నన్ను మన్నించి నాకుఁ బ్రసన్న వగుము. 383

గీ. పరమదారుణమైన యీ పాపచింత
యేమిటికి నీకుఁ గల్గెనో యెఱుఁగకుంటి
నాకు భరతుపై ప్రేమయున్నదియొ లేదొ
నీ విటు పరీక్ష చేయుచున్నావొ యేమొ? 384

చ. అదె నిజమైన రాము విపినాంతర సీమల కంపుమందువే?
మదిమది నీవు శ్రీయుతుఁడు మాన్యుఁడు ధర్మరతుండు రాముఁడే
మొదటి సుతుండు నా కనెడు మున్పటిమాటల కర్థమేమి? నా
ముదమున కాదితో యతని మ్రొక్కులు సేవలునంద నాడితో. 385

ఆ. అట్టిదుష్టచిత్త వగుటచే నీవు రా
మాభిషేకవార్త కార్తిఁ గుంది
పరవశాత్మ వగుచుఁ బడియుంటి వీ కోప
గృహమునందు నాకుఁ గిదు దలఁచి. 386

క. అనుపమ నయమతి వగు నీ
మన మిటు విపరీతగతిని మారుటవలనన్
మన యిక్ష్వాకుకులమునకె
యనర్థము ఘటిల్లె నేమియనఁ గల నింకన్. 387

క. ఓ వనజాయతనయనా!
నీ వెప్పుడు ననుచితము ననిష్టము నాకుం
గావించి యెఱుఁగ విప్పుడు
నీవే యిటులంటి వనుచు నే నమ్ముదునే? 388

క. నరనుతుఁడు పూజ్యుఁడగు నా
భరతునితో సముఁడు రామభద్రుం డనుచున్
బరమానందంబునఁ బ
ల్కరు నాకెటిఁగింతుగాదె మంగళచరితా! 389

సీ. నోరెట్టు లాడెనే శ్రీరాము వని కంప
నీ రీతిఁ బదునాలుగేండ్లదాఁక
మనసెట్టు లొప్పెనే మదన సుందరు రాము
జడదారిగాఁజేసి యడవి నుంప
తలపెట్లు వచ్చెనే తనయాధికుని రాము
నడవుల నిడుమల నడలఁజేయ
కసి యెట్లు కలిగెనే కరుణాకరుని రాము
భైరవారణ్యాల పాలుసేయ

గీ. ధర్మనిర్మలచరితు నుదారయశుని
ప్రేమధాముని లోకాభిరాము రాము
నట్టి మన రాము విడనాడుమనుట దగునె?
యిట్టి వెడబుద్ధి నీకేల పుట్టె దేవి? 390

క. కన్నకుమారుఁడు భరతుని
కన్నన్ రాముండు సేవ గావించును నీ
కన్నన్ భరతునియందిఁక
నున్న ఘనత యేమొ తెలియకున్నది నాకున్. 391

క. నీ చెప్పిన కార్యంబుల
నే చేయఁగ నిన్నుఁగొలువ నినుఁ బూజింపన్
నీ చిత్తము దనుపఁగ నిం
కే చనువరి గలఁడె రాముఁ డీతఁడు దక్కన్. 392

గీ. అతివ! మనకున్న దాసీజనాళిలోన
నున్న పరిచారకులలోన నొక్కరైన
రామునెడ నిందనే నపరాధమేని
వినిచి నట్లు నే నెన్నఁడు విని యెఱుంగ. 393

క. పురుషోత్తముఁడగు రాముఁడు
పరిశుద్ధ స్వాంతుఁ డగుచుఁ బ్రజలఁ బ్రజలుగా
నరయుచు బ్రియముం గూర్చుచుఁ
జరితార్థుఁ డగుచు నుండె జనరంజకుఁడై. 394

గీ. నిరతశుశ్రూష గురువుల; నిత్యదాన
కలన నర్థులఁ శత్రుల; గార్ముకమున;
నిఖిలభువనంబులను సత్యనియతి గెల్చు
ప్రథితగుణుఁ డన్నిఁటను వీరరాఘవుండు. 395

క. గురుసేవ తపము విద్యయు
వరదానము శౌచ మార్దవము మిత్రతయున్
నిరతత్యాగము సత్యా
చరణము నివియెల్ల రాము సహజగుణంబుల్. 396

గీ. మానసంబునఁ గపటంబులేనివాఁడు
అసమతేజంబునందు మహర్షినిభుఁడు
దివ్యమంగళగుణముల దేవసముఁడు
నైన రామునిపై నెగ్గులాడె దేల ? 397

క. లోకప్రియతమవాదియు
నాకుఁ బ్రియుండైన రామునకు నప్రియమున్
నా కలనైనఁ దలంపను
నీకొఱ కప్రియముచెప్ప నే నోర్చెదనే? 398

క. శమ మింద్రియదమనము స
త్యము ధర్మంబును గృతజ్ఞతామతియున్ భూ
తములయెడ నహింసయుఁ ద్యా
గముగల సుతుకంటె దిక్కుఁగలదే నాకున్? 399

క. జరితుఁడ మృతిసన్నిహితుఁడఁ
గరుణింపఁగఁ దగినవాఁడఁ గడు దీనుఁడ ది
క్కరి ప్రలపించెడి నన్నుం
బరమకృపం బ్రోవ నీదె భారము కైకా! 400

క. పారావారావృత భూ
మీరాజ్యం బెంతొ సంక్రమించెను నాకున్
గోరిన సర్వ మొసంగెద
శ్రీరామునియెడలఁ గినుకఁ జెందకు దేవీ! 401

ఆ. పదములంటియైన బతిమాలుకొందును
అంజలించియైన నడిగికొందు
నా మొఱాలకించి రాముని రక్షింపు
మిపుడు నన్నధర్మ మెనయకుండ. 402

*మ. అని దుఃఖానలసంప్రతప్తహృదయుండై శోకతీవ్రార్తి మూ
ర్ఛనముంగాంచి యిలాస్థలింబడి యపారంబైనదుఃఖాంబుధిన్
దను దాఁటింపు మటంచు దీనుఁడయి గాద్గద్యంబునన్ వేఁడు భ
ర్తను రూక్షేక్షణయౌచుఁ గైక గని నిర్దాక్షిణ్యయై యిట్లనెన్. 403

---

* పాఠాంతరము

మ. అని ఘనదుఃఖతాపహతుఁడై విలపించెడివాని, నష్ట సం
జ్ఞను బొరలాడువాని, జననాథుని, దుర్భరదుఃఖవార్ధి మ
గ్నుని నను నుద్ధరింపు మని గోడున మాటికి వేఁడువాని భ
ర్తను గని రోషభీషణ నిదారుణభాషలఁ గైక యిట్లనెన్. 403

## అధర్మ మెనయకుండ కాపాడు మని దశరథుఁడు కోరగా కైకవరము లిమ్మని నిర్బంధించుట

గీ. రాజవై యుండి నాకు వరంబు లొసఁగి
యేల యిచ్చితి నని యిప్పు డేద్తువేని
ధార్మికుండును వీరసత్తముఁడు ననెడి
ఖ్యాతి నే రీతి నిల్పుకోఁగలవు నీవు? 404

గీ. తోడిరాజర్షివరులు నీతోడఁగూడి
యీ వరద్వయప్రస్తావ మెత్తి నపుడు
నిఖిలధర్మము లెఱిఁగన నీవు వారి
కే మొగమువెట్టి యుత్తరం బీయఁ గలవు? 405

గీ. ఎవతె కాపాడెనో నన్ను బవరమందు
నేను జీవించియుంటినో యెవతె కరుణ
నట్టి కైకేయి యెడ మిథ్యలాడితి నని
చెప్పుకొందువు గాఁబోలు సిగ్గుమాలి. 406

క. నరవర! వరముల నొసఁగియు
తిరుగుడు నుడి నుడివి మచ్చ దెచ్చుకొనుచు నీ
సరిరాజకుల సమాఖ్యకె
పరిహాసముఁగూర్చె దిట్టి పాపము గలదే? 407

గీ. పక్షికై దేహ మిడి శిబి ప్రథితుఁ డయ్యె
కన్నువిడి యలర్కుఁడు పుణ్యగతులు గాంచె
వేల దాఁటు కంబుధిరాజు వినుతి కెక్కె
ప్రతిన నిల్పుము నీవు పూర్వగతు లెఱిఁగి. 408

ఆ. దుర్మతంబుపట్టి ధర్మంబు విడనాడి
రాజ్యమునకు రాము రాజుఁజేసి
నిత్యసుఖముపొంతె నీవు కౌసల్యతోఁ
గూడి క్రీడలాడఁ గోరుచుంతె? 409

గీ. అది యధర్మమో ధర్మమో యగును గాక
అది యసత్యమో సత్యమో యగునుగాక
ఆనవెట్టి నీ విచ్చినదాని కింకఁ
దిరుగులేదు; నా కిచ్చియే తీరవలయు. 410

క. నీ వభిషిక్తుని రాముం
గావించిన యపుడె నీ సకాశమునందే
నీవు గనుచుండ విషముం
ద్రావి యుసురు విడుచుదానఁ దప్పదు సుమ్మీ! 411

గీ. రాముఁడే భూమిపాలుఁడై రామమాతఁ
నంజలించి ప్రజల్ గొనియాడుచుంట
నొక్కనాఁడైన గని మనియుండుకంటెఁ
జచ్చుటయె మేలు నాకు నిశ్చయముగాఁగ. 412

గీ. క్షితితలేశ్వర! తుదిమాటఁ జెప్పుచుంటి
భరతుమీఁద బ్రదుకుమీఁదఁ బ్రతినఁ జేసి
అడవులకు నిప్పుడే రామునంపుకంటె
నింతకంటె నా కిష్ట మింకేది లేదు. 413

ఆ. ఇట్టు లాడి భర్త యెంతయేడ్చుచునున్న
గైక మాఱుమాటలేక యుండ
నప్రియంబు లాడినట్టి యా ప్రియురాలి
నతఁడు ఱెప్పవాల్ప కట్టెచూచి. 414

కైక మంకుపట్టునకు దశరథుఁడు దూషించుట

ఆ. రాజు భరతుఁజేయ రాముని వనిఁద్రోయ
నడుగు పిడుగువంటి నుడుల కడలి
ఘోరదుఃఖశోకఘూర్ణితచిత్తుఁడై
తల్లడిల్లిపోయె దశరథుండు. 415

ఆ. దేవి కైక ఘోరదీక్షను నిజకృత
శపథమును దలంచి యపుడు నృపుఁడు
రామ రామ యనుచు వేమాఱు రోజుచు
నొరఁగె నఱకఁబడిన తరువుఁబోలె. 416

క. పతి యపు డున్మత్తుని గతి
మతిచెడి రోగిగతిఁ బీడ్యమానుండును మం
త్రిత భుజగేంద్రునిగతి నప
గతతేజుఁడు నయ్యె నడలు గడలుకొనంగన్. 417

గీ. అట్లు మతిచెడి రాజు దీనాననుఁ డయి
యింతి! యిదె పరమార్థమం చీ యనర్థ
మెవరు బోధించిరే? సివ మెత్తినట్టు
లాడుచున్నావు సిగ్గింతయైన లేక. 418

గీ. బాలవై యున్నయపుడు నీ శీలమందు
నెట్టి లోపంబు నాకుఁ గన్పట్ట లేదు
పడఁతి యిపు డది నీ నడవడినిబట్టి
నాకు విపరీతరీతి గానఁబడుచుండె. 419

ఆ. రాజు భరతుఁజేయ రాముని వనిఁ ద్రోయఁ
బట్టుపట్టె దెట్టిభయము పుట్టె?
నాకు లోకమునకు నీ కుమారునకు మే
ల్దలఁతువేని నిట్టి తలఁపు విడుము! 420

ఆ. ఓసి క్రూరురాల! ఓ నీచురాల! యో
పాపకర్మురాల! పతితురాల!
నేను రాముఁ డనిన నీకేల భయము? మే
మే మేమి చెడుఁగు చేసినామె నీకు? 421

క. రామునిఁ గాదని భరతుం
డీ మహి నేలంగఁ గోరఁ డెన్నఁడుగాని
రాముని కంటెను ధర్మ బ
లా మేయుఁడు భరతుఁ డంచు నాత్మఁ దలంతున్. 422

గీ. అడవులకుఁ బొమ్ము నీవన్న యంతలోనె
పాముపట్టిన నెఱచందమామఁబోలి
గోము చెడి వెల్లనైన యా రాము మోముఁ
గాంచి నే నెట్టు సహియింపఁగలను కైక! 423

గీ. హిత పురోహిత సచివ సమ్మతముగాఁగ
నేను బూనిన కార్య మి ట్లైనయపుడు
శత్రువినిహితమగు నాత్మసైన్య మురక
గను నృపునిఁబోలి నే నెట్లు గాంచఁగలను? 424

గీ. ప్రాభవేక్ష్వాకువంశసంభవత నీతఁ
డెడ్డె యయ్యెను జిరకాల మేలె ననుచు
దేశదేశాలనుండి యేతెంచి యున్న
నరవరేణ్యులు నవ్వరే నన్నుఁ జూచి? 425

గీ. మహితగుణులు బహుశ్రుతుల్ మాన్యులైన
పిన్నపెద్ద లెందఱొ వచ్చియున్నవార
లిపుడు వారెల్ల శ్రీరాముఁ డేఁడి యనుచుఁ
జేరి ప్రశ్నింప నే నేమి చెప్పువాఁడ? 426

గీ. నిలుపుకో సత్యమని కైక నిలువరింప
నేను రామునిఁ బంపితిఁ గాన కనినఁ
జేసెదను రామపట్టాభిషేక మనుచు
నా సభ వచించుసత్య మేమైన దనరె? 427

ఆ. వనికి రాము నంపు నను(గని కౌసల్య
యేమిచేసి తనిన నేమిచెప్ప
నింత యప్రియంబు నే(జేసి యామె మో
మెట్లు చూచువా(డ నింకమీ(ద? 428

ఉ. ఏ నమయంబునందు నను నిచ్చమెయిన్ దనియింప( గోరుచున్
దాసివలెన్ సఖీమణివిధంబున( గూరిమి ధర్మపత్నిగా
నా సహజన్మురాలివలె నన్గని పెంచిన తల్లిపోలికన్
గోసలరాజపుత్రి నను(గొల్చి భజించుట నీ వెఱుంగవే? 429

క. ప్రియము లొనరించునదియును
ప్రియపుత్రుని గన్నయదియు( బ్రియవాదినియున్
ప్రియురాలగు నామెకు నీ
భయమున( బ్రియ మాచరింప( బాల్పడ నైతిన్. 430

గీ. సుదతి! నీయెడ నే(జేయు సుకృత మెల్ల
నిప్పు డపకృత మగుచు న న్నే(చుచుండె
నామయగ్రసితుని నపథ్యంబు లైన
వ్యంజనంబుల( గూడిన యన్న మట్లు. 431

గీ. అంతప్రియమైన రామునే యడవి కంపి
మాటదబ్బరచేసిన మనుజవిభుడు
నా తనయు నేమిచేయునో నీతిదప్పి
యని సుమిత్ర నమ్మునె యెన్న(డైన నన్ను? 432

గీ. విపినముల కేగె నా రామవిభు( డటంచు
మామ దశరథు( డంతనే మడిసె ననుచు
నక్కటా! యప్రియద్వయ మొక్కమాటె
విని సహింప(గ( జాలునే జనకతనయ? 433

గీ. హిమశిఖరిపార్శ్వమున దురదృష్టకలనఁ
గిన్నరునిఁ బాసి నెగులొందు కిన్నరివలె
నకట! నాచేఁ ఋ పాపకృత్యంబువలన
మహిజ దుఃఖించి దుఃఖించి మడియ కున్నె? 434

క. వనముల కరిగిన రాముని
మనమునఁ దలపోసి పోసి మహిజాత యిటన్
వనరుచుఁ గుములుటఁ గని నే
మనఁగలనే? యామెయార్తి మాన్పఁ గలనే? 435

ఆ. రాము నడవి కంపి నామేనఁ బ్రాణముల్
నిలుపఁజాల నొక్క నిమిసమైన;
నీవు విధవ వగుచు నీసుతు భరతుతో
నేల యడ్డులేక యేలుకొనుము. 436

గీ. అమృతకళఁ దోఁచు విసపుమద్యంబుఁ ద్రావి
యవల గ్రహియించుకొన్న మద్యపునిఁబోలి
గుణవతివి రూపవతి వనుకొన్న నేను
నిప్పటికి నిన్ను నసతిగా నెఱిఁగికొంటి. 437

గీ. ఈలపాటలఁ జొక్కించి జాలమందు
జింకఁ జిక్కించుకొని చంపు చెంచురీతి
కల్లబొల్లిమాటల నాకుఁ గైపుఁ గూర్చి
న న్నిపుడు పట్టి చంపుచున్నావు నీవు. 438

ఆ. అలిమాట మరఁగి యడవులవెంబడి
గొడుకుఁ గెడపినట్టి కూళ యనుచుఁ
బెద్దలెల్ల వీధిఁబెట్టి తిట్టరె నన్నుఁ
గల్లుద్రావు ద్విజునిఁ గంకినట్లు. 439

ఆ. అకట! యింతదుఃఖ మౌర! యింతటి కష్ట
మెన్నఁ డనుభవించి యే నెఱుంగఁ;
బ్రాప్త మయ్యె నిపుడు ప్రారబ్ధవశత నీ
దారుణోక్తి వినెడు కారణముగ. 44

క. పాపాత్మురాలి నిన్నున్
బాపి నగుచు బుద్ధిలేక బహుకాలము నా
ప్రాపునఁ జేరిచి మెడకుం
దాపిన యుర్రిత్రాడువోలెఁ దగులుచుకొంటిన్. 44

ఆ. నీవు నాకు మృత్యుదేవత వనుకోక
నెమ్మి నలరినాఁడ నిన్నుఁ గూడి
కీ డెఱుంగలేక కృష్ణసర్పంబును
గేలఁబట్టి యాడు బాలుఁబోలి. 44

గీ. క్రూరచరితుండనైన నా కొమరుఁ డగుట
పూజ్యచరితుఁ డనాథుఁడై పోయె నతఁడు;
పాపి నగు నే నొనర్చిన పాడుపనికి
నాడిపోయక మానునే యఖిలజగము? 44

క. స్త్రీలోలుఁడు దశరథ భూ
పాలుఁడు కామాంధుఁ డగుచుఁ బరమహితు సుతున్
బాలిశుఁడై యడవులకున్
దోలె ననుచుఁ బ్రజలు నన్ను దూషింప రొకో? 44

గీ. వ్రతవిధులచేత బ్రహ్మచర్యములచేత
నలఘు గురుసేవనములచే నలఁగి కలఁగి
ఘనుఁ డయిన రాముఁ డీ భోగకాలమందు
నైనఁ గష్టాల పాలెగానయ్యె నకట! 44

చ. అనఘుఁడు రామచంద్రుఁ డెదురాడఁగఁబోవఁడు నాకుఁ; గానకున్
జను మన మంచిదేయను; ననమ్మతిఁ జూపఁడుః చూపెనేని నా
మనమున కిష్టమౌనుగద; మాన్యుఁ డతండు విశుద్ధచిత్తుఁడై
కనఁడు మదింగితంబు; నుడికారమునే శిరసా వహించెడిన్. 446

క. వనమునకు రాము నంపిన
చెనఁటి యితం డనుచు జనులు చీవా ట్లిడుచున్
ననుఁ దిట్టుచుండ మృత్యువు
గొని చనదే యముని కొలువుకూటంబునకున్. 447

క. పురుషోత్తముఁడగు రాముం
డరణ్యమున కేగువెనుక నడలునఁ బడి నే
మరణించినంత నా ప్రియ
పరివారము నెంత బాధపఱుపఁ దలఁచితో! 448

చ. వనులకు రామునంపిన నవశ్యముఁ జత్తును నేను; వెన్క నా
తని జనయిత్రి చచ్చును; బదంపడి లక్ష్మణుఁ డార్తిఁ జచ్చు; నా
తని యనుజన్ముఁ డీ పలుకు దా వినినంతనె చచ్చు; నింతయున్
గనిన సుమిత్ర నాకు సహగామినియై మరణింప కుండునే? 449

గీ. పతియుగముతోడ ముప్వురు సుతులతోడఁ
బతి నయిన నన్ను దుఃఖాలపాలుచేసి
యందఱిని జంపి యుంక నే యడ్డులేక
హాయిగా నుందుగాక కైకేయి నీవు! 450

గీ. సద్గుణయుతంబు పూజ్యంబు శాశ్వతం బ
నాకులంబును నైన యిక్ష్వాకురాజ్య
మేను నా రాముఁడును ద్యజియించిపోవ
నీతిబాధలతో నీవె యేలుకొనుము! 451

క. భరతునికిని శ్రీరాముని
యరణ్యవాసంబు ప్రియమె యైయుండిన నే
మరణించువెనుక నా యు
త్తరకర్మల నతఁడు చేయఁదగఁ డెన్నఁటికిన్. 452

ఆ. పాపబుద్ధి విడిచి పగదానవై పోక
కరుణ గనుము మమ్ముఁ; గాకయున్న
ననఘుఁడైన రాము వని కంపి నన్నుఁ జంపి
యిలను విధవ వగుచు నేలుకొనుము. 453

చ. నరవరపుత్త్రి వంచు నిను నమ్మి గృహమ్మునఁ జేర్చుకొంటు, నా
పరువు నశించెఁ; గీర్తియును బాసెను; దుఃఖము సంభవించె; నేఁ
బరిభవ మందితిన్; జగము పాపి యితం డని నన్నుఁ దిట్టఁగా
శిరమును వంపఁగా వలసెఁ జేసినతప్పున కిప్పు డకటా! 454

క. శ్రీరాముఁడు రథ గజ తుర
గారూఢుం డగుచుఁ దిరుగు నా రాముఁడు దు
ర్గారణ్యసీమలను బద
చారి యగుచు వగలఁ దగులఁ జాలునె యకటా! 455

ఆ. కుండలులను సూదకులు రుచ్యభక్ష్యమ్ము
లొండొరులను మించి వండి యిడఁగ
నారగించు రాముఁ డాటవిక కషాయ
తిక్త కటువు లెట్లు తిని సహించు? 456

గీ. మృదుల కౌశేయవసనముల్ మేనఁ దాల్చి
హంసతూలికాతల్పంబులందు మెలఁగు
రాముఁ డెట్లు కాషాయాంబరములు గట్టి
కటికనేలను నివసింపఁ గలుఁగు నకటా! 457

ఆ. రాము నడవి కంపి రాజ్యాభిషిక్తుగా
భరతుఁ జేయుమన్న పాడుమాట
తలఁపరాని యిట్టి దారుణదుర్బోధ
నేరు నీకు చేసినారె కైక? 458

క. స్త్రీలోకమె స్వార్థపరము
మేలాడుచుఁ గీడుచేయ మేకొను నకటా!
యీలా గందఱి నాడం
బోలునె నిను భరతమాతఁ బోలిచి యంటిన్. 459

ఆ. స్వార్థపరత నొగుల కపకృతిసేయు నృ
శంసురాల! నన్నుఁ జంపె దేల?
యేను నీకుఁ గీడు నేమిచేసితి? లోక
హితుఁడు రాముఁడేమి యెగ్గు చేసె? 460

చ. అనుఁగుఁదనూజుఁ దండ్రి విడనాడిన, భర్తను భార్య వీడినన్
గనియును లోక మేమనదు గాని జగత్ప్రియు రాము నీకతం
బునఁ ద్యజియించి దుఃఖముల ముంచినచోఁ గని విశ్వమెల్ల ని
న్ననిశముఁ దిట్టిపోయుచును నాఁటిడిపెట్టక యూరకుండునే? 461

క. శతమఖసుతువలె సమలం
కృతుఁడై తిరుగాడు రాము నీక్షించిన నా
మతి కానందంబును వృ
ద్ధతకు న్నవయౌవనంబు దార్కొనుచుండున్. 462

ఆ. ఇనుఁడు లేకయున్న యింద్రుఁడు వానలు
గురియకున్న జగము వఱలుఁగాక
యిచటినుండి కాన కేగు రామునిఁ జూచి
బ్రదుకఁ జాల దొకక్క ప్రాణియైన. 463

ఉ. నాకు వినాశకారిణివి, నా కపకారవిశ్చితాత్మవున్,
నాకు విరుద్ధవర్తనవు, నా కపమృత్యువటం చెఱుంగఁగాఁ
బోక నినున్ మహోగ్రవిషభోగిని నంకముఁ జేర్చుకొన్న న
న్నికరణి న్విమోహమతి నిప్పుడు చంపుచునుంటి వక్కటా! 464

క. నను, రామలక్ష్మణులఁ, బ
త్తనవాసుల, దేశజనులఁ, దగుచుట్టములన్
దునిమి మదహితులు మెచ్చఁగ
నినుఁ గూడి ధరిత్రి నేలు నీ భరతుఁ డిఁకన్. 465

ఆ. అదరు బెదరు లేక యాపదలం బెట్టి
యదయహృదయ వగుచు నెదురు దిరిగి
వదరు నీదునోటిపం డ్లింతలింతలై
పుడమిమీఁద రాలిపడ విదేమి? 466

గీ. అహితమును బల్కఁ డప్రియ మాడఁబోఁడు
పరుసము నెఱుంగఁ డా రామభద్రుఁ డెప్పుడు;
ననఘగుణుఁడు ప్రియంవదుఁ డతనియెడల
నెట్టి దోషంబు నీవు చూపెట్టఁ గలవు? 467

గీ. చింతచేఁ జీకిపొమ్ము నశించిపొమ్ము
కాలిపొమ్ము బూడిద వయి రాలిపొమ్ము
కులకళంకినీ! నీ చెడ్డకోర్కు లింక
నే మయినఁగాని నీకు నే నీయఁబోను. 468

ఆ. కల్లబొల్లినుడులఁ జల్లనికత్తివై
పాపమతిని నుతిని బ్రాణములను
గోఁతవెట్టుచుంటి కులనాశకారిణీ!
యుర్వి నీవు బ్రతుక నొల్ల నింక. 469

గీ. చచ్చినాఁడను నా కింక సౌఖ్యమేడ?
నా కొడుకురాము విడిచి యానంద మేడ?
రాణి వపకృతి సేయఁగా రాదు నాకు
చరణ మంటి వేఁడెదను బ్రసన్న వగుము." 470

క. ఈ రీతి వేఁడి యేడ్చుచు
నారీధర్మంబుదప్పు నాతికి వశుఁడై
యా రాజేంద్రుఁ డనదవలె
దారపదము లందరాక ధరణిం బడియెన్. 471

## 13-వ సర్గము

### నేలఁబడిన దశరథునికి కైక బదులు వలుకుట

ఉ. వంతలఁగూరి నేలపయి బ్రాలుటకున్ దగనట్టివానిఁ బు
ణ్యాంతమునన్ ధరాపతితుఁ డైన యయాతిని బోలువాని భూ
కాంతుని పాపరూపయగు కైక గనుంగొని భీతిగొల్పుచున్
బంతముతో భయంపడక పట్టినపట్టునువీడ కిట్లనెన్. 472

గీ. "నే దృఢవ్రతుఁడను సత్యవాది ననుచు
నో మహారాజ! పొగడుకొం చుందు వెపుడు;
నిచ్చినవరాల నిపుడు నే నీయ ననుచుఁ
బట్టుపట్టెద వింతపాపంబు గలదె?" 473

క. అని కైక తూలనాడఁగ
విని భూపాలుండు క్రోధవిహ్వలుఁ డగుచున్
"ననుఁ జంపి రాము నరవరు
ననిపి వనికిఁ గోర్కెదీర నపు డలరుదువే! 474

క. నీ కిచ్చిన సత్యమునకు
నాకము లభియించుఁగాక నాకు సుఖంబే
యో కైక! రాముసేమము
నాకులు న న్నడుగ నే మనంగలవాఁడన్? 475

ఆ. సతికిఁ గైక కిడిన సత్యంబునకు రాము
నడవి కంపినాఁడ ననిన సురలు
నిండుసభను రామునికి రాజ్య మిచ్చెద
నన్న సత్య మేమి యయ్యె ననరె? 476

ఆ. సంతు లేక లేక చింతలఁ బడిపడి
యింతకాలమునకు నీ శుభాంగుఁ
బూజ్యుఁడైన రాముఁ బుత్త్రుగాఁ బడసితి
నతని విడువఁ గలనె యక్కటకట! 477

క. శూరుఁడు విద్యావంతుఁడు
సారసపత్త్రేక్షణుండు శాంతుఁడు కరుణా
సారుఁడు ప్రియపుత్త్రుం డగు
నా రాముని నెట్లు కాననముల కనుపుదున్? 478

క. రాముని నిందీవర సు
శ్యాముని నభిరాముని న్మహోబాహుబలో
ద్దాముని దండకకానన
సీమలఁ గష్టాలపాలు సేయంగలనే? 479

ఆ. సుఖము లనుభవించు సుకుమారుఁడగువాఁడు
వగలఁ దగిలి నొగులఁ దగనివాఁడు
బుద్ధిమంతుఁడైన పుత్త్రుండు రాముండు
కష్టపడుచునుండఁ గాంచఁ గలనె? 480

ఆ. సత్యవిక్రముఁడగు జనవంద్యు రాముపై
వైరమేల నీకుఁ గ్రూరురాల?
కష్టపెట్టి యతని కాన కంపక మున్నె
యేను చచ్చిపోవుటే సుఖంబు." 481

## సూర్యాస్తమయ మగుట

క. అని యపకీర్తికిఁ బరిభవ
మునకున్ దపియించి యినుఁడు మునుకుచు నుండన్
వనజాప్తుం డపరాంబుధి
మునిఁగెన్; దమి యంత మించి ముంచెన్ దెసలన్. 482

ఆ. అపుడు చంద్రమండలాలంకృతం బయి
హర్షదాయినియగు యా త్రియామ
యార్తుఁ డగుచుఁ గుందు నా రామచంద్రున
కింత సుఖమునైన నీయ దయ్యె. 483

ఆ. వేఁడినిడుదయూర్పు వెడలంగఁ బుచ్చుచు
వృద్ధుఁడైన దశరథేశుఁ డపుడు
గగనభాగ మట్టె కలయంగఁ జూచుచు
నెంతొ యార్తి నిట్టు లేడ్వఁ దొడఁగె. 484

క. "తారాగణభూషితవగు
నో రజనీ! తెల్లవారకుండుము; నాకై
కారుణ్యదృష్టి నాపైఁ
గూరుపు మొక్కింత; మ్రొక్కుకొందును నీకున్. 485

ఆ. కాకయున్న వేగ కదలిపొ మ్మిప్పుడే
పట్టి నన్ను బాధపెట్టుచున్న
క్రూరపాపచిత్త కుటిలాత్మయగు కైక
పాడుమొగము నింకఁ జూడఁ జాల." 486

క. అని విలపించుచుఁ గైకం
గనుఁగొని దశరథవిభుండు కైమోడ్చి ప్రస
న్నను జేసికొనఁగఁ గ్రమ్మఱ
ననియెన్ దీనాననుండు నార్తుం డగుచున్. 487

ఆ. "దేవి! మంగళాంగి! దీనుండ వృద్ధుండ
సచ్చరితుఁడ మృత్యుసన్నిహితుఁడ
నీ వశంవదుండ నీకు విభుండగు
నిట్టి నన్ననుగ్రహింప వలదె? 488

గీ. నే నెఱుఁగకంటి నా రాము నిండుసభను
రాజుఁ జేసెద నంచుఁ దిరంబుగాఁగ
సహృదయవు నీవు నాకు ససత్యదోష
మొదవకుండఁ గటాక్షింపు మో శుభాంగి! 489

గీ. అసితనయన! నా యెడలఁ బ్రసన్నాత్మ వగుము
నేను నీ కోర్కిఁ దీర్పఁగా నిత్తు నిప్పు
డవ్యయంబగు రాజ్యంబు; నంది దాని
నవల రామున కిచ్చి ప్రఖ్యాతి గనుము. 490

క. నావలనఁగొన్న రాజ్యము
నీవే రామునికి నిచ్చితేని స్నేనున్
నీవును భరతుఁడు రాముఁడు
భూవిబుధులు గురులు ప్రజలు ముదముం గనరే!" 491

ఆ. అనుచుఁ గన్ను లెఱ్ఱ నగుచు నశ్రులఁ దోఁగఁ
గన్నవారి మనసు వెన్నగాఁగ
బాలు లీల నేడ్చు పతివిలాపమునకుఁ
గైకరాతిగుండె కరఁగ దయ్యె. 492

ఆ. ఎంతొ ప్రేమగలిగి యెంతొ ప్రియంబైన
యింతి కైక యిప్పు డెదిరి రాము
వనికి నంపితీరవలె నని వేధింప
వనరి మరల మూర్ఛ మునిఁగె విభుఁడు. 493

గీ. అనఘమతియగు రా జిట్లు వనటఁగుంది
వేఁడినిట్టూర్పుగాడ్పులు విడుచుచుండ
నిసి దొలఁగె నంచు బోధకుల్ నిదురఁదెలుప
నృపుఁడు వలదంచు వారి వారించె నంత. 494

# 14-వ సర్గము

## దశరథుఁడు దుఃఖించుచుండఁగా రాత్రి వేగుట సత్యము నిల్పుకొమ్మని కైక ప్రబోధించుట

గీ. పుత్త్రశోకార్తిఁ బడి నేలఁబొరలువాని
నొడ లెఱుంగక మతిదప్పియున్నవాని
ప్రభుని నైక్ష్వాకునిం దేఱిపాఱఁజూచి
పాపమతికైక యిట్లని పలుకఁ దొడఁగె. 495

గీ. "శపథమును జేసి వర మిచ్చి కపటమతిని
నవనిపై నిట్లుపడి పొరలాడెదేల?
ఆడి తప్పుట నీకు మర్యాదకాదు
నియతమతి వౌచు సత్యంబు నిల్పుకొనుము. 496

గీ. ధర్మవిదులగు బుధులు సత్యంబుకంటెఁ
బరమధర్మంబులేదని పలుకుచుంద్రు
అట్టిధర్మంబుతోనె ని న్నడిగికొంటి
నిచ్చినది నీయ ననుట నీకేటి నీతి? 497

సీ. పక్షికై తనమేని పలలంబు డేగకు
నర్పించి శిబి స్వర్గ మందుకొనియె
వేదవిప్రుఁడు వచ్చి వేఁడ నలర్కుండు
కనుదోయినిచ్చి నాకంబు కనియె
విబుధేంద్రుఁ డర్థింప వెన్నెముక నొసంగి
యా దధీచి మునీంద్రుఁ డమరుఁ డయ్యె.
సత్యంబుపాటించి సరిదధినాథుండు
వేల దాఁటక ధర్మశీలుఁ డయ్యె

గీ. సత్యమే ప్రణవము బ్రహ్మ సత్య మగును
సత్యమందె ధర్మములెల్ల సంస్థితములు
సత్యమునె నిత్యనిగమముల్ సన్నుతించు
మహిప! సత్యంబు పరమధర్మంబు గాదె? 498

గీ. ఉత్తమోత్తముఁ డనుచుఁ బేరొందు నీవు
ధర్మమతి వాదువేని సత్యంబు నిలిపి
నా వరంబులఁ దప్పక నా కొసఁగుము
వరదుఁడవుగావె ప్రజల కెల్లరకు నీవు. 499

క. నే ముమ్మాటికిఁ జెప్పెద
రాము నడవి కంపు ధర్మరక్షణకై; యొం
డే మన్న నిపుడె చచ్చెద
నీ ముందటఁ దప్ప దింక నిందే దైనన్" 500

ఆ. అట్లు కైక నిర్భయంబుగా నదలింప
సత్యపాశవశుఁడు జనవిభుండు
అడి తప్పఁజాలఁ డయ్యె నుపేంద్రుని
పలుకు దాఁటలేని బలి విధాన. 501

గీ. అప్పు డుద్భ్రాంతుఁడున్ వివర్ణాస్యుఁడైన
మనుజనాథుండు యుగచక్రమధ్యమస్థ
వృషభముంబోలి విహ్వాలవీక్షణములఁ
గైకఁ గని పల్కె హృదయంబు గట్టిపఱచి. 502

## దశరథుఁడు దిటవుతెచ్చుకొని కైకను దూషించుట

ఆ. "అగ్నిసాక్షికముగ నాగమోక్తంబుగ
నే గ్రహించినట్టి నీ కరమును
నాకుఁ బుట్టినట్టి నీ కుమారుని నిన్ను
నేఁడు వదలుకొంటి నీచురాల! 503

ఉ. యామిని వేగె; సూర్యుఁ డుదయంబయినంతనె దేవి! నన్గురుల్;
రాము శుభాభిషేకవిధుల న్నెఱపన్ త్వరపెట్టవచ్చి యిం
దే మరణింపఁ గాంతు; రపు డేమగు? నయ్యభిషేకతోయముల్
రాముఁడు నాకుఁజేయు సలిలక్రియలం దుపయుక్తమౌనొకో! 504

గీ రాము పట్టాభిషేకకార్యములఁ జెఱచి
క్రూరమతి నీవు ననుఁ జంపుకొందువేని
నా సలిలకర్మముల నీవు నీ సుతుండుఁ
జేయరాదు ముమ్మాటికిఁ జేయరాదు. 505

క. రామాభిషేక మని పర
మామోదమునన్ జెలంగు నట్టి ప్రజ నిరా
శామగ్న మగుచు నడలఁగ
నే మొగమున వారి నిప్పు డేఁ గన నేర్తున్?" 506

ఆ. తేజ ముడిగి రాజు దీనుఁడై యిటు కైక
వేఁడుకొనుచు బతిమలాడుచుండఁ
జుక్కగములతోడఁ జక్కని నెలతోడ
వఱలు రేయి తెల్లవాఱిపోయె. 507

గీ. హయచతుష్కంబుఁ బూన్చిన యరద మదిగొ
చంద్రమండల నిభమైన ఛత్ర మదిగొ
చండకోదండచంద్రహాసంబు లవిగొ
సిద్ధమైన వన్నియు నభిషేకమునకు. 516

సీ. ప్రాభవోపేతమౌ పల్లకి, బోయలు
సితచామరములు పసిండిగిండ్లు
బంగారుగొలుసుతో బలుపు మూఁపురముతో
వీక్షణపర్వమౌ వెల్లయెద్దు
చక్కనిమెడజూలు జవసత్త్వములుగల్గి
మెఱయు నాలుగుపండ్ల వరహయంబు
నవరత్నసింహాసనము వ్యాఘ్రచర్మంబు
పావనగోమృగపక్షిచయము

గీ. సర్వమంగళవాద్యిత్రసంఘములను
బుణ్యకాంత లలంకృతల్ పుణ్యసతులు
శ్రేష్ఠపౌరజనంబులు శ్రేష్ఠిగణము
సర్వసన్నద్ధమైయుండె సమయమునకు. 517

గీ. ఉజ్జ్వలితవీతిహోత్రమై యుండె వేది
పుణ్యపురుషు లాచార్యులు భూమిసురులు
వచ్చియుండి రింకను ప్రియంవదు లనేక
ధారుణీంద్రులు వచ్చుచున్నార లిటకు. 518

గీ. పరమపావన మగు నీ ప్రభాతవేళ
సర్వతోభద్రపుణ్యనక్షత్రవేళ
రామభద్రుని పట్టాభిరాముఁ జేయ
ప్రభుని నీ వేగి వేగిరపఱుపవలయు." 519

## సుమంత్రుఁ డంతఃపురముఁ బ్రవేశించి రాజును మేల్కొలుపుట

ఆ. అని వసిష్ఠుఁ డట్టు లానతి యీయంగ
ననఘుఁడైన సూతతనయుఁ డప్పు
డధిపుఁ బొగడుకొనుచు నలవాటు చొప్పున
నడ్డులేక యరిగె నంతిపురికి. 520

ఆ. సమయమునకు రాజసదనంబునకు నేగి
ధరణివిభు నవస్థ నెఱుఁగ కునికి
నా సుమంత్రుఁ డప్పు డంజలి ఘటియించి
వినుతిసేయఁ దొడఁగె వేడ్కమీఱ: 521

ఆ. "ప్రభువరేణ్య! చిత్రభానూదయంబునఁ
బూర్ణసాగరుండు పొంగినట్లు
సహజసుగుణరత్నసంతానగరిమచే
మేలుకొనుము నిద్ర మేలుకనుము. 522

గీ. ఇట్టి సుప్రభాతముననే వృత్రవైరి
మాతలిప్రబోధమున జితారాతి యయ్యె;
ని న్నటుల నే ప్రబోధించుచున్నవాఁడ
మేలుకొనుము మహారాజ! మేలుకనుము. 523

గీ. సాంగపూర్ణంబులగు చతురాగమములు
నా స్వయంభువు విభు చతురాస్యుఁ బోలి
నిన్ను నేను ప్రబోధించుచున్నవాఁడ
మేలుకొనుము మహాప్రభూ! మేలుకనుము. 524

ఆ. అఖిలభూతధాత్రి యగు ధాత్రి శుభదాత్రి
నరుణకిరణుఁ డమృతకరుఁడు బోలి
నిన్ను మేలుకొలుపుచున్నాఁడ నిప్పుడు
మేలుకొనుము రాజ! మేలుకనుము. 525

గీ. అపుడు క్రోధతామ్రేక్షణ నిపుణవచన
పాపమతియగు కైక యా ప్రభునిఁ గాంచి
"తెగులుగొంటు మాటలు నన్నుఁ దిట్టెదేల?
ప్రియసుతుని రాఘవునిఁ బిలిపింపు మిటకు 508

గీ. భరతు నా తనయుని పట్టభద్రుఁ జేసి
విపినసీమకు రాముని వెడలనంపి
యొరులు నాకు శత్రువులు లేకుండఁజేసి
కువలయేశ! సత్యము నిల్పుకొందుగాక." 509

చ. అని యిటు కైక పట్టువిడనాడక పల్కినపల్కుచేఁ జుఱు
క్కన మునికోల ప్రేటుగను నశ్వముఁబోలి ప్రభుండు "దేవి! స
త్యనియతిఁ జిక్కి ధీబలము దక్కి కలంగుచు నున్నవాఁడ ధ
ర్మనిరతు జ్యేష్ఠపుత్త్రుఁ బ్రియు రాముని రమ్మను చూతుఁ గా"క నెన్. 510

ఉ. ఆ తమియంతబోఁగ నుదయాద్రికి భానుఁడురాఁగఁ బుష్య సం
పీతమహాముహూర్త శుభవేళ సమీపముగాఁగ శిష్టక
వ్రాతముతో వసిష్ఠభగవానుఁడు వేగ శుభాభిషేక సం
పూతసమస్త వస్తుపరిపూరితుఁడై పురిఁజేరె వేఁడుకన్. 511

సీ. సిక్త సమ్మార్జి తాంచితపథంబులతోడ
సమధికధ్వజభూషణలతోడ
సవిచిత్ర రుచిర ప్రసవ మంజరులతోడ
ప్రచురప్రవాళతోరణలతోడ
సురభిళచందనాగరుధూపములతోడ
నవవస్తుపూర్ణాపణములతోడ
సముదితానంద ప్రజాగణంబులతోడ
వర్ణనాతీతోత్సవములతోడ

గీ. రామపట్టాభిషేక దర్శన వినోద
జానపద పౌరగణ విలాసములతోడఁ
బరమశుభకరమగు నింద్రపురముఁ బోలి
చూపుఁ దనియించె నపు డయోధ్యాపురంబు. 512

చ. గురుఁ డటు లా పురంబుఁ గనుగొంచుఁ గ్రమించి ద్విజప్రఘోషలన్
బరఁగెడుదాని జానపదపౌరయుతంబగుదాని వేద వి
ద్వరవర యాజకాఖిల సదస్యసమంచితమైనదాని నా
ధరణితలాధినాథు మణిధామముఁ జేరగఁబోయి వేడుకన్. 513

## ద్వారమునొద్ద సుమంత్రుని చూచి వసిష్ఠుఁడు రాజునకుఁ దనరాక నెఱింగింపు మనుట

క. మునివరుఁ డచ్చటునిండిన
జనములఁ దరియించి చనుచు సన్నిధి ద్వారం
బునఁ గనియెన్ బ్రియదర్శను
మనుజోత్తము రాజసూతు మంత్రి సుమంత్రున్. 514

గీ. చిరతపస్తేజుఁడైన వసిష్ఠుఁ డపుడు
మతియుతుండగు సూతు సుమంత్రుఁ జూచి
నే నిటుకు వచ్చి వేచియున్నా నటంచు
ప్రభుని కెఱిఁగించి రమ్ము శీఘ్రముగ ననుచు. 515

సీ. ఇవె గాంగజలపూర్ణ హేమకుంభంబులు
ఘనసాగరోదకఘటము లవియె
ఇదె యభిషేకార్థ మిడు నుదుంబరపీఠి
నవధాన్యరత్నచందనము లవియె
ఇవె దర్భలాజాప్రసవనిహంబులు
పంచామృతోపేతపాత్ర లవియె
వీరె సుందరులైన వా రష్టకన్యకల్
వరణీయ వరభద్రవారణ మదె

గీ. మేరుగిరిశృంగమున జగన్మిత్రుఁ బోలి
కనకమణిమయాలంకార గాత్రదీప్తి
నాశ లలరార నిత్యకల్యాణలీల
లెమ్ము వేగ మహారాజ! లెమ్ము రమ్ము." 526

క. రవియును సుధాకరుండును
భవుఁడు గుబేరుండు వరుణపావకమూర్తుల్
దివిజేంద్రుఁడు విజయంబుల
సవరింతురుగాక నీకు క్ష్మాపాలమణీ! 527

క. వెడలె విభావరి భగవతి
గడపితి వీ రేయి సుకృతకార్యరతుఁడవై
తడయక లెమ్ము ప్రభూ! త్వర
పడు మిఁక రామాభిషేకభద్రకృతులకున్. 528

ఆ. జానపదులు పౌరజనములు వణిజులు
గొలువ విప్రవరులఁ గూడి గురుఁడు
వేచియుండె వేగ విచ్చేసి రామాభి
షేకమునకు నాజ్ఞ చేయువలయు. 529

ఆ. పాలకుండు లేని పసిమంద, దళవాయి
లేని సేన, విధుఁడు లేని రాత్రి,
గోవృషంబు లేని గోసంఘముంబోలి
రాష్ట్ర మెలమి గనదు రాజు లేక " 530

గీ. అను సుమంత్రుని సాంత్వనసార్థకోక్తు
లాలకించి తనూజచింతాంతరంగుఁ
డమలతేజుండు ధర్మాత్ముఁ డైనయట్టి
నృపుఁడు శోకతామ్రాక్షుఁడై యిట్టు లనియె. 531

## దశరథుఁడు సుమంత్రుని స్తవముల వారించి పలుకకుండుట

గీ. "చాలుచాలు సుమంత్ర! నీ సంస్తవముల
చేతఁ బీడింపఁబోకు నా జీవములను"
ననెడి కరుణోక్తి విని దీను నధిపుఁ జూచి
యతఁడు వెనుకంజ వైచెఁ దా నంజలించి. 532

## రాముని గొనిరమ్మని కైక సుమంత్రు నాజ్ఞాపించుట

క. భూమీశుఁడు దీనుండై
యేమియు మాటాడకునికి నిదె యద ననుచున్
ధీమతి కేకయనందన
యా మంత్రి సుమంత్రుతోడ నల్లన ననియెన్. 533

గీ "రామపట్టాభిషేకహర్షమున రాజు
రాత్రి మేల్కని యలసి నిద్రాళుఁడయ్యెఁ;
ద్వరగ నిశ్శంక రాజనందను యశస్వి
రాముఁ గొనిరమ్ము నీకు భద్ర మగుఁ గాక!" 534

## సుమంత్రుఁడు రాముఁ గొనితేర నరుగుట

క. అనిన సుమంత్రుఁడు ప్రభు శా
సన మిది శుభద మని యెంచి సత్వరగతియై
చనె రాముఁదేర యభిషే
చన మపు డైనట్లె యుబ్బి సమ్మోదమునన్. 535

గీ. అబ్ధిగర్భంబునందున్న హ్రదముఁ బోలు
నంతిపురి పేడి ద్వారంబుచెంతఁ జేరి
ప్రభువరులు భాగ్యవంతులు పౌరజనులు
క్రిక్కిఱిసియున్న సభ విలోకించె నతఁడు. 536

# 15-వ సర్గము

## శ్రీరామాభిషేక కార్యములు దీర్చుటకు విప్రులు వసిష్ఠునితో సభ చేయుట

గీ. రామపట్టాభిషేక కార్యములు దీర్ప
రాత్రి చనుదెంచియుండిన ధాత్రిసురులు
వేదపారగుల్ సభను గావించి రపుడు
క్షితిపతి పురోహితుండగు వసిష్ఠుఁ గూడి. 537

క. సామంతనృపులు సచివులు
శ్రీమంతులు నాగరికులు సేనాధిపతుల్
ప్రేమమున వచ్చియుండిరి
రాముని పట్టాభిషేకరమణునిఁ జూడన్. 538

గీ. అమలభానూదయమునఁ బుష్యాభియుక్తి
రాము జన్మలగ్నమగు కర్కాటకమున
నతని నభిషిక్తుఁ జేయ నాయత్తు లగుచు
నుర్వీసురు లెల్లరును వేచియుండి రపుడు. 539

గీ. కాంచనమయంబులగు జలకలశములును
భాసురాలంకృతంబు భద్రాసనంబు
వ్యాఘ్రచర్మసమాస్తీర్ణమైన రథము
సిద్ధముగఁ గూర్పఁబడి ప్రకాశించుచుండె. 540

క. గంగాయమునాసాగర
సంగమపావనజలంబు సకలనదనది
మంగళకూప సరో హ్రద
సంగతపుణ్యోదకములు సమకూర్పఁబడెన్. 541

క. తూరుపునకుఁ బడమరకున్
దాఁకునదులఁ దిర్యగూర్ధ్వపథగమనములన్
దాఁకు నదుల నఖిలాబ్ధుల
నీరములున్ గలశపాళి నిండింపఁబడెన్. 542

గీ. సరసిజోత్పలలాజాప్రసక్తము లయి
పరమపావనసలిలసంభరితము లయి
క్షీరపల్లవచ్ఛన్నంబులై రహించు
రమ్యకాంచరజతపాత్రములు మెఱసె. 543

గీ. నేయిఁ బాలును బెరుఁగు దేనెయును లాజ
లలరులుఁ గుశాంకురంబులు నలరుచుండె:
నమలకాంచనమణిభూషణములు దాల్చి
చెలువు మెఱయుచు నున్నారు వెలవెలఁదులు. 544

గీ. శశికిరణపుంజముంబోలి విశద మగుచు
మెఱుఁగురతనాలబంగారుపరుజుతోడఁ
దేజరిలుచుండెఁ గాంతులు దెసలఁ బర్వ
రామచంద్రుని యుత్తమచామరంబు. 545

గీ. చారుశారదపూర్ణిమాశర్వరీశ
మండలముఁబోలి కన్నులపండు వగుచు
విమలకాంతుల విలసిల్లు వెల్లగొడుగు
సిద్ధమై యుండె రామాభిషేకమునకు. 546

గీ. ధవళతురగోత్తమంబును ధవళవృషము
రాజయోగ్యంబు దానధారాప్రసక్త
గండయుగము శ్రీమంతమౌ గజవరంబు
సిద్ధమై యుండె రామాభిషేకమునకు. 547

గీ. మంగళాంగులు కాంచనమణిమయాళి
లాభరణభూషితలు నైన యష్టకన్య
లఖిలవాదిత్రములు మాగధాదు లెల్లఁ
జేరియుండిరి రామాభిషేకమునకు. 548

ఉ. శ్రీకరలీల నొప్పు నభిషేకశుభక్రియలందుఁ బావనే
క్ష్వాకు కులప్రసూతులకుఁ గాన్కలుపట్టెడునట్లె యుత్తమ
శ్లోకులు రాజులెల్ల నృపచోదితులై విపులోపహారముల్
గైకొనివచ్చి ద్వారమునఁ గాచియు నుండిరి రాజురాకకున్. 549

గీ. సవితృఁ డుదయించె సుముహూర్తసమయ మయ్యె
నభిషవము దీర్ప సభఁగూడి రవనిసురులు;
రాజుఁ రాఁడాయె; నిటు మనరాకదెల్పు
నతఁడు లేఁడాయె నని వార లనుకొనంగ. 550

గీ. విని సుమంత్రుఁ డా సామంతవిభులఁ జేరి
రాముఁ గొనితేరఁ జనుచుంటి రామునాజ్ఞ;
విభున కిపుడేగి మీ రాక విన్నవింతు
మహిపునకు రామునకు మీరు మాన్యులుగద! 551

గీ. అనుచు మరియాద లెటిఁగిన యా సుమంత్రుఁ
"డేలొకో! రాజు రాలేదు మేలుకనియుఁ
గారణం బేమొ యడిగెదఁగాక" యనుచు
నంతిపురికిని గ్రమ్మఱ నరిగె యతఁడు. 552

## సుమంత్రుఁడు తిరిగి యంతఃపురము ప్రవేశించి పౌర జానపదులు గురుఁడు రామాభిషేకమునకు వేచియుండిరని తెలుపుట

క. పరిపాటిగ నపు డంతః
పురముఁ బ్రవేశించి రాజుఁ బొగడం దొడఁగెన్
దెరవెనుక నిలిచి పూర్వజ
పరంపరను సన్నుతించి భద్రోక్తులతోన్. 553

క. "రవియును సుధాకరుండును
భవుఁడు గుబేరుండు వరుణపావకమూర్తుల్
దివిజేంద్రుఁడు విజయంబుల
నవరంతునుగాక నీకు క్ష్మాపాలమణీ! 554

క. వెడలె విభావరి భగవతి
గడపితి వీ రాత్రి సుకృతకార్యరతుఁడవై
తడయక లెమ్ము ప్రభూ! త్వర
పడుమిఁక రామాభిషేకభద్రకృతులకున్. 555

ఆ. జానపదులు పౌరజనములు వణిజులు
గొలువ విప్రవరులఁగూడి గురుఁడు
వేచియుండె వేగ విచ్చేసి రామాభి
షేకమునకు నాజ్ఞసేయు మధిప!" 556

క. అని యిట్లు ప్రబోధించుచుఁ
దను సన్నుతిసేయు మంత్రతంత్రజ్ఞు సుమం
త్రుని సూతుఁగూర్చి దశరథ
జనపాలుం డిట్టు లనియె స్వరభసవృత్తిన్. 557

క. "నీ వేగి వేగ రాముని
దేవలె నని రాజ్ఞి నీకుఁ దెలిపినదిగదా!
యీ విధమగు నా యాజ్ఞం
గావింపకయుంటి వేమికతము సుమంత్రా? 558

ఆ. నిదుర గనుట లేదు నేను నీ విపుడేగి
రాముఁ దోడుకొనుచు రమ్ము వేగ"
మనుచు దశరథేంద్రుఁ డపుడు స్వయంబుగా
నా యమాత్యవరున కానతిచ్చె. 559

క. నరనాథచంద్రు నానతి
శిరసా వహియించి మ్రొక్కి సిద్ధార్థుఁడు దా
శరథి యగు నంచు నెంచుచు
నరిగె సుమంత్రుండు రాము నాహ్వానింపన్. 560

## రాజునాజ్ఞ శిరసా వహించి సుమంత్రుఁడు రాముఁ గొనితేర నరుగుట

గీ. సచివుఁడు సుమంత్రుఁ డపుడు ప్రసన్నమతిని
హర్షపులకితుఁడై పతాకాంచితంబు
రాజలాంఛిత ధ్వజపట రమ్యమైన
రాజమార్గంబు గనుచు శీఘ్రముగ నరిగె. 561

క. సారథియైన సుమంత్రుం
డా రాజపథంబుఁబట్టి యరుగుచు వినియెన్
శ్రీరాముని యభిషేకముఁ
గోరి ప్రజలు వేడ్కఁజెప్పుకొను ముచ్చటలన్. 562

క. ఆ లీల నతఁడు చని కనెఁ
దైత్రిలోక్యాధీశ్వ రాయతనరమ్యంబున్
గైలాసశిఖరసామ్యము
శ్రీలాలిత రామరాజ సిత హర్మ్యంబున్. 563

సీ. అయతోన్నతకవాటాగ్ర సౌభాగ్యంబు
సువితర్దికాశతశోభితంబు
కాంచన పాంచాలికాంచిత శిఖరంబు
చారువిద్రుమమణి తోరణంబు
సురుచిర హేమభూధర దరీ ప్రతిమంబు
శారదనీరద సన్నిభంబు
మణిసువర్ణలతాంత మాలికా లసితంబు
ముక్తామణిప్రభామోహనంబు.

గీ. మలయజాగరు పరిమళ విలసితంబు
నయనపర్వంబు మానసానందకరము
మహిత దర్దురశిఖరోపమంబు నగుచు
మెఱయు శ్రీరామ సౌధంబు దరిసె నతఁడు. 564

సీ. సారస కేకికులారవామోదంబు
విరచిత మృగపక్షి విగ్రహంబు
రాజిత నవరత్న తేజోభిరామంబు
శిల్పకల్పిత రమ్యచిత్రకంబు
భాస్కరచంద్ర ప్రభా భాసమానంబు
శతమఖప్రాసాదసన్నిభంబు
మేరునిభంబు కుబేర సౌధాభంబు
కైరాత కుబ్జోపచారితంబు

గీ. ధవళిత ఘనాఘనప్రభా తరళితంబు
లలిత నవరత్నభూషణాలంకృతంబు
నదమలోన్నత మగు రామచంద్రభవన
మా సుమంత్రుండు దర్శించె హర్ష మెసఁగ. 565

క. కానుకలు గొని కృతాంజలు
లై నిలిచి ముదంబుమీర నభిషేకశుభా
ఖ్యానంబుల నొనరించెడి
జానపదుల నిండి రామసౌధము మెరసెన్ 566

క. నరసంకుల మగు రాముని
వరవేశ్మము గనుచు మంత్రివరుఁ డశ్వములన్,
దరలించి యభిముఖంబుగ
నరదము నడపుచు జనాళి నలరంజేసెన్. 567

క. సుందరబహువిధ ఖగ మృగ
బృందంబుల వెలయుచున్న నృపతనయమణీ
మందిరముఁ జొచ్చి యింద్రుని
మందిరమున్ జేరుక్రియ సుమంత్రుం డలరెన్. 568

గీ. స్వర్గతుల్యముల్ కైలాససన్నిభములు
సదమలాలంకృతములు కక్ష్యలను జొచ్చి
అందుఁ గల రాము ప్రియసుహృదాళి గడచి
రథికుఁడు సుమంత్రుఁ డంతఃపురంబు దరిసె. 569

గీ. అచటుఁ బ్రజలెల్లఁ గూడి రామాభిషేక
కార్యములఁ గూర్చి లోకమంగళముఁ గూర్చి
ప్రభుతనయు శ్రేయముం గూర్చి బహువిధములఁ
బొగడు నుడులను విని సూతపుత్త్రుఁ డలరె. 570

క. నగభేదిగృహోపమమై
మృగ ఖగ లసితమయి మేరుశృంగోన్నతమై
యగణితరత్నప్రభలన్
బొగడందగు రాము నంతిపురి నతఁడు గనెన్. 571

క. యానముల డిగ్గి దోయిట
గానుకలం గొనుచు ద్వారగతులౌ బహు సం
ఖ్యానీకపౌరజనముల
జానపదుల నచటఁ గాంచె సచివుం డెలమిన్. 572

గీ. ఉరుమహీధరవారిధరోన్నతంబు
ప్రమదము నిరంకుశమ్ము దురాసదమ్ము
రుచిరము బలిష్ఠమైన శత్రుంజయమను
హస్తి నటఁ గనె రాము వాహనము నతఁడు. 573

గీ. అమలభూషణభూషితు లైనవారి
నశ్వ వారణ రథయుక్తు లైనవారి
రాజ సఖ మంత్రి ముఖ్యవర్గముల దాఁటి
సిరు లెసఁగు నంతిపురిఁ బ్రవేశించె నతఁడు. 574

క. స్థిరమేఘనిభం బున్నత
గిరిశృంగాభము విమానగృహవిస్తరమౌ
పుర మతఁడు ప్రవేశించెన్
శరధిన్ మకరంబుసొచ్చు సరణి యథేచ్ఛన్. 575

## 16-వ సర్గము

### సుమంత్రుఁడు రామపదవముఁ జేరి వచ్చినపని చెప్పుట

చ. ఇనకులపూర్వ వృత్తములనెల్ల నెఱింగిన సూతుఁ డప్పు డా
జనగణ సంకులంబగు హజారముదాఁటి ధనుస్సు లీటెలున్
గొని భయభక్తులం గొలుచు కుండలులున్ సువయస్కులైన భృ
త్యనివహామున్న శాంతిమయ ధామము దేవిడిఁజేరె వేడుకన్ 576

క. కాషాయాంబరధారుల
భూషణభూషితుల వృద్ధపురుషులఁ బ్రహరీ
యోపాధ్యక్షులఁ బ్రియ నం
భాషులఁ గనె నతఁడు వేత్రపాణుల నచటన్. 577

క. శ్రీరామప్రియకాంక్షులు
వా రప్పుడు లేచి గౌరవము దెల్పఁగ నా
సారథి తన రాకను రఘు
వీరునకున్ వేగ విన్నవింపం గోరెన్ 578

ఆ. మంత్రిమాట విన్నమాత్రాన వా రేగి
విభుని కతని రాక విన్నవింప
రామచంద్రుఁ డపుడు రాణివాసమునకు
జనకసుతను దేర ననుమతించె. 579

సీ. రాజరాజవిభూతిఁ దేజరిల్లెడు వాని
ననుపమాలంకృతుం డైనవాని
నపరంజిసరిగపానుపున దువ్వలువపై
నుల్లాసమునఁ గూరుచున్నవాని
సిరిమించు వలపులఁ జిలుకు నెత్తవిగంద
మెన్నిక మైఁ బూసికొన్నవాని
నొకప్రక్కఁ జామర మూని సీతాదేవి
యల్లనల్లనవీవ నలరువాని

గీ. చిత్రతారతో శశిఁబోలి చెలఁగువాని
విమల తేజోమయుం డయి వెలయువాని
నరికులవిరాము నినకులశరధిసోము
రాముఁ గనె మంత్రి యంతఃపురమున కరిగి. 580

క. ఆదిత్యనిభుని వరదుని
భూదార కుమారు రాముఁ బొడఁగని వినయ
శ్రీదయివారఁగఁ బరమా
మోదమున సుమంత్రుఁ డపుడు మ్రొక్కి నుతించెన్. 581

గీ. మహిపసత్కృతుఁడైన సుమంత్రుఁ డప్పు
డంజలించి విహారశయ్యాసనములఁ
గూర్చి శ్రీరామచంద్రుని కుశల మడిగి
హితమధురభాషణంబుల నిట్టు లనియె. 582

క. "నినుఁ గడుపారం గాంచిన
జననుత కౌసల్య సుప్రజావతి రామా!
నిను దేవి కైకయును నీ
జనకుఁడు గనఁ గోరి రిపుడ చనుదేర నగున్." 583

గీ. అమితతేజుండు పురుషోత్తముఁడు నైన
రాముఁ డా మాట లాలించి ప్రేమమీఱ
సారథి సుమంత్రు తగురీతి గౌరవించి
యెలమి వెలయంగ సితతో నిట్టు లనియె. 584

క. "నాయనయ్యు జనని కైకయు
నా యభిషేకార్థచింతనన్ మంతనమున్
జేయుచు ననుఁ గనఁ గోరిరి
ప్రేయసి! యిది నిశ్చయముగ ప్రియమగు మనకున్. 585

క. మదిరేక్షణ! ప్రియకామయు
సుదక్షిణయు నైన కైక శుభమతిని బతిన్
హృది గని పనిగొనుచున్నది
మదీయఫలసిద్ధి కంచు మనమున నెంతున్. 586

క. కేకయనృపాలనందన
నాకు జనని లోకమునకు నాకున్ గల్యా
ణాకాంక్షిణి మజ్జనకుఁడు
క్ష్మాకాంతున కెల్లయెడల సహచరియె గదా! 587

గీ. ఆ మహారాజు ప్రేయసియైన దేవి
కైకతోఁ గూడి మత్ప్రియాకాంక్షియైన
యీ సుమంత్రుని దూతగాఁ జేసి యిటకుఁ
బంపి పిలిపించుకొనుట నా భాగ్యము గద! 588

గీ. ఎట్టిసభ యటఁగూడెనో యట్టిదూత
మనకడకు వచ్చినాఁడు సుమంత్రుఁ డిపుడు;
ఆ మహారాజు నన్ను సభాముఖమున
నిపుడె యువరాజుగాఁ జేయు నిది నిజంబు. 589

గీ. జానకీ! నీవు నీ పరిజనముతోడఁ
గూడి విహరించుచుండుము కొంతసేపు
జయమగుంగాక నే నేగి జనని కైక
క్షితిపతిని దండ్రి నిపుడె దర్శింతు"ననిన. 590

క. పతిసమ్మానిత భూమీ
సుత కువలయనయన యపుడు సుమహితమతియై
పతివెంబడిఁజని ద్వార
స్థితయై శుభచింతనంబు సేయుచు ననియెన్. 591

ఆ. "వారిజాసనుండు వాసవునకుఁబోలి
రాజసూయ యోగ్యరాజపదము
పరమపూజ్యమైన బ్రాహ్మణముఖముగా
జనవరుండు నీకొసంగుఁ గాక! 592

ఆ. రాజ్యమంది యంత రాజసూయాధ్వర
దీక్షc బూని నియతిc దేజరిల్లు
హరిణశృంగకరుని, నజినాంబరుని, శుచి
నిన్నుc జూడc గోరుచున్నదాన. 593

గీ. నాకపతి పూర్వదిశ నిన్ను సాcకుc గాక
ధర్మపతి దక్షిణమున నిన దనుపుc గాక!
ఉదధిపతి పశ్చిమమున ని న్నోముc గాక
అర్థపతి యుత్తరమున ని న్నరయుc గాక!" 594

## రాముcడు సూతునితో రథారూఢుcడై రాజమార్గమున తండ్రిభవనమున కరుగుట.

చ. అని శుభచింతనంబున ధరాత్మజ త న్ననుపం బ్రసన్న ద
ర్శనుcడును మంగళాంగుcడగు రాముcడు సూతునితో గుహాముఖం
బున వెలువడ్డ సింహమును బోలి నివేశమువీడి ద్వార వ
ర్తనుని గృతాంజలిన్ వినతుc దమ్ముని లక్ష్మణుcగాంచె వాకిటన్.

చ. మనుజవరుండు రాఘవుcడు మధ్యమకక్ష్యను జేరి యచ్చటన్
దన సఖులన్ మహోత్సవజనంబులc దన్పుచు నంత హవ్యవా
హనరుచిరంబు రాజతమునై విభవోచితమైన యట్టి మె
త్తని పులితోలుగప్పిన రథంబును నెక్కె సుమంత్రసూతుతోన్.596

చ. ఘనసినదంబు విస్తృతము కాంచన రత్నవిభూషితంబు సూ
ర్యనిభము నేత్రవిభ్రమమునై కరిణీకలభోపమాశ్వ యు
క్తి నెసcగు తేరియం దతు లధిష్ఠితుcడై రఘురామచంద్రుc డిం
ద్రునివలె నేగె దిక్కుల మెఱుంగుల నించుచు నుజ్జ్వలప్రభన్.597

క. శ్రీరాముc డపుడు రథగమ
నారావము దెసల నంబుదారవముక్రియన్
బోరుకొన నగరు వెడలెన్
స్వారాడ్గిరినుండి వెడలు జాబిల్లి వలెన్. 598

క. రామునివెనుకన్ దమ్ముఁడు
సౌమిత్రి వినీతుఁ డగుచు స్యందనగతుఁడై
చామరము ఛత్రముంగొని
ప్రేమన్ సేవించుచుండెఁ బ్రియసోదరునిన్. 599

సీ. గుంపులై బహుజనుల్ కోలాహలంబుగా
జయజయధ్వానముల్ సలుపుచుండ
వెనువెన్క గిరినిభద్విరదాధిరూఢులు
జవనాశ్వికులసహస్రములు వెడల
తొడి పూసి కట్టి యోధులు సుసన్నద్ధులై
ప్రభుభక్తి వెలయ నగ్రమున నడువ
వాద్యస్వనంబులు వందిస్తుతులు శూర
సింహనాదంబులు చేరి మొరయఁ

గీ. చారుభూషణభూషితల్ పౌరసతులు
సౌధవాతాయనంబుల సరస నిలిచి
క్రొవ్విరులజల్లు జల్లునఁ గురియుచుండ
రాజవీథిని జనుచుండె రాఘవుండు. 600

క. రమణీయాంగక లగు పుర
రమణీరత్నంబు లపుడు రాఘవుఁ డలరన్
సుమధురహితభాషణములఁ
బ్రమదంబునఁ బొగడి రిట్లు భద్రాకాంక్షన్. 601

గీ. మాతృనందన! నిన్నుఁ బ్రేమమునఁ గన్న
యతివ కౌసల్య ధన్యాత్మ యయ్యె నిజము;
సఫల మగుఁగాక నీ యాత్ర; జనకురాజ్య
మంది వచ్చు నిన్గని ప్రజ యలరుఁ గాక! 602

ఆ. అమృతకరునిఁ జంద్రు నా రోహిణింబోలి
పతిగ రామచంద్రుఁ బడయు కతన
విమలచరిత సీత వెనుకటిభవమున
నధికతపము చేసెననుట నిజము. 603

గీ. రామునికి హృదయేశ్వరి ప్రేమమూర్తి
సర్వవిధముల నాతని సహచరియును
నఖిలసీమంతినీ రత్నమైన యట్టి
యవనిసుత సీత యెంత పుణ్యాత్మురాలు. 604

క. వరసౌధోపరితలములఁ
బురసతు లిటు లాడుకొను ప్రమోదవచనముల్
నరవరుఁడగు రఘువీరుం
డరదముపైనుండి వినుచు నరుగుచు నుండెన్. 605

చ. జననుతు రామచంద్రుఁగని జానపదుల్ నగరప్రజల్ ముదం
బున "నిపు డీ నృపాత్మజుఁడు భూపతియానతిఁ బట్టభద్రుఁడై
యినకులగౌరవంబు వెలయించుచుఁ గూరిమి నేలుఁగాక మ
మ్మని వినుతింపఁ జొచ్చిరి చిరాభిమతంబు ఫలించినట్లుగన్. 606

గీ. చాలకాలంబునకు రామచంద్రుఁ డిప్పు
డవనిపతియౌట ప్రజల భాగ్యంబు గాదె;
యతనిపాలనమున నొక్కఁ డైనఁగాని
యప్రియము దుఃఖమును బొందఁ డనుట నిజము." 607

క. అని జనులు వందిముఖ్యులు
ఘనమంగళవాదకులును గరితురగయుతుల్
మును నందదించి నడువఁగఁ
జనె రాముఁడు రాజరాజసమతేజమునన్. 608

చ. పురజను లుల్లసిల్ల రఘుపుంగవుఁ డట్లు రథాధిరూఢుఁడై
కరి కరిణీ శతాంగ తురగప్రకరాకులమున్ మహాజనో
త్కర పరిపూరితాంగణ మగణ్య మణీమహితాపణంబు నౌ
సురుచిర రాజమార్గమును జూచుచు నేగుచునుండె వేడుకన్. 609

# 17_వ సర్గము

క. పరమోత్సవజనములచేఁ
బరిమళధూపములచేత భవ్యశుభాలం
కరణములచే నయోధ్యా
పుర మానందమునఁ బొంగి పొరలుచు నుండెన్. 610

సీ. అగరుధూపితములై యమలాభ్రనిభములై
ధగధగమెఱయు సౌధములతోడ
బహుమాల్యభూషణాంబరసుగంధద్రవ్య
సంపూర్ణవిపణివేశ్మములతోడ
క్రయవిక్రయేచ్ఛానుగత జనసంకుల
నవరత్నరుచిరాపణములతోడ
నభిషేకసందర్శనాగతజనలోక
వరణీయ వివిధోత్సవములతోడ

గీ. స్వాదుభక్ష్యవిక్రయనివేశములతోడ
నాటపాటలతోడ వాద్యములతోడఁ
బ్రమదమున నిండి దివి దేవపథముఁ బోలి
రాజిలుచునుండె నప్పు డా రాజవీథి. 611

గీ. మంగళద్రవ్యములతోడ ముంగిళులను
నిలిచి దీవించువారల నెలమి గనుచు
నభిముఖజనంబులను దత్తదర్హరీతి
నాదరించుచు రాముఁ డట్లరుగుచుండ. 612

## రామపరిపాలనమున జనులు రానున్న శుభములఁ గూర్చి ముచ్చటించుకొనుట

గీ. "రాముఁ డిప్పుడు పట్టాభిరాముఁ డగుచుఁ
దాతముత్తాతలపథంబుఁ దప్పకుండ
సకలజనపూజ్యుఁడై ధర్మశాసనమున
మనల నెల్లరఁ బాలించి మనుచుఁగాత. 613

ఆ. తండ్రి యేలుబడికిఁ దాతముత్తాతల
దొరతనంబునకును మెఱుఁగువెట్టి
రాముఁ డేలుచుండ రంజిల్లుప్రజలకు
సుగము లగునుగాక ద్విగుణితముగ. 614

ఆ. వలదు భోజనములు వలదు భోగంబులు
స్వర్గపదవులైన వలదు మాకుఁ
బట్టభద్రుఁ డగుచుఁ బ్రాసాదమున కేగు
ననఘు రాముఁ జూడఁ గనుటె చాలు. 615

క. సమధికతేజోబల వి
క్రముఁ డగు రాముండు యౌవరాజ్యాంగశ్రీ
రమణుఁ డగుట గనుకంటెన్
ప్రమదములు మనోరథములు మాకుం గలవే. 616

క. ఈ రీతి సుహృజ్జనులును
పౌరులు దను వినుతిసేయు ప్రమదవచనముల్
ధీరోదాత్తుఁడు గావున
నా రాముఁడు వినియు విననియట్లుగ నరిగెన్. 617

గీ. ఆ జగన్మోహనాంగు డవ్వయిన రాము
దలఁచు తలఁపులు చూచుచూపులు మరల్ప
నొక్కపురుషుండు గూడఁ దా నోపఁ డయ్యె
నన్న నిఁక స్త్రీజనముమాట యెన్ననేల? 618

గీ. జానకీరాముఁ గానంగలేనివాఁడు
నాతనికటాక్షముల కందనట్టివాఁడు
నే నభాగ్యుఁడ నని లోక మెంచునేమొ
యనుచుఁ దనుఁ దాన నిందించుకొనుచునుండు. 619

గీ. రాముఁ డే వేళ నాల్గువర్ణములవారిఁ
బ్రాయమునుఁబట్టి దయఁజూచు ప్రభుఁడు గాన
నఖిలధర్మస్వరూపుఁ డైనట్టివాని
నెపుడుఁ బ్రేమించుచుండెద రెల్లప్రజలు. 620

క. క్షితిపతి సుతుఁడగు రాముఁడు
చతుష్పథము లాలయములు చైత్యములు శుభా
యతనమ్ములకుఁ బ్రదక్షిణ
గతి రథగతుఁ డగుచు నేగెఁ గౌతుకమతియై. 621

## శ్రీరాముఁడు దశరథుని సద్మంబు జేరుట

సీ. శ్రీరాముఁ డట్లు రథారూఢుఁడై యేగి
దశరథరాజసద్మంబుఁ జేరి
మేఘబృందశ్రీల మెఱయుచున్నవియును
గైలాసశిఖరసంకాశములును
ధవళోజ్జ్వలవిమాననివహోపమంబులు
బహుచిత్రములును శుభంకరములు
నాకచుంబిత మహోన్నతశిఖరంబులు
నై విలసిల్లు సౌధాళితోడ

గీ. మహితమణిగణాంచితవర్ధమానభవన
పాళితోడ లోకఖ్యాతిఁ బడయుదాని
నింద్రవేశ్మాభమై సిరు లెసఁగునట్టి
జనకు ప్రాసాదమునఁ బ్రవేశం బొనర్చె. 622

గీ. రాముఁ డప్పుడు విలుకాండ్రరక్షణమున
నలరు కక్ష్యాత్రయంబును నధిగమించి
యచట రథమాపి యవని కక్ష్యాద్వయంబు
గడచి చనె పాదచారియై కౌతుకమున. 623

క. ఆ రాముఁ డట్లు కావలి
వారల వాకిళులు దాఁటి వరుసగ వెంటన్
గూరిమిని వచ్చు జనముల
వారించుచుఁ బోయె రాణివాసంబునకున్. 624

క. ఇనకులచంద్రుఁడు తము విడి
జనకునిఁ గనఁ నేగఁ దోడఁజను జనగణ మా
తని రాకఁ గోరుచుండెన్
వననిధి చంద్రోదయమును వాంఛించు క్రియన్. 625

# 18–వ సర్గము

## శ్రీరాముఁడు తండ్రిభవనమును ప్రవేశించుట

గీ. ఉత్తమాసనమునఁ గూరుచున్నవాని
నువిదయగు కైకచెంగట నున్నవానిఁ
జెన్నఱినవాని ఖిన్నుఁడై యున్నవానిఁ
దండ్రిఁ గనుఁగొనె రాముఁ డంతఃపురమున. 626

క. వినయియగు రాముఁ డప్పుడు
మునుమున్నుగ జనకుపాదములఁ బ్రణతుండై
వెనుకన్ గేకయసుతయగు
జననికి వందన మొనర్చి సంభావించెన్. 627

కం. జనపతి యప్పుడు 'రామా'
యని యనుఁగుంగొమరుఁ బిలిచి యవ్వల మాటా
డను జూడను మఱి నేరక
వనటు మునిఁగె నశ్రువారివఱదలువాఱన్. 628

## రాముఁడు దశరథుని స్థితి గాంచి భయపడుట

గీ. ఇంతవఱ కెన్నఁడును గాంచి యెఱుఁగనట్టి
జనకుని భయావహాకృతి గనఁగలేక
రాముఁడుంగూడ నపుడు విభ్రాంతుఁ డగుచుఁ
బాముఁ ద్రొక్కిన జనునట్లు భయముపడియె. 629

చ. కలఁగుమనంబుతో నతివికారమునందిన యింద్రియాళితోఁ
దలకొను దుఃఖశోకపరితాపముతోఁ గృశమైన మేనితోఁ
దొలఁకెడు వేఁడియూరుపులతోఁ జెలువేదిన నెమ్మొగంబుతో
నలమటఁ గుందు తండ్రిసి భయార్తునిఁ గన్గొనె రాముఁ డయ్యెడన్.

గీ. అలలఁ గలగుండువడు సంద్రమట్లు పాము
పట్టి పీడించు భానుని పగిదిఁ గల్ల
లాడిన తపస్విపలె నున్న యధిపుఁ గాంచి
కలఁగె రాముండు పున్నమకడలిఁ బోలి. 631

గీ. "అకట! యిదియేమి నన్నుఁ గన్నప్పు డెల్ల
నభిముఖుండయి ప్రేమించి యాదరించి
సంతసించుచునుండు భూకాంతుఁ డిప్పు
డిట్లు దుఃఖించుచున్నవాఁ డెందుచేత? 632

గీ. ఎంత కోపంబుతోనున్నయెడల నైన
ననుఁ గని ప్రసన్నుఁ డగుచుండు నా జనకుఁడు
ఇపుడు ననుఁ జూడఁజాలక యింతవంతఁ
గలఁత పడుచుండుటకు నేమి కారణంబొ?" 633

## రాముఁడు తండ్రి యవస్థకు కైకను కారణ మడుగుట

క. పితృహిత రతుఁడగు రాముఁడు
మతి నిటు చింతించి శోకమలినాస్యుండై
ధృతిసెడి దీనుని వలె న
య్యతివ కయిక కెలఁగి యపుడె యడిగె భయార్తిన్. 634

గీ. "తెలియ కే యపచారంబు సలిపినానొ
నన్నుఁ గని కోపగించిన ట్లున్నవాఁడు
కారణము దెల్పి నా యెడఁ గనికరించి
నా యనుఁగుఁ దండ్రిని బ్రసన్నుఁ జేయు మమ్మ! 635

క. నను నిరతముఁ బ్రేమించెడి
జనకుం డిపు డేల యప్రసన్నుండై దీ
నునివలె వనరుచు నన్నుం
గనియుం బలుకాడఁ డేమికారణ మమ్మా? 636

గీ. తనువు నసి దప్పుటనొ? మనస్తాపముననొ?
జనకుఁ డిటు గుందుచున్నవాఁడని తలంతు;
ధరణిపై జనించిన దేహధారులకు ని
రంతరసుఖానుభవము దుర్లభముగాదె! 637

క. ఘనుఁడు కుమారుఁడు జన రం
జనుఁ డగు భరతునకొ; బలుఁడు శత్రుఘ్నునకొ;
జననుతసచ్చరితలు నా
జననులకొ యమంగళంబు సంధిలదు గదా? 638

గీ. జనకుఁ డాగ్రహమున నున్నసమయ మందు
నతని శాంతింపఁగాఁ జేయునంతదాఁక
నతనియాజ్ఞను బాలించునంతదాఁక
నొక నిమిషమాత్రమైన నే నుండఁజాల. 639

క. తన జన్మకారణంబని
తనకుం బ్రత్యక్షదైవతం బని యెఱుకన్
దనుఁ దాఁ దెలిసిన యెవ్వఁడు
తన జనకుని భక్తిఁగొలిచి తనుపకయుండున్? 640

క. చనవు బలిమిఁ బరుసంబుల
నని యనుఁగుం దండ్రి నొవ్వనాడవుగద! యో
జనని! యేమిటి కీతఁడు
మనసుగలఁగి యింతచింత మరగుచు నుండెన్? 641

గీ. అమ్మ! తెలియంగఁ గోరి ని న్నడుగుచుంటి
రాజు నా తండ్రి యేమికారణమువలన
నెన్నఁడును గాంచి యెఱుఁగని యిట్టి వగల
నొగులుచున్నాఁడొ సత్యంబు నుడువు మమ్మ!" 642

క. అనుచు మహాత్ముఁడు రాముఁడు
తను వేడఁగఁ గైక స్వార్థతత్పరయై సి
గ్గును జంకుగొంకులే కి
ట్లనియెన్ నిశ్చయముగాఁగ నాతనితోడన్. 643

## కైక రామునకు దశరథుని దుఃఖకారణముదెల్పి తన వరద్వయము నుగ్గడించుట

క. "ఏ కినుక లేదు విభునకు
నే కష్టములేదు రామ! యితనికి మదియం
దాకాంక్ష యొకటి యున్నది
నీకుం జెప్పంగలేక నీళ్లు నమలెడిన్. 644

గీ. ప్రియసుతుండగు నీకు నప్రియముసెప్ప
నవనిపతి కించుకైన నోరాడకుండెఁ;
బ్రభుఁడు చేసెద నని నాకు బాసయిడిన
యట్టికార్యంబు నీవు చేయంగ వలయు. 645

గీ. నిత్యసత్యచరిత్రుఁ డీ నృపుఁడు నాఁడు
పరమగౌరవమున నాకు వరము లొసఁగి
మాట నిలుకడలేని పామరునిఁ బోలి
నాన విడనాడి కుందుచున్నాఁడు నేఁడు. 646

క. అలనాఁటి మాట నాచేఁ
బలికించి యొసంగ నాకు బాస యిడి యిలా
తలపతి యిటు వగచుట గత
జలసేతు నిబంధనంబు సలుపుట గాదే? 647

క. నీపైఁ బ్రేమన్ నరపతి
నాపైఁ గోపించి చలమునన్ సత్యంబున్
ద్రోపాడకుండ నీ విఁకఁ
గాపాడుము ఋతము ధర్మకందంబుగదా! 648

గీ. నీకు మేలైనఁ గీడైన నృపునియాజ్ఞఁ
బాలన మొనర్ప నీ వొడంబడుదువేని
జనవిభుండగు నితనిపక్షము వహించి
వినిచెదను నేనె నీకు సవిస్తరముగ. 649

క. అవనిపునానతి నీ విపు
డవశ్య మొనరింతు ననుచు నాన యిడినచోఁ
వివరింతు నేనె యప్రియ
మవునేని వచింపఁజాలఁ డాతఁడు నీకున్." 650

క. ఈ రీతిఁ గైక నుడివిన
శ్రీరాముఁడు దుఃఖవికలచేతస్కుండై
రారాజు తండ్రి సన్నిధి
నా రాణి వినంగ నిట్టు లనె దీనతతోన్. 651

గీ. "అక్కటా! దేవి న న్నిట్టు లాడఁదగునె?
క్షితివిభుఁడు తండ్రి నా కాజ్ఞ చేసినంత
నుఱుకనే యగ్నిఁ; ద్రావనే గరళమైన;
మునుఁగనే యొక్క పెట్టున వనధినైన. 652

క. గురుఁడును జనకుఁడు నృపుఁడున్
బరమహితుం డితనియాజ్ఞఁ బాలింపక యే
మఱినన్ శిష్యుఁడఁ దనయుఁడఁ
బరిపాల్యుఁడఁ బ్రియుఁడ నైన ఫలమే మింకన్? 653

ఆ. అట్లుగాన నృపుని యభిమత మేమియో
తెలుపు మమ్మ! చేసితీరువాఁడ!
బాసచేసినట్లు పలుకుచుంటిని రాముఁ
డాడు మాటఁ దప్పువాఁడు గాఁడు." 654

క. అని యీ గతి ఋజువర్తనుఁ
డనుపమసత్యవ్రతుండు నగు రాముఁడు చే
సిన బాసకు మది నుబ్బుచు
ననార్యయగు కైక యిట్టు లనెఁ గ్రూరముగన్. 655

## తండ్రి దురవస్థకు కారణము కైక రామునకుఁ దెల్పుట

క. "తొల్లి సురాసుర రణమున
భల్లక్షతిఁ జిక్కి మూర్ఛపడి నాచే నీ
వల్లభుఁడు సురక్షితుఁడై
యుల్ల మలర వరయుగంబు నొసఁగె న్నాకున్. 656

ఆ. భరతు నిపుడె పట్టభద్రుని గావింప
విపినములకు నిన్ను నిపుడె పంప
రామ! యిపుడె నేను రాజునకుం జెప్పి
యా వరద్వయంబు నడిగికొంటి. 657

చ. జనకుని సత్యపాలన యశంబును నిల్పఁ దలంతువేని; స
త్యనిరతుఁ డౌదువేనిఁ; బితృదత్తవరంబులఁ దీర్ప నా నుడిన్
విని పదునాలుగేండ్లు వనవీథులలో మునివృత్తి వల్కలా
జినములుదాల్చి నీ వట వసింపఁ జనందగు నిప్డె రాఘవా! 658

గీ. మఱియు నీ యభిషేకసామగ్రితోనె
చేయఁగాఁ దగు భరతాభిషేక మిపుడె
రాజ్యమును వీడి దండకారణ్యసీమఁ
జేరి జటి వయి నీవు వసింప వలయు. 659

క. భరతుఁడు రాజై కోసల
పురమునఁ జతురంగబలవిభూతి యెసంగన్
సిరిమించు రాజ్యమంతయుఁ
బరిపాలింపఁ దగు విగతభయకంటకుఁడై. 660

ఆ. ఇట్టిమాటచెప్ప నీ నరనాథుండు
గాఢదుఃఖశోకకలితుఁ డగుచు
దీనమానసుఁ డయి దిగులున మొగ మెత్తి
నిన్నుఁ జూడఁ జాలకున్నవాఁడు. 661

గీ. కావున నృపాలు నుడి శిరసా వహించి
తండ్రియాజ్ఞ నొక్కింతైనఁ దప్పకుండ
రామ! రఘుకులసత్యగౌరవము నిలిపి
తండ్రి రక్షించుకొనుము సత్యంబుచేత." 662

గీ. కైక యతిదారుణముగ నీ గతి వచింప
నించుకైన రాముఁడు చలియింపలేదు;
గాని యతిధీరుఁ డయ్యు భూజాని యపుడు
సుతవియోగార్తి దుఃఖసంక్షుభితుఁ డయ్యె. 663

# 91–వ సర్గము

## రాముఁడు కైక దారుణోక్తికి నేమియు కలఁగక వనవాసము చేయుట కిష్టపడుట

గీ. విమతమర్దనుఁడగు రఘువీరుఁ డప్పు
డప్రియంబులు మరణతుల్యంబులైన
యా కయిక దారుణోక్తుల నాలకించి
యెంతమాత్రమును జలింప కిట్టు లనియె. 664

క. "ఓ జననీ! యట్లేయగు
నేఁ జనియెద విపినములకు నిపుడ తపసినై;
రాజాజ్ఞను బాలింతు; జ
టాజినధారుండ నగుచు నట వసియింతున్. 665

ఆ. అరి విమర్దనుండు నమితదుర్ధర్షుఁడౌ
భూవిభుండు నన్నుఁ బూర్వ మట్లు
గారవింపకున్న కారణ మేమియో
యిది యెఱుంగ నిచ్ఛయించుచుంటి. 666

గీ. తల్లి! న న్నాగ్రహింపగాఁ దగదు నీకు
నీవు చూచుచునుండఁగా నిపుడె నేను
వల్కలజటాధరుండనై వనములకును
గదలిపోయెద నీవు సుఖంబుఁ గనుము. 667

క. గురుఁడును హితచింతనుఁడును
నరపతియుఁ గృతజ్ఞుఁడైన నా జనకునకున్
బరమప్రియమగు కార్యము
నెఱవేర్పక యుండ నింక నే నెటు లుందున్? 668

క. భరతాభిషేకవృత్తము
ధరణీనాథుండు నాకుఁ దానై యేలా
యెఱిఁగింపఁ డన్న శంకయె
మఱిమఱి బాధించుచుండె మనమున నన్నున్. 669

ఆ. ఒరులు చెప్పకున్న భరతునకు న్నేనె
రమణి సీతనైన రాజ్య మైనఁ
బ్రాణమైన నిష్టమగు ధనాదికమైన
నింక నేదియైన నిచ్చువాఁడ. 670

గీ. అట్టిచో మనుజాధిపుఁడైన తండ్రి
యే స్వయంబుగ నానతి యిచ్చె నప్పు
డేను నీ యాజ్ఞ దీర్పఁగాఁ బూనినపుడు
చేసెద నటంచు మఱిమఱి చెప్పనేల? 671

క. అదిగావున నీ పితని
మది కూఱటఁ గలుగఁ జేయుమా! యవనీశుం
డుదిరిగొని నేలచూపుల
కొదిగిల్లఁగ నశ్రుకణము లొలుకుటయేలా? 672

గీ. క్ష్మావిభునియాజ్ఞచే శీఘ్రగాములైన
తురగముల నధిరోహించి దూత లిపుడె
మాతులగృహంబునుండి కుమారు భరతు
నిచ్చటికిఁ దోడితేరఁ బోయెదరు గాక! 673

గీ. ఇంచుకంతయు నే సంశయింపకుండఁ
దండ్రియాదేశమును జవదాఁటకుండ
దండకాటవి కిప్పుడే తరలువాఁడ
వాస మొనరింపఁ బదునాల్గు వత్సరములు. 674

క. రాముఁ డిటు లనఁగ విని పర
మామోదమునంది కైక యతిశీఘ్రముగా
నా మహితాత్మునిఁ గానన
భూమి కనుప సాహసంబుఁ బూని యిటు లనెన్. 67

## అంగీకరించిన రాముని యడవి కనుప త్వరపెట్టుట

ఆ. భరతుఁదేర దూత లరిగెద రిపుడు నీ
వడవి కేగ నిష్టపడితి గాన
నాలసించు టింక ననుచితం బని యెంతు
నడవి కిపుడె పయన మగుము రామ! 67

క. ఆడిన తనమాటను బో
నాడెద వేమొ యను సంశయంబువలననే
వ్రీడాన్వితుఁడై పతి మా
టాడకయున్నాఁడు దా స్వయంబుగ నీతోన్. 67

ఆ. అట్లుగానఁ దండ్రియానతిఁ బాలింప
నతని సంశయంబు నపనయింప
నడవి కేగు రామ! యందాఁక నీ తండ్రి
స్నానమాడఁ డన్నమైనఁ దినఁడు 67

ఆ. అనుచుఁ గైక రాము నట్లు వేగిరపెట్ట
నకట! యెంతకష్ట మయ్యె ననుచు
భర్మవననకలితపర్యంకమున రాజు
శోకవివశుఁ డగుచు సొమ్మసిల్లె. 67

ఆ. కఠినచిత్త యగుచుఁ గైక యప్రియముగా
దారుణముగ నిట్లు తన్నుఁ బలుక
నించుకంతయైన నెడఁదఁ జలింపక
రాముఁ డిట్టు లనియె నామెతోడ. 68

ఆ. దేవి! నాకు లేదు శ్రీవిభవాసక్తి
వలదునాకు లోకవాసయుక్తి
తల్లి! నేను మౌనిధర్మావలంబిని
నాకు నన్యచింతనములు లేవు. 681

ఆ. ఎంతొ పూజ్యుఁడైన యీ రాజచంద్రుని
క్లిష్టమైన కార్య మేదియైన
నుసురు లొసఁగియైన నొనరింపఁ దగునేని
తిరుగులేక చేసితీరువాఁడ. 682

క. జనకునిఁ గొలుచుటకంటెన్
జనకాజ్ఞను నిర్వహింపఁ జాలుటకంటెన్
దనయునకు విధాయక మగు
ఘనతరధర్మము మఱొండు గలదే తలఁపన్? 683

ఆ. పరమపూజ్యుఁడైన నరపతి నా తండ్రి
స్వయముగా ననుజ్ఞ సలుపకున్న
నీ యనుజ్ఞ నేగి నిర్జనాటవి నుందు
నేను బదియునాలుగేండ్లదాఁక. 684

గి. అన్నిట నధీశ్వరివి తల్లివైన నీవు
నీ తలఁపు నాకుఁ జెప్పక నృపతి నిట్లు
వర మడుగునంత పని యేమివచ్చె నమ్మ!
నా స్వభావంబు గ్రహియించినావు గావు. 685

క. జననికడ సెలవుగైకొని
యనునయమున సీతఁదేర్చి యతివేగమె నేఁ
జనియెదను నేఁడె దండక
వనవాసము చేయుటకు నవశ్యముగాఁగన్. 686

గీ. ధరణిఁ బాలించుఁ గావుత భరతుఁ డింక
విధిగ నాతఁడు జనకు సేవించునట్టు
లరయుచుండంగ వలయు నీ వనవరతము
తల్లి! పితృసేవ యుత్తమధర్మముగద." 687

గీ. అనెడు రాముని ధర్మోక్తు లాలకించి
యినుమడించిన ఘనశోక మెదఁ గలంప
నలముకొనిముంచు కన్నీటి నాఁపలేక
యవనినాథుండు బావురు మనుచు నేడ్చె. 688

గీ. తను వెఱుంగని తండ్రిపాదముల కెఱఁగి
పాపమతియగు కైకకుఁ బ్రణతిఁజేసి
యపుడె పితరుల వలగొని యంతిపురము
వదలి రాముఁడు తన సుహృద్వరులఁ గనియె. 689

## రాముఁడు తండ్రికి మ్రొక్కి అంతఃపురంబు వీడుట

క. ఆననమునఁ గ్రోధంబును
నానతనయనముల నశ్రు లడరంగ సుమి
త్రానందవర్ధనుండగు
సూనుఁడు లక్ష్మణుఁడు చనియె సోదరువెనుకన్. 690

ఆ. అపుడు రామభద్రుఁ డభిషేకమంగళ
దివ్యభాండమును బ్రదక్షిణించి
దానివంకనైనఁ గాన కల్లన నేగెఁ
దండ్రియాజ్ఞఁదీర్చు తలఁపుతోడ. 691

గీ. ప్రకృతిరమణీయుఁడగు రఘురామచంద్రు
నతనిరాజ్యవిచ్యుతి యించుకంత యైన
స్మేరవదనద్యుతిని దూల్ప నేరదయ్యెఁ
గలుషరజనీతమము చంద్రకళనుబోలె. 692

గీ. అపుడు రాజ్యంబు విడనాడి యడవి కేగ
నిశ్చయించిన రాముని నెమ్మనంబు
మమత విడనాడు యోగీంద్రు మదినిఁ బోలి
నిశ్చలము నిర్వికారమై నివ్వటిల్లె. 693

చ. విడిచి శుభాతపత్రమును వీజనమున్ విడనాడి మిత్రులన్
విడిచి శతాంగమున్ విడిచి వెంబడుపౌరులపీడి యంత లో
నడలు నడంచి యింద్రియచయంబును బట్టి బిగించి ధీరుఁడై
వడిఁ జనె రాముఁ డయ్యశుభవార్తను దెల్పఁగఁ దల్లియింటికిన్.

## రాముడు తల్లి యింటికి జనుట

క. శ్రీలలితుఁడు సత్యవ్రత
శీలుఁడు నగు రామచంద్రు స్మితవదనమునన్
సాలంకృతాభిజనముల
యా లోకమ్ములకు విస్మృతి యగపడ దయ్యెన్. 695

గీ. ఆ మహాబాహుఁడైన శ్రీరాముఁడపుడు
సహజహర్షవికాసంబు సడలఁ డయ్యె
శారదోజ్జ్వలకిరణవిస్తారుఁడైన
విధుఁడు నైజప్రకాశంబు విడుప నట్లు. 696

క. సారోదారయశుం డగు
నా రాఘవుఁ డభిజనముల నతిమధురోక్తిన్
గారవమునఁ దేరుచుచున్
ధీరుండై చేరెఁ దమ్మునిన్ లక్ష్మణునిన్. 697

క. శ్రీరామసమగుణుండును
సారపరాక్రముఁడు నైన సౌమిత్రిమదిన్
గూరు వగ నడఁచుకొనుచు గ
ధీరుండై వెంబడించెఁ బ్రియసోదరునిన్. 698

గీ. ఆత్మ రాజ్యపదచ్యుతినైన వికృతిఁ
గని సుహృజ్జన మేమౌనో యనెడి శంక
రాముఁడు మనంబుననె విచారంబు నణఁచి
మాతృమంగళానందధామంబుఁ జేరె! 699

## 20-వ సర్గము

### శ్రీరాముని నిశ్చయమునకు రాణివాస రమణులు చింతించుట

గీ. దాశరథి తండ్రి కడనుండి తరలి నపుడె
రాణివాసంబునందున్న రమణు లెల్ల
"నక్కటా! యెంత విపరీత మయ్యె" ననుచు
గోలుగోలున నేడ్చుచుఁ గూలఁబడిరి. 700

గీ. "క్షితిపతి స్వయంబుగా నాజ్ఞసేయకున్న
నంతిపురముననున్న మా యందఱికిని
సంతతాభీష్టదాత రక్షకుఁడు నైన
నందనుఁడు కాన కేగుచున్నాఁడె యకట! 701

క. కన్నకొడుకు కౌసల్యకుఁ
గన్నకొడుకు మాకు నెల్లఁ గన్నారఁగ రా
మన్న యిటు లడవికేగఁగ
నన్నా! మా కింక బ్రదుకు నాశలు గలవే! 702

క. కోపమతులు దనుఁ దిట్టినఁ
గోపింపనివాఁడు; సహజకోపాత్ములకున్
గోపంబు దీర్చువాఁడు; న
కోపనుఁడగు రాముఁ డడవిఁ గ్రుమ్మరఁ జనునే? 703

ఆ. అఖిలజీవకోటి కభిరాముఁడగు రాము
నజ్ఞుఁడై నృపాలుఁ డడవి కంపి
మాకు సర్వజీవలోకమునకు నెంత
చెట్టు యిపుడు తెచ్చిపెట్టె నకట!" 704

ఆ. రాణివాసమందు రాణు లందఱునిట్లు
దీన లగుచు విభునిఁ దిట్టుకొనుచు
వత్సలను దొరంగి వగుచు నావులభంగి
నంగలార్చి రావు రావు రనుచు. 705

గీ. పుత్రశోకానుసంతాపపూర్ణుఁడైన
భూపుఁ డంతఃపురస్త్రీలు భూరిశోక
విహ్వలత నట్లు లేడ్చుట విని సహింపఁ
జాల కట్టె తల్పమునందె కూలఁబడియె. 706

క. ఆ రాణుల యేడ్పులు విని
శ్రీరాముఁడు నెంతొ చింతచే వారణ మ
ట్టూరిచి సుస్థిరమతియై
చేరనరిగె జననిగృహముచెంత కనుజుతోన్. 707

## శ్రీరాముఁడు కౌసల్యాసద్మమును జేరుట

క. ఆ రాముఁడు శుద్ధాంత
ద్వారంబున రాజపూజ్యుఁడగు వృద్ధుని దౌ
వారికు నుపవిష్టుని బెర
వారల నిలుచున్న భృత్యవర్గముఁ గనియెన్. 708

ఆ. అపుడు విజయశీలుఁడైన రామునిఁ గాంచి
యచట నున్న ప్రహరు లట్టె లేచి
యంజలించి ప్రేమ నాశీర్వదించుచు
జయనినాదములను జలిపి రంత. 709

ఆ. ప్రథమకక్ష్యదాఁటి ప్రభుపూజ్యులగువారి
నఖిలనిగమవేత్త లైనవారి
వృద్ధవిప్రవరుల కెఱఁగి రెండవకక్ష్య
నధిపసుతుఁడు రాముఁ డధిగమించి. 710

క. ఆ లీలన్ రాముఁడు చని
బాలలు వృద్ధలును ద్వారపాలిక లగుచున్
బాలించు తృతీయంబగు
నాలోవరిఁ జేరుకొనియె ననుజునితోడన్. 711

గీ. రాముఁ గని వారలెల్ల హర్షమునఁ బొంగి
దీవన లొసంగి వేగ మంతిపురి కరిగి
జనని రాణికి రామాగమన సువార్త
విన్నపంబు గావించిరి వేడ్కమీఱ. 712

ఆ. అప్పుడు పట్టమహిషియైన యా కౌసల్య
నియతమానసమున నిశను గడపి
సుప్రభాతవేళ సుతహితైషిణి యయి
పూరుషోత్తమునకుఁ బూజచేసి. 713

గీ. వ్రతనిరత శుభ్రకౌశేయవసనకలిత
భద్రభూషణభూషిత ప్రముదిత యగు
దేవి మంత్రపూతములుగా ద్విజులచేత
హోమములను జేయించుచునుండె నపుడు. 714

చ. అనఘుఁడు రామచంద్రుఁ డపు డంతిపురంబున కేగి పుష్పచం
దన పరమాన్న మోదక ఘృతప్రకరాఖిలహవ్యపూజ్య వ
స్తు నిహిత భాజనప్రతతి శోభిలు పావనవేదినుండి వే
దనిధులు వేల్చుపావకుని ధ్యానముచేసెడి తల్లిఁ గన్గొనెన్. 715

*క. తురగి కిశోరిం గాంచిన
కరణిన్ వీక్షించి యపుడు కౌసల్యవడిన్
బరమప్రీతి నెదుర్కొనెఁ
జిరకాలానందకరుని చిన్నికొమరునిన్. 716

గీ. వత్సలత నిట్టు లెదురుగా వచ్చుచున్న
తల్లిఁ గని రాఘవుండు వందనముచేయ
ననుఁగుసుతు నామె కౌఁగిట నాదరించి
శిరము మూర్కొని యిట్టు లాశీర్వదించె. 717

## కౌసల్య రాముని ఆశీర్వదించుట

గీ. అనుఁగునందన! నీకు మే లగునుగాక
వృద్ధులు మహాత్ములును ధర్మవేదులైన
రాజఋషులట్లు వంశధర్మంబు నిలిపి
ఘనతరాయుర్యశంబులఁ గాంతుగాక! 718

గీ. రామ! నిన్నిపుడే యౌవరాజ్యమందు
నిలుపు నీ తండ్రియగు రాజు నిశ్చయంబు
అది తప్పనివాఁడు ధర్మాత్ముఁ డాతఁ
డిపుడె చూతువుగాత యా నృపుని పేర్మి. 719

గీ. నాయనా! రమ్మిటకె భోజనమ్ము చేయ"
నని నిమంత్రించి మణిమయాసనముఁ జూపఁ
గరములను పీఠమును దాఁకి కైమొగిడ్చి
జననిఁ గనుఁగొని రాముండు సాధ్వసమున. 720

---

* పాఠాంతరము:

క. పరమధ్యానపరాయణ
వరవర్ణిని దేవి కొంతవడిక్కిఁ దనయునిన్
దురగి కిశోరము గాంచిన
కరణిన్ వీక్షించి యెదురుగా నేగె వడిన్. 716

## రాముఁడు తల్లికి తన విపినవాసవృత్తాంతము దెలుపుట

క. వినయాన్వితుఁడును గౌరవ
వినతుఁడునగు రాముఁ డపుడు విప్రియమైనన్
దన విపినవాసవృత్తము
వినిచి జననిసెలవు గాంచి వెడల నిటులనెన్. 721

గీ. "ఒక మహావిపత్తు గాపయి యున్నదనుచు
నీకు సీతకు లక్ష్మణునకిని గూడ
నది మహాదుఃఖదాయకమైన దనియు
దేవి! యేమియుఁ దెలియకున్నావు నీవు. 722

గీ. దండకారణ్యములఁ బట్టి తరలునాకు
నింక నీ రత్నమయపీఠ మేటికమ్మ!
జనని! దర్భాసనము వేసికొనఁగఁ దగిన
కాలముగదమ్మ యిది నాకుఁ గానలోన. 723

గీ. మధువు గ్రోలుచుఁ బండ్లు దుంపలును దినుచు
మౌనిపోలిక నిర్జనకాననమున
కే నిపుడుపోయి పదునాలుగేండ్లదాఁక
వాస మొనరించి జీవింపవలయునమ్మ! 724

క. ధరణీశుఁ డొసఁగ నుండెను
భరతునకును యౌవరాజ్యపదవిని; నాకో
పురి విడిచి దండకాటవి
కరిగి తపసి నగుచు నుండ నానతి యిచ్చెన్. 725

మ. నరనాథాజ్ఞను గాన కేగి యట వానప్రస్థధర్మంబులన్
బరిపాలించుచు నేను మూలఫలముల్ భక్షించి జీవించుచున్
జరియింతున్ బదునాలుగేండ్లు విజనస్థానంబులన్ మౌని శే
ఖరులం గొల్చుచుఁ; దల్లి నీవును ననుజ్ఞం జేసి యంపందగున్."

## రాము వనవాసము నెఱిఁగి కౌసల్య మూర్ఛిల్లుట

గీ. అనెడి విపరీతవాక్యంబు లాలకించి
ఖడ్గఖండితవృక్షశాఖయును బోలి
నాకవిచ్యుత దివ్యాంగనయును బోలి
యట్టి దేవేరి మూర్ఛిల్లి యవనిఁ బడియె. 727

గీ. అట్లు దుఃఖంబు నొందరానట్టి దాని
నవనిఁబడు నరఁటిం బోలినట్టి దాని
నవశయై విస్మృతింగన్నయట్టి దాని
దేవి జననిని రాముఁడు లేవనెత్తి. 728

గీ. భారమువహించి బడలికదీఱఁ బుడమిఁ
బడి దొరలి లేచియున్నట్టి బడబఁ బోలి
దుమ్ముగ్రమ్మ నంగకములఁ దూలునామె
యొడలు నిమిరి రాముఁడు ధూళినెడలఁ జేసె. 729

గీ. అధికదుఃఖవిహ్వలయు సుఖార్హ యైన
రాజ్ఞి త న్నట్లు సేవించు రామచంద్రు
మానవోత్తము గూర్చి లక్ష్మణుఁడు వినఁగ
నెదఁ బగుల్చు శోకంబుతో నిట్లు లనియె 730

గీ. పుత్ర! నీవు నా కడుపునఁ బుట్టుటెల్ల
నధికశోకానుభూతికే యయ్యె నిప్డు;
డట్లుగాకున్న గొడ్రాలి నగుటకంటె
నొండుదుఃఖంబు నాకు లేకుండును గద! 731

క. తనయులు లేరే నాకని
మనమునఁ దలపోసి లోన మఱుఁగుటె కానీ
యనపత్యకు ననుఁ బోలెన్
ఘనతరదుఃఖంబు గాంచు కారణ మున్నె? 732

గీ. అతఁడు ప్రభుఁడైనఁ బతిమూలమైన యట్టి
సిరియు సౌఖ్యంబు నే నెన్నఁ డెఱుఁగ నైతి;
కొడుకువలన నైనను సుఖపడుదు ననుచు
నుల్లమునఁ బుట్టెఁ డాసతో నుంటి నోయి! 733

గీ. నా సవతులందు మిన్న నౌ నన్నుఁ జూచి
క్రింది చలపాదిసవతులు క్రించుపఱచి
కుట్టుమాటలచే దుఃఖపెట్టుచుండ
వంగి క్రుంగి కృశింపఁగా వలయు నింక. 734

ఆ. బోటి కెందు సవతిమాటలఁ బడుకంటె
నింతకంటె దుఃఖ మేమికలదు?
నా విలాపమునకు నా దుఃఖమున కొక
యవధిలేదు; దీని కంతులేదు. 735

గీ. కన్నతండ్రి! నా చెంత నీ వున్నయపుడె
యన వినఁగరాని యవమాన మందియుంటి;
నీవు ననువీడి దూరమై పోవుదేని
మరణమునకంటె నాకింక శరణ మున్నె? 736

క. నా నాథుఁడు నన్నెపు డవ
మానించుటెగాని యింత మన్నించె నొకో!
నే నెపుడుఁ గైక యుడిగపు
దానికి సమమైతిఁ; గాదు తక్కువె యైతిన్. 737

గీ. పరిజనుం డెవ్వఁడైన నాపంపుసేయు
నట్టిభాగ్యంబు నా కెట్టు లబ్బు నింక?
ననుచరుఁడుఁ గూడఁ గైకనందనుని కడలి
పలుకు వినిపించుకొనఁడు; కన్నులనె పడఁడు. 738

గీ. పతి మహారాజు సుప్రజాహితుఁడు సుతుఁడు
గలుగఁ బగగొన్న సవతాలు కైక పలుకు
హీనదుర్భాషణముల సహింపవలసెఁ
దనయ! నే నెంత గతిలేనిదాన నైతి? 739

గీ. నిన్నుఁ గడుపారఁ గన్నార నేను గాంచి
యెపుడు యువరాజ వయ్యెద వీ వటంచు
నెపుడు నా కడగండ్లు గట్టెక్కు ననుచుఁ
గడపితిని పదునేడేండ్లు కన్నతండ్రి! 740

ఆ. అంతులేని యింతవంత నా సవతాండ్ర
వలనఁ గలుగు పరిభవంపుఁ జింత
ముసలిదాననైన ముప్పుగాలంబున
నే భరించి బ్రదుకనేర రామ! 741

క. పున్నమచందురు నిగ్గులఁ
జెన్నగు నీ మోముఁ గనక చిరదుఃఖితనై
కన్నీళ్లతోడ జీవన
మెన్నాళ్లని గడుపుదాన నే నిఁక రామా! 742

ఆ. ఒక్కప్రొద్దులుండి యుపవాసములుచేసి
విన్న కన్ననోము లెన్నొ నోచి
పేదఁబోలి నిన్నుఁ బెంచిన శ్రమ యెల్ల
నిట్లు విఫల మయ్యెనే కుమార! 743

ఆ. వానసీటఁ గ్రొత్తవఱదతాఁకుడునకు
గొప్పయేటిగట్టు కూలినట్లు
భయదదుఃఖవార్తఁ బగులదు నా గుండె
యెట్టి గట్టిరాతఁ బుట్టినదియొ? 744

గీ. అడవి విలపించుమృగిని సింహంబుఁ బోలి
శమనుఁ డిప్పుడె ననుఁబట్టి చంపఁడేమి?
దండధరునింత నాకింత తావులేదె?
అక్కటక్కట! నాకుఁ జావైన రాదె? 745

గీ. ఇంతదుఃఖార్తి నందియు నినుమొ రామొ
తునిసి పడకుండె నాగుండె తనువునుండి
నా జగన్నాథునాజ్ఞయై నపుడె గాని
కానివేళఁ గోరినరాదు గాదె చావు! 746

గీ. తనయునిం-గోరి నేఁ జేసికొనిన యట్టి
దాననియమవ్రతంబులు దపము లెల్లఁ
జౌటినేలఁ జైరిడిన బీజంబు లట్లు
విఫలతం గాంచ నాకిట్టి వెత జనించె. 747

క. కాలమురాకయ దుఃఖము
పాలంబడు జీవి చావుఁ బడయుఁ గలుగుచో
నే లేఁగ వీడు నావుం
బోలి నిను వ్వీడి చచ్చిపోదును గాదే! 748

ఆ. నీవు కాన కేగఁ జావు నా కెడఁగాఁగ
నికృతిఁ బడుచు నిచట నిలువఁ గలనె?
లేఁగ వెంబడించి యేగు గోవట్లు నీ
తోన యేను వచ్చుదాన వనికి " 749

గీ. అనుచుఁ గౌసల్య దుఃఖంబు నాపలేక
సత్యవశుఁడైన సుతు రామచంద్రుఁ జూచి
దనకు రాఁబోవు దుఃఖంబు దలఁచి పాశ
బద్ధసుతుఁ గన్న కిన్నరిభంగి నేడ్చె. 750

# 21-వ సర్గము

## దుఃఖించు కౌసల్యను జూచి లక్ష్మణుఁడు సమయోచితముగఁ బలుకుట

ఆ. ఆ విధమున నంగలార్చుచు నేడ్చు కౌ
సల్య రాజ్ఞి రామజననిఁ గాంచి
జాలిఁ బడుచు దీనుఁడై లక్ష్మణుఁడు సమ
యోచితముగ నిట్లు లుగ్గడించె. 751

ఆ. "తల్లి! యొక్క యాఁడుదాని మాటకు లోఁగి
సార్వభౌమపదవి జాఱ విడిచి
రఘువరేణ్యుఁ డిట్లరణ్యాని కేగుట
నాకుఁ గూడ మదికి నచ్చలేదు. 752

గీ. అతఁడు వృద్ధుఁడు విషయవిహ్వలుఁ డతండు
అతఁడు చపలుండు కామమోహితుఁ డతండు
అతఁ డధిపుఁడైన నే? మయ్యె యైన నేమి?
యతనిమాటలు పాటింప నగునె మనకు? 753

ఉ. ఏ యపరాధమేనిఁ గలనే నొనరింపని యట్టివాని న
న్యాయము మాటనైన మదినైనఁ దలంపనియట్టివాని, భూ
నాయకుఁ డిట్లు రాఘవు జనప్రియు రాష్ట్రమునుండి కానకున్
ద్రోయఁగఁ జెల్లునే? యతని దోసముగల్గెనె పీస మేనియున్? 754

ఆ. ఎంత శత్రుఁడైన నెంత ధిక్కృతుఁడైన
నీ జగంబునందు నెవ్వఁ డైన
నతనియెడఁ బరోక్షమందైన దోషంబు
లాడి దూఱినట్టివాఁడు గలఁడె? 755

గీ. ఋజుగతియు దేవసముఁడు జితేంద్రియుండు
అరులకుం గూడఁ బ్రియుఁడగు నట్టి సుతుని
ధరణిఁ బాలించు ధర్మతత్పరుఁ డెవండు
క్రూరుఁడై పీడనాడు నిష్కారణముగ? 756

క. ముదిసియును బాల్యచేష్టల
వదలక చరియించు ధరణివల్లభుమాటల్
విదితముగ రాజనీతిని
మది నెఱిఁగిన కొడు కెవండు మన్ననచేయున్? 757

ఆ. అన్న! యిట్టివిభుని యానతి నగరమ్ం
దొక్కయింత సుబ్బకున్న యపుడె
నేను దోడుఁగాఁగ నీ రాజ్య మంతయు
శీఘ్రముగ వశంబు చేసికొనుము. 758

క. ఎక్కటి ధనుర్ధరుఁడనై
ప్రక్కను నేనుండ యముని ప్రతిమూర్తి యితం
డౌకోఁ యని నీ వుండఁగ
నుక్కున ని న్నెదురఁగలఁడె యొరుఁ డెవఁ డైనన్? 759

క. నరవర! నీ కప్రియముగఁ
బరు లెవ రెదిరినను వారిఁ బరిమార్చెద; మ
త్ఖరతరశరశిఖిశిఖలన్
దరికొల్పి యయోధ్య నిర్జనముఁ గావింతున్. 760

క. భరతాభిమాను లగుచున్
భరతుని పక్షమున నెదురు వైరిపంథుల ను
క్కఱఁ జేసి కసిమసంగెదఁ
బరువు నిలుచునయ్య మెత్తఁబాటున నెందున్? 761

క. తెంపున గేకయనృపసుత
పంపున మనతండ్రి మనకుఁ బగయగునేనిన్
జంపుద; మాతని పడి బం
ధింపుద మటుగాక దుష్టనృపు విడఁదగునే? 762

క. అవలిప్తుఁడు గార్యాకా
ర్యవిచారము లేక దుర్ణయంబగు పథమున్
దవిలినవానిన్ ధరణీ
ధవునైనన్ దండ్రినైన దండింపఁ దగున్. 763

గీ. పూరుషోత్తమ! ధర్మానుభోజ్యమైన
నీ యవనిరాజ్య మా కైక కీయ నృపతి
యే బలము చూచుకొని యానతిచ్చినాఁడు?
ఏకతంబున నిటు నిశ్చయించినాఁడు? 764

క. నీతోడను నాతోడను
క్ష్మాతలపతి వైరమూని సకలధరిత్రీ
నేతగ భరతునిఁ జేయఁగ
దాతయగునె? తలలుమార్పఁ దాత తరంబే? 765

క. జననీ! యగ్రజుపైఁగల
యనురాగబుననె యిట్టు లనుచుంటిఁజుమీ!
నను నమ్ము బాస సేసెద
ధనువుపయిన్ సత్యసవనదానములపయిన్. 766

ఆ. ప్రజ్వలాగ్నినైనఁ బ్రబలోగ్రవనినైనఁ
జొరఁగ రాముఁ డడుగు జరుపునేని
నన్నకన్న మున్న యరిగి యందుఱికెద
నే నటంచు నిశ్చయింపు మమ్మ! 767

గీ. భానుఁ డుదయించి తమమును బాపినట్టు
లే నిపుడు విక్రమించి నీ యెడరుఁ దీర్తు;
జనని! నా వీరవిక్రమసాహసములు
చూతుఁగాక! రాఘవుఁడును జూచుఁగాక! 768

## కౌసల్య లక్ష్మణుఁ డనిన ప్రకారము గావించి తనువీడి పోవలదనుట

చ. అనఘుఁడు లక్ష్మణుం డిటు ప్రియంబునఁ బల్కినఁ గోసలేంద్ర నం
దన విని శోకదుఃఖపరితాపముల న్మదిఁ గుంది యేడ్చుచున్
దనయుని రామచంద్రుఁ గని "తమ్మునిమాటలు వింటిగాదె? నా
యన! తరువాతికార్యము హితానుమతిన్ బొనరింపఁగాఁ దగున్.

గీ. నయము ధర్మంబు వీడిన నా సపత్ని
మాటలను బాటిగాఁ గొని మాత నన్నుఁ
బ్రబలదుఃఖశోకంబుల పాలుసేసి
దిగవిడిచి పోవుటిది నీకుఁ దగదు తండ్రి! 770

క. ధర్మము నెఱిఁగినవాఁడవు
ధర్మిష్ఠుఁడ విటనె నిలిచి తల్లిని నన్నున్
బేర్మిని సేవించుటయే
ధర్మము; నీ కిదియుఁ బరమధర్మము గాదే! 771

ఆ. తనయ! కాశ్యపుండు తనయింటనే యుండి
జననిసేవఁజేసి సంయమి యయి
ఘనతపస్వులైన మునివరేణ్యుల మించి
చూఱగొనియె స్వర్గసుఖము లతఁడు. 772

క. రాజైనతండ్రి నెట్టులు
పూజించెదొ యట్లె నన్నుఁ బూజింపఁ దగున్
నీ జననియాజ్ఞ లేకయె
పోఁజన దడవులకు నీవు పురమున కెడయై. 773

ఆ. నాకు బ్రదుకు లేదు; నాకు సౌఖ్యము లేదు;
నిన్ను విడుతునేని గన్నతండ్రి!
ఆకలములు దినుచు నైన నీతోఁ గూడ
వనములందునైన మనుట మేలు. 774

ఆ. దుఃఖవార్ధి మునిఁగి దురపిల్లు నను వీడి
నీ వరణ్యములకుఁ బోవుదేని
నింక బ్రదుకఁజాల నిచటనే ప్రాయోప
వేశ మూని మేను విడుచుదాన! 775

ఆ. అట్లు జరుగునేని నాపగానాథుండు
బ్రహ్మహత్య కగ్గపడినయట్లు
నీవు లోక మెఱుఁగ నిరయదుర్గతిఁ జిక్కి
వనటఁ గంది కుందవలసియుండు." 776

క. అని దీనత విలపించెడి
జననిం గౌసల్యఁ గాంచి సద్ధర్మాలం
బనుఁడగు శ్రీరాముఁడు ధ
ర్మనిరూఢిం బలికె నిట్లు ప్రాంజలి యగుచున్. 777

**తండ్రియాజ్ఞను దాఁటలేనని రాముఁడు చెప్పుట**

ఆ. "జనని! నాకు శక్తి చాలదు పితృాజ్ఞ
నొక్కయింతయైన నుజ్జగింపఁ
బ్రణతిఁ జేసి నిన్నుఁ బ్రార్థించుచున్నాఁడ
ననుమతింపు మమ్మ! యడవి కేగ. 778

సీ. ధర్మజ్ఞుఁడగు కండుతపసి తండ్రియనుజ్ఞఁ
జేసి గోవధమైనఁ జేసినాఁడు
మనవంశజులు సగరునిసుతుల్ పితృాజ్ఞ
నిలఁ ద్రవ్వి యసురులే యిచ్చినారు

తండ్రిపంపున జామదగ్ని వెన్కాడక
జనయిత్రినైనను జంపినాఁడు
జనకాజ్ఞ నిటుదీర్చి చన్నవా రెందఱో
మున్నింటి మహితాత్ము లున్నవారు

గీ. నే నొకండనె యిటుచేయఁ బూనినానె?
పూర్వపురుషుల యాచారములను బట్టి
సుమహితంబైన ధర్మమార్గమును బట్టి
తండ్రియానతి నే జవదాఁటనమ్మ! 779

ఆ. అంతకఠినమైన యాజ్ఞగాదే నాకు
వనికి నేను బోయి వచ్చుటెంత?
కన్నతండ్రియాజ్ఞ కడకుఁ ద్రోయగఁ జాల
ధర్మపథ మొకింత దప్పఁజాల. 780

ఆ. నేను మున్ను లేనిదానిఁ జేయుట లేదు
ధర్మబాహ్యమైనదానిఁ గాదు;
ప్రాజ్ఞు లనుమతించు బాటఁ బట్టితిఁ గాని
తల్లి దుఃఖపెట్టఁ దలఁచిగాదు. 781

క. జగమున ముందుగఁ జేయం
దగు జనకునియాజ్ఞఁ దీర్చెదను ముఖ్యముగన్;
నిగమోక్తిగఁ బితృవాక్యము
వగవక పాలించి యెవఁడు వ్యర్థుం డయ్యెన్?" 782

క. పలుకాడ నేరుపరి బలు
విలుకాండ్రను మేటియైన వీరుఁడు రాముం
డలఘుమతిఁ దల్లి కిట్లని
తెలియంగాఁ జెప్పి తమ్ముదెసఁగని యనియెన్. 783

## రాముఁడు లక్ష్మణుని తొందరపాటునకు మందలించుట

గీ. "అనుజ! లక్ష్మణ! నీకు నా యందు నెంత
ప్రేమయున్నదియో నే నెఱింగియుంటి;
మఱియు నీ సత్త్వము పరాక్రమంబు నీ ప్ర
భావతేజముల్ క్రొత్తలు కావు నాకు. 784

గీ. అమ్మ యిప్పుడు ఘోరదుఃఖాబ్ధి మునిఁగి
సత్యశమతత్త్వము లెఱుంగఁ జాలకుండె;
నఖిలశుభలక్షణ యుతుండ వైన నీవుఁ
గూడ నెఱుఁగని యట్లు మాటాడెదేల? 785

గీ. ధర్మమే పెద్ద పూరుషార్థములలోన
ధర్మమందె నిల్చినది సత్యంబుగూడ
నిపుడు తండ్రియొనర్చిన యీ యనుజ్ఞ
ధర్మసంయుక్త ముత్తమోత్తమము గాదె? 786

ఆ. తండ్రిపల్కునైనఁ దల్లి వాక్యమునైన
నవనిసురునిమాటయైనఁ గాని
చేయ సమ్మతించి చేసినబాసను
దప్పరాదు వీరధార్మికునకు. 787

గీ. అట్లగుటఁజేసి నేఁ దండ్రియాజ్ఞఁ దీర్ప
కుండఁ బ్రతికూలవర్తి నై యుండఁ జాల;
గైక నన్నట్లు త్వరపెట్టఁగల్గుటకును
గారణము తండ్రివచనమే వీరవర్య! 788

క. కావునఁ దమ్ముఁడ! క్షాత్రము
నీ వవలంబించి ధర్మనియతిని వీడం
గా వలదు; ధర్మమతివై
నా వచనము వినుము; వడితనం బిటఁ దగునే." 789

క. భ్రాతృస్నేహమున సుమి
త్రాతనయున కట్లు చెప్పి ప్రాంజలి యగుచున్
మాతకు సాష్టాంగనతుం
డై తగ నిట్లనియె లక్ష్మణాగ్రజుఁడు మతిన్. 790

క. "ఓయమ్మ! వనికి నిప్పుడ
పోయెద సెల విచ్చి నన్నుఁ బోనీయఁ దగున్;
నా యాన మాఱుచెప్పకు
చేయుము దీవనలు శుభము చేకుఱ నాకున్. 791

గీ. అమ్మ! రాజర్షియైన యయాతి తొల్లి
యమరపురివీడి క్రమ్మఱ నరిగినట్లు
ఈ యయోధ్యను వీడి నే నేగి వనికి
సమయముం దీర్చివత్తు నిచ్చటికి మరల. 792

గీ. మదిఁ గుములఁ జేయు దుఃఖంబు మనసునందె
యణఁచుకొనుమమ్మ శోకింపకమ్మ! యిట్లు;
తండ్రియానతి సత్యంబుఁ దప్పకుండ
వనికి నేఁ బోయి యింతలో వత్తు నమ్మ! 793

క. నే నొకఁడగాదుఁ దశరథుఁ
డానతిఁ దలఁదాల్ప నీవు నవనిజయు సుమి
త్రానందనుఁడు సుమిత్రయు
మానుగ శిరసా వహించి మన్నింపఁ దగున్. 794

గీ. తల్లి! నా యభిషేకకృత్యములు విడిచి
మమతయును దుఃఖమును నెమ్మనమున నడఁచి
పాడిమెయిఁ గాన కేగు నా పయనమునకు
సమ్మతించి సెలవొసంగు మమ్మ! నాకు. 795

ఆ. పాడి దప్పకుండఁ బ్రతినవీడక యిట్లు
పట్టువట్టుసుతుని పలుకులువిని
యట్టె మూర్ఛమునిఁగి యంతలోఁ దెలివంది
పట్టమహిషి మరల నిట్టు లనియె. 796

గి. "మైత్రిచేత ధర్మముచేతఁ బుత్త్ర! నీకుఁ
దండ్రివలె నేనుఁ బూజింపఁ దగినదాన
నను వనటు ముంచి వనికేగఁ జనదు నీకు
నేను దాని కానతి నిచ్చుదానఁ గాను. 797

మ. తనయా! నా బ్రతుకేల ని న్విడిచి స్వర్గామంబు నొల్లన్; సుధా
శన మే నొల్లను; బైతృకంబగు స్వధాసత్కార మే నొల్లఁ; గాం
చనె యొల్లం బరలోకసౌఖ్యము; సమస్తప్రాణిలోకాళి క
న్నను నిన్నొక్క నిమేషమేనిఁ గనుఁగొన్నంజాలు నా కియ్యెడన్."

ఆ. ఇట్లు జాలిగదుర నేడ్చు తల్లిఁగని
కరఁగి రాముఁ డెంతొ పరితపించెఁ
గొఱవిగముల మృగయు లఱిమిన తెరువున
నిఱికికొను మహాగజేంద్ర మట్లు. 799

## రాముఁడు తల్లికి తమ్మునకు ధర్మమర్మ మెఱిఁగించుట

ఉ. దారుణ దుస్సహార్తి స్మృతిదప్పిన చొప్పున నున్న తల్లినిన్
బారములేని దుఃఖహతిఁ బొల్పడి చేడ్పడియున్న తమ్మునిన్
బేరిమిఁ గాంచి యిట్లనియెఁ బెంపు దలిర్పఁగ; నట్టిపట్టునం
దా రఘురాముఁడే తెలుప నాఢ్యుఁడు నిర్మల ధర్మమర్మమున్ 800

క. "తమ్ముఁడ! నా యెడఁగల నీ
నెమ్మియు నీ బలము నెఱుఁగనే? యిటు నా చి
త్త మ్మెఱిఁగియు న న్నీగతి
నమ్మవలెన్ దుఃఖపెట్టనగునే నీవున్? 801

గీ. తనకు ననుకూలవతియైన దారవలన
ధర్మసుఖపుత్త్రసంతతుల్ దనరి నట్టు
లొక్క ధర్మమూలముననె యొదవుచుండు
ధర్మరతులకుఁ బూరుషార్థత్రయంబు 802

ఆ. కేవలార్థకృతులు కీడొదవించును;
గామకృతులవలనఁ గలుగు నింద;
ధర్మమందె కలవు ధర్మార్థకామముల్
గాన ధర్మకృతికె గడఁగ వలయు. 803

చ. గురుఁడు ప్రభుండు వృద్ధుఁ డనుకూలుఁడు నౌ తనతండ్రి క్రోధ ము
ష్టురుఁ డయిగాని కామియయిగాని ప్రియుండయిగాని చేయు ను
త్తరు వెటువంటిదైన నది ధర్మముగా శిరసా వహించి ధ
ర్మరతుఁ డకిల్బిషుం డగు కుమారుఁ డైవం డొనరింప కుండెడిన్? 

ఉ. కావునఁ దండ్రిపంపు విధిగా నొనరింపకయుండఁ జాల వ
త్సా! విను; నాకు నీకు మనతండ్రి గురుండు ప్రభుండు నౌట నా
జ్ఞావరుఁ డాజ్ఞసేయఁ దగు; మాతకుఁగూడ సదా శరణ్యుఁడున్;
బావనుఁడైన భర్త నెడబాయుట ధర్మమె యించుకేనియున్. 805

ఉ. అంతటి ధర్మరాజు సముదారగుణుండు స్వధర్మమార్గ మొ
క్కింతయు దాఁటనట్టి హృదయేశుఁడు సన్నిధిచేసియుండఁగాఁ
జింతలగుంది పట్టమహిషీమణి వయ్యు ననాథవోలె నా
చెంతనె యుండ వత్తునని చెప్పుట చెల్లునెతల్లి! నీ కిటన్. 806

గీ. అడవి కే నేగుటకు నాజ్ఞ నిడఁ గదమ్మ!
భద్ర మొనఁగూడ దీవించి పంపు మమ్మ!
సుకృతిని యయాతి స్వర్గంబుఁ జొచ్చినట్లు
వ్రతముదీర్చి నేఁ గ్రమ్మఱ వత్తునమ్మ! 807

ఆ. ధరణి రాజ్యకాంక్ష దవిలి మహోదయ
విమలకీర్తిపథము విడువఁజాల
జనని! జీవితంబు క్షణభంగుర మధర్మ
యుక్తిఁ దుచ్ఛరాజ్య మూనుటేల?" 808

చ. ఇనకులచంద్రుఁ డిట్లు జనయిత్రిని సారెకు నూఱడించుచున్
వని కరుగంగ నిశ్చయ మొనర్చి యచంచలమైన పూన్కితో
ననుజు సుమిత్రసూతిఁ గని యాత్మమతం బెఱిఁగించి పిమ్మటన్
మనముననే ప్రదక్షిణ నమస్కృతులం బొనరించెఁ దల్లికిన్. 809

## 22-వ సర్గము

### రాముడు లక్ష్మణుని కోపము తగ్గించుకొనుమని వనవాసమేగుటకు దగు ప్రయత్నములు చేయుమనుట

సీ. అంత ధీరోదాత్తుఁ డగు రాఘవుఁడు హృద
యాంతరవ్యథ దీనుఁడైనవాని
నురుతరక్రోధ సముద్ధతుండగువాని
నురగేంద్రుగతి రోఁజుచున్నవాని
రోషవిస్ఫారితారుణనేత్రుఁ డగువాని
ననుగతపరమాప్తుఁ డైనవానిఁ
వరసుమిత్రానందవర్ధనుఁ డగువాని
ననుజులలోఁ బ్రియుం డైనవానిఁ
గీ. గలఁతఁజెందినవాని లక్ష్మణుని గాంచి
చిత్తవికృతి ధైర్యంబుచేఁ జిక్కఁబట్టి
యతని డగ్గరి యల్లన నాదరించి
యనునయోక్తులతోడ నిట్లని వచించె. 810

ఆ. అట్టి ప్రేమ నన్ను నాదరించెడి కైక
రాజ్య మీవు చేయరా దటంచుఁ
గాన కేగు మంచుఁ గఠినోక్తు లాడఁగాఁ
గారణంబు దైవగతియె గాదె! 823

ఆ. కాకయున్న రాజకన్య సద్గుణమాన్య
సత్స్వభావయైన సాధ్వి కైక
భర్తచెంత నన్నుఁ బ్రాకృతస్త్రీవోలె
నిట్టినుడుల దుఃఖపెట్టఁ గలదె? 824

ఆ. కానరాని దాఁటఁబోని దైవమునకు
భూతకోటు లాటబొమ్మలు గద!
కాకయుండెనేని కైకకు నాయెడ
నిట్టి భేదబుద్ధి పుట్టు టెట్లు? 825

గీ. కార్యఫలరూపమునఁ గాని కానఁ బడని
దైవమును మున్నె తెలియంగఁ బోవు టెట్లు?
అది యదృష్టంబు; దానికి నెదురు లేదు
తెలిసి యెవ్వాఁడు దాని భేదింపఁ గలఁడు? 826

గీ. భవము నాశంబు భయము కోపంబు లాభ
నష్టములు కష్టసుఖములు నాఁగ నిట్టి
కారణము కానఁబడని సంఘటన లెల్ల
దైవసంకల్పము లటంచుఁ దలఁపవలయు. 827

ఆ. ఉగ్రతపముఁ జేయుచున్న మహర్షులు
నట్టి దైవపీడ కగ్గ మగుచు
నిరత తీవ్ర నియమనిష్ఠలఁ బోనాడి
క్రోధకామములను గుమిలిపడరె? 828

విపులయత్నకార్యంబులు విఫల మగుచు
నెట్టి సంకల్పమును లేనియట్టి నేవొ
యిట్టె సంభవ మగుచుండు; నిట్టి వెల్ల
దైవకృతములె సుమి సుమిత్రాకుమార! 829

ఈ యథార్థంబు బుద్ధిచే నెఱిఁగి నేనె
నా మనసు నిగ్రహించుకొన్నాఁడఁ గాన
సిద్ధమైనట్టి పట్టాభిషేక మిపుడు
నిలిచిపోవుట కింత చింతింపనోయి! 830

అదిగావున నో తమ్ముఁడ!
మదిఁ బరితాపంబు విడిచి మాటాడ కిఁకన్;
వదలు మభిషేకయత్నము;
లదృష్టమున కెదురు దిరిగి యాఁగం గలవే? 831

చిన్నితమ్ముఁడ! పట్టాభిషేకమునకుఁ
దెచ్చియుంచిన యీ దివ్యతీర్థవారి
పుణ్యతాపసవ్రతదీక్షఁ బూను నాకుఁ
బావనస్నానవిధికిఁ జొప్పడును గాక! 832

ఇది కూడఁదగదు నాకిపు
డిది రాజోచితము; కైక యేమనుకొనునో
గద! స్వయముగ నా తోడిన
యుదకమె నియమవ్రతమున కుపయుక్త మగున్. 833

లక్ష్మణా! సిద్ధమగు రాజ్యలక్ష్మి నేఁడు
తిరిగిపోయిన దనుచుఁ జింతింప వలదు;
అవనిభరమైన వనవాసమైన నొకటె
యైన రెండవదే శ్రేయ మగును నాకు. 834

మ. అనుఁగుం దమ్ముఁడ! కోపమున్విడుము; నీ వావంత యేవంతయున్
గనగాఁ బోకుము; ధైర్య మూనుము తిరస్కారంబు సైరింపు మా
త్మనియు క్తిన్; బ్రమదంబుతో నభిషవద్రవ్యాదు లెల్లన్ విస
ర్జనమున్ జేయుము; నీకు వేగముగఁ దీర్పంజెల్లు నిక్కార్యముల్.

క. నా యభిషేకోత్సవముల
నాయత్తముసేయఁ జూపు నమితోత్సాహం
బీ యెడలఁ దమ్ముఁడా! నే
నా యడవుల కేగు పనులకై చూపఁదగున్. 812

క. తమ్ముఁడ! నా యభిషేకా
ర్థమ్మయి చింతించుచుండు తల్లి, మనమునన్
సమ్మతినొందఁగ శంక ల
వమ్మైనను జెందకుండ వర్తింపఁ దగున్. 813

గీ. అట్లు శంకించి తల్లి దుఃఖార్త యగుట
నించుకంతయే నిపుడు సహింపఁజాల;
నెట్టిఁగియైన నెఱుఁగకైన నెడఁదనైనఁ
దల్లిదండ్రుల కహితంబు దలఁప నోయి! 814

ఆ. సత్యభాషణుండు సత్యప్రతిజ్ఞుండు
సత్యవిక్రముండు సత్యమూర్తి
యైన జనకుఁ డిప్పు డాముష్మికార్థమై
యురక భయము నొందకుండుఁగాక! 815

ఆ. ఈ యభిషవకార్య మిపు డాఁగకున్నచో
ననృతదోషభీతి నడలుఁ దండ్రి;
దానిఁ బరిహరింపఁ గానకేఁ బోయెద
నతని వెతలఁబెట్టి బ్రతుకఁగలనె? 816

క. అనుఁగుం దమ్ముఁడ! నే నిటు
వని కేగఁ గృతార్థ యగుచు వాత్సల్యమునన్
తన కొమరు భరతు నభిషే
చనముం గావించి కైక సంతోషపడున్. 817

గీ. నారలను గట్టి కృష్ణాజినము ధరించి
యూరు విడనాడి నే జడదారి నగుచుఁ
గానలకుఁ బోవుచుండఁగాఁ గైక గాంచి
డెందమున నెంతొ యానంద మందఁగలదు. 818

క. తప్పనిసరిగా నీ పని
యొప్పుకొనిన తండ్రిమనసు నొక్కింతైనన్
నొప్పింపఁ జాలఁ; గావున
నిప్పుడ యిటనుండి కాన కేగెద ననుజా! 819

క. సమ్మతి నిచ్చిన రాజ్యము
క్రమ్మఱ నీకుండుటకును గారడవులకున్
బొమ్మనుటకు నొరు లెవ్వరు
తమ్ముఁడ! కారణము గారు; దైవమ్ము సుమీ! 820

ఆ. ఇట్టిచింత కైక కేమిటఁ గల్గు; దై
వంపు కారణంబు వలనఁగాక?
కాకయున్న నన్నుఁ గన్నబిడ్డగఁ జూచు
తల్లి దుఃఖపెట్టఁ దలఁపనేల? 821

గీ. ఏను దల్లుల నెల్లర నెల్లవేళ
నేకమతిఁ గొల్చుచుండుట యెఱిఁగినట్లె
కన్నసుతుఁబోలి లక్ష్మణా! నన్నుఁ గైక
యెపుడుఁ బ్రేమించుటయును నీ వెఱుఁగుదుగద! 822

క. ఓ వత్స! కార్యవిఘ్నము
గావించెను బిన్నతల్లి కైక మనకు; దై
వాదేశత నప్రియ మా
దేవి పలికె; దైవమహిమఁ దెలిసితివి గదా!" 835

# 23-వ సర్గము

## రాముని మనోనిశ్చయ మెఱిఁగి లక్ష్మణుఁడు విచారించుట

ఆ. అన్న రాముఁ డిట్లు లానతిచ్చుచునుండ
సారెసారె వీనులార వినుచు
నా సుమిత్రసూతి హర్షదుఃఖాందోళి
తాంతరంగుఁ డైన యట్టు లుండె. 836

ఆ. బిలమునుండి రోఁజు భీకరోరగమట్లు
బొమలు ముడి వడంగ బుస్సగొనుచుఁ
గినుక నడరు లక్ష్మణునిమొగం బప్పుడు
భయదసింహముఖము భంగిఁ దోఁచె. 837

గీ. కరికరముఁబోలు తనకరాగ్రము విదిల్చి
శిరము నట్టిట్టు కంపింపఁజేసి చూడ్కి
నడ్డముగఁ ద్రిప్పి కొనగంటు నన్నుఁ గనుచు
కినుక దొనకంగ సౌమిత్రి యనియె నిట్లు. 838

## దశరథుఁడు రాము నడవికిఁ బంపుటన్నది కైక పన్నాగమని లక్ష్మణుఁడు రామునకు చెప్పుట

క. "ఎక్కడ ధర్మము చెడునో
యెక్కడ లోకంబు చెడునో యేమో యని నీ
వి క్కరణి సంశయించుచు
నక్కఱపడి వేగిరించు టన్నా! తగునే? 83

దుర్బలం బగుదైవమే దొడ్డ దనుచు
భ్రాంతిమంతుఁ డధీరుఁడై పలికినట్లు
శూరవరుఁడు సుక్షత్రియవీరవరుఁడు
నైన నీ యట్టివాఁ డిట్లు లాడఁదగునె? 840

దీనశరణ్యంబును బల
హీనంబగు విధిని బొగడె దేటికి? పాపా
ధీనులు కైకయెడన్ భూ
జానియెడలఁ గలుగదేల సంశయ మన్నా! 841

ధర్మకవచంబుదొడిగి స్వార్థంబుఁ గాంచు
కపటవర్తనుల్ కొందఱు గలరు జగతి;
నటులె యా ప్రియదంపతుల్ కిటుకుచేసి
పులిమిపుచ్చిరి నిన్నంచుఁ దలఁప వేల? 842

అన్నా! కైకకు దశరథుఁ
డెన్నాళ్ళకొ ముందె యొసఁగె నీవర; మటుగా
కున్న నిపు డెత్తునే? యిది
పన్నాగముగాదె నిందఁ బడకుండుటకున్? 843

జనవిరుద్ధంబుగా నిన్నుఁ జాగనంపి
యితరునకుఁ బట్టముంగట్ట నెంచినార;
లిట్టి దుష్కార్యమును నే సహింపఁజాల
నెట్టు లైనను; నను క్షమియింపు మన్న! 844

## ధీరుఁడైనవాఁడు దైవమును ద్రోసి పౌరుషంబున పైకి వచ్చునని లక్ష్మణుఁడు చెప్పుట

క. ధర్మాధర్మపథంబుల
మర్మ మెఱిఁగినట్టి నిన్నె మతిమాలిచి యే
ధర్మము భ్రమపెట్టెనొ యా
ధర్మ మసహ్యం బసమ్మతం బగు నాకున్. 845

క. పౌరుషవంతుఁడ వయ్యును
ఘోరకు వశుఁడైన పిత యధార్మికుఁడై యా
చారవిరుద్ధవినిందిత
ఘోరాజ్ఞలు చేయఁ జేయఁగూడునె నీకున్? 846

క. ఇది కుహనాదుస్తంత్రం
బిది నింద్యం బిది యధర్మ మిది యపచారం
బిది నీ వెఱుఁగమి వగచెద;
నిది నీకుం జేయఁదగునె యినవంశమణీ! 847

క. కామాధీనుల నీకున్
వైమాలముఁ గిడెఁ దలఁచువారిఁ బితరులన్
నామమున నున్న శత్రుల
కామితముందీర్ప నెట్లుగడఁగె దెఱిఁగియున్? 848

గీ. అట్టివారికిఁ గలిగినయట్టి బుద్ధి
దైవచోదిత మనియె నీ భావ మైన
నదియు గ్రాహ్యంబు గాదు; త్యాజ్యంబె గాని
యెంతమాత్రము దాని కే నిష్టపడను. 849

క. భీరుఁడు దుర్బలుఁడగు వాఁ
డారాధింపంగఁ జూచు నా దైవంబున్
ధీరస్వాంతుఁడు వీరుఁడు
పౌరుషవంతుం డెవండు పరిగణియించున్. 850

గీ. పౌరుషంబున దైవంబు మీఱఁజాలు
నట్టి ధీరుండు దైవబలంబువలన
సాహసముపీడి స్వార్థంబు జాఱవిడిచి
యించుకేనియు దుఃఖింపఁ డెన్నఁడేని. 851

ఆ. దైవపౌరుషములచేవ లెట్టిట్టివో
యెల్లలోక మిప్పు డెఱుఁగుఁగాక!
దైవమానుషముల తరతమంబులు బైటఁ
బడునుగాక భ్రమలు విడునుగాక! 852

క. నీ పట్టభంగమునకున్
దాపై మనపైకివచ్చు దైవబలంబున్
ద్రోపాడఁగ నే పారెదు
నా పౌరుష మెట్టిదో కనంబడు నిపుడే. 853

గీ. అతి మదబలోద్ధతంబు నత్యంకుశంబు
శీఘ్రధావిత మపగతశృంఖలంబు
నగు గజముఁబోలు దైవంబు నాక్రమించి
యిట్టె మత్పౌరుషంబునఁ గట్టివైతు. 854

క. లోకేశు లెత్తిరానీ
యేకంబై ముజ్జగంబు లెదిరి తొడరనీ
యాఁకట్టఁగలరె నీ యభి
షేకము; నీకఁ దండ్రిమాట చెప్పఁగనేలా? 855

క. ఏకాంతవినిశ్చితులై
భూకాంతా! నిన్ను వనికిఁ బొమ్మనువారే
లోక మెఱుఁగఁ బదునాల్గేం
డ్లా కలముల దినుచుఁ బోదు రడవులపాలై. 856

క. వర మని నీ యభిషేకముఁ
జెఱిచి నిజాత్మజుని రాజుఁ జేయఁ దలఁచు మ
చ్చరి కైకకు విభునకుఁ గల
దురాశ విదళించివైతుఁ దుత్తునియలుగన్. 857

గీ. అరి తిమిర భంజన ప్రతాపార్కుఁడైన
నను నిరోధించి యెవ్వండు మనగఁగలఁడు?
మత్పురుషకారబలవిక్రమములఁ దగులు
పగతు నే దైవమైనఁ గాపాడఁ గలదె? 858

గీ. రఘువరా! నీవు వేయివర్షములు రాజ్య
మేలి వనవాసవిధిదీర్ప నేగినపుడు
బూజ్యులగు నీ తనూజులు రాజ్యపట్ట
భద్రులై సల్పెదరు ప్రజాపాలనంబు. 859

ఆ. ప్రజల బిడ్డలట్లు పరిపాలనముసేయ
నాత్మజులకు రాజ్య మప్పగించి
పూర్వరాజఋషులఁ బోలి వానప్రస్థ
ధర్మ మపుడు పూనఁ దగును నీకు. 860

## రాముఁ డంగీకరించిన రాజుబలమును బంధించి రాముని రాజుగా చేయుదు ననుట

మ. చలచిత్తుండగు రాజుమూలమున రాజ్యంబందుఁ గల్లోలముల్
గలుగంబోవు నటన్న శంక గదురంగా నీకు నీ రాజ్యమున్
జలధిన్ నిల్పెడి వేలవోలి యెపుడున్ సంరక్షగావింతు; న
ట్లలవుంజూపనయేని పీరగతికే నర్హుండఁ గాకుండెదన్. 861

ఆ. సిద్ధమంగళాభిషేకయత్నముల నీ
వాచరింపు మిప్పు డనుమతించి
పరనృపాలబలము బంధింపఁ గుందింపఁ
జంప నే నొకండఁ జాలువాఁడ. 862

మ. తనుభూషార్థమె నా భుజద్వయము కోదండం బలంకారమే
దొనల న్నింపుటకే శరావళి కటిం దూగాడనే కత్తి శ
త్రునికాయంబుల నాక్రమింపఁగలవర్ దూటాడ వేటాడఁగా
వినియోగింపనెగాక యాచపుక ముద్వేలప్రతాపంబునన్. 863

ఆ. నాకుఁ బగతుఁ డగుచు నన్ను మార్కొనువాని
నింతసేపు బ్రదుకనీయ నొల్ల
మెఱుఁగుమెఱుఁగు లీను కఱకుకత్తిని ద్రుంతు
నతఁడు వజ్రియైన నగునుగాక! 864

క. పరబలభీకర మగు మ
త్ఖరతరకరవాలఖండితములై తుమురై
కరితురగభట పరంపర
కర జఘన శిరంబు లలముఁగాక రణోర్విన్. 865

గీ. అస్మదీయాసిధారోగ్రహతులఁ ద్రెళ్లి
ప్రజ్వలితధాతుగిరి సన్నిభంబు లగుచు
సంగ తేరమ్మదాంబుద సమము లగుచుఁ
గరిపరంపర భూమిపై నొఱఁగుఁగాఁక. 866

గీ. బద్ధగోధాంగుళిత్రాణపాణి నగుచు
భయద కోదండయుత సవ్యపాణి నగుచు
నాహవక్షోణి నే నిల్వ సాహసమున
నెవఁడు పౌరుష మూని న న్నెదురఁ గలఁడు? 867

క. ఒక్కనిఁ బెక్కుశరంబులఁ
బెక్కుర నొకశరముచేత భేదించుచు నే
నొక్కడ నరగజహయముల
యిక్కువలం జెక్కివైతు నెక్కటి కడిమిన్. 868

గీ. ప్రభువరా! మామకాస్త్రప్రభావ మిపుడు
రాజ్యపాలకుఁ డగు దశరథనృపాలు
క్షితిపతిత్వవిహీనునిఁ జేయుఁగాక
శ్రీరఘువరేణ్య నిను రాజుఁ జేయుగాక! 869

చ. పునుఁగు జవాజి గంధములఁ బూయఁగ నందిలిదండవేయఁగా
ధనము లవారి నర్థులకు దానము లీయఁగ మిత్రకోటిఁ బా
లనమునుఁ జేయఁగాఁ దగిన లక్ష్మణబాహులు తావకాభిషే
చన విముఖాదులన్ గెడపఁ జక్కఁడపన్ దగు నింక రాఘవా!870

మ. విమతుం డెవ్వడు నీకు వాని నిపుడే వేధించి తత్ప్రాణ మా
నములం దూల్తుఁ; దదీయమిత్రజనసైన్యస్తోమముంగూల్తు రా
జ్యము సర్వంబు భవద్వశంబగు నుపాయం బెంచి నా కాజ్ఞ సే
యుమునే నీ పదపద్మకింకరుడనై యుంటిన్ గదా! రాఘవా!" 871

చ. అనియిటు లక్ష్మణుండు వినయానతి నానతి వేఁడ రాఘవుం
డనుగతు సౌమ్యుఁ దమ్ము బ్రియమారఁగఁ జేరఁగఁ దీసి శాంత సాం
త్వన మధురోక్తిఁ దేర్చి కనుఁదమ్ములఁ గ్రమ్మెడు నశ్రు లార్చి నే
జనకునిమాట దాఁటు నిది సత్య మటంచు వచించె ధీరుఁడై. 872

# 24-వ సర్గము

## దూడను వెన్నాడు గోవువలె తానుకూడ నడవికి కౌసల్య వచ్చెద ననుట

క. అని రాముఁడు తన జనకుని
యనుజ్ఞఁ బాలింప నిశ్చయాత్ముం డగుటన్
గని కనుల న్రశ్రు లొలుకుచు
ననియెన్ గౌసల్య దీనయై ధర్మమతిన్. 873

క. లోకప్రియంవదుఁడవై
నాకున్ శ్రీదశరథేంద్రునకుఁ బుత్త్రుఁడవై
యే కష్టం బెఱుఁగని ధ
ర్మైకమతికి నీకు నుంఛవృత్తియె రామా! 874

క. ప్రాకటముగ నీ భృత్యా
నేకసహస్రముల కిష్టమృష్టాన్నంబుల్
చేకూరుచు నీ కడవుఁ
నాకలములు దినుచు బ్రదుక నయ్యెనె తండ్రీ! 875

ఆ. ప్రభువరుండు తండ్రి ప్రాణప్రియుని నిన్ను
సుగుణవంతు నిన్ను సుతుని నిన్ను
వనికిఁ బంపెనన్న విని నమ్ము నెవఁడు రా
జనిన? నెవఁడు భయము నందకుండు? 876

గీ. సకలలోకాభిరామ! రాజ్యంబు వీడి
నీ వడవిఁ కేగుచుండుట నేఁడుసూడ
నఖిలలోకంబులను దనయాజ్ఞఁ ద్రిప్పు
దైవబల మటేయుం బౌటు తథ్య మయ్యె. 877

సీ. నిరూప మగు గాలి నీ యదర్శనముగా
సమిధలు దుఃఖశోకములు గాఁగఁ
బరితాప చింతానుభవము ధూమంబుగా
నుదితాశ్రుకణము లాహుతులు గాఁగ
నిను వీడి శుష్కజీవననై కృశించు నా
హృదయాంతరాళంబు కుదురు గాఁగఁ
నిట్టూర్పు తిరుగుడు పుట్టినచోటుగాఁ
దొడరిన యీ మహాదుఃఖవహ్ని

గీ. శిశిరఋతువునందుఁ జిత్రభానుఁడు రేఁగి
యిగురుటీరమును దహించి నట్లె
ప్రబలి యాక్రమించి ప్రజ్వలించి దహించి
నన్ను బూదిసేయకున్నె రామ! 878

క. కావున వత్సము వెనుకొను
గోవుంబలె వత్తు నన్నుకొని చను" మని వా
పోవు జనయిత్రిఁ దేర్చుచుఁ
బావనచరితుండు రామభద్రుఁ డిటు లనెన్. 879

క. "జననీ! నే వని కేగఁగ
మును పే కైకమ్మ మోసమునఁబడి వగలన్
మునిఁగెడి జనకుని నీవున్
గనకుండిన నతఁడు బ్రతుకఁ గలఁడే యింకన్? 880

క. ఆఁడుది మగనిన్ వీడుట
కూడనిపని లోకనిందఁ గూర్చును గద! యి
ట్లాడను దలఁచుట గూడను
బాడియగునఁటమ్మ నీకుఁ? బతిదేవతకున్. 881

క. సేవింప నగును యావ
జ్జీవము కాకుత్స్థతిలకు క్షితినాయకు నీ
జీవితవిభు నా జనకు మ
హీవిశ్రుతనిత్యధర్మ మిది గద జననీ! 882

గీ. కష్టముల మఱపించు రాఘవుని పరమ
ధర్మసూక్తుల విని శుభదర్శనయగు
పట్టంపుదేవి యాతని పలుకుబడిని
మెచ్చుకొని సత్యమే యని యిచ్చనెంచె." 883

చ. అని యిటు సమ్మతించియు మహత్తరదుఃఖము నందుచున్న మా
తను గనుఁగొంచు ధార్మికవతంసుఁడు రాముఁడు "తల్లి! నాకు నీ
కును బ్రభుఁడున్ గురుండు జనకుండును నాథుఁడు సర్వమైన యా
తని భజియింపఁగా ననుమతంబును దీర్చుట ధర్మ మెమ్మెయిన్. 884

ఆ. నీవు జీవితేశుసేవ నిందుండఁగా
నేను జనకునాజ్ఞఁ గాన కేగి
యిట్టె గడపివైచి యేఁడు లీరేడును
వచ్చి నిను భజించువాఁడ నమ్మ!" 885

క. అను ప్రియతనయుని పలుకులు
విని యా కౌసల్య దుఃఖవివశాత్మికయై
కనుదోయి నశ్రు లొలుకఁగ
ననియెన్ వత్సలత రాము నల్లనఁ గనుచున్. 886

ఆ. "జనకునాజ్ఞ నీవు వని కేగ సవతుల
నడుమనుండి బాధపడఁగఁ జాల
వనకురంగిఁ బోలి వత్తును నా తండ్రి
నన్నుఁ దోడుకొని చనంగదయ్య!" 887

ఆ. ఎంతొ జాలిగదుర నీ రీతిఁ గోరుచు
మఱియు మఱియు నేడ్చు మాతఁ గాంచి
యెడఁదఁ బొంగు దుఃఖ మడఁపలే కేడ్చుచు
నినకులావతంసుఁ డిట్టు లనియె. 888

సీ. బ్రదికినన్నాళ్లును బడఁతికి భర్తయే
యధినాథుఁడును దైవ మగుఁ గదమ్మ!
సతియైన నీకును సుతుఁడైన నాకు న
య్యవనీశుఁడె నియంత యగుఁ గదమ్మ!
దశరథ ధారుణీధవుఁ డుండఁగ ననాథ
గతి మన కెందుఁ గల్గదు గదమ్మ!
దేవి! నీ యానతుల దిక్కును బ్రియవాది
భరతుండు పాడి దప్పఁడు గదమ్మ!

గీ. కాన కే నేగఁ బుత్రశోకమున మఱుఁగు
వృద్ధుఁ బ్రభుని రక్షించువా రెవ్వ రమ్మ?
వనమునందుండి నే వచ్చువఱకు స్వామి
నూఱడించుచు సేవించుచుండు మమ్మ! 889

క. వ్రతములు చేసినఁ గానీ
సతతము నుపవాసవిధులు సలిపినఁ గానీ
పతి సేవింపని యుత్తమ
సతియైనన్ బాపగతికిఁ జనునంద్రు బుధుల్. 890

గీ. భూసురాతిథిదైవతపూజనములఁ
జేయకున్నను దానముల్ చేయకున్న
నిరతభర్తృశుశ్రూషల నెఱపుచుండు
సతికిఁ గరతలామలకమౌ స్వర్గసుఖము. 891

క. సుదతి పతిమేలు నిష్టము
మదిఁ గోరుచు సేవచేసి మను టొప్పుఁగదా!
యిది లోకాచారం బగు
నిది శాస్త్రము వేదవిహిత మిది నేఁటిదియే? 892

క. దేవి! నా సేమమునకు
దేవతలన్ బూజనముల, ద్విజవరులన్ సం
భావనముల, హోమములన్
బావకునిన్ దనుపుచుండుమా భద్రమతిన్. 893

గీ. నియతపూజావ్రతాహారనిరత వగుచు
విభుని సద్భక్తియుక్తి సేవించుకొనుచు
నా శుభాగమనంబు మనంబునందుఁ
గాంక్షసేయుచుఁ గాలంబు గడపుమమ్మ! 894

ఆ. వనమునుండి నేను వచ్చిన పిమ్మట
ధార్మికోత్తముండు దశరథుండు
బ్రదికియుండునేనిఁ బరమదుర్లభములౌ
కాంక్షితములఁ బడయఁగలవు తల్లి!" 895

గీ. తనయుఁ డీ రీతి ధర్మబోధనముసేయఁ
బుత్త్రశోకార్త కౌసల్య భూరిదుఃఖ
భారవిహ్వలయై బాష్పవారిపూరి
తాక్షియై రాముఁ గని యిట్టు లని వచించె. 896

క. "వీరకుమారా! నీ కాం
తారాగమనదృఢవినిశ్చితం బగు బుద్ధిన్
వారింప నేర; నిఁక నే
వారికిఁ గాలంబు దుర్నివారంబుగదా! 897

ఆ. పోయిరమ్ము రాజపుత్త్ర! నిశ్చలుఁడవై
యడవి నీకు భద్రమగును గాక!
క్రమ్మఱంగ వచ్చి కన్నులఁబడఁగ ని
న్నరసి దుఃఖమెల్ల మఱతుఁగాక. 898

క. కృతకృత్యుఁడవును జరిత
వ్రతుఁడవు బూజ్యుఁడవు భాగ్యవర్ధిష్ణుఁడవై
పితృఋణవిముక్తుఁ బ్రత్యా
గతు నినుఁ గని సౌఖ్య మందఁ గలను కుమారా! 899

క. నా వచనము పాటింపక
యీ వడవుల కేగుచుంటి విపుడు కుమారా!
యీ విధి నినుఁ గావించిన
దైవబలం బిట్టి దనుచుఁ దలపం దరమే! 900

ఆ. బాహుబలమె నీకు భద్రంబు లొనఁగూర్చు
రామ! వనికిఁ బోయి రమ్ము వేగ;
మరల వచ్చి నన్ను మధురభాషణములఁ
దేర్తుగాక! యెలమి గూర్తుగాక! 901

ఆ. పల్కలములతోడ వరజటావళితోడ
వ్రతముపూర్తి చేసి వనము వీడి
యీవు వచ్చువేళ యిప్పుడే యైనచో
నెంతొ సంతసంబు గాంతును గద!" 902

క. అని చెప్పి కోసలాత్మజ
తనయుని శుభకాము సుగుణధాముని రామున్
వనవాసనిశ్చితుని గని
చను మని దీవింపఁ దొడఁగు సదమలమతియై. 903

# 25-వ సర్గము

## కౌసల్య రాముని వనవాసమునకు కియ్యకొని మంగళాశాసనములు చేయుట

గీ. అపుడు కౌసల్య దుఃఖాశ్రు లపనయించి
యాచమించి పవిత్రయై యాత్మజుఁడగు
రామచంద్రున కెందు భద్రము లెసంగ
సాధుమతిఁ జేసె మంగళాశాసనములు. 904

ఆ. "అడ్డగింప రాక యరుగుచు నున్నావు
నీకు సేమ మగును గాక రామ!
సాధుజనులు చన్నజాడ పీడఁగఁ బోక
వెడలిపొమ్ము మరల వేగరమ్ము. 905

గీ. పురుషసింహామ! రఘురామ! పుణ్యనామ!
ధృతియుతుండవు నియమసంయుతుఁడ వగుచు
నీవు పాలించు నీ ధర్మమే సతంబు
భద్రము లొసంగి నిన్నుఁ గాపాడుఁగాక! 906

గీ. ఆలయంబులయందుఁ జైత్యంబులందు
నీవు పూజించు దేవత లెల్ల వేళఁ
గాననాశ్రమముల ఋషిగణముసేవ
చేయుచుండిన నిన్ను రక్షింత్రు గాత! 907

క. ధీమంతుం డగు నా వి
శ్వామిత్రుఁడు నాఁ డొసంగినట్టి మహాస్త్ర
స్తోమం బెప్పుడు నీకున్
సేమం బిడుఁగాత సుగుణసీమా! రామా! 908

క. నీ వొనరుచు పితృసేవయు
నీ వొనరుచు మాతృపూజ నీ సత్యము ని
న్నే వేళం బ్రోవఁ జిరం
జీవి వగుము దోర్బలమునఁ జిన్నికుమారా! 909

చ. ప్రతిదినమున్ సమిత్కుశలు భద్రపవిత్రము లగ్ని వేదు లా
యతనములుం బ్రపూజితపదాంతరముల్ ఘనశైలసింహముల్
పతగములున్ గుజంబులును బన్నగముల్ హ్రదముల్ నికుంజ సం
తతులును బ్రోచుఁగాత విపినంబుల నెల్లెడ నిన్ను రాఘవా! 910

క. ఏ వేళ నీకు శుభములె
గావింతురుగాక సాధ్యగణములు విశ్వే
దేవతలు మరుద్గణములు
దేవర్షులు సత్యధర్మదీక్షిత రామా! 911

ఆ. ధాత భద్ర మిచ్చుఁగాత విధాత్రుండు
దివిజనాథముఖ్యదిక్పతులును
బూషుఁడును భగుండు పూజ్యుఁ డర్యముఁడును
నీకు మేలుగూర్త్రు గాక రామ! 912

ఆ. అబ్దములును ఋతువు లాఱును మాసముల్
పక్షదివసములును బవలురేయి
జాములును ముహూర్తసమయంబు లెప్పుడు
నీకు రక్ష గూర్చుఁగాక తనయ! 913

గీ. స్మృతియు ధృతియును ధర్మంబు శ్రుతిచయంబు
స్కందదేవుండు సోమవాచస్పతులును
బరమముని నారదుండు సప్తర్షివరులు
శ్రేయములుగూర్చి నిన్ను రక్షింత్రుగాక! 914

ఆ. ఏను పరమభక్తి నే వేళఁ బూజించు
దిగ్గిరీశు లఖిలదేవతలును
నీకు వనులఁ దోడునీడలై నిత్యంబు
గరుణఁ బ్రోచుచుండ్రుగాక నిన్ను. 915

చ. సరసులు పుష్కరంబులును సాగరముల్ వరుణుండు భూనభో
తరపదముల్ గ్రహంబులును దారకలున్ సహదేవ దేవమం
దిరములు సర్వపర్వతనదీనదవేణులు సంధ్యలున్ విభా
వరులు దివంబులు న్నిను నవశ్యముఁ గానలఁ బ్రోచుగావుతన్ 916

క. సత్యవశత మునివేషము
నత్యుత్సాహమునఁ దాల్చి యరిగెడు నిన్నా
దిత్యులు దైత్యులు వనమున
నిత్యముఁ బ్రోచెదరుగాత నిర్మలచరితా! 917

గీ. రౌద్రమూర్తులు ఘోరవర్తనులు నైన
రాక్షస పిశాచ భూతవర్గముల నొండె
క్రూరసత్త్వాళి నొండె కాంతారసీమ
నీకు భయ మొండు లేకుండుఁగాక రామ! 918

గీ. విపినముల నీవు దిరిగెడు వేళలందు
ప్లవగ వృశ్చిక దంశసర్పములవలన
గహన కీటక క్రిమిమశకములవలన
నీకు నే బాధ లేకుండుఁగాక రామ! 919

గీ. క్రూరదంష్ట్రోద్ధతంబులౌ వారణములు
ఋక్షములును శార్దూలహర్యక్షములును
శృంగసంగత మహిషాదు లెప్పుడు నడవి
నొండు కీడు నీ కొదవింపకుండుఁ గాక! 920

గీ. తనయ! నే నిటఁ జేయు నర్చనలవలన
నడవులంబట్టి తిరుగాడునట్టి నిన్ను
నతత మానవమాంసభోజనములైన
యుగ్రసత్త్వముల్ హింసింపకుండుఁగాక! 921

క. నీ యేగుపథము లెల్లన్
శ్రేయ మిడుత; విక్రమములు సిద్ధార్థునిగాఁ
జేయుం గావుత నిను భ
ద్రాయితమూర్తివయి పోయిరమ్ము కుమారా! 922

క. భువిపై వెలసినవారున్
దివి నేలెడివారు నైన దేవతలు మహా
టవి నినుఁ బ్రోతురు గాతన్
బవతురయిన నీకు సాయపడెదరు గాతన్. 923

క. తనయా! నా పూజలఁగొని
యిన శశి గురు ధర్మ ధనదు లెంతో దయతో
నిను రక్షింతురు గావుత
మనుదినమున్ దండకావనాంతరసీమన్. 924

గీ. విమల తీర్థావగాహన వేళలందు
నగ్నులును హోమధూమంబు లనిలములును
మౌనిముఖ వినిర్గతములౌ మంత్రములును
నీకు నిత్యంబు శుభము లందించుఁగాత! 925

గీ. అఖిలలోక విధాత యైనట్టి ధాత
రక్షకుండైన యట్టి నారాయణుండు
మౌనులును సర్వదేవతల్ కానలందు
నీకు మేలొనగూర్తురు గాక రామ!" 926

గీ. అని యశస్వినియును విశాలాక్షి యైన
కోసలాత్మజ మంగళాశాసనములఁ
గౌమరునిన్ దన్ని కుసుమదామములచేత
నతి నుతులచేత సర్వదేవతలఁ గొలిచి. 927

క. సితమాల్యంబులు సమిధలు
సితసర్షపములు ఘృతంబు సిద్ధపఱచి స
న్నుతమతి కోసలధరణీ
పతిసుత కౌసల్య సర్వభద్రార్థినియై. 928

ఆ. శాస్త్రవిదులచేత సద్బ్రాహ్మణునిచేత
రాము మేలుఁగోరి యామె యప్పు
డుజ్జ్వలాగ్నియందు హోమముల్ సేయించెఁ
బరమభక్తి భావభరిత యగుచు. 929

గీ. సమధికోపద్రవంబులు శాంతినంద
సంతతారోగ్యభాగ్యముల్ సమకురంగ
ఋత్విజుఁడు హోమములు యథారీతిఁ దీర్చి
హవ్యశేషంబుచేత బాహ్య బలి సేసె. 930

గీ. దధిమధుఘృతాక్షతలతోడి దక్షిణలను
బృథ్వీసురుల కిప్పించి యా ఋత్విజుండు
స్వస్త్యయనములఁ దీర్పించె వారిచేత
రామభద్రున కెందు భద్రములు గలుగ. 931

గీ. మహితకీర్తి యా శ్రీరామమాత యపుడు
విప్రవరుఁడు సాంగాగమవేత్తయైన
ఋత్విజునకును దక్షిణ లిచ్చి తనిపి
విమలమతి రామచంద్రు దీవించె నిట్లు. 932

గీ. "వైరివీరవృత్రాసురవధ మొనర్చి
యఖిలదేవవంద్యుఁడు సహస్రాక్షుఁ డింద్రుఁ
డెట్టి సన్మంగళసమృద్ధి నెసఁగినాఁడొ
యట్టి జయమంగళమ్ము నీ కగును రామ! 933

గీ. అమృతమును దేర నర్థించి యల్లనాఁడు
తనయవరుఁడైన యా సుపర్ణునకు వినత
నెట్టి మంగళాశీర్వాద మిడిన యదియొ
యట్టి శుభమంగళమ్ము నీ కగును రామ! 934

గీ. దివ్యసుధఁ గోరి వార్ధి మథించువేళ
నసురహరుఁ డమరేంద్రుఁడౌ నాత్మజునకు
నెట్టి మంగళాశాసన మిడియె నదితి
యట్టి నిత్యమంగళము నీ కగును రామ! 935

గీ. మూఁ డడుగు లెంచి ముజ్జగంబులను గూడ
నాక్రమించిన యట్టి త్రివిక్రమునకు
నెట్టి సన్మంగళము లభియించి నదియొ
యట్టి విజయమంగళము నీ కగును రామ! 936

గీ. ఋతువులును సాగరంబులు శ్రుతిచయంబు
ద్వీపములు లోకములు దశదిశలుఁగూడ
పూరుషోత్తముఁడవు మహోభుజుఁడవైన
నీకు మంగళములఁ గూర్చుఁగాక రామ!" 937

చ. అని యిటు కోసలప్రభువరాత్మజ యాత్మజు రాము స్వస్తివా
చనములఁ దేర్చి సేసలను జల్లి శిరంబును మూరుకొంచుఁ జం
దనము నలంది మంత్రసహితంబుగఁ దన్మహిమంబు మున్నె కాం
చిన ఘనమౌ విశల్యకరణిన్ వలకేలను గట్టె రక్షగన్. 938

గీ. అంతఁ గౌసల్య శోకదుఃఖార్త యయ్యుఁ
గౌతుకంబుఁ జూపుచు రాముఁ గౌఁగిలించి
శిరము మూర్కొని "సుఖముగా నరిగి రమ్ము
ప్రతిన దీర్చి ర" మ్మని తొట్రుపడుచుఁ బలికె. 939

గీ. "ఆన దీరిచి సర్వసిద్ధార్థి వగుచు
గ్రమ్మఱఁగ నీ యయోధ్యాపురమ్ముఁ జేరి
స్థిరముగా రాజ్యపీఠి వసించు నిన్ను
ఘనసుఖారోగ్యనిధిఁ గాంచఁ గలను వత్స! 940

గీ. దుఃఖసంకల్పముల నెల్లఁ దొలఁగఁ ద్రోసి
హర్షవిద్యోతితానన యగుచు నపుడు
నెలనడిమిదేయిఁ బొడసూపు నెలనుఁ బోలి
కాన వెలువడివచ్చు ని న్గాంచఁ గలను. 941

క. జనకుని యానతిఁ గైకొని
వనవాసము దీర్చి వచ్చి వరమణిసింహా
సనమున వెలసెడి నిన్నున్
గనులారఁగ మరలఁ గాంతుఁ గన్నకుమారా! 942

ఆ. కానఁబడివచ్చి కల్యాణమూర్తివై
మాత నాకు నతికి సీత కెపుడు
వాంఛితములు దీర వర్తింతుగాని నీ
వేగిరమ్ము రమ్ము వేగిరముగ. 943

గీ. నీకుఁ గావించు పూజ లంగీకరించి
శివుఁడు మున్నగు దేవతల్ సిద్ధఋషులు
నసురు లురగులు భూతంబు లడవి కేగు
నీకుఁ జిరశుభములఁ గూర్తుగాక రామ!" 944

గీ. అనుచు స్వస్త్యయనంబు యథార్థరీతి
నాచరించి కౌసల్య బాష్పాక్షి యగుచు
రక్షకై రామచంద్రుఁ బ్రదక్షిణించి
కౌఁగిట గదించెఁ బలుమాఱు గారవమున. 945

క. ఈ విధి జయమిడు జననీ
పావనచరణాబ్జములకుఁ బలుమరు ప్రణతుల్
గావించి యాత్మతేజ
శ్రీ వెలయఁగ రాముఁ డరిగె సీతనగరికిన్. 946

# 26–వ సర్గము

## రాముఁడు తల్లి సెలవంది సీతనగరి కరుగుట

క. రాజసుతుఁడు రాముఁడు జన
రాజిసమాకీర్ణమైన రాజపథంబున్
రాజిలఁ జేయుచు గుణముల
నా జనహృదయముల నప్పు డాకర్షించెన్. 947

ఆ. పతివివాసవార్త పట్టభంగంబైన
యట్టివార్త యెఱుఁగనట్టి సీత
వ్రతనివిష్ట యగుచుఁ బతి యభిషేచన
శుభఫలాప్తి కెదురు చూచుచుండె. 948

ఆ. రాజధర్మ మెఱిఁగి రాజ్ఞీసదాచార
రీతు లెఱిఁగినట్టి సీత యెలమి
దేవపూజనములఁ గావించి స్వయముగా
విభునిరాకఁ గోరి వేచియుండె. 949

## దీనవదనుఁడై రాముఁడు సీతభవనమును జేరుట

క. అంతట రాముఁడు వ్రీడా
స్వాంతుండై సొచ్చెఁ గించిదవనతముఖుఁడై
కాంతాలంకృతమును న
త్యంత జనామోదమైన యాత్మభవనమున్. 950

ఆ. సీత వేగ లేచి భీతిల్లి వడఁకుచు
వ్యాకులాత్ము విపులశోకతప్తు
స్వామిఁ గాంచినంత రాముండుఁ దన దుఃఖ
మాపనేరఁడయ్యె నామెఁ జూచి. 951

క. ఖిన్నుని వివర్ణవదనుని
స్విన్నాంగుని రాముఁగాంచి సీత యడలి "యి
ట్లున్నకత మేమి నాథా !
యెన్నఁ డెఱుఁగ నింతదుఃఖ మేటికిఁ గలిగెన్? 952

గీ. అఖిలసంపద్యుతంబు బార్హస్పతంబు
నైన పుష్యతారను బ్రాజ్ఞులైన ద్విజులు
నీకుఁ బట్టాభిషేకంబు నెఱపనుండ
నిట్టిశుభవేళ నీ దుఃఖ మేమి నాథ? 953

సీ. జలఫేననిభమైన శతముఖచ్ఛత్రంబు
నీడ నీమోము రాజింప దేమి?
శశిహంససమమైన చామరద్వయము నీ
యుభయపార్శ్వంబుల నొలయ దేమి?
వందిమాగధసూత బృందముల్ నీముందు
విజయపాఠములు గావింప రేమి?
విధ్యుక్తముగ వేదవిదులు నీ శిరమున
సిద్ధాభిషేకంబు సేయ రేమి?

గీ. సచివముఖ్యులు, ముఖ్యులు, జానపదులు
పురజనులు భూరిభూషణభూషితు లయి
పరమకౌతుకసమ్మోదభరితు లగుచు
నిపుడు నిను వెంబడించి రారేమి నాథ? 954

గీ. విమల మణిహేమభూషణ విలసితములు
ననిలవేగంబు లగు చతురశ్వములను
బూన్చినట్టి మహోత్సవపుష్యరథము
కదలి నీ ముందు రాదేమి హృదయనాథ! 955

గీ. సిద్ధలక్షణోపేతంబు శ్రీయుతంబు
నీలమేఘమహాశైల నిభము నైన
భద్రదంతావళంబు నీ పయన మందు
వెడలి నీ ముందు రాదేమి వీరముఖ్య! 956

ఆ. చిత్రకనకరత్న సింహాసనము నీకు
హాయలుమీర ముందు బయలుదేఱ
వీరవరులతోడ నూరేఁగ విదియేమి?
ప్రకృతిజనమనోభిరామ! రామ! 957

క. విభవోపేతంబుగ నీ
యభిషేకము జరుగునిట్టి యవసరమున నో
ప్రభువర! వికలాస్యుఁడవై
యభూతపూర్వాప్రతిభుఁ డవైతి విదేలా?" 958

క. అని యేడ్చుచుఁ బ్రశ్నించిన
జనకజ కిట్లనియె రామచంద్రుఁడు "దేవి!
జనవంద్యుఁడు మత్పిత న
న్ననుశాసించెను వనంబునందు వసింపన్. 959

ఆ. పూజ్యవంశమందుఁ బుట్టిన దానవు
ధర్మవేది జనకుతనయ వీవు;
ధర్మనిష్ఠ వఖిలధర్మజ్ఞురాలవు
వినుము జరిగినట్టి వృత్త మెల్ల. 960

## రాముఁడు సీతకుఁ దాను వనవాసమునకుఁ బోవుచున్నానని చెప్పుట

గి. "క్షితివిభునిచేత సత్యదీక్షితునిచేత
దశరథేశ్వరుచేత నాతండ్రిచేతఁ
దొల్లి నాతల్లి కైక సంతుష్టిఁజెంద
సమయమతి రెండు వరము లొసంగఁ బడియె. 961

క. ఇప్పటి నృపవరు నానతి
చొప్పున నగు మదభిషేక శుభసత్క్రియలన్
దప్పించె నా వరద్వయ
మిప్పు డడిగి కైక; క్షితిపుఁ డేమను నింకన్? 962

క. ఒకవరముచేత నే దం
డకవనిఁ బదునాలుగేండ్లు నడయాడఁగ, వే
ఱొకవరముచేత భరతుఁడు
సకలమహీపాలుఁ డగును జనకునిచేతన్. 963

క. జనకాజ్ఞను దలఁదాలిచి
జనని కెఱుఁగఁజెప్పి యామె సమ్మతమున్ గై
కొని నేను నిర్జనంబగు
వని కేగుచు నిన్నుఁ జూడవచ్చితి సీతా! 964

ఆ. భరతునొద్ద నన్నుఁ బ్రస్తుతింపఁగరాదు
మఱచియైన నొక్కమాటనైన;
సంపదాఢ్యులైన జనపాలురు వినంగఁ
బూన నొల్ల రొరుల పొగడికలను. 965

క. కావున నన్నుం బొగడుచు
భూవిభు భరతానుమతిని బోకున్న నిటన్
నీవుండ లేవు; నిను నం
భావింపఁగ నతని కంత బాధ్యత గలదే? 966

క. భరతునకు యౌవరాజ్యము
నరపతి యొసఁగెను సనాతనం బగు దానిన్;
జరియింప వలయు నీ వా
యిరువురి మన మలర ధర్మహితమతి వగుచున్. 967

క. జనవిభు ప్రతిజ్ఞఁ దీర్పన్
జనియెద నే దండకావనంబున కిపుడే
యనఘాత్మ నీవు నిశ్చల
మనస్కవయి యిచట నుండుమా కల్యాణీ! 968

ఆ. తాపసేంద్రసేవితం బగు కాంతార
మందు నే వసించునట్టివేళ
నుండు మిచట సువ్రతోపవాసనియుక్తిఁ
బరమధర్మనిరత! భద్రచరిత! 969

ఆ. ప్రతిదినంబు నీవు ప్రత్యూషమున లేచి
ధర్మవిధిని దైవతములఁ గొలిచి
నరవరేణ్యుఁడైన నా తండ్రి దశరథు
చరణములకుఁ బ్రణతి సలుప వలయు. 970

గీ. ఎపుడు ధర్మంబునే యాశ్రయించినదియు
వృద్ధురాలును సంతప్తహృదయయు నగు
మాత కౌసల్య దుఃఖంబు మఱచునట్లు
విధిగ నేవేళ నీవు సేవింప వలయు. 971

గీ. పేర్మిచేఁ బెంపకంబుచేఁ గూర్మిచేత
మాత లందఱు నాకు సమాన లగుట
నున్న మాతల నెల్ల నీ వొక్కలాగె
భక్తిఁ బూజించుచుండుము ప్రతిదినంబు. 972

ఆ. సాధ్వి! భరతుఁడన్న శత్రుఘ్నుఁడన్నఁ బ్రా
ణములకన్న నిష్టతములు నాకు;
నన్నదమ్ములట్టు లాత్మజు లట్లు నీ
వరయ వలయు వారి ననవరతము. 973

క. భరతుఁడు మన కులమునకున్
ధరణికిఁ బ్రభుఁ డయ్యె నిపుడు తత్ప్రతిమతివై
చరియించుట యొప్పదు నీ
కెఱిఁగియయిన నెఱుఁగకైన నెయ్యెడ నైనన్. 974

గీ ఆలసింపక తమ కనుకూలవృత్తి
సేవఁ గావించువారలఁ జిత్తగించి
యట్లు చేయనివారిపై నలుకగనుట
క్ష్మాతలాధీశ్వరుల కెల్ల సహజగుణము. 975

గీ. ధరణినాథులు తమ కహితంబుసేయు
నౌరస కుమారకులనైన నవలఁద్రోసి
యతిసమర్థుని సామాన్యునైనఁ గాని
చెంతకుం జేర్చి యాదరించెదరు గాదె! 976

గీ. నృపతి భరతుని కలుక జనింపకుండ
నిత్యసత్యవ్రతవు ధర్మనిరత వగుచు
నుచితమగురీతి నిచట నీ వుండవలయు
సకలసద్గుణసముపేత! జనకజాత! 977

క. నే వెడలుచుంటి నడవికి;
నీ వబలవుగాన నిచటనే యుండఁదగున్
గావింప కెవరి కపకృతి;
నా వచియించిన నుడి న్వినం దగును బ్రియా!" 978

## 27-వ సర్గము

గీ. అనెడి రాముని నుడువుల నాలకించి
ప్రియములె వినంగ నర్హయై ప్రియము లెపుడు
పలుకు వైదేహి మానకోపము వహించి
యాత్మవల్లభుఁ గాంచి యిట్లని వచించె. 979

ఉ. "నేఁ డిదియేమి రామః ధరణీశ్వరపుత్త్రుఁడ వయ్యు నెంత మా
టాడితి వీ లఘూక్తి; విన్నంతనె వింతగ నన్నువంటి యే
యాఁడుదియైనఁగాని పరిహాసము సేయదె? యిట్టిపల్కు లే
ఖాఁడయినన్ వచించితివె? నాకు వినం గదు నమ్రబమయ్యెడిన్. 980

ఆ. పితయు మాత భ్రాత సుతుఁడును గోడలు
నాత్మసుకృత దుష్కృతాళివలనఁ
గలుగునట్టి సుఖముఁ గష్టంబుఁ దము దామ
యనుభవించుచుందు రార్యపుత్త్ర! 981

క. పతి కర్ధశరీరిణి యగు
సతిమాత్రమె భర్తృభాగ్యసమభాగిని; నీ
పిత నీకుఁజేయు నానతి
సతి నాకుం జెల్లుగాదె సారవిచారా! 982

గీ. తల్లిదండ్రులుఁ దనయులుఁ దానుఁ గాని
నెచ్చెలులుగాని గతిగారు నెలఁతుకలకు
నిహపరంబులయం దెందు నెంచిచూడ
సతికి సద్గతియగు వాఁడు పతి యొకండె. 983

ఆ. అవనినాథ! దుర్గమారణ్యసీమల
కిపుడు వెడలుదేని నేను వచ్చి
నీకు ముందుగాఁగ నీ పదంబులఁ గుశాం
కురము లొత్తుకుండ నరుగుదాన! 984

గీ. సంశయింపక రోష మీర్ష్యయును గూడఁ
బానశేషోదకంబులభంగి విడిచి
నేను నే పాప మెఱుఁగనిదానఁగాన
వెంటఁ గొనిపొమ్ము నన్నును వీరవర్య! 985

క. సతికిన్ బ్రాసాదంబులు
కృతకవిమానములు నంతరిక్షగమనముల్
హితములుగా వెన్నఁటికిన్
బతిపాదచ్ఛాయ యొకటె పరమపద మగున్. 986

గీ. పితరు లుపదేశ మొనరింపఁ బిన్ననాఁడె
యెన్నియో ధర్మములు వినియున్నదాన;
నెప్పు డే రీతి నేఁ జరియింపవలెనొ
తెలిసికొనియుంటి నింతబోధింప వలెనె? 987

గీ. త్రిభువనైశ్వర్యమైనఁ జింతింపఁబోక
యగమ మజనంబుఁ గ్రూరసత్త్వాకులంబు
నైన వనినైనఁ బుట్టింటియందుఁబోలి
నిలువఁగలను బాతివ్రత్యనిరత నగుచు. 988

గీ. వీరవర! నీకు సేవ గావించుకొనుచు
నియతమానసనై వ్రతనిరత నగుచు
మధుసుగంధివనంబుల మనసుదీర
నేను విహరింతు నీతోడ నెల్లవేళ. 989

క. వనములఁ దిరుగాడెదు నే
జను నైనను రక్షసేయఁ జాలెడి నీకున్
నను నీ దానను నొకతెను
మనుచుట కేపాటిదాన మానవిధానా! 990

గీ. నేను వచ్చెద నీతోడ నిశ్చయముగ
నా పయన మిప్పు డెవ్వరు నాఁపలేరు;
పండ్లు దుంపలుఁ దిని వనిఁ బ్రదుకఁగలను
గాని, నీకెట్టి శ్రమ గల్గనీను రామ! 991

సీ. నిర్భీతి నీక్షింతు నిభృతకాననశైల
నివహనిర్గత దరీ నిర్ఝరిణుల
నెలమిమైఁ దిలకింతుఁ గలహంసపారన
సరసిజామోదకాసారములను
విహరణం బొనరింతు వేడుక లూరఁగాఁ
గుసుమితతరులతా కుంజములను
నవగాహన మొనర్తు నఘమర్షణంబుగా
దివ్యనదీనదతీర్థములను

గీ. నేను నిన్నుఁ గూడి వనుల వేయేఁడులైన
క్షణము లట్లు సుఖంబుగాఁ గడపఁగలను
ప్రాణనాయక! నిను వినా నాకలోక
చిరసుఖంబైనఁ గాని వాంఛింప నొల్ల. 992

గీ. గహనమును మృగవానర గజయుత మగు
వనమునకు నేను నీ వెంట వచ్చెదాన
నీ పదధ్యాననిరతనై నిత్యనియతి
నచట నే నుందుఁ బితృగృహమందుఁబోలి. 993

క. అనురక్తమతి ననన్యను
నినుఁబాసి క్షణంబు బ్రదుకనేరని దానన్
వనికి న్నను దోడ్కొని పో
ననుమతి నిడు మంతభారమా యిది నీకున్?" 994

ఆ. అనుచు సీత యపుడు కనుల నీ రొలుకుచు
నెంత వేడుకొన్న నిష్టపడక
నరవరుండు ధర్మనిరతుండు వనిఁగల్గు
వెతల ననునయమున వినిచె నిట్లు. 995

# 28-వ సర్గము

## వనవాసమునందలి కష్టములను రాముఁడు సీతకుఁ జెప్పుట

క. "జానకి! నీవు సదా ధ
ర్మానుమతివి సత్కులీన వగుదువు; నన్నున్
మానసమునఁ దలఁచి స్వధ
ర్మానుసరణి సంచరింపుమా యిచ్చోటన్. 996

ఆ. చెప్పినట్లు వినుము సీత! నీ వబలవు
దుస్సహములు వనులు దుర్గమములు
మనసునందు విడుము వనవాసవాంఛ; కాం
తార మనిన గష్టపూరముగద! 997

క. నీ మేలుగోరి చెప్పెద
నా మాటలు వినుము; కాననంబుల నెందున్
వైమాలము కష్టములే
యే మాత్రము సుఖము గలుగ దెఱుఁగుము సీతా! 998

క. అనవరత శైల నిర్ఝర
నినదంబులు గిరిగుహావినిర్గత పంచా
నన భీకర గర్జనములు
వనములు వినఁ గనఁ జొరంగ వశమే నీకున్? 999

క. కాచుకొని నిర్భయంబుగ
స్వారిఁ దిరుగు క్రూరమత్తసత్త్వావళిచే
ఘోరమగు విజన విపిన వి
హారము పుష్పోపవనవిహారమె సీతా! 1000

ఆ. నిరతపంకిలములు కరిమకరవిహార
సంకులంబు లడవిసరసు లెల్లఁ
జెలువ వెలమిమీఱ జలకేళిసేయు న
ద్యానదీర్ఘిక లని తలఁతె సీత! 1001

గీ. విపుల కంటక వనలతా వేష్టితములు
భయద కృకవాగ్వినిస్వన ప్రతిరవములు
సలిలశూన్యములు బహుదుస్తరము లడవి
కాలిబాటలు రాజమార్గములె దేవి! 1002

సీ. తమయంతరాలిన తరుపత్రములమీఁద
నలసి రేలను నిద్ర నందవలయు;
పవలు తేలును జెట్లఁబండిన ఫలములే
యాహారముగఁ దృప్తి నందవలయు;
వల్కలాజినజటావళిఁ దాల్చి యోర్మిమై
నుపవాసములఁ జేయుచుండవలయు;
అతిథులఁ బితరుల నఖిలదేవతల వి
ధ్యుక్తంబుగాఁ గొల్చుచుండవలయు;

గీ. మూఁడువేళలఁ దానంబు లాడవలయు;
స్వయముగాఁ గోసికొన్న పుష్పములఁ దెచ్చి
వేది నర్చించి విధిగ సేవింపవలయుఁ;
గానవాస మది యెంతొ కష్ట మబల! 1003

ఆ. వనములను జరించువారు నిత్యంబు న
నిష్టకష్టములె సహింపవలయు;
దొరకినట్టివానితోఁ దృప్తినంది యా
హారనియతి నంగలార్పవలయు. 1004

క. ఆఁకటిబాధకు సోలుచు
వ్యాకుల ఝంఝానిలోపహతిఁ గూలుచుఁ జెం
జీఁకటిరేలం దూలుచుఁ
దేకువఁ గారడవి నీవు దిఱుగం గలవే? 1005

గీ. బలసి పెక్కురూపులఁ గొండచిలువ లెన్నొ
భయముగూర్చుచు నుండును బాటలందు
వాహినులఁబోలి యెల్లెడ వక్రగతులఁ
గ్రూరజలసర్పములు భీతిఁగొల్పుచుండు. 1006

గీ. విహగ దంశ మశక కీట వృశ్చికములు
వెతలఁ గూర్చుచునుండును విపినములను
గంటకద్రుమములు కుశకాశములును
గిలుబుకొని మార్గముల నడ్డగించుచుండు. 1007

క. ఎక్కడనున్నను భయమే
యెక్కడ కేగినను గష్టమే యగు; వనమం
దెక్కరణి నుండఁగోరెద;
వొక్కింత సుఖమ్ముగూడ నుండదు సీతా! 1008

గీ. లోభ కోపంబుల కొకింత లోనుగాక
తపమునందె నిత్యంబు చిత్తంబు నిలిపి
ప్రబలు భయకారణములకు భయముపడక
కానలం దీవు చరియింపఁ గలవె చెలువ? 1009

క. కావున నిప్పుడు నాతో
రావలె నను కోర్కి మదికి రానీకుము; క
ష్టావిష్టము వనవాసము;
నీ వడవులలోనఁ దిరుగనేరవు సీతా!" 1010

## 29–వ సర్గము

### రాముఁడు సీతను అడవికి రావలదని వారించగా సీత రామునితో అందుల కియ్యకొనక వత్తుననుట

క. అనుచు మహాత్ముఁడు రాముఁడు
వనికిం దనరాక నిటు నివారించుటయున్
జనకజ సమ్మతి నందక
కనుల న్నీరొలుక మెల్లగా నిట్లనియెన్. 1011

క. వనమే దుఃఖాకర మని
మనుజేశ్వర! నీ వచించు మాటలు సరియే
యనురాగంబున నడవిన్
నినుఁ గూడి చరించు నా కనిష్ట మెదవునే? 1012

ఆ. కరులు గిరులు హరులు ఖడ్గముల్ వ్యాఘ్రముల్
ఖగము లన్యవన్యమృగము లెల్ల
ని న్నపూర్వపురుషుఁ గన్న బెగ్గిలిపాఱు
భయదములకు జగము భయముపడదె. 1013

క. గురునాజ్ఞచేత సీతో
నరుదేరం దగినదాన నడవుల కేనున్;
నరవర! నీ యెడఁబాటున
నరనిమసము బ్రదుకనేర్తునా యియ్యెడలన్? 1014

గీ. పావనములైన నీ పదాబ్జములనీడ
నేను నిర్భీతచిత్తనై నిలిచియుండ
నమరవిభుఁడు సహస్రాక్షుఁ డైనఁగాని
శూరవర! తన్నుఁ గన్నెత్తి చూడఁగలఁడె? 1015

క. పతిఁ బాసిన నతి యెన్నఁడు
బ్రదుకంగాఁ జాల దనుచుఁ బలుమరు బోధిం
చితి వీవె నాకు; నను నీ
సతి నిటు దిగనాడిపోవఁ జనునే నీకున్? 1016

చ. జనకునియింట నున్నపుడె జ్యోతిషవేత్తలు చెప్ప వింటి; యో
వనమునఁ గొన్నినాళ్లు వనవాసము చేయుదు నంచు; నట్టులే
వినిచిరి లక్షణజ్ఞులును; వేడుక నప్పటినుండి య వ్వనం
బును గన నుంటి; నీవు గొనిపోవక కోరికయెట్లు తీరెడిన్? 1017

క. దైవజ్ఞులు నుడివిన గతి
నా వనవాసంబు దప్పునా? కానలకున్
బోవు తటి వచ్చె; వత్తును
నీ వెంటన్ విప్రవాక్కు నిక్కము గాఁగన్. 1018

ఆ. కాననముల నెందుఁ గష్టంబులే యెప్పు
డుండు నని యెఱింగి యున్నదాన;
భీతిగొలుపుచుండు భీరుల కవియెల్ల
వెఱవనేల మనము వీరసింహ! 1019

గీ. కన్నెనై పుట్టినింట నే నున్నవేళ
నొక సదాచార భిక్షుకి యొక్కనాఁడు
నను గనుంగొని మా యమ్మ వినుచునుండ
నాకు వనవాసయోగ మున్నదని చెప్పె. 1020

క. మున్నుపె పలుమఱు నీతో
వనవాసముచేయు కోర్కి వచియించితి; నీ
వును సుప్రసన్నమతివై
యనుమోదముఁ జూపినాఁడ వగులె మ్మనుచున్. 1021

ఆ. విపినములఁ జరింప వేడుకపడుచుంటి
నధిప! నీకు భద్ర మగునుగాక!
శూరవర్య! నీకు శుశ్రూష లేవేళఁ
జేయఁ గోరుచుంటిఁ జెంతనుండి. 1022

క. పరిశుద్ధాత్ముఁడ వగు నినుఁ
బరమానందమునఁ గొలిచి పాపరహితనై
యరుదెంచెద నీ తోడన్
బరమంబగు సుగతి సతికిఁ బతియే కాదే! 1023

క. నిక్కముగ మనకుఁ గలిగిన
యిక్కల్యాణానుబంధ మిహపరములలోఁ
జెక్కుచెదర; దిటు భూసుర
వాక్కుల శ్రుతిసూక్తి విన్నవారముగాదే! 1024

క. గురులగు పితరులు నియతిన్
గర మనురాగమునఁ గాళ్లు గడిగి యిడిన యా
వరుఁడే వధువున కిహమునఁ
బరమునఁ బతి యగు నటంచుఁ బలుకు నిగమముల్. 1025

గీ. ధర్మ మీ రీతి నుండఁగా దయిత నన్ను
సతతసద్వృత్త నను బతివ్రతను నన్ను
ధర్మచారిణి నన్ను నీదాన నన్ను
నేలఁ గొనిపోవు ప్రార్థించు నిట్టి నన్ను? 1026

క. అనురక్తమతిని సాధ్విని
నినువిడి మనలేనిదాన నీతో సమభా
గిని నౌదుఁ గష్టసుఖముల
ననుఁ గొనిపోఁ దగును వనమునకుఁ బ్రాణేశా! 1027

ఆ. వెంటవత్తు నంచు విలపించు నన్నిందు
వీడనాడిపోవువాఁడ వేని
నీట మునిఁగియైన నిప్పులఁ బడియైన
విసము మెసవియైన నుసురు విడుతు." 1028

క. అని సిత యెంతవేఁడిన
జనశూన్యంబైన వనికి సతిఁ గొనిపోవన్
మనసొప్పమి రఘువీరుం
డనునయమునఁ దేర్పఁ దొడఁగె నామెం బ్రేమన్. 1029

## 30-వ సర్గము

### రాముఁ డెంత యూఱడించినను సీత దుఃఖముతో పలుకుట

ఆ. ఊఱడించుకొలఁది నురుదుఃఖితాత్మయై
యక్షు లశ్రు లొలుక నవనిజాత
పేరురంబువాని శూరునిఁ బతిఁ గాంచి
ప్రణయకోపనికృతిఁ బలికె నిట్లు. 1030

గీ. "నీవు పురుషోత్తముఁడ వని నీ కొసంగె
నన్ను మిథిలేశ్వరుండైన నా జనకుఁడు;
ఇపుడు నను వీడి రామ! నీ వేగుట విని
యనుకొనఁడె నిన్నుఁ బురుషరూపాంగన వని. 1031

గీ. రవివలె ప్రతాపమూర్తియౌ రామునందుఁ
బరమతేజం బిపుడు గానఁబడ దటంచు
నజ్ఞు లగువార లెవరైన నాడుకొన్న
నకట! విని యూరకుండఁగా నయ్యె నాథ! 1032

క. ఏలా చింతిల్లెదవు భ
యాలోలత యేల నీకు? ననితరగతి న
న్నేలా త్యజించి పోయెద
వో లోకశరణ్య! ధర్మమొకొ యిది నీకున్? 1033

గీ. అల ద్యుమత్సేనభూపాలు నాత్మజుఁడగు
సత్యవంతుని సావిత్రిసాధ్విఁ బోలి
వీరవర్య! నీ పాదారవిందసేవ
నెపుడు జీవింతు ననుచు న న్నెఱుఁగు మీవు. 1034

ఉ. పావనమూర్తి రామ! కులపాంసనిపోలిక నన్యచింత నా
భావమునందులేక నిను భక్తిభజించుచునుండుదాన; నన్
యౌవని సాధ్వినిన్ జిరతరాశ్రిత నార్యను నీకు భార్యనౌ
పావని నట్టు వట్లొరులపంచలపా లొనరించి పోయెదే? 1035

ఆ. ఎవరి మేలుగోరి యెవరి యక్కఱఁగోరి
యిచట నన్ను నిలుప నెంచినావొ
యట్టివారి యాజ్ఞ నడఁగి నీవుండుము
ప్రియుని నిన్నె యనుసరింతు నేను. 1036

క. నీతులు దెలిసినవాఁడవు
నీ తరుణి న్నను ద్యజింప నీ కుచితంబే
యే తపమో యే వనమో
యే త్రిదశాలయమొ సర్వ మీవే నాకున్. 1037

క. నీడవలె న్నీయడుగుల
జాడన్ వెనువెంట వత్తు సంతోషముగా
నాడుచుఁ బాడుచు నడవుల
గోడుం గిడేల నిన్నుఁ గూడిన నాకున్? 1038

సీ. కుశ కాశ కంటక కుజ గుల్మములు నాకు
నళినతూలస్పర్శ మగును గాక
భూరివాతోద్ధూత భూపరాగము నాకు
నగరుగందపుఁ బూఁత యగును గాక;
వనవనాంతరిత శాద్వల తలంబులు నాకు
నతిమృదుతల్పంబు లగును గాక
యధికాల్పమూలఫలాదికంబులు నాకు
నమృతోపమానంబు లగును గాక;

గీ. నీవు సతతంబు నాతోడునీడ వగుచు
నరయుచుండంగ నాథ! నా కడవులందు
నఖిలపథములు సుగమంబు లగును గాక!
యఖిలవస్తువుల్ సుఖదము లగును గాక. 1039

ఆ. ఋతుల ననుసరించి యేవేళ లభియించు
ప్రసవములను దాల్చి పండ్లు దినుచుఁ
దల్లి దండ్రి నిల్లుఁ దలఁపక సుఖముగాఁ
గానలందు నిన్నుఁ గలసియుందు. 1040

క. ఆ వని నీకే కష్టము
నే వి(ప్రియ మే దొసంగు నెనయ దొకపుడున్
నావలన; నన్నుఁగొనిపొ
మ్మో వల్లభ! భూభరణున కొఁకనతి భరమే? 1041

క. నీతోనున్నదె స్వర్గము
నీ తో డెడసినదె నాకు నిరయము; నా యీ
(ప్రీతి నెఱిఁగి నిర్భీతిన్
నాతోఁ బయనంబుగట్టి నడువుము వసికిన్. 1042

క. ఓ నాథ! యింతదృఢమతి
నే నుండఁగ నన్నుఁ ద్యజించి నీ వేగినచో
మేను విడుతు విసమైనం
బానముఁ గావింతు నొరులపొ ల్పడకుండన్. 1043

ఆ. నన్ను వీడి నీవు చన్న దుఃఖంబున
నెప్పుడైన చావు దప్ప దింక
నిపుడె నిన్ను వీడినపుడె (ప్రాణంబులు
వాయు టొప్పు నాకుఁ (బాణనాథ! 1044

క. హృదయేశ్వర! నిను విడి నే
(బ్రదు కొల్లను నిమిషమైనఁ బదునాల్గేండ్లా
పదియేండ్లుగాదు మూఁడేం
డ్లదిగా దొకయేఁడుఁ గూడ నాఁగునె యుసురుల్?" 1045

క. అని దుఃఖాయాసంబున
వినువారికిఁ గరుణపుట్ట విలపించుచు రా
ముని గౌఁగిలించి యేడ్చెన్
జనకాత్మజ పేరెలుంగునన్ విహ్వలయై. 1046

ఆ. పతి యనిష్టవచనతతి నొచ్చి జానకి
గరళశరనివిద్ధకరిణిఁ బోలి
నిలుపలేక కనుల నొలికించె నశ్రులఁ
దఱచు నరణి నిప్పు నెఱసు లట్లు. 1047

గీ. నలిననిష్యంద జలకణంబులను బోలి
జనకతనుజాత నయనాంబుజముల నపుడు
స్ఫటికనిభములు శోకతప్తములునైన
యశ్రుబిందులు జాల్వాఱె నతితరముగ. 1048

గీ. నెలనడిమిన్నాఁటి చందురుపోలుపుఁ గాంచి
నిడుదగన్నుల నొప్పు నన్నెలఁతమోము
జలవినిర్గతకమలంబు సరణి నపుడు
బాష్పపర్యాకులతఁజేసి ప్రభ దొఱంగె. 1049

ఆ. అధికదుఃఖవివశయై యేడ్చుచుండిన
కాంత సీత నట్టె కౌఁగిలించి
మించుప్రేమ నూఱడించుచు నిటుపల్కె
జాలి గదుర రామచంద్రుఁ డపుడు 1050

ఆ. "దేవి! నీకు దుఃఖ మావంతయినఁగూర్చు
దాని స్వర్గమైన నేను గోర
నాస్వయంభువునకునట్టులే నాకును
విశ్వమందు నెందు వెఱపు లేదు. 1051

ఆ. నీ యభీష్ట మేమొ నీ నిశ్చయం బేమొ
నే నెఱుంగకుంట నిన్ను వనికిఁ
గొంచుఁబోవ సంశయించి యుంటిని గాని
శక్తిలేకగాదు జలజనయన! 1052

క. సీతా! నీవును గానల
కేతేరఁగ నిట్లు నిశ్చయించితి గానన్
నాతోడ రమ్ము; ధీరుఁడు
ఖ్యాతింబలె నిన్ను విడువఁగాఁ జాల నిఁకన్. 1053

క. నీవు వచించిన ధర్మము
పావన మది పెద్దలెల్లఁ బాలించినదే
దేవీ! సూర్యు సువర్చల
కైవడి నన్ననుసరింపఁగాఁ దగు నీకున్. 1054

ఆ. సత్యబద్ధమైన జనకునియానతి
నన్ను వనికిఁ ద్రోయుచున్న దిపుడు
కాన పయన మాపఁగా రాదు నాకింకఁ
ద్వరపడంగ వలయు ధరణితనయ! 1055

క. జనకునకున్ జనయిత్రికి
వినయి విధేయుండు నగుట విధి తనయునకున్;
మన నేర నట్టిధర్మము
ననువర్తింపక నిమేష మైన లతాంగీ! 1056

## తల్లిదండ్రులు ప్రత్యక్షదైవతములని రాముఁడు సీతకుఁ జెప్పుట

గీ. సేవలంగొను ప్రత్యక్షదైవము లగు
తల్లిదండ్రుల గురువులఁ దప్పవిడిచి
యరయఁగా రాని, చేరంగ నలవిగాని
దేవునిన్ గొల్చు టెట్లు విదేహతనయ! 1057

క. ముల్లోకంబులుగారే
తల్లియుఁ దండ్రియుఁ గురుండు; తత్తుల్యులు లే
రెల్లెడ వెదకినఁ గావున
నెల్లప్పుడుఁ గొలుతువారి నే నలినాక్షీ! 1058

గీ. కాంత! దక్షిణాపూర్ణయాగములు గాని
దానమానముల్ గాని సత్యంబుగాని
పావనంబగు పితృదేవసేవకంటె
బలకరంబులు హితకరంబులును గావు. 1059

క. ధనధాన్యంబులు విద్యలు
తనయులు సంపదలు స్వర్గధామసుఖంబుల్
తన పితరుల సేవించెడి
ఘనమతికిన్ దుర్లభములు గావు శుభాంగీ! 1060

గీ. తల్లిదండ్రులఁ బూజించు ధన్యమతులు
దేవగంధర్వగోలోకదివ్యసుఖము
నితరపుణ్యలోకసుఖంబు లింతెకాక
బ్రహ్మలోకసుఖంబును బడయఁ గలరు. 1061

గీ. అట్లుగావున సత్యధర్మానుమతిని
దండ్రిచేసిన యానతిఁ దలను దాల్చి
దాని నెట్లైనఁ బాలింతుఁ దప్పకుండ
నిది సనాతనధర్మంబుగద [illegible]ాంగి! 1062

ఉ. ఓ నవమోహనాంగి! మది నున్నది చెప్పెద; నింతదాఁక ని
న్గానకుఁ గొంచుఁబోఁ దలఁపఁ గాని స్వధర్మము నూని నీవు నా
తో నరుదేరఁగోర నెటు త్రోయుదు నిప్పుడు? రమ్ము పల్లవ
శ్రీనిభగాత్రవై వని వసింపనె పుట్టితి వేమొ జానకీ! 1063

క. పుట్టిన మెట్టిన గృహముల
నుట్టిపడెడు పరమశోభనోద్యోగము చే
పట్టితి; వుభయకులంబుల
రెట్టించెను కీర్తి సుందరీ! నీ వలనన్. 1064

క. ఓ సుశ్రోణీ! మన వన
వాసమునకు నిపుడె చేయవలయు జతనముల్
నీ సహవాసము లేకయ
యే సురలోకసుఖమైన నేఁ గోరుదునే? 1065

## రాముఁడు సీతను దానములు చేయు మనుట

గీ. ధరణిసురులకుఁ గనకరత్నముల నిడుము
పెట్టు మిష్టమృష్టాన్నముల్ భిక్షుకులకుఁ
గోరినవి యిమ్ము యాచకకోటి కెల్లఁ
జేయు మిది వేగమే యాలసింప కింక. 1066

చ. ధరణిసుపర్వసంతతులఁ దన్పి యనంతరమందు భృత్యు లె
ల్లరకు శయానవాహనవిలాసమనోజ్ఞవిహారవస్తువుల్
వరమణిభూషణంబులును వస్త్రములు న్మనకున్న వన్నియున్
వరుసగఁ బిల్చి యీఁదగు నవారిగ వారికిఁ దృప్తిదీరఁగన్." 1067

ఆ. అనుచు నాథుఁ డిట్టు లనుకూలమతిఁ దెల్ప
విని ముదంబునంది జనకతనయ
విభునివెంటఁబోవు వేడ్కతో దానముల్
సేయఁగాఁ దొడంగె శీఘ్రముగను. 1068

గీ. శ్రీమతి యశస్వినియు మనస్వినియు నైన
ధరణిసంజాత పతిసమ్మత మ్మెఱింగి
పరమహర్షంబుతో ధర్మపరుల కెల్ల
నిష్టధనమణిగణముల నీయఁ దొడఁగె. 1069

# 31-వ సర్గము

## రాముని వెంబడించిన లక్ష్మణుఁడు అన్నపాదములకు ౹మ్రొక్కి సీతనుగాంచి తానుగూడ నడవికి వచ్చెదననుట

చ. కని విని మున్నె యన్నవెనుకం జనుదెంచిన లక్ష్మణుండు కీ
ర్తినిధి రఘూద్వహుం డపుడు దీనత దుఃఖము నాఁపలేక రా
ముని పదపంకజమ్ములకు ౹మ్రొక్కుచుఁ గన్నుల నీరునించుచున్
జనకజ వించునుండ దృఢసత్త్వతు నగ్రజుఁగాంచి యిట్లనెన్. 1070

గీ. "౹క్రూరమృగసంకులంబైన ఘోరవనికి
నిపుడు మీ రేగుటకు నిశ్చయింతు రేని
బాణ తూణీర కోదండపాణి నగుచు
నరవరేణ్య! మీ ముందు నే నడచువాఁడ. 1071

గీ. వెంట నే నుండి నిన్ను సేవించుచుండ
వివిధఖగమృగగణమహారవము లొలసి
బోరుకొను నెన్నియేని కాంతారములను
గడుసుఖంబుగ విహరింపఁగలవు రామ! 1072

ఆ. అన్న నిన్ను వీడి యమరత్వమైనను
సర్వసుఖదమైన స్వర్గమైన
నఖిలలోకనిస్తులైశ్వర్యమైనను
గూడ నేను గోరువాఁడఁగాను." 1073

ఆ. అట్లు నిశ్చయముగ నా సుమిత్రాసూతి
వనికిఁ దానుఁ గూడ వత్తు ననుచుఁ
గోరి రాముఁ డెంత వారించినను దన
పట్టు విడక మరల నిట్టు లనియె. 1074

ఆ. "అనఘ! నాకు మున్నె యానతి నొసఁగియు
నిపుడు వల దనంగ నేమివచ్చె ?"
ననుచుఁ గైమొగిడ్చి యా సుమిత్రాసూతి
యన్నముందు నిలిచి యడుగుటయును. 1075

ఉ. "తమ్ముడ! నీవు నన్మతివి ధర్మరతుండవు నిత్యసత్య మా
ర్గమ్మున నుండువీరుఁడవు ప్రాణసమానుఁడవున్ బ్రియుండవున్
నమ్మిన తోడునీడవును న్నా కనుజుండవు; నీవు వచ్చుచో
నమ్మలఁ జూచువార లెవరయ్య? వనిన్ మన మున్న వేళలన్. 1076

గీ. అవని దనియించు పర్జన్యునట్టు లెపుడు
ప్రజ కభీప్సితసౌఖ్యసంపదలఁ గూర్చి
యెలమిఁ బాలించు దశరథాధీశుఁ డిపుడు
కాలపాశవివశ్వాలుఁడయి కలఁగి యుండె. 1077

క. కేకయనృపాలసుతయగు
నా కైకయె రాజ్యమునకు నధికారిణియై
శోకోపహతల సవతుల
నే కరణిన్ మనుచు నీ వయిన లేకున్నన్ ? 1078

గీ. ధరణిరాజ్యంబు గైకొన్న భరతుఁ డైనఁ
దల్లి కైకమాటనె జవదాఁటకుండి
సతతశోకానుతప్తఁ గౌసల్యఁ గాని
యా సుమిత్రను గాని తా నరయఁబోఁడు. 1079

గీ. అట్లగుటఁజేసి నృపుకృప నందిగాని
స్వయముగా నీవుగాని కౌసల్య నార్య
నా సుమిత్రను గాపాడ నగును గాన
వత్స! యిటనుండు మాటాడవలదు నాకు. 1080

గీ. అట్లు చేసెదవేని నాయందుఁ గలుగు
ప్రేమయును గురుజనములఁ బ్రీతిఁగొలుచు
ననఘధర్మంబుఁ జూపిన ట్లగును నీకుఁ
దమ్ముఁడా! నీ వెఱుంగని ధర్మమున్నె? 1081

ఆ. ఓ స్వధర్మనిరత! యో రఘునందనా!
నా వచించిన ట్లొనర్ప కుండ
నీవు గూడ వచ్చితేనిఁ దల్లుల నింక
నెవరు గాంత్రు? వారి కేది సుఖము?" 1082

క. మాటలనేర్పరి రాముఁడు
పాటించి మనోహరముగఁ బలికిన పలుకుల్
నాఁటి మదిఁ గళవళింపఁగ
మాటు లెఱుఁగు లక్ష్మణుండు మరలం బల్కెన్. 1083

క. నీ తేజోవిక్రమముల
చేతనె భరతుండు పూజచేయు జనులన్;
మాతలకు నెట్టికష్టము
నాతఁ డొదవనీఁడు సంశయము లే దిందున్. 1084

గీ. జనని కౌసల్య తన పరిజనములకును
వేనవేలుగ గ్రామముల్ దాన మిచ్చె;
నామె నా యట్టి జనసహస్రాళినైనఁ
బాలనముసేయఁ గలయట్టి పట్టమహిషి. 1085

గీ. సద్యశస్విని సౌభాగ్యశాలిని యగు
జనని కౌసల్య యాత్మపోషణమె కాక
నా జననియౌ సుమిత్రను నన్నువంటి
శ్రితుల నెందఱినైనఁ బోషింపఁ గలదు. 1086

క. కావున రామా! నను నీ
సేవకుఁ గైకొనుము నేను సిద్ధార్థుఁడనై
సేవింతు; నీకు మేలగు
నేవైధర్మ్యంబు గలుగదిం దించుకయున్. 1087

ఆ. పదనుతూపుదొడిగి పట్టిన వింటితోఁ
ద్రవ్వుగోల చిన్నితట్టతోడ
నడవులందు ముందు నడచుచు నేఁగూర్తుఁ
ద్రోవ నీకు నడుగు నొవకుండ. 1088

క. వనముల మూలఫలంబుల
మునివరులు భుజించు నన్యముల వన్యములన్
గొనితెచ్చి సమర్పించుచు
నిను సంసేవించుచుందు నే ననిశంబున్. 1089

గీ. అన్న నీ నిద్రవేళ మేల్కన్నవేళ
నెపుడు నినుఁ గొల్చి నీ పను లెల్లఁ దీర్తు;
నీవు వైదేహితోఁ గొండనెత్తములను
హాయి వాయువిహారంబు సేయవచ్చు." 1090

క. అను లక్ష్మణువచనంబులు
విని రాముఁడు సంతసించి "వేగ చనుము నీ
యనుఁగులకుఁ దెల్పి యందఱి
యనుమతులం గాంచి తమ్ముఁడా ర" మ్మనుచున్. 1091

## లక్ష్మణుని రాకకు నిష్టపడి రాముఁడు ఆయుధము లన్నింటి వెంబడి దెమ్మనుట

సీ. "సౌమిత్రి! తొల్లి యా జనకభూపతి మహా
యాగంబు గావించు నవసరమున
వరుణుండు కృప మన యిరువురి కొసఁగిన
యరిభీకరములు దివ్యంబు లైన

ధనువులు మఱి యభేద్యములైన కవచంబు
లక్షయశరములో నమ్ముపొదులు
రవినిభప్రభంబులు నవరత్నకాంచన
ఖచితంబులగు శితఖడ్గములును
గీ. సర్వమును బూజసేసి యాచార్యునింట
దాఁచియుంచితి నా యాయుధముల నెల్ల
శీఘ్రమ మీవేగి గురుని వసిష్ఠు నడిగి
వాని నన్నింటిఁ గొనితేరవలయు నిపుడు." 1092

చ. అని యిటు రాముఁ డాజ్ఞయిడినంత ముదంబున నేగి లక్ష్మణుం
డనుఁగుల కెల్లఁ దెల్పి సెలవంది వసిష్ఠునిచెంత దివ్యమా
ల్యనిచయ పూజితంబులగు నాయుధముల్ గొని వేగ వచ్చి వా
నినెదుటఁబెట్టి కైమొగిచినిల్చె నతుండయి యన్నసన్నిధిన్. 1093

## శ్రీరాముఁ డడవికిఁ బోవుచు తమ్మునితో గలిసి దానములు చేయుట

ఆ. ధీరచిత్తుఁడైన శ్రీరాముఁ డపుడు ల
క్ష్మణుని గాంచి యుక్తసమయమునకె
వచ్చినాఁడ వీవు వత్స! నీ రాకకే
యెదురుచూచుచుంటి నిపుడు నేను. 1094

క. నా ధనము భూసురులకుఁ ద
పోధనులకు దాన మొసఁగఁ బూనితి విబుధా
రాధనతత్పర! నీతో
నీ ధర్మము నిర్వహింప నెంచితిని మదిన్. 1095

ఆ. పరమభక్తియుక్తి గురులఁ బూజించు వి
ద్యార్థులకును భూసురావళులకు
నాశ్రితులకు నెల్ల నభిమతార్థంబుల
దాన మాచరింపఁ దలఁచినాఁడ. 1096

# 32-వ సర్గము

## గురు సుతుసుయజ్ఞు తోడ్కొనిరమ్మని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పుట

క. ధరణీసురవరు నార్యున్
గురుపుత్త్రు సుయజ్ఞు వేగ గొనిర మ్మతనిన్
మఱియు మహాత్ముల భూసుర
వరులం బూజించి యరుగువాఁడ ననిʼʼ కనన్. 1097

క. కౌసల్యాత్మజు ప్రియశుభ
శాసనమున్ దలను దాల్చి సంతోషముతో
నా సౌమిత్రి వెసంజని
వాసిష్ఠు సుయజ్ఞుఁ గాంచె వహ్నిగృహమునన్. 1098

ఆ. కాంచి వందనంబు గావించి "శ్రీరామ
చంద్రుఁ డిపుడు వనికిఁ జనుచు నొరుల
కలవిగాని సుకృతి నాచరింపఁగ నుండె
వచ్చి నీవు చూడవలయు సఖుఁడ!" 1099

క. అన విని సుయజ్ఞుఁ డప్పుడు
తన సంధ్యాదికము దీర్చి తగ లక్ష్మణుతోఁ
జనుదెంచెన్ శ్రీమంతము
మనోజ్ఞ మగు రామచంద్రు మందిరమునకున్. 1100

గీ. హుతవహుం బోలి వెల్గుచు నున్నవాని
నాగతుని నాగమజ్ఞు సుయజ్ఞు నపుడు
సీతతోఁగూడి రాముండు చేరి మ్రొక్కి
యంజలించి ప్రదక్షిణ మాచరించె. 1101

ఆ. కాంచనాంగదములు కంకణంబులు రత్న
భర్మకుండలములు బాహుపురులు
భూరిమణులు నొసఁగి పూజించె నప్పుడు
గురుసుతున్ గకుత్స్థకులతిలకుఁడు. 1102

క. శ్రీరాముఁ డంత సీతా
ప్రేరణను సుయజ్ఞుఁ గాంచి "ప్రియుపడి యిపుడీ
ధారుణిసుత నీసతి కుప
హారము లర్పింపనుండె నందు" మటంచున్. 1103

గీ. కనకసూత్రముల్ హారముల్ కాంచికలును
నమలకేయూరములు విచిత్రాంగదములు
వనికిఁ దనవెంటఁ బయనమైవచ్చు సీత
చేత నిప్పించె నా గురుసూతి కపుడు 1104

గీ. మఱియు సరిగ దువ్వలువపైఁ బఱచినట్టి
రత్నపర్యంక మిప్పించి రమణిచేత
మామ యిడిన శత్రుంజయనామ గజము
తోన వేయేన్గు లతనికిఁ దా నొసంగె. 1105

క. గౌరవమున వా రిడు నుప
హారములన్ గొని సుయజ్ఞుఁ డతిముదమున సీ
తారామలక్ష్మణుల కల
రారన్ గావించె మంగళాశాసనముల్. 1106

క. ఏమఱుపాటెఱుఁగని శ్రీ
రాముఁడు ప్రియవాది యపుడు బ్రహ్మ నుపర్వ
స్వామికిఁ బలె నానతి యిడె
సౌమిత్రికిఁ బ్రియతమునకు సహజన్మునకున్. 1107

గీ. "చిన్నితమ్ముఁడ! బ్రాహ్మణశ్రేష్ఠులైన
కౌశికాగస్త్యులను బిల్చి గౌరవించి
తనుపఁ దగు వారి బహుళరత్నములచేత
సలిలసేకంబుచేత సస్యములఁ బోలి. 1108

గీ. మఱియు గోసహస్రములచే మణులచేత
రజత కాంచనమయ ధనరాశిచేతఁ
జిరతపస్వులౌ వారిఁ బూజింప వలయు
మానధన! లక్ష్మణా! వరదానశీల! 1109

క. కౌసల్యకు నిత్యశుభా
శాసనుఁడును దైత్తిరీయశాఖాగురుఁడౌ
భూసురున కిమ్ము తృప్తిగ
దాసీజన యాన రత్న ధన వసనాదుల్. 1110

చ. జనకునకున్ విధేయుఁడయి సారథియై చిరకాలభృత్యుఁడై
మన కడనున్న యట్టి జనమాన్యుఁడు చిత్రరథుండు నెమ్మదిన్
దనియ నొసంగు మాతనికిఁ దమ్ముఁడ! కాంచన రత్న వస్తు వా
హన ధనముల్ సవత్సక పయస్వినులైన సహస్రధేనువుల్. 1111

క. పాలాశదండులును గఠ
కాలాపులు నిగమపఠనకర్మఠులు వటుల్
చాలఁ గలరు స్వాదుప్రియు
లోలిం బూజింపఁ దగిన యుత్తమచరితుల్. 1112

గీ. వారలకు దుక్కిటెడ్ల నిన్నూఱు మఱియు
వడ్లగంతలమోసెడు నెడ్లువేయి
పాలుపెరుఁగు నే యొసఁగెడు నాలు వేయి
మణుల నింపినబండ్ల నెన్బదియు నిమ్ము. 1113

గీ. అంతియే కాక కౌసల్య నాశ్రయించి
బాల విద్యార్థు లున్నారు వేలకొలఁది
తలకు వేయేసి గోవు లందఱికి నిమ్ము
తమ్ముఁడా! యమ్మ చూచి సంతసము నంద." 1114

క. అను రాముని యానతి విని
యనఘుఁడు సౌమిత్రి యా ధనాదిక మెల్లన్
ధనదుని పోలిక శ్రద్ధా
వినతుండై యొసఁగె నపుడు విప్రవరులకున్. 1115

ఆ. అంతఁ జెంత నిలిచి యశ్రువు లొలికెడి
సేవకాళి నెల్లఁ జిత్తగించి
జాలి గదురఁ గాంచి జానకీపతి వారి
కిష్టధనము లిచ్చి యిట్టు లనియె. 1116

క. "సౌమిత్రిమందిరంబును
నా మందిర మెపుడు విడక నమ్మిన బంట్లై
యేమఱక చూడఁగాఁ దగు
నేము మరలివచ్చుదాఁక నెప్పటివలెనే." 1117

గీ. అనుచు శ్రీరాముఁ డా సేవకాళిచేతఁ
గోశమందున్న తన ధనరాశి నెల్లఁ
బేర్మిఁ దెప్పించి యనుజుతోఁ బేద లైన
బాలవృద్ధభూసురులకుఁ బంచి యిచ్చె. 1118

ఆ. కొంకి త్రవ్వగోల గొడ్డలియును దాల్చి
యడవి నుంఛవృత్తిఁ గడపు నట్టి
ద్విజుఁడు పింగళుండు త్రిజటుఁడన్ గార్గ్యుండు
వచ్చె నపుడు దైవవశత నటకు. 1119

క. మల్లడిగొను పేదఱికపుఁ
బెల్లునఁబడి వృద్ధుఁడైన పెనిమిటిఁ గనుచున్
బిల్లల ముం దిడి యాతని
యిల్లాలగు తరుణి యప్పు డిట్లని పలికెన్. 1120

క. "చేతులఁ గాయలె గానీ
వాతికిఁ గడి యిడనియిట్టి వస్తువు లేలా?
దాతయగు రాము దయగొని
ప్రాతిగ బిడ్డలును మనము బ్రదుకం దగదే? 1121

గీ ప్రాణనాయక! నా పల్కు పాటిసేసి
సకలధర్మజ్ఞు రాము దర్శనముఁజేసి
మన కుటుంబదారిద్ర్యమున్ మనవి చేసి
కామితములందు మాతని కరుణఁజేసి." 1122

ఆ. అనిన గృహిణిమాట లాలించి త్రిజటుండు
చింకిపావి మేన సిస్తుపఱచి
యపుడు రామమందిరాభిముఖుండయి
యరిగె నతఁడు కోర్కు లురవడింప. 1123

ఆ. అంగిరసునిఁబోలి యా భృగునింబోలి
దివ్యతేజుఁడైన త్రిజటుఁ డప్పు
డైదుకక్ష్యలును నిరాఘాటముగ దాఁటి
చనియె రామచంద్రు సన్నిధికిని. 1124

చ. అనఘచరిత్రుఁ డా త్రిజటుఁ డప్పుడు రామునిఁ గాంచి "యో జగ
ద్వినుత! యశోవిశాల! పృథివీతలనాథకుమారచంద్ర! నన్
గను మిటు పేదతాపసుఁడ గంపెడుబిడ్డలవాఁడ నుంఛ జీ
వనుఁడ గృహస్థుఁడన్ గహనవాసుఁడ వచ్చితి నిన్ గనుంగొనన్"

క. అన రాముఁడు పరిహాసం
బున నిట్లనె "గోసహస్రముల నొక్కటియై
నను నీయఁబడదు నాచే
విను మిపుడు వచించువాఁడ ద్విజకులతిలకా! 1126

క. గిరగిరఁ ద్రిప్పుచు దండము
గిరవాటిడినంతమేర గిరికొను గోవుల్
కరగతము చేసికొనఁదగు
ధరణీసురగణ్య! వృద్ధతపసివరేణ్యా!" 1127

ఆ. అనిన రాముమాట లాలించి త్రిజటుండు
సంబరంబుతోడి సాధ్వసమున
శాటిఁ గటినిఁ జుట్టి శ్వాసలు బిగఁబట్టి
బలము కొలఁది యష్టిఁ బట్టి విసరె. 1128

గీ. అవనిసురుఁ డట్లు విసరినయట్టి యష్టి
సరయువును దాఁటి గోసహస్రముల దాఁటి
యవలఁ గల గోవృషము చెంత నవనిఁ బడియె
ముసలిజడదాథి జవము రాముండు మెచ్చ. 1129

గీ. పరమధర్మాత్ముఁడగు రామభద్రుఁ డపుడు
కౌతుకంబున నా విప్రుఁ గౌఁగిలించి
సరయుతటినున్న గోసహస్రముల నెల్ల
వల్లవులచేత మునివనవాటి కనిపి. 1130

చ. "అనుపమతేజ! నీ బలము నారయ నే నిపుఁ డన్నమాటకున్
గనలకు మయ్య! వేడుకకుఁగా నటు లంటిని; విప్రులందు నా
ధన ముపయుక్తమైనఁ గడు ధన్యుఁడ నయ్యెదఁ; గాన నీకు నిం
కనుగల కామితంబు లడుగం దగు నత్యముగా నొసంగెదన్." 1131

ఆ. అన సతీయుతుండు ముని మాటి కోర క
మ్మొదవులను గ్రహించి ముదము గాంచి
బలము యశము సుఖము ప్రమదంబు వొదల దీ
వించి రామవిభుని వీడుకొనియె. 1132

గీ. రాముఁ డంత సంతుష్టాంతరంగుఁ డగుచు
ధర్మ విక్రమార్జిత మగు తన ధనంబు
నాప్తమిత్రుల కీయంగ నాజ్ఞ నొసఁగి
హితవచనసత్కృతులఁ దన్పె నెల్లవారి. 1133

గీ. అపుడు ద్విజులందు మిత్రులయందు భృత్యు
లందుఁ బేదలు భిక్షుకులందు నెందు
సర్వగతి రాముఁ డొసఁగు దానాళిచేతఁ
దృప్తి నందనివాఁ డొక్కఁడేని లేఁడు. 1134

# 11-వ సర్గము

## సీతారామలక్ష్మణులు విప్రులను దానాళిచేఁ దన్పి దశరథుని దర్శింప నరుగుట

గీ. శ్రీయుతులు రామలక్ష్మణుల్ సీతతోడ
సమధికంబుగ బ్రాహ్మణోత్తముల కెల్ల
ధన కనక ధేను వస్తు వాహనము లొసఁగి
చేరి ముగ్గురు నృపుని దర్శింపఁ జనిరి. 1135

ఆ. పుష్పమాలికాభిభూషితాయుధములు
రాఘవులు ధరించి రథ్య నడువఁ
దేరి చూడరాక దీపించె నవియెల్ల
సీతవలన మఱియుఁ జెన్ను మిగిలి. 1136

గీ. అపుడు సంపన్నులైన గృహస్థు లెల్ల
మండపములు ప్రాసాదహర్మ్యములనుండి
యాయత విమాన గృహశిఖరాళినుండి
యరయఁ దొడఁగిరి వారలు హర్ష మెడలి. 1137

క. జనగణసంకులపథమునఁ
జనఁజాలక దీనులైన జానపదజనుల్
ఘనగోపురాదిగతులై
కనఁ దొడఁగిరి రామచంద్రుఁ గడుదుఃఖమునన్. 1138

ఆ. గొడుగులేక కాలినడకను జనుచున్న
రాచకొమరుఁడైన రాముఁ జూచి
జనులు దుఃఖ మాపఁజాలక సంతప్త
చిత్తు లగుచు నిట్లు చెప్పికొనిరి. 1139

క. చతురంగముఖ్యబల సం
యుతుఁడై విచ్చేయు రాముఁ డొంటి నిటు చనన్
క్షితిసుతయును సౌమిత్రియు
నతని ననుసరించుటయ్యె నా కాల్నడలన్. 1140

గీ. ప్రాభవైశ్వర్యవిభవానుభావుఁ డయ్యు
నర్థులకు నర్థము లొసంగ సాధ్యుఁ డయ్యు
రామచంద్రుఁడు ధర్మగౌరవమువలన
జనకు ననృతవాదినిఁ జేయఁ జాలఁ డయ్యెఁ. 1141

గీ. గగనసంచారులగు భూతగణములైన
నేఁటిదాఁకను గానంగ నేరనట్టి
వసుమతీజాత యిపు డెల్లవారుఁ జూడఁ
గాలినడ నేగుచుండె రాఘవునితోడ. 1142

గీ. తావి నెమ్మేనిపూఁతకుఁ దగినయదియు
నెఱ్ఱగందపుమైపూఁత నెసఁగునట్టి
సీత యింక వర్షాతపశీతములకు
వన్నియ దొఱంగి వసివాళ్లు వాఱకున్నె? 1143

## పాదచారులై వెడలుచున్న సీతారామలక్ష్మణులను జూచి ప్రజలు వగచుట

ఉ. నెయ్యముఁ దియ్యముం గల వినీతుని రాముఁ గుమారునిన్ బ్రియున్
దయ్యముపట్టి రా జిటు వనంబులఁ ద్రోయుచునుండె నిక్క; మే
యయ్యయు దుర్వినీతుఁడగు నాత్మజునైనఁ ద్యజింపఁ డన్న న
య్యయ్యొ! జగజ్జయాఖ్యుఁడగు నౌరసుఁ బంక్తిరథుండు వీడునే?

గీ. దయము శీలంబు శమమును దమ మహింస
విద్యయును గల శ్రీరాము వీడనాడి
యెండకాలంబునను జల మిగుర నొగులు
జలచరము లట్టు లడలరే జనగణములు? 1145

క. అగమూలము ఖిలమైనను
జిగురులు పూవులును బండ్లుఁ జేడ్పడు కరణిన్
జగతీపతియగు రాముని
వగలన్ వగఁ గనదె జీవవర్గం బెల్లన్? 1146

ఆ. ధర్మమూర్తి కీర్తిధాముండు రాముండు
తల్లివేరు ప్రకృతి తరువునకును;
బత్రములును బూలుఁ బండ్లును గొమ్మలుఁ
గావె సకలలోక జీవతతులు? 1147

క. కావున రాముఁడు పోయెడు
త్రోవన పోవుదము సతులతో బిడ్డలతో
ధీవిభవుఁడు లక్ష్మణువలె
వేవేగ మయోధ్య విడిచి విపినంబులకున్. 1148

ఆ. పూలతోఁట లిండ్లు పొలములు విడనాడి
యనుసరింత మింక నధిపు రాము;
నెంత కష్టమైన నెట్టి సుఖంబైన
ననుభవించుచుంద మతనితోనె. 1149

సీ. పాఁతులు పెకలింపఁ బడిన గోతులతోడ
నలువంక నెలుక కన్నములతోడ
వరిగిం జయినలేని పట్టిగాదెలతోడ
సిరివీడి చన్న యోవరులతోడ
బుగ్గి బూడిదయైన యగ్గిగుండములతోఁ
గలయంపిలేని వాకిళులతోడ
పొాయి బూఁజువాఱిన బోనంపుటిండ్లతోఁ
గిడ్వాటుగన్న ముంగిళ్ళతోడఁ

గీ. బెంకుప్రోఁగులతో నెల్కపెంటుతోడఁ
గ్రమ్ముకొను గబ్బుతోఁ దుక్కుదుమ్ముతోడ
పాడువడిపోయినట్టి యీ వాడ లెల్ల
నింకఁ గైకమ్మ గైకొని యేలుఁగాక! 1150

ఆ. అతిథిసేవ దేవతార్చనంబును లేక
యగ్నిహోత్ర మధ్యయనము లేక
యింటు బైట బాట నెందు నెవ్వరు లేక
యపుఁ డయోధ్య శూన్య మగును గాక! 1151

క. అనఘుఁడు రాఘవుఁ డడుగిడు
వనమే భవన మగుఁగాక! వైభవయుతమై;
వన మగును గాక యాతఁడు
వనిన వెనుక నగర మెల్ల జనశూన్యంబై. 1152

క. పుట్టలఁ బాములు వీడును
గట్టులఁ జెట్టులను వీడు ఖగనగచరముల్
నెట్టన మనకున్ భయపడి
నట్టడివినె వీడిపోవు నానామృగముల్. 115

ఆ. ఆ విషోరగమ్ము లా క్రూరవిహగంబు
లా మహోగ్రమృగచయంబు లెల్ల
నాత్మనిలయమైన యడవిని విడనాడి
మనము వీడు వీటు మనలుఁ గాక! 115

గీ. తృణము పలలంబు ఫలములు దినుచు బ్రదుకు
వ్యాళభీకరఖగమృగవాసమైన
దేశ మిఁక నేలుకొనుఁ గాక దేవి కైక
తన కొడుకుతోడ సకలబాంధవులతోడ. 115

క. మన మెలమి రాముతోడనె
వని నుండ" మటంచు నిట్లు వా రనుకొనఁగా
వినియును రఘువీరుఁడు తన
మనమునఁ జలియింపఁ డెంతమాత్రం బైనన్. 115

క. పాలిత ధర్ముఁడు మదగజ
లీలాగమనుండు రఘుకులీనుఁ డపుడు దా
నాలోకించుచు వలఁగొనెఁ
గైలాసనిభంబు జనకు ఘన సౌధంబున్. 1157

క. తనుఁ గనుఁగొని దుఃఖించెడు
జనములఁ గాంచియు నొకింత చలియింపక య
య్యనఘుఁడు దృఢనిశయుఁడై
చనియె న్నగుమొగముతోనె జనకుఁ గనుఁగొనన్. 1158

గీ. వినయ భయయుక్తిఁ గాపున్న వీరులున్న
రాజగృహముఁ బ్రవేశించి రాముఁ డప్డు
డనతిదూరంబుననె దీనుఁడై చరించు
మంత్రివరుఁడైన యట్టి సుమంత్రుఁ గాంచె. 1159

గీ. అమలతేజోనిధి మహాత్ముఁడైన రాముఁ
డాత్మవనవాసవార్త విన్నంత నుండి
యడలెడు సుమంత్రుచే తన యాగమనము
తండ్రి కెఱిఁగించుటకుఁ గొంతతడవు దాళి. 1160

గీ. జనకు నానతిఁ బాలింప వనికి నరుగ
నిశ్చయించిన సద్ధర్మనిరతుఁడైన
రాఘవుఁడు రామునకుఁ దనరాకఁ దెలుప
వృద్ధమంత్రి సుమంత్రుని కెఱుకపఱచె. 1161

## 34-వ సర్గము

### రాముఁడు తనరాకను తండ్రికిఁ దెలుపుమని సుమంత్రునితోఁ జెప్పుట

ఉ. సామజవైరిమధ్యముని సారసపత్ర విశాలనేత్రునిన్
శ్యామలకోమలాంగుని మహాత్ముని రాముని యాజ్ఞఁగొంచు దుః
ఖామిత విహ్వలాత్ముఁడగునట్టి సుమంత్రుఁడు వేగ మేగి యా
భూమిపుఁగాంచె నూరుపులఁ బుచ్చుచుఁ బొక్కుచునున్న యాతనిన్.

ఆ. పుడమి యేలి కపుడు పొక్కుచు గ్రుక్కుచు
నివురుగప్పినట్టి నిప్పువోలి
పాముపట్టినట్టి పవలింటి దొరఁబోలి
జాలులేని కొలనిఁ బోలి యుండె. 1163

సీ. పనవి రాముని గూర్చి పలవించు దశరథుఁ
గని సుమంత్రుం డంతఁ గై మొగిడ్చి
యాచారసరణి జయాశీస్సు లొనరించి
భయభక్తు లెసగంగఁ బలికె నిట్లు
"భూమీశ! నీయగ్రపుత్త్రుఁడు ద్విజపరి
జనముల ధనముల సత్కరించి
వారల వీడ్కొని వనికిఁ బోఁబోవుచు
నిన్నుఁ గన్గొన వచ్చియున్నవాఁడు
గీ. వేయి కిరణాలతో వేఁడి వెలుఁగుఁ బోలి
యఖిలరాజగుణాళితో నలరు కొమరు
సత్యవిక్రము శ్రీరామ చంద్రమూర్తిఁ
గనఁగఁ దగు నొక్కసారి దర్శన మొసంగి." 1164

## దశరథుఁడు రామున్ని తన రాణివాసపు స్త్రీలందఱితోను జూడఁగోరుట

గీ. అన వనధిఁబోలి గంభీరుఁడైన వాఁడు
నాకసముఁ బోలి నిర్మలుఁడైన వాఁడు
నాడితప్పనివాఁడు మేలైనవాఁడు
నగు నృపుం డప్పు డతని కిట్లని వచించె. 1165
ఆ. "ఎల్లసతులఁ గూడి యేను ధర్మాత్ము నా
కొడుకు రాముఁ జూడఁ గోరుచుంటి
నట్లు గాన వారినందఱఁ దోడ్తెఱ
నేగరమ్ము సచివ! వేగిరమ్ము." 1166
క. అని నృపుఁ డానతి సేయఁగ
విని యాతఁడు రాజగృహము విడి చని దేవీ
జనమునకు విన్నవించెన్
జనపతి మిముఁ జూడఁ గోరెఁ జనుఁ డటు" కనుచున్. 1167

చ. అదివిని ధారుణీవిభుని యానతిఁ దప్పక రాణివాసపు
న్మదితలు దుఃఖవారినిధి మున్గుచుఁ దేలుచు మూఁడునూర్లయేఁ
బదుగురుఁ గోసలాత్మజను బట్టపుదేవిని గూడివచ్చి రా
త్మదయితుఁ డున్న పీటికి ధృతవ్రతలై పదముల్ తడంబడన్. 1168

గీ. దార లిటు వచ్చినంతనే దశరథుండు
తనయు రమ్మను మని సుమంత్రునకుఁ దెలుప
సూతుఁ డపుడె లక్ష్మణునితో సీతతోడ
రాఘవునిఁ బిల్చుకొనివచ్చె రాజుకడకు. 1169

గీ. దూరమందుండియే కేలు దోయిలించి
సన్నిధికి వచ్చు సుతు రామచంద్రుఁ గాంచి
దుఃఖమున రాణు లందఱితోడఁ గూడ
జనవిభుఁడు పీఠ మెడలి దిగ్గునన లేచి. 1170

క. అడుగులు తడఁబడ వడివడిఁ
గొడుకు నెదురఁబోయి చేరుకొనఁ జాలక యి
మ్మడి వగఁబడి యొడ లెఱుఁగక
పుడమి పయిం బడియె మూర్ఛ ముంచుకొనంగన్. 1171

క. రాముఁడును మహారథుఁ డగు
సౌమిత్రియు దుఃఖవివశు జనవిభు జనకున్
భూమిఁ బడనీక వెసఁ జని
కోమల కరములను బట్టుకొలిపి రతనికిన్. 1172

ఆ. నగల రవళి యార్తనాదంబుతోఁ గూడి
ప్రభుని భవన మెల్లఁ బ్రతిరవింప
నపుడు రాణులెల్ల "హా రామ! హా రామ!"
యనుచు నేడ్వఁ దొడఁగి రడలు మిగుల. 1173

ఆ. సీతతోడఁ గూడ శ్రీరామలక్ష్మణుల్
దశరథావనీంద్రు తత్క్షణంబ
పాణిపల్లవములఁ బట్టి దుఃఖించుచు
సెజ్జ నొయ్య నొయ్యఁ జేర్చి రంత. 1174

ఆ. కొంతసేపటికిని తెలివంది ఘనదుఃఖ
వనధి మునిఁగియున్న జనకుఁ గాంచి
రామచంద్రుఁ డపుడు కైమోడ్చి గావించి
వినయ మెనయ నిట్లు విన్నవించె. 1175

గీ. "అవనినాథ! మా కధినాథుఁ డైన నిన్ను
వనికిఁ బోవుచు వీడ్కొన వచ్చినాఁడ
మనసు పదిలంబు గావించి వనట వీడి
సేమమును గోరి నన్నుఁ గటాక్షింపు మిపుడు. 1176

క. నా తెలుపు హేతులకుఁ బ్రతి
హేతువులం జూపి నిశ్చయించిరి వీరల్
నాతోడ వనికి రా; నీ
సీతా సౌమిత్రులకును సెలవీ వలయున్. 1177

ఆ. ప్రజకు నాజ్ఞ వెట్టు బ్రహ్మదేవునిఁ బోలి
వసుమతీశ! చింత వంత మాని
జనకసుతకు నాకు ననుజు లక్ష్మణునకు
నడవి కేగ నాజ్ఞ యిడఁగ వలయు." 1178

క. అని వేగ వనికిఁ బోవఁగఁ
దన యానతి కెదురుచూచు తనయుని రాముని
వినయానతునిం గనుఁగొని
జనవిభుఁ డిట్లనియె శోకసంతప్తమతిన్. 1179

ఆ. కన్నతండ్రి! రాము! కైకచే నే నిట్లు
వంచితుండ నైతి వరము లిచ్చి;
యిట్టి నన్ను నిగ్రహించి యయోధ్యకుఁ
బ్రాభవమున నీవె రాజ వగుము." 1180

క. జననాథుఁ డిటు వచింపఁగ
విని వాక్యవిశారదుండు విమలచరిత్రుం
డనఘాత్ముఁడు రాఘవుఁ డి
ట్లనియె న్నిజజనకునకుఁ గృతాంజలి యగుచున్. 1181

క. "ఈ యవని నెల్ల నేలుచు
వేయేఁడులు నీవె ప్రభుత వెలయుము తండ్రీ!
పోయెద నే నిపు డడవికి
నే యెడ ని న్ననృతుఁ జేయ నే నోపుదునే? 1182

ఆ. ప్రభువరేణ్య! నేను పదునాలుగేఁడులు
కానలను సుఖంబుగాఁ జరించి
ప్రతిన దీర్చి వచ్చి క్రమ్మఱ నీ పాద
సేవఁ జేయువాఁడఁ జిత్త మలర." 1183

ఆ. అని వచింప దశరథాధిపుఁ డేడ్చుచుఁ
బ్రబల సత్యపాశ బద్ధుఁ డగుటఁ
గైక యింగితంబు గడపఁగాఁ జాలక
యనుఁగుఁ గొమరు గాంచి యనియె నిట్లు. 1184

క. "నాయన! నీ కే యెడలన్
శ్రేయంబును నభ్యుదయముఁ జేకుఱుఁగాతన్
శ్రీయుత మభయం బగు పథిఁ
బోయి మరల రమ్ము భద్రముగ విజయుఁడవై. 1185

క. ఓ రఘునందన! తండ్రీ!
శ్రీరామా! సత్యకామ! స్థిరధర్మాత్మా!
సారాచార విచారా!
ధీరా! నీ తలఁపు నేను ద్రిప్పం గలనే? 1186

ఆ. ప్రొద్దుపోయె నపుడె పోవల దిప్పుడే
యొక్కరే సుఖింతు నుండు మిచట;
నిన్నుఁ గన్నతల్లి నన్నుఁ దృప్తులఁ జేసి
తృప్తిఁ జనెదు గాని రేపకడనె. 1187

ఆ. నా ప్రియంబు కొఱకు నీ ప్రియార్థము లెల్ల
విడిచి విజనవనికి వెడలుచుంటి
వకట! రామ! యిట్టి యతిదుష్కరక్రియ
నెవరు చేయ నేర్తు రీవుదక్క. 1188

ఆ. శపథ మాచరింతు సత్యంబుగా నిది
తనయ! నాకు సమ్మతంబుగాదు;
గుప్తతంత్రయై నిగూఢానలముఁ బోలు
నింతి కగ్గ మగుట నిట్టు లైతి. 1189

చ. తనయులలోనఁ బెద్దవయి తండ్రిని సూనృతవాదిఁ జేసినా
వనుటొక వింతగాదు; స్వకులామల గౌరవమున్ ద్యజించి వం
చన మొనరించి నన్నిటు వశంవదుఁ జేసిన కైకకోర్కె నీ
వును విని తీర్పఁబూని తివి వో పరమాద్భుత మో రఘూత్తమా!"

క. అని విలపించుచుఁ బలికిన
జనకుని వచనములఁ దాను సానుజుఁ డగుచున్
విని రామచంద్రుఁ డప్పుడు
ఘనశోకాకులతఁ దండ్రిఁ గని యిటు లనియెన్. 1191

క. ఈ పూఁట రాజభోగ
ప్రాపణముం జేసి తృప్తిపడనేమి యగున్?
రేపెట్టు లోదవు నా కవి?
వే పోయెదఁ గోర్కెలెల్ల విడిచితిఁ దండ్రీ! 1192

క. ధన ధాన్య సమంచితమును
జనగణ సేవితము రాష్ట్రసంయుతమును మ
ద్వినిసృష్టము నగు రాజ్యం
బనుజుఁడు భరతున కొసంగ నగు నవనీంద్రా! 1193

ఆ. అరుగువాఁడ వనికిఁ దిరుగదు నా బుద్ధి
యెలమి నీవు కైక కిడినయట్టి
వరము లెల్ల సఫలపఱచిన దాతవై
సత్యవాది వగుము జనవరేణ్య! 1194

గీ. అధిప! నీ యాజ్ఞ దీర్ప నే నడవినుందు
వనచరులతోడఁ బదునాల్గువత్సరములు
సంశయింపక నీవు విచార మెడలి
ధరణి రాజ్యంబు మన భరతునకు నిమ్ము. 1195

గీ. అవనినాయక! నీ యాజ్ఞ నక్షరాలఁ
బాలన మొనర్చుటయె నాకుఁ బరమహితము;
ఆత్మసుఖమందుఁ గాని రాజ్యంబునందుఁ
గాని నా కించుకయు లేదు కాంక్షితంబు. 1196

క. విడువుము దుఃఖము కన్నులఁ
దడియం జేయకుము బాష్పధారలచేతన్;
వడి నెన్ని నదులు సుడివడఁ
బొడిచిన సాగరుఁడు కలతఁ బొందునె? తండ్రీ! 1197

గీ. కామ్యముల నొల్ల సుఖ మొల్లఁ గాంత నొల్ల
రాజ్య మొల్ల స్వర్గం బొల్లఁ బ్రాణ మొల్ల
పలుకుచుంటి నా సుకృతిపై బాసచేసి
యొక్క సత్యంబు నీవు నాకున్నఁ జాలు. 1198

క. జనవర! నే నిటు నిలువం
జన దొక్క నిమేషమైనఁ జనియెద వనికిన్
ననుఁగూర్చి వగవకుము నా
మనమునఁ గల నిశ్చయంబు మాఱదు తండ్రీ! 1199

గీ. కానకును నేఁడె చను మని కైకగోర
నట్టి యని యొప్పుకొంటి నే నామె చెంతఁ;
గాన నిచ్చట నిలువఁగాఁ గాదు నాకుఁ
బాలనము చేసికొందు నా ప్రతినఁ గూడ. 1200

ఆ. తల్లడిల్లఁ బోకు తండ్రి మా కొఱకునై
సుప్రశాంత హరిణశోభితంబు
లలిత బహువిహంగ కల నాదితంబునౌ
కాన నెలమిఁ దిరుగఁ గలము మేము. 1201

గీ. తండ్రియే దైవతము దేవతలకుఁ గూడ
నన్న యార్యోక్తి నే వినియున్నవాఁడఁ;
గానఁ బ్రత్యక్ష దైవతమైన యట్టి
జనకు నానతి నే శిరసా వహింతు. 1202

క. ఈరే డేండ్లను నే నొక
వారముగాఁ గడపి మరలి వచ్చిన నన్నుఁ గ
గన్నారం గానం గలవో
భూరమణా! దుఃఖపడఁగఁ బోకుము నాకై. 1203

ఆ. గువ్వగుత్తుకలను గుందుచునున్న యీ
జనము నూఱడించు స్వామి వయ్యు
నీవుఁ గూడఁ గలఁగి యిట్లు దుఃఖించుచో
నింకఁ దేర్చు వార లెవరు గలరు? 1204

క. నరవర! నేఁ ద్యజియించిన
పురములు రాష్ట్రములు సకలభూమీతలముల్
భరతునకు నిమ్ము నే నిపు
డరణ్యమున కేగి తావకాజ్ఞను దీర్తున్. 1205

క. సిరు లిడు గిరికాననముల
స్థిరమగు సీమలకు శుభము చేకూర్చెడు నీ
ధరణి న్నీ పలుకుబడిని
పరిపాలనఁ జేయుఁగాత భరతుఁడు తండ్రీ! 1206

ఆ. పెద్ద లెల్ల మెచ్చు పితురాజ్ఞ దృఢముగా
నాటుకొన్న యట్టి నా మనంబు
ఇష్టకామ్యములకు నెన్నఁడుఁ దిరుగదు
జనక! నాకునై విచారపడకు. 1207

క. భూవర! నిను జనవంద్యునిఁ
బావనచరితుని నసత్యభాషణునిగ నేఁ
గావింతునేని నా కిఁక
శ్రీవిభవము సౌఖ్యములును జీవిత మేలా? 1208

క. ఫలమూలంబుల మెసవుచు
లలితములగు నదులఁ గొలఁకులన్ శైలములన్
దిలకించుచు నానాతరు
విలసిత వని వేడ్క నుండు విడువుము వగలన్." 1209

క. అని రాముఁడు వచియింపఁగ
విని ఘనతరశోకదుఃఖవిహ్వలుఁ డగుచున్
జనవరుఁడు తనయు నాలిం
గన మొనరిచి మూర్ఛ మునిఁగె గతచేతనుఁడై. 1210

ఆ. అపుడు కైక దక్క నందఱు రాణులు
నినునిఁ జుట్టిముట్టి యేడ్చుచుండ
నంతిపురము నిండె హాహారవములు; సు
మంత్రుఁ డేడ్చియేడ్చి మ్రానుపడియె. 1211

## 35_వ సర్గము

### సుమంత్రుఁడు కైకను తిట్టుట

సీ. అంతలోననె తెల్వినంది సుమంత్రుండు
వగ నొందు రాజు నవస్థ గాంచి
తల విదుర్చుచు నూరుపులను వెలార్చుచు
పాణులు బిగియించి పండ్లుగొఱికి
యొదవిన కినుకచే నొడ లెల్ల వడఁకంగఁ
గను లెఱ్ఱవాఱ మొగంబు గందఁ
గడువాఁడితూపుల గైకేయిహృదయంబు
వడఁకించి ఛేదించువాఁడువోలె

గీ. ములుకులం బోలు తులలేని పలుకుగములఁ
గొలిపి యామె జీవంబులఁ గలఁచిఁ వైవఁ
బట్టి పల్లార్చి గుట్టెల్లఁ బయటఁబెట్టి
భయము విడనాడి యిట్లని పలుకఁ దొడఁగె. 1212

క. సకల చరాచరజీవుల
నకలంకత నేలుపతినె త్యజియించిన నీ
కిఁక నెందుఁ జేయనేరని
యకార్య మేమైన నుండునా కైకమ్మా? 1213

గీ. ఇంద్రువలె నజేయుండు గిరీంద్రుకరణి
నచలు డబ్ధీంద్రుపోలిక నక్షుభితుఁడు
నగు పతినె చెట్టసేతఁల నడలఁజేయు
నీవు పతిహంత్రిణివిఁ కులఘ్నివియుఁ గావె? 1214

గీ. వరదుఁడగువాని భరియించువానిఁ బతిని
దశరథుఁ బరాభవింపఁగాఁ దగదు నీకు;
బతిహితవ్రతాచరణమే సతుల కెందుఁ
గోటితనయుల కంటె నెక్కుడగుఁగాదె! 1215

క. జననాథు ననంతరమునఁ
దనయులు జ్యేష్ఠానుసరణి ధరనేల దగున్;
ఘనుఁడగు రాముని నైష్ఠ్యా
తుని యెడఁ దత్ప్రథముఁ దప్పఁ గోరుటఁ దగునే? 1216

క. నీ తనయుఁడు భరతుండె ధ
రాతలఁ మేలుకొనుఁ గాత రాజగు గాతన్
సీతాపతితోనే చని
యాతం డెందున్న నుందు మందఱ మచటున్ 1217

క. పేరాసఁ జేసి యింతటి
ఘోరాచరణంబుఁ జేయఁ గోరితిఁ గానన్
నీ రాజ్యంబున నిఁక స
త్పూరుషుఁ డొకడైన నిలువఁబోఁవడు సుమ్మా! 1218

క. నీ వొనరుచు దుష్కృతికై
భూవలయం బిపుడె పగిలిపో దేమనుచున్?
గేవల మిది యొకవింతగ
భావించుచు నుంటి నింతపాపము గలదే? 1219

ఆ. బ్రహ్మఋషుల శాపభాషలు ధిక్కృతుల్
భీకరంబు లగుచుఁ బిడుగులట్లు
లడవులకును రాము వెడలించు నీ క్రూర
చిత్త కర్త్రిశిక్ష సేయ వేమి? 1220

గీ. గొడ్డటను దీయమామిడి గొట్టివైచి
చేఁదువేపకుఁ నచ్చటఁ బాదుచేసి
క్షీరములువోసి యెంతపెంచినను వాని
నాల్కు తీపినిగనునె యేనాటికైన? 1221

క. నీ కులశీలము లెఱుఁగుదుఁ
గైకా! నీ తల్లిపోలికయె నీ కొదవెన్;
లోకమున వినమె వేమునఁ
గాకోలమెగాని తేనె గాఱ దటంచున్. 1222

సీ. కైకేయి! నీ తల్లి కఠినదుశ్చేష్టల
నన్నింటి మును వినియున్నవాఁడ
నీ తండ్రి కొకయోగి నిఖిలజీవులభాష
లెఱుఁగంగ నుత్తమవర మొసంగె
క్షితిపతి యొకనాఁడు చీమ పల్కినపల్కు
విని పకపక నవ్వుకొనుచు నుండ
నది చూచి నీ తల్లి యప్పుడు కోపించి
యిట్టి నీ పరిహాస మేటి కనియె

గీ. నది యెఱింగింప మరణింతు ననియె రాజు
వినుపకుండిన నేఁ జత్తు ననియెఁ రాణి
ఆ వరదుఁ జేరి కర్తవ్య మడిగె రాజు
వినుపఁ దగ దామె చచ్చుఁ గా కనియె యోగి. 1223

క. తన గురుని యాజ్ఞ విని నీ
జనకుఁడు నీ జననిమాట సరకుగొనక జీ
వనము నిలుపుకొని సుఖవ
ర్ధనుఁడై హర్షమున నుండె రారాజు క్రియన్. 1224

ఆ. అట్టి తల్లిబిడ్డ వగు నీవు నిప్పుడు
పాపమనని దుష్టపథముఁ బట్టి
పతిని మోసపెట్టి యతని నసత్కార్య
కరణమునకుఁ ద్రిప్పఁ గలిగినావు. 1225

ఆ. తండ్రిగుణము లొదవుఁ దనయుల కనుచును
తల్లిగుణము లబ్బుఁ దనయుల కని
లోకులాడు మాట నా కెఱుంగఁగ వచ్చె
నిక్కమైన దనుచు నిన్నుఁ బట్టి. 1226

క. దేవి! నీ వా దారిని
బోవక పతివచనములను బుద్ధి నిలిపి దుః
ఖావిలచిత్తులఁ బ్రజలం
బ్రోవుము నీ కింతకంటెఁ బుణ్యము గలదే! 1227

క. దేవేంద్రసమప్రభుఁడగు
భూవిభు నీ విభు నధర్మమునఁ బడద్రోయం
బోవకు పాపుల నడవినఁ
బోవకు దుర్నయము చేయఁ బోవకు తల్లీ! 1228

క. శ్రీయుతుఁ డనఘుఁడు రాజీ
వాయత నయనుండు దశరథావనిపతి నీ
కీ యెడఁ జేసిన బాసన్
ద్రోయునె? నీవె పతిమతికిఁ దోడ్పడవలయున్. 12

క. కావున జ్యేష్ఠు వదాన్యుని
పావనచరితుని స్వధర్మపరు సత్యనిధిన్
జీవదయాళుని రాముని
నీవే పట్టాభిషిక్తునిం జేయఁదగున్ 12

ఆ. తండ్రియైన ప్రభుని దశరథు నెడఁబాసి
యడవులకును రాముఁ డరిగెనేని
నీకు మోయరాని నింద నెత్తినిఁ బడు
నన్నమాట తెలియ వైతి వేమి? 12

ఆ. చిత్తమును గలంచు చింతలెల్లను వీడి
రాజ్య మేలనిమ్ము రామచంద్రు
నాతఁ డడవిఁ బట్టియరుగ నయోధ్యలో
నొక్కజీవియైన నుండఁబోఁడు. 12

క. శ్రీరాముఁడు యువరాజై
ధారుణిఁ బాలించుచుండ దశరథుఁడు కులా
చారానుసారియై స్వీ
కారముసేయఁదగుఁ గాదె గహనవ్రతమున్.” 12

క. అని యిట్లు సుమంత్రుఁడు సాం
త్వనములు పరుషములునైనవాక్యంబులతో
జనవిభుసభ గైక మన
మ్మును దూలిచి యుఱకనిలిచె మోడ్పుంగేలన్. 123

ఆ. అట్లు తండు నొవ్వ నాడిన వేఁడిన
గలఁగలేదు; వంతఁ గాంచలేదు;
మొగము బిగియఁజేయు మోడి వీడఁగలేదు
కైకరాతి గుండె కరఁగ లేదు. 1235

## 36-వ సర్గము

### దశరథుఁడు సర్వసైన్యమును ధనమును రాముని వెంట నడవికి పంపు మనుట

క. అమ్మహిపతి యంతయు విని
యుమ్మలికం జెంది యూర్చి యొసఁగిన వరదా
నమ్ము సడలింప నేరక
క్రమ్ముకొనిన వంత మంత్రి గని యిట్లనియెన్. 1236

సీ. "సురుచిర ధనరత్న శోభితకోశముల్
చతురంగబల సర్వసైన్యములును
చతురభాషిణులు వేశ్యాసుందరీమణుల్
వరపదార్థసమృద్ధవైశ్యవరులు
రామోపజీవులై రామాంగరక్షులై
విశ్వాసపాత్రులౌ వీరవరులు
నాగరుల్ శకటముల్ నానాయుధంబులు
వనపథదర్శక వ్యాధ గణము

గీ. నడవులకు రాముతోఁ గూడ నంపు మిపుడె
యాతఁ డట సుఖంబుగ వేఁటలాడుకొనుచు
దేనెలానుచు రమణీయదృశ్యములకుఁ
బ్రియముపడి రాజ్యమును విస్మరింపఁ గలఁడు. 1237

క. నీ మూలధనము ధాన్యము
రామునితోఁ బంపుఁ మఱఁ దరణ్యమున ఋషి
గ్రామణులతోడఁ బావన
భూముల వ్రతదానధర్మముల సుఖి యగుతన్. 1238

క. భరతుండు మహాబాహుఁడు
పరిపాలనఁ సేయుఁ గాతఁ బ్రభుత నయోధ్యన్
బరమార్థసంపదలతోఁ
జరితార్థుని రాము నంపఁ జను వనమునకున్." 1239

క. అని యిట్లు చెప్పుచుండఁగ
విని కైక భయంబునంది విహ్వలమతియై
తన నాథుని గనుఁగొని యి
ట్లనియెన్ నుడి తడఁబడంగ నాత్రముతోడన్. 1240

ఆ. "సాధుశీల! యింకఁ జాలు నీ మాటలు
క్రోలి విడుచు కల్లుకుండఁ బోలి
సంపదలును సిరులు జను లెవ్వరును లేని
యీ యయోధ్య భరతుఁ డేలుకొనునె?" 1241

చ. అనియిటు సిగ్గువీడి బదులాడిన కైకకఠోరవాక్యముల్
విని సహియింపలేక పృథివీపతి రోషకషాయితాక్షుఁడై
నను నిఁక బాధపెట్టుకు ఘనమ్మగుఁ భారము మీఁదఁబెట్టి యో
మనుజపిశాచి మున్నడుగమానిన విప్పుడు గోరవచ్చునే." 1242

క. అని క్రోధమున నదల్పఁగ
ధనవిభుఁ డీ నెపమువెట్టి తన కోర్కులు వ
మ్మొనరింపఁ జూచె నన్నుచున్
గన లినుమడిగాఁగ మరలఁ గైక యిటు లనెన్. 1243

క. నీ వంశీయుండగు సగ
రావనిపతి జ్యేష్ఠతనయు నసమంజుని ము
న్నేవిధి నడవుల కంపెనొ
యా విధి నా రాముఁ డిప్పు డరుగంగఁ దగున్." 1244

క. నావుడు నరపతి యామెను
దీవరముగఁ దిట్టె; సన్నిధిం గలవా రె
న్నోవగల నేవగించిరి
యావంతయు నాఁటు వయ్యె నవి కైకమదిన. 1245

క. అపు డచట నున్నవృద్ధుఁడు
నృపుని హితుఁడు సచివవరుఁడు నిర్మలమతి ని
ష్కపటుండగు సిద్ధార్థుఁడు
కుపితమతిన్ గైక సరకుగొన కి ట్లనియెన్. 1246

సీ. "అక్కటా! దేవి! యి ట్లనఁగ నో రెట్లాడె
నసమంజుతోఁ బోల్ప నగునె రాము
దుర్బుద్ధి యాతండు తోడిపిల్లల నెల్ల
సరయూనదిని ద్రోసి చంపుచుండ
భరియింపఁ జాలక ప్రజలెల్ల వగఁ గుంది
పృథివీశునకు మొఱవెట్టుకొనగ
సగరుండు చింతించి జనహితం బూహించి
ధర్మాత్ముఁ డతఁ డగ్రతనయు నప్పు

గీ. డూరి కిఁక జీవితంబునఁ జేరకుండఁ
గట్టుబట్టతోఁ ద్రోయించెఁ గాననముల;
కట్టులే పాప మెఱుఁగని యట్టి రాము
వనికిఁ ద్రోవంగ నేమంత వచ్చెనమ్మ? 1247

గీ. అమలతేజోవిరాజి శశాంకునందు
నెట్టికల్మషమేని చూపట్టునట్లు
ప్రకట సుగుణాభిరాము శ్రీరామునందు
నే యవగుణంబు గానమే మింపుకైన. 1248

ఆ. కోసలాత్మజాత కొడుకు రాఘవునందు
దోస మింత నీకుఁ దోచెనేని
చూపి రూఢిగా నిరూపించెదవు గాక
వనికి నపుడు పంపవచ్చుఁ గాక! 1249

ఆ. నిత్యసత్యనియతు నిర్దుష్టచరితు ని
ర్హేతుకముగఁ జెఱుప నెంచునట్టి
వాఁడు శక్రుఁడైన వాని సంపద లెల్ల
బూదియై నశించి పోవుఁగాదె! 1250

క. కావున దేవీ! రాఘవు
శ్రీవంచితుఁ జేయఁబోకు; చేసినచో నీ
వా వల నిఁకఁ ద్రోవంగా
లేవు సుమీ లోకనింద లేశం బైనన్." 2251

క. అని సచివుఁడు సిద్ధార్థుఁడు
వినయము నయ మెనయఁ బలుక విని దుఃఖితుఁడై
జననాథుఁడు గైకేయిం
గని సన్నయెలుంగు చెదరఁగా నిట్లనియెన్. 1252

ఆ. "ఇతఁడు చేయుబోధ మతి కెక్కలేదె? నా
హితము నీ హితంబు నెఱుఁగకుండ
దుష్పథంబుఁ బట్టి దుశ్చేష్టితములతో
సాధుపథము దప్పి చనెదె! చెనఁటి? 1253

గీ. శ్రీయు రాజ్యంబు సుఖముఁ బరిత్యజించి
చనెద నే నిప్పుడే రామచంద్రుతోడ
రాజు భరతుండుగా నీవె రాజ్య మంది
యెల్ల కాలంబు సుఖముగా నేలుకొనుము." 1254

# 37–వ సర్గము

## కైకను సుమంత్రుఁడు తిట్టుట
## సిద్ధార్థుని వచనంబు లాలకించి రాముఁ డనుట

గీ. అను నృపునిపల్కు మంత్రిబోధను గ్రహించి
గురుజనంబులకడ నడఁకువఁగ మెలఁగు
రామచంద్రుఁ డప్పుడు దశరథునిఁ గాంచి
వినయవినమిత గాత్రుఁడై యనియె నిట్లు. 1255

గీ. "భాగ్యమును వీడి భోగానుభవము వీడి
యఖిలసంగంబులను వీడి యాన వీడి
పండ్లు దుంపలు దిని వని బ్రదుకు నాకు
ననుచరులతోడఁ బనియేమి యవనినాథ! 1256

క. ఏనుఁగును దాన మిచ్చియు
దాని నడుమునందు మెఱయు దట్టిపయిన్ మో
హానం గుంది తపించెడు
వానిన్ లోకంబు వెఱ్ఱివాఁడను కొనదే? 1257

క. కావున సాధుజనోత్తమ!
భూవర! నాకేల? సైన్యములు వైభవముల్
నే విడిచితి నవి భరతున;
కీ విప్పుడు వల్కలముల నీఁదగు నాకున్. 1258

ఆ. కదలిపోవువాఁడ బదునాలుగేఁడులు
వనములను వసించువాఁడఁ గాన
మూలములకుఁ ద్రవ్వకోలయుఁ బండ్లకు
సన్నప్రేఁపపుటిక యున్నఁ జాలు." 1259

క. అన్నంత సిగ్గుమాలిన
చెన్నఁటి కైకేయి నారచీరలఁ గొని రా
మన్న కిడి కట్టుకొమ్మనె
నన్నా యని చూచువార లందఱుఁ గుందన్. 1260

గీ. పురుషోత్తముఁడగు రామమూర్తి యపుడు
దనకుఁ గైకేయి యిడిన వస్త్రములఁ గొనుచు
నుత్తమ దుకూల వసనంబు లుజ్జగించి
మునులపోలిక వల్కలమ్ముల ధరించె. 1261

ఆ. అన్నరాము వలెనె యా లక్ష్మణుఁడుఁ గూడఁ
దండ్రి నృపుని సన్నిధానమందె
లలిత మృదుల వసనముల నెల్లఁ ద్యజియించి
కఠిన వల్కలములఁ గట్టుకొనియె. 1262

గీ. అపుడు కౌశేయధారిణి యైన సీత
తానుఁగూడ న ట్లొనరించు తలఁపు తోడ
వల్కలమ్ములఁ గనుఁగొని వలను గన్న
యాఁడులేడినిఁ బోలి విహ్వలత నందె. 1263

చ. లలిత మనోహరాంగి శుభలక్షణ లక్షితఁ ధర్మశీల ని
ర్మల సుచరిత్ర పావని ధరాసుత జానకి కైక యిడ్డ వ
ల్కలములఁ గాంచి నెమ్మదిఁ గలంగఁగ సిగ్గిలి బెగ్గడిల్లి క
న్గలువల నశ్రులొల్క సురనాథనిభున్ విభుఁగాంచి నివ్వెఱన్. 1264

ఆ. "ఇట్టి నారచీర లే రీతిఁ దాల్తురో
కానలందు మౌనికాంత లెల్ల
నెఱుఁగ నైతి" నంచు నేమేమొ యనుకొంచుఁ
దెల్లపోయి సీత దిగులుచెంది. 1265

గీ. ఒకటి మెడఁజుట్టి చేత వేఱొకటి పట్టి
సిగ్గుపడి యూరకుండిన సీత దరిసి
యపుడె ధర్మాత్ముఁడగు రాముఁ డామెపట్టు
పుట్టమున వల్కలమ్మును బొందుపఱచె. 1266

క. పూతచరిత్రుఁడు రాముఁడు
సీతకుఁ దానట్లు నారచీరలు గట్టన్
జేతములు గలఁగఁ గనుఁగొని
కాతరలై యంతిపురపుఁ గాంతలు వగలన్. 1267

క. "ఓ తండ్రీ! వనవాసము
నీ తండ్రి యనుజ్ఞచేసె నీ కొక్కనికే
సీతకుఁ గాదోయీ! యీ
క్ష్మాతనయకు నారఁగట్టఁగాఁ దగదోయీ! 1268

ఆ. జనకుశాసనమున వనముల కీ వేగి
వ్రతముదీర్చి మరల వచ్చుదాఁకఁ
బ్రీతి నిన్నుఁ బోలి సీతను గాంచుచు
నేము సుఖము గాంచనిమ్ము వత్స! 1269

ఆ. రామచంద్ర! నీవు సౌమిత్రితోఁ గూడి
వనములకును బోయివత్తు గాక!
దారుణాటవులను దాపసాంగనఁ బోలి
మంగళాంగి సీత మసలఁ గలదె? 1270

ఆ. పాడిదప్పనట్టి వాఁడవు నీవు మే
ముందు మన్న నిచటు నుండఁ బోవు
కాన నిపుడు సీత నైన నిందుంచి మా
యభిమతంబుఁ దీర్ప నగును దనయ !" 127

క. అని యిటు రాజాంతఃపుర
వనితలు వాపోవ విననివాని కరణి న
వ్వనచేలంబును రాముఁడు
తనవలె శుభశీలయైన తన్వికిఁ గట్టెన్. 127

**అది చూచి వసిష్ఠుఁడు కైకను దిట్టుట**

ఆ. సీత యిట్లు నారచీరలు దాల్పఁగాఁ
గని నిరాకరించి కినుక గదుర
దశరథుని గురుండు ధర్మిష్ఠుఁడు వసిష్ఠుఁ
డపుడు కైకఁ గాంచి యనియె నిట్లు. 127

ఆ. "మేరమీరి తిరుగఁ గోరకు మో కైక !
కుమతి వగుచు నీవు కులముఁ జెఱిచి
వరదు మోసగించి వరములఁ గొన యమ
ర్యాద దెచ్చు దారిఁ బోధు వేల? 127

క. ఈ సీతాదేవికి వన
వాసముతో నేమిపని యవశ్యము పతి సిం
హాసనముం గైకొని నయ
శాసనమునఁ బ్రజల నేలఁ జను నికఁ గైకా! 127

క. శ్రీరాము నాత్మయగు నీ
ధారుణిసుత సీత యిపుడు ధర నేలుకొనున్
దారపతిగ్రహులగు సం
సారుల కందఱకు భార్య సామేను గదా! 127

గీ. ఇపుడు వైదేహి రాము నాత్మేశుఁ గూడి
విపినవాసంబె కావింప వెడలు నేని
యరిగెదము వారివెంట మే మందఱమును
గలసి పట్టణ మంతయుఁ గదలిపోవు. 1277

సీ. సీతతో వనికేగు శ్రీరామువెంటనే
సైన్యాధిపగణంబు సాగిపోవు
చతురంగబలములు సర్వసంపదలును
విపినంబులకు వారివెంటఁ బోవు
పరివారగణముతోఁ బురరాష్ట్రజనముతో
దశరథేశ్వరుఁడును దరలిపోవు
తపసివేసము దాల్చి తమ్ము శత్రుఘ్నుతో
భరతుఁ డగ్రజుఁ డేగు సరణిఁ బోవు

గీ. నపుడు దుర్మతివై యొంటి వైన నీవు
సంపదలులేని సిరిలేని జనములేని
పాదపాకీర్ణమైన యీ పాడునేల
నెల్లఁ గైకొని రాణివై యేలుకొనుము. 1278

ఆ. రాముఁ డేలనట్టి రాజ్యంబు వన మగు
రాముఁ డున్న వనమె రాజ్య మగును;
అట్టి రామచంద్రు ననుసరింపకయుండ
నెవఁడు నిలువఁ గలఁడు నీ యయోధ్య? 1279

ఆ. తండ్రి యొసఁగునట్టి ధరణిరాజ్యంబు నీ
కొడుకు భరతుఁ డేలుకొనఁగఁ బోఁడు.
అతఁడు దశరథునకు నౌరసుఁ డగునేని
నిన్నుఁ దల్లివలె గణింపఁబోఁడు. 1280

ఆ. భువిని వీడి నీవు దివి కెంత యెగసిన
నిన్ను మెచ్చఁ బోఁడు నీ సుతుండు;
జనక విమల వంశచరితంబు లెఱిఁగిన
భరతుఁ డెపు డధర్మ పరుఁడు గాఁడు. 1281

క. కావున భరతుఁడు రాముని
సేవించుచు నడవి నతనిచెంతనె యుండున్;
నీ విటు ప్రియపుత్త్రునకున్
గావించితి వప్రియంబె కైకా! తుదకున్. 1282

ఆ. మఱియు రాము వెంట నరిగెడు గోవులఁ
గరి తురంగ హరిణ ఖగకులముల
నతని పెంపుగన్న యవనీజములఁ గూడ
నేఁడు చూడఁ గలవు నీవు కైక! 1283

క. దేవీ! కోడలు సీతా
దేవికి మణిభూషణములు దివ్యాంబరముల్
నీ విపు డీయందగుఁ; దగు
నే వల్కము లీయ వరదు నిది కోరితివే? 1284

ఆ. రాజు నడిగి తీవు రామునే వని కంప
నతనిధర్మపత్నియైన సీత
యనవరత విభూషణాంగియై భర్తతోఁ
గలసియుండుఁ గాక కానలందు. 1285

క. పరివారజనంబులతో
వరభూషణ వసన వస్తువాహనములతో
నరుగం దగు వనములకున్
ధరణీవరజాత సీత తన నాథునితోన్." 1286

ఆ. రాజకులగురుండు తేజోవిరాజితుం
డవని సురవరేణ్యుఁ డగు వసిష్ఠుఁ
డట్లు చెప్పుచుండ నాలకించియు సీత
విభుమతాను కృతిని విడువ దయ్యె. 1287

# 38–వ సర్గము

## నారలు గట్టిన సీతను గాంచి అంతఃపుర స్త్రీలు విచారించుచు రాజును దిట్టుట

క. జనకజ సనాథ యయ్యును
ననాథవలె నారచీర లట్లు ధరింపన్
గని "యెంతచేటు దెచ్చితి"
వని నృపు నిందింపఁ దొడఁగి రంతిపురిసతుల్ 1288

క. ఆ నిందాఘోషలు విని
భూనాథుఁడు శోకదుఃఖపూర్ణహృదయుఁడై
మానిత ధర్మముమీఁదన్
మానప్రాణములమీఁద మమతలు వీడెన్. 1289

క. భూకాంతుఁడు దశరథుఁ డై
క్ష్వాకుఁ డపుడు వేడియూర్పుగాడ్పు లెగయఁగాఁ
గైకం గని కోపముతో
"నా కోడలు జనకసుతకు నారలు తగునే? 1290

క. నిరత సుఖోచిత బాలిక
విరిబోఁడి మహీజ సీత విపినంబులలోఁ
దిరుగాడఁ దగని దని మ
త్పురోహితుఁడు గురుఁడు సత్యమునె వచియించెన్. 1291

ఆ. అకట! జనకనృపుని యాత్మజ యగు సీత
శ్రమణిఁబోలి వల్కలములు గట్టి
నేఁడు జనుల నడుమ నిశ్చేష్టయై నిల్చె
నీమె యెవరి కేమి యెగ్గుచేసె? 1292

ఆ. ఇట్టి ప్రతిన పూర్వ మేఁ జేసినది గాదు
వదలుఁ గాక సీత వల్కలములు;
సర్వవస్తువిభవ సహితయై సుఖముగా
నీమె రాము వెంట నేగుఁ గాక! 1293

ఉ. కాలము చేరువై యిటు లకార్యము చేసితి; సిట్టిచెట్టుకున్
మూలము నీవకావె? వెత ముంచితి విందఱఁ బాడిఁ; దప్పఁగాఁ
జాలక నేను నీ కిడిన సత్యము స్వీయసుమంబు వేణువుం
బోలి దహించుచుండె నను; మూఢపిశాచి! యిఁకేమిచేయుదున్?

ఆ. రామువలన నీకు నేమైన నెపుడైనఁ
గష్టమించు కంత గలుగుఁ గాక
యవనిజాత యేమి యపకృతి సేసెనే
కుటిలచిత్తురాల! క్రూరురాల! 1295

ఆ. అడవులకును రాము నంపుట చాలదే?
హరిణనయన సాధ్వి యనఘశీల
జనకసుతను గూడ ననుపఁగా వలెనె? నీ
యఘవిచేష్టితముల కంతులేదె? 1296

క. కనవచ్చిన శ్రీరాముని
గని యభిషేకంబు మాని కానల కేగన్
జను నంటివి; కాదంటినె?
జనకజ పేరెత్తినావె? సరియంటి నకే? 1297

క. బాస యటు లుండ నీ విప్పు
డీ సీతకు నారచీర లిచ్చుట మఱియున్
దోసముగాదే? దుష్కృతిఁ
జేసి నిరయమందుఁ గూలి చెడిపోయెదవే?" 1298

ఆ. అనుచు ధీరుఁ డయ్యె నవనీంద్రుఁ డేడ్చుచుఁ
బుత్త్రవిరహవశతఁ బొక్కిపొక్కి
యాత్మశోకమునకు నవధి గానఁగలేక
యడలి యడలి యార్తినవశుఁ డయ్యె. 1299

ఆ. అట్లు చెప్పిచెప్పి యాయాసఖిన్నుఁడై
తలను వంచియున్న తండ్రిఁ గాంచి
యడవి కేగఁ బయనమై యున్న శ్రీరాముఁ
డంజలించి యిట్టు లని వచించె. 1800

## రాముఁడు తన తల్లిని యాదరముతోఁ జూడుమని చెప్పుట

గీ. "శీలవతి వృద్ధురాలు విశాలకీర్తి
నీకుఁ బట్టపు దేవేరి నాకుఁ దల్లి
యైన కౌసల్య నన్ను నెగ్గాడఁబోని
దాని మన్నింపఁ దగుఁ దండ్రి! ధర్మచరిత! 1801

ఆ. ఏకపుత్త్రు నన్ను నెడసి మున్నెన్నఁడు
చూచి యెఱుఁగనట్టి శోకజలధి
మునిఁగియున్న యామె ననునయింపుము; నేను
లేని లోటొకింత లేకయుండ. 1302

క. కరుణించి నీవు పరమా
దరమునఁ దిలకింప నేను దరి లేకున్నన్
మరణింపక నా రాకను
స్మరియించుచు బ్రదుకుఁ గాక మా తల్లి యిటన్. 1803

ఆ. నన్నుఁ బ్రేమఁ జూచు నా తల్లి కౌసల్య
యడవి కేను బోవ యడలి యడలి
ప్రబలశోకవశతఁ బ్రాణముల్ విడకుండ
నాదరించి ప్రోవ నగు మహీంద్ర!" 1804

## 39-వ సర్గము

క. అని విన్నప మొనరించుచు
దన సన్నిధి సీతతోడఁ దాపసవేషం
బున నున్న రామభద్రుని
గని దశరథుఁ డొల్లఁబోయె గతచేతనుఁడై. 1805

క. మునివేషధరుని రామునిఁ
గనఁజాలక బదులు చెప్పఁగాఁ జాలకయే
తనలోనె రామ రామా
యనుచుం బలవింపఁ దొడఁగె నవనిపుఁ డార్తిన్. 1806

క. "ఎందఱు తల్లులఁ దండ్రుల
నందనులకుఁ బాపి తొల్లి నవయించితినో
యెందఱి హింసించితినో
యందుల కిపు డొదవె నిట్టి యాపద నాకున్. 1807

చ. లలిత దుకూల భూషణములన్ ద్యజియించి తపస్విఁబోలి నా
రల నిటు గట్టుకొన్న రఘురాముని గాంచునవస్థ గన్న న
న్నిలు వడివీడి కైక తపియింపఁగఁ జేయుచు నున్నఁ బ్రాణముల్
కలఁగి తొలంగ వక్కటా! యకాలమునన్ మరణంబుగల్గునే? 1808

ఆ. స్వార్థపరతఁ గపటజాలంబు నిటు పన్ని
కష్టపెట్టు నొక్క కైకవలన
నేడ్వవలసి వచ్చె నిందఱికిన్ గూడ
నకట! దైవనియతి కడ్డు గలదె?" 1809

గీ. అనుచు నీ రీతి నధికదుఃఖార్తుఁ డగుచుఁ
గన్నుఁగవ బాష్పపూరముల్ గ్రమ్ముకొనఁగ
నొక్కమాఱె రామా యని యూర్పు విడిచి
మరల మాటాడలేఁడయ్యె మనుజవిభుఁడు. 1310

ఆ. నృపవరేణ్యుఁ డట్లు నిశ్చేష్టుఁడై యుండి
కొలఁది సేపటికిని తెలివి నంది
కనుల నశ్రు లొలక గద్గదకంఠుఁడై
సూతుఁడగు సుమంత్రుఁ జూచి పలికె. 1311

ఆ. "వేగ మేగి నీవు విమలాశ్వములఁ బూన్చి
స్వారి దిరుగఁ దగిన తేరుఁ దెచ్చి
సాధుశీలు రాము జనపదసీమల
కవలదాఁకఁ జాగనంపి రమ్ము. 1312

క. తలిదండ్రులే స్వయంబుగఁ
గులదీపకు విక్రమాఢ్యుఁ గొడుకు నడవికిన్
దొలఁగింప వలసె నక్కట!
ఫల మిదె యనుకొందు ధర్మపరుల నియతికిన్." 1313

ఆ. అను నృపాజ్ఞ సూతుఁ డరదంబు గొనివచ్చి
రాము నెదుట నిల్చి కై మొగిడ్చి
"స్వర్ణమయ రథంబు జవనహయంబులఁ
బన్ని తెచ్చితి" నని విన్నవించె. 1314

గీ. నృపుఁ డపుడు దేశకాలజ్ఞు నిశ్చయాత్ము
సత్ప్రవర్తను విత్తసంచయ నియుక్తు
సర్వకోశాధికారిని సత్వరముగ
నటకు రావించి యిట్లని యానతిచ్చె. 1315

క. పదునాల్గేండ్లు ధరింపఁగ
విదేహనృపసుతకుఁ జాలు వివిధ విభూషల్
మృదులాంబరములుఁ దెచ్చిన
ముదలం గొనితెచ్చి యతఁడు భూమిజ కిచ్చెన్. 1816

ఆ. అడవి కేగఁ బయనమైన యా సుందరి
విమల వసన భూషణములఁ దాల్చి
స్వీయకాంతి మెఱయఁ జేసి సంతపురంబు
నుదయభానుకాంతి చదలఁబోలె. 1817

గీ. సదమలాచారవతియగు జనకతనయ
నత్తయగు కోసలాత్మజ యపుడు గాంచి
వేగ దరిఁ జేరి తూరిమిఁ గౌఁగిలించి
శిరము మూర్కొని యిట్లు వచింపఁ దొడఁగ. 1818

గీ. "అసతు లెప్పుడు ప్రేమఁ ద మ్మాదరించు
పతులచే నీప్సితార్థ సత్కృతులఁ గనియు
వారలకుఁ గష్టకాలంబు వచ్చినపుడు
గౌరవింపఁగఁ బోరు లోకమున నెందు. 1819

క. కలిమిగలనాఁడు భర్తల
వలనన్ మును సౌఖ్యమంది వారలు నిడుములన్
దొలఁగుదురు గుమతులై యు
వ్వలఁ ద్రోయుట నైజగణము వనితల కెందున్. 1820

గీ. కాంత లెప్పుడు పాపసంకల్పమతులు
గూఢహృదయులు చంచలల్ కుటిలశీల
లెంత యనురాగమునఁ జూచు కాంతునైన
నింతలోనె విరక్తలై యేవగింత్రు. 1821

క. తలఁపరు కుల మపకారము
దలఁపరు గౌరవము విద్య దలఁపరు ధనమున్;
జెలువల మనసులు గడుఁ జం
చలములు వారలను నమ్మఁ జన దెయ్యెడలన్. 1322

ఆ. సత్యమును శ్రుతంబు శమము సౌశీల్యంబు
గలుగు సాధ్వులైన కాంతలకును
వాంఛనీయములగు వస్తు లన్నిటికంటెఁ
బరమగతి దలంపఁ బతి యొకండె. 1323

ఆ. కానఁ గాననుండు వాని నా నందను
రాముఁ జులకసేయరాదు నీకు
నురుధనాఢ్యుఁడైన నిఱుపేదయైనను
నతఁడె నీకు దైవ మగును గాక!" 1324

గీ. అనుచుఁ గౌసల్యచేయు ధర్మార్థబోధ
లాలకించి విదేహనృపాత్మజాత
యంజలి ఘటించి యత్తకు నభిముఖి యయి
వినయ మృదుభాషణంబుల ననియె నిట్లు. 1325

ఆ. "పూజ్యురాల! నీవు బోధించి యిపుడు నా
కానతిచ్చినట్లె యాచరింతుఁ;
బతులఁ గొలుచు సతుల పరమధర్మములు నే
వింటి మున్నె పుట్టినింటియందు. 1326

ఆ. దేవి! నీవు దుస్స్వభావలౌ సామాన్య
తరుణు లట్లు నన్నుఁ దలఁప వలదు;
చంద్రు నెడయనట్టి చంద్రికయుంబోలి
ధర్మపథము నేను దప్పఁబోను. 1327

ఆ. తీఁగ లేకవీణ మ్రోగంగ రాదు చ
క్రంబులేక రథము గదలఁ బోదు
సుతులు నూర్గు రున్న సుదతి యెక్కింతైనఁ
భర్త లేక సుఖముఁ బడయ లేదు. 1328

క. పితరులు సుతులును నెప్పుడు
మితముగనె యొసంగుచుంద్రు మెలఁతల కెందున్;
మితిలేని సుఖము లొసఁగెడు
పతిఁ గొలువక యెట్టులుండుఁ బడఁతి యసతియై? 1329

గీ. అమ్మ! యిట్టిపతివ్రతనైన నన్ను
వరసతీ ధర్మములు విన్న గఱిత నన్ను
నించు కంతైన మది సంశయింప వలదు
సతికిఁ బతియె ప్రత్యక్షదైవతము గాదె!" 1330

గీ. అనుచు హృదయంగమంబుగా నాడినట్టి
సీత పల్కులు విని సత్యశీలయైన
రామజననియు త్రి దుఃఖహర్షంబు లొలయ
వెడఁదకన్నుల నశ్రువుల్ విడువఁ దొడఁగె. 1331

ఆ. అపుడు ధర్మనిరతుఁ డగు రాముఁడందఱు
తల్లులందుఁ బూజ్యతను వహించు
జనని కోసలాత్మజకు మ్రొక్కి వలగొని
యంజలించి యిట్టు లని వచించె. 1332

క. "జననీ! దుఃఖింపక నా
జనకుని సేవించుకొనుచు జరుపుము దినముల్;
జననీజనకులఁ గొలువఁగ
వనవాసము దీర్చి వేగవచ్చెద నిటకున్. 1333

ఆ. ఇట్టి తిరిగిపోవు నీరేడువర్షముల్
కలను గడచిపోవు కాలమట్టు;
లపుడు పూర్ణకాముఁడై వచ్చు నను సుహృ
ద్వరసమేతుఁ బ్రీతి నరయఁ గలవు." 1334

క. అని రాముఁడు వినయంబున
జనని ననునయించి యట్లె సంతాపమునన్
మునిఁగిన మున్నూరేఁబది
జననుల నీక్షించి పలికె సాంజలి యగుచున్. 1335

ఆ. "కలసి మెలసి చనవుకలిమిచే నెపుడైన
నెఱిఁగియుండియైన నెఱుఁగకైన
నెగ్గులాడియుంటినేని నన్ను క్షమించి
వీడుకొలుప రమ్మ! వెడలి పత్తు." 1336

ఆ. ధర్మసమ్మతముగఁ దనయుఁ డిట్లు వచింప
నాలకించి విహ్వలాత్మ లగుచు
రాముఁ జెల్లఁ గలఁగి క్రౌంచీస్వనంబుల
నేడ్వఁ దొడఁగి రప్పు డెలుఁగు లెత్తి. 1337

ఆ. మురజ పణవనాదముల విలసిల్లెడు
దశరథావనీశు ధామ మపుడు
ఘోర శోక విలప సురవంబులతోడ
వ్యసన దుఃఖ వికల మగుచు నుండె. 1338

## 40-వ సర్గము

క. రాముండును జానకియును
సౌమిత్రియు నపుడు భక్తి సాంజలు లగుచున్
భూమిపు దశరథు వలగొని
యామంత్రణమును గ్రహించి రాతసిచేతన్. 1339

ఆ. అట్లు తండ్రిసెలవు నంది ధర్మజ్ఞుఁడు
శ్రీరఘూత్తముండు సీతతోడ
నరిగి దుఃఖవివశుఁడై తల్లి కౌసల్య
పాదపద్మములకుఁ బ్రణతుఁ డయ్యె. 1340

గీ. మఱియు రాముని వెనుక లక్ష్మణుఁడు నపుడు
జననికౌసల్య చరణాంబుజముల కెఱఁగి
తనకు జనయిత్రి యగు సుమిత్రను గూడ
వరుసఁ గావించె పాదాభివందనములు. 1341

ఆ. అట్లు ప్రణతుఁడైన యాజానుబాహునిఁ
బుత్రు లక్ష్మణుని సుమిత్ర యపుడు
చేరఁ దీసి యేడ్చి శిరమును మూర్కొని
హితముఁ గోరి యతని కిట్టు లనియె. 1342

ఆ. ప్రియజనంబు నెపుడుఁ బ్రేమింతు వడవులఁ
బట్టి తిరుగుకొఱకె పుట్టితీవు
తనయ! యన్న కడవివిహారుల నేమి యపా
యంబు గలుగకుండ నరసికొనుము. 1343

క. క్షేమముల గలుముల నొందును
రాముఁడె నీ కెప్పుడును శరణ్యుఁడు; జ్యేష్ఠుని
ప్రేమ ననుజుండు గొలుచుట
యీ మహి సత్పురుషధర్మ; మిది నీకుఁ దగున్. 1344

క. దానమును యజ్ఞదీక్షయు
మే నాజిన్ వీడుటయును మీ కులవృత్తు
లైన సనాతన ధర్మం బో
నందన! యిదియు నీకు నుచితము కాదే?" 1345

ఆ. రాముఁ డన్న నెంతొ ప్రేమించు వానిని
గాన కరుగ సిద్ధమైన వాని
దనయుఁ గని సుమిత్ర "వని కేగు
లక్ష్మణా! యేగి ర"మ్మటంచు హెచ్చరించె. 1346

ఆ. "అనఘు రాము దశరథునిగ సేవింపుము
మహిజ గొలువు మాతృమాత గాఁగ,
దండకావనంబు దలఁపు మయోధ్యగాఁ
బుత్ర! సుఖము గాఁగఁ బోయిరమ్ము." 1347

క. సారథి సుమంత్రుఁ డప్పుడు
శ్రీరాముని కంజలించి సిద్ధపఱచితిన్
దేరని వచియించి సురా
సురునికడ మాతలి వలెఁ జెంత వినతుఁడై. 1348

క. "నే రారోహింపం దగు
నో రాజకుమార చంద్ర! యురుతరకీర్తి!
శ్రీరామా! నీ యనుమతి
మేరకుఁ గొనిపోయి విడుతు మిము వేగముగన్. 1349

ఆ. దేవి కైకయాజ్ఞ నీ వేగి పదునాల్గు
సమలు కాన నుండఁ జనుసు గాన
నట్టి కార్యములకు నాయత్తపడుమింక
రఘుకులాబ్ధిచంద్ర! రామచంద్ర! 1350

ఆ. అనిన యంతనే వరారోహ యగు సీత
నైజవిమలభూషణములఁ దాల్చి
హర్షచిత్త యగుచు నారోహణ మొనర్చె
భానుకాంతినిభము భద్రరథము. 1351

ఆ. అంత నన్నదమ్ము లగు రామలక్ష్మణుల్
భూరి రత్న కనక భూషితంబు
ననలకాంతినిభము లైన స్యందనముపై
నధివసించి రిరువు రతిరయమున. 1352

చ. వని నివసింపఁగాఁదగిన వర్షములన్ గణియించి సీతకున్
జనపతి మామయిడ్డ వసనంబులు భూషణసంచయంబు న
య్యనఘులు రామలక్ష్మణుల కయ్యె యొసంగిన యాయుధంబు లుం
చిన యజినంపుఁ బుట్టికలుఁ జేర్చె సుమంత్రుఁడు స్యందనంబునన్. 1353

గీ. అపుడు సూతుండు నొగలిపై నధివసించి
యరదమున సీతతోడ ముప్పురినిఁ గాంచి
యనిలజవములు శుభలక్షణాంచితములు
నైన హయముల నదలించె నతిరయమున. 1354

గీ. గహన చిరవాసమునకు రాఘవుఁడు వెడలఁ
బనవి పరవశమైపోయెఁ బౌరజనము;
జానపదగణ మెల్ల మూర్ఛను మునింగె;
సేన చతురంగములతోడ భ్రమానుపడియె. 1355

గీ. వ్యాకులభ్రాంత పురజనాలోకితంబు
కుపిత మదమత్త కుంజరఘూర్ణితంబు
భూషితోద్భ్రాంత హయచయఘోషితంబు
నై క్షుభిత మయ్యె నపు డయోధ్యాపురంబు. 1356

ఆ. అపు డయోధ్యనున్న యాబాలవృద్ధులు
నధికదుఃఖపీడితాత్ము లగుచుఁ
బ్రభు కుమారువెంటఁ బడిరి తృషార్తులు
వారికొఱకుఁ బరుగువారనట్లు. 1357

ఆ. అరదమునకు వెనుక నవ్వాల నివ్వాల
ముందటను జనంబు మూఁగికొనుచు
మొగము లెత్తి యూర్పు లెగయ నశ్రులు జాఱఁ
బ్రభుకుమారుఁ గూర్చి పనవి రిట్లు 1358

ఆ. "పగ్గముల బిగించి పట్టి గుఱ్ఱంబుల
నరద మిపుడు నడపు మల్ల నల్ల
సూత! రామచంద్రుఁ జూతుము; మరల నె
ప్పటికిఁ గనులఁ బడునొ ప్రభుని మోము! 1359

క. దేవసమానుఁడు సుతుఁ డిపు
డా వనముల కేగుచుండ నరసియుఁ బగులం
బోవ దెడఁద కౌసల్యకు
దేవిహృదయ మినుమొ యేమొ తెలియక యుండెన్. 1360

క. నీడవలె నాత్మపతి వె
న్నాడి చనెడి సీత ధన్యరా లెయ్యెడలన్
వీడదు స్వధర్మ మింతయుఁ
బ్రేడిమలన్ వేఁడివెలుఁగు పగిది ననిశమున్. 1361

క. చరితార్థుఁడ వో లక్ష్మణ!
నిరతప్రియవాది దేవనిభు నగ్రజునిన్
బరిచర్యలఁ దనియించుచుఁ
బరమంబగు భక్తిఁ గొలుచు భాగ్యము గనుటన్. 1362

క. వదలక రాముని పదముల
సదమలమతి గొలువ నేగు సౌమిత్రీ! నీ
కిదె శ్రేయం బిదె ధర్మం
బిదియె తపస్సిద్ధి మార్గ మిదె సద్గతికిన్." 1363

క. అని యిట్లు ప్రలాపించుచుఁ
గనుదమ్ముల నశ్రువారి గడలుకొనంగా
జనులెల్ల రాము రఘునం
దను వెంటంబడిరి ప్రేమతత్పరమతులై. 13

గీ. అపుడు దుఃఖార్తలైన భార్యలను గూడి
విపులశోకోప హతుఁడైన నృపవరుండు
కన్నతండ్రిని శ్రీరాముఁ గాంతు ననుచు
నంతిపురినుండి వెలువడె నాత్రపడుచు. 13

క. కరిరా జాపదఁ బడఁగని
కరిణులు విభుఁ జుట్టి యేడ్చు కరణి దశరథున్
గిరికొని యేడిచి రంతః
పురభామిను లార్తనాదములు మినుముట్టన్. 13

క. శ్రీమంతుం డైక్ష్వాకుఁడు
రామజనకుఁ డపుడు నృపుఁడు రహితస్పృహుఁడై
భీమఫణిగ్రస్త సుధా
ధాము పగిది సత్త్వహీనతం గనుపట్టెన్. 13

ఆ. అప్రమేయ మహిమ్ముఁ డాఢ్యుండు శ్రీరామ
చంద్రుఁ డపుడు ప్రజల సందడిఁ గని
"వాగెలను సడల్చి వారు వంబుల దౌడు
విడువు" మంచు సూతు వేగిరించె. 136

ఆ. రథము దోలు మనుచు రాముండు త్వరపెట్టు
నాఁపు మనుచు జనము లాఁకపెట్టు
కళవళంబు నొంది కర్తవ్యమూఢుఁడై
సూతుఁ డొల్లఁబోయి చూడఁదొడఁగె. 136

క. శ్రీరాముఁ డరుగుచుండఁగ
పౌరజనులు వెంటనంటి పరువులు వారన్
ధారుణి నెగయు పరాగము
వారల ఘనదుఃఖ బాష్ప వారి నడంగెన్. 1370

ఆ. ప్రభు కుమారుఁ డట్లు పయనమై చనుచుండ
నపుడు రాజధాని య య్యయోధ్య
'హా'రవాకులంబు నశ్రుసంసిక్తం బ
చేతనము వ్యథాభిభూత మయ్యె. 1371

క. తలఁగని దుఃఖశ్రమచే
గలఁగిన పురసతుల కనులఁ గన్నీ రొలికెన్
జలగత మీనక్షోభన్
జలజంబులు వెలువరించు సలిలముభంగిన్. 1372

గీ. ఆ పురం బట్లు నైకకంఠ్యంబుగాఁగ
రోదనాక్రందనంబుల రోఁజుచుండఁ
గని విని నృపాలుఁ డపుడు ని ల్వునను గూలె
మొదలు తెగిపడ్డ ఫలవృక్షమో యనంగ. 1373

ఆ. అట్లు రాముఁ జూడ నరుగుచు దుఃఖార్తిఁ
బడినయట్టి భూమిపాలుఁ గాంచి
ప్రభుకుమారు వెనుకఁ బరుగిడు ప్రజల హా
హారవములు దెసల నలముకొనియె. 1374

క. కొందఱు రామునిఁ బేర్కొని
కొందఱు కౌసల్యఁ బేరుకొని యేడ్వంగా
నందఱు రాణుల ఘోరా
క్రందనముల నంతిపురము గగ్గో లయ్యెన్. 1375

క. వెనుదిరిగి యప్పు డా రో
దనఘోషము లాలకించి దాశరథి యటన్
దనుఁ జేర వచ్చుచుండెడి
జననీజనకులను గాంచి సంచలితుఁడై. 1376

ఆ. రాటఁ గట్టఁబడిన ఘోటక శాబంబు
కన్నతల్లి గాంచుచున్నయట్లు
ధర్మబద్ధుఁడైన దశరథరాముండు
కన్నవారిఁ గనుచు గలఁతపడియె. 1377

ఆ. నేలఁ గాలు మోప నేర కందలములఁ
దిరుగు సుఖులు కష్ట మెఱుఁగ రట్టి
రాజు రాణి గాంచి రాముండు "సూతుఁడా!
తురగములను వేగఁ దోలు" మనియె. 1378

ఆ. అట్టి దుఃఖితాత్ము లగు తల్లిదండ్రుల
నరవరుండు రాముఁ డరయలేక
బరియగోలపోటుఁ బడ్డ యేనుఁగుఁ బోలి
తాల్మి పల్లటిల్లఁ దల్లడిల్లె. 1379

ఆ. బిడ్డమీఁదిప్రేమ పిరిగొన వేగంబ
గోష్ఠమునకుఁ బోవు గోవులాగు
పదము దొట్రిలంగఁ బరువెత్తెఁ బ్రియసుతు
రథమువంక కపుడు రామమాత! 1380

శా. ఆ సమ్మర్దమునందుఁ దేరివెనుకన్ హా రామ! హా లక్ష్మణా!
హా సీతా! యని యంగలార్చుచు మహాయాసంబుతో నూర్చుచుం
గాసిం దూలుచుఁ గన్నుల శ్రు లొలుకంగాఁ బర్వున న్వచ్చు నా
గౌసల్యన్ జనయిత్రిఁ గాంచె నెద గ్రుంగన్ రాముఁ డుద్విగ్నుఁడై.

ఆ. రథము నాపు మనుచు రా జన, రాముండు
వేగ( దోలు మనుచు వేగిరింప
నపుడు సూతు హృదయ మల్లాడె విపరీత
చక్రయుగళి( జిక్కు చందముగను. 1382

క. జనవిభు నుడి వినరా లె
దన నైనన్ వచ్చు(గాని యక్కటకట! నా
జననీజనకుల దుఃస్థితి
గనలేనని రాము( డెంతొ కళవళపడుచున్ 1383

క. "వనటు(బడి నడచి వచ్చెడి
జననీజనకులనుజూడ( జాల సుమంత్రా!
చన నిమ్మరదము వేగం
బని రాము(డు హెచ్చరించె" నపు డాత్రముతోన్. 1384

ఆ. రాకుమారు నాజ్ఞ( గైకొని సూతుండు
వెంబడించు జనుల వీడుకొలిపి
సాగిపోవుచున్న జవనహయంబుల
పగ్గములు సడల్చి పఱవ( జేసె. 1385

ఆ. మరలు మొగముపెట్టు పురపరిజనములు
దశరథాత్మజుని( బ్రదక్షిణించి
వార లాగిరెట్లో; వంతయు( గన్నీరు
నా(గవయ్యె నెంత యడ(చుకొన్న. 1386

గి. "ఎవ(డు తిరిగిరా(గ నిచ్చగింతుమొ యట్టి
ప్రియుని దూర మనుసరింప( గూడ"
దనుచు సచివు లెల్ల నా రాజమౌళికి(
జెప్పి సమ్మతింప( జేసి రంత. 1387

క. మౌనం బెమ్మటఁ గ్రమ్మఁగ
దీనంబగు మొగముతో సతీమణితో భూ
జాని హితసూక్తి విని య
చ్చోనాఁగి కుమారువంకఁ జూచుచునుండెన్. 1388

## 41-వ సర్గము

ఆ. పురుషోత్తముండు శ్రీరాముఁ డా రీతి
వినతి నంజలించి వీడుకొనఁగ
నంతిపురపు సతులు హాహారవంబులు
చదలు ముట్ట నేడ్వఁ జాగి రపుడు. 1389

సీ. "ఎటు కేగుచున్నాఁడొ హీనదీనానాథ
తాపశోద్ధారి మా తండ్రి యిపుడు
ఎటు కేగుచున్నాఁడొ కుటిలకోపనివర్తి
సమవర్తియైన రాకొమరుఁ డిపుడు
ఎటు కేగుచున్నాఁడొ యీ తల్లి కౌసల్యఁ
గనునట్లు మముఁగన్న తనయుఁ డిపుడు
ఎటు కేగుచున్నాఁడొ యింతి కగ్గంబైన
రాజాజ్ఞ లోకశరణ్యుఁ డిపుడు

ఆ. సర్వజీవహితుఁడు సత్యవ్రతుండు స
ద్ధర్మనిరతుఁ డత్యుదారచరితుఁ
డైన రాము వీడనాడి తా నిపు డెంత
బుద్ధిహీనుఁ డయ్యె భూమిజాని." 1390

క. అని రాజాంగన లందఱు
ననుఁగుం బసిలేఁగ వీడు నావుంబలె రో
దన మొనరించిరి శ్రీరా
ముని వీడఁగలేక వంత ముప్పిరిగొనఁగన్. 1391

గీ. తనయవిరహాతిదుఃఖ సంతప్తుఁడైన
జనవిభుం డంతిపురినుండి వినఁగ వచ్చు
దారుణార్త రవములకుఁ దల్లడిల్లి
మఱియు నస్తోకశోకనిర్మగ్నుఁ డయ్యె. 1392

ఆ. అధిపసుతుఁడు రాముఁ డడవి కేగినచింత
వేల్వ రైరి వేది విప్రవరులు;
వంటమాని రింటివారలు; తమ పనుల్
జనులువీడి రంత నినుఁడు గ్రుంకె. 1393

ఆ. పాలు గుడుపవయ్యె పసిలేఁగలకు గోవు
లేమి మేయ వయ్యె సామజములు;
నెలమిఁ బొంద దయ్యెఁ దొలిచూలి మగబిడ్డ
గనిన నతియు నపుడు వనటఁ గుంది. 1394

సీ. కుజ బుధ గురులును గ్రూరగ్రహములుఁ ద్రి
శంకుతోడ శశాంకు సంక్రమించె
గ్రహతారకాళి నిర్గతకాంతి డిందె; వి
శాఖయు ధూమసంసక్త మయ్యె
తిమిరసంకులములై దెస లెల్ల నసి దప్పె
నుడుఖేటములతేజ ముడిగిపోయె
ఝంఝానిలోద్ధూత జలనిధినిం బోలి
యాపదఁబడె నయోధ్యాపురంబు

గీ. రామచంద్రవియోగ దుర్భరతఁ జిక్కి
పౌరు లాకస్మికంబుగాఁ బ్రతిభ దక్కి
శోకసంతప్తహృదయులై సొక్కి సుక్కి
తిండి త్రిప్పట విడి కలగుండువడిరి. 1395

ఆ. అపు డయోధ్యనున్న యఖిలజనంబులు
నఖిలదుఃఖపీడితాత్ము లగుచు
మట్టుమీరి వేఁడినిట్టూర్పు లెగయంగ
నాడిపోయెఁ దొడఁగి రవనినాథు. 1396

గీ. బాష్పపర్యాకులాస్యులై పథములందుఁ
గలఁగి తిరుగాడు ప్రజల నొక్కనికిఁ గూడ
హర్ష మనుమాట లేదయ్యెః నఖిలజనులు
విపుల శోకోగ్ర సంతాప వివశు లైరి. 1397

క. మెల్లఁగ వీవదు తెమ్మెర;
చల్లఁగ వెలుగంగఁబోఁడు చంద్రుఁడు; సెగలం
జల్లఁడు పవలిటి దొర; యిటు
లెల్ల జగము నొల్లబోయె నినకులుఁ డెడలన్. 1398

క. పిల్లలు దలఁపరు దల్లుల;
నిల్లాండ్రను బత్తులు దలఁప; రే బంధువు లే
నొల్లరు దలపఁగ నొండొరు;
నెల్లర హృదయములు రామునే వెనుకొనుటన్. 1399

క. శ్రీరామమిత్రు లెల్లరు
హా రామా! రామ! యనుచు నార్తిఁ బొగులుచున్
దారుణదుఃఖోపహతిన్
ధారుణిఁ బడి వివశులైరి తద్గతమతులై. 1400

ఆ. ప్రేమధాముఁడైన శ్రీరాము నెడఁబాసి
యార్త సుభటు సామజాశ్వమైన
యా యయోధ్య ఘోష నందెఁ; బర్జన్యుని
దక్కి నవయు భూతధాత్రిఁ బోలి. 1401

# 42-వ సర్గము

ఆ. రాముఁ డట్టులేగ రథగమనోద్ధూత
మగు రజంబు దోఁచునంతదాఁకఁ
గన్నుకొమరువంకఁ గాంచుచు దశరథ
మనుజవిభుఁడు కన్ను మలఁపఁ డయ్యె. 1402

క. *ఎందాఁక దశరథేంద్రుఁడు
నందను శ్రీరాము దెసఁ గనన్ దొరకొనెనో
యందాఁక భూపరాగము
గందోయికిఁ గ్రమసమృద్ధిఁ గన్పట్టుండెన్. 1403

ఆ. కొడుకు తేరిధూళిఁ గూడఁ జాలైనంత
నృపతి వంతగుంది నేలఁ బడగఁ
గాంచి రామజనని కౌసల్య వలకేలఁ
బట్టి లేవనెత్తెఁ బ్రాణవిభుని. 1404

ఆ. అపుడు భరతమాత యగు కైక దాపలి
ప్రక్క కేగి విభునిఁ బట్టఁబోవ
వినయ నయవిదుండు విమలధర్ముఁడు నృపుఁ
డిట్టు లనియె వ్యథితహృదయుఁ డగుచు. 1405

క. "నా కాంతగ నైనను దా
నీ కాంతగ నైన నిన్నుఁ జేకొన నింకన్
తాకం బోవకు నన్నున్
గైకేయీ! దుష్టురాల! కన నొల్ల నినున్. 1406

---

* పాఠాంతరము

క. ఎందాక భూపరాగము
కందోయిందోఁచి గగనగతమైనదియో
యందాఁక దశరథేంద్రుఁడు
నందను శ్రీరాముఁ దెస గనంగాఁ దొడఁగెన్. 1403

ఆ. నిన్నుఁ బట్టి బ్రదుకు నీ వారి కే రాజుఁ
గాను నాకు బ్రజలు గారు వారు;
కేవలార్థపరత నీ వధర్మిణి వైతి
నిన్ను విడిచినాఁడ నేటినుండి. 1407

ఆ. అగ్నిసాక్షికముగ నానాఁడు నీ పాణిఁ
బట్టి నట్టి ధర్మబంధకలన
నిహపరములఁ గల్గు నెల్ల సంబంధముల్
విడిచి త్రెంచి పాఱవేసినాఁడ. 1408

గీ. అవ్యయంబైన యీ రాజ్యమంది భరతుఁ
డెలమిఁ గనునేని పితృదేవతలకు నాకు
నతఁ డొసఁగు తర్పణాదికకృతులు మాకు
ముట్టరా కనర్థంబులై పోవుఁ గాక!" 1409

ఆ. అనుచుఁ గైకఁ దిట్టు నాత్మేశుఁ గౌసల్య
గాంచి యధికదుఃఖ కలిత యగుచు
నొడలిధూళి దులిపి యొయ్యన నతనితో
నంతిపురమువంక నరుగఁ దొడఁగె. 1410

ఆ. తపసిరూపుగన్న తనయునిఁ దలపోసి
ధర్మమూర్తి దశరథప్రభుండు
పరితపించె నగ్నిఁ బాటి ముట్టినయట్లు
స్వార్థపరత విప్రుఁ జంపినట్లు. 1411

గీ. అపుడు గౌసల్యతోఁ గూడి నృపుఁడు చనుచు
మాటిమాటికి వెనుకను మరలి కనుచు
దీనుఁడై దుఃఖవశత నిస్తేజుఁ డయ్యె
రాహు కబళితుఁడైన మార్తాండుఁ బోలి. 1412

క. అనుగుంగొమరునిఁ దలఁచుచు
వనటుంబడి కంది కుందు వసుధేశుం డూ
రినిఁ దాఁటి రాముఁ డేగుట
విని యిటు విలపించె దుఃఖవిహ్వలుఁ డగుచున్. 1413

ఆ. "రాముఁ గొనుచుఁ జన్న రథతురగంబుల
జాడ లివిగొ! కన్నవాఁడఁగాని
కన్నచిన్నికొమరుఁ గన్నారఁ దమిదీరఁ
గాంచు భాగ్య మేను గాన నైతి.  1414

చ. వెలఁదులు చామరంబులను వీవఁగఁ జందనచర్చితాంగుఁడై
లలిత దుకూల శయ్యలఁ దలాడలపై సుఖసుప్తిఁ గాంచు కో
మలతనుఁడైన మత్ప్రియకుమారుఁడు గానల రాయి రప్పయో
తలగడ గాఁగ నేలపయిఁ దా శయనించునె యక్కటక్కటా!

క. ధారుణిఁ బరుండి వగ ని
ట్టూరుపు లెగయంగ ధూళి యొడ లలమంగా
నా రాముఁడు లేచునొ? సెల
యేఱు కడఁ బరుండి లేచు నేనుఁగుబోలెన్. 1416

క. ఆయతబాహుఁడు జగతీ
నాయకుఁ డగు రాముఁ డిపు డనాథునివలె భూ
శాయి యయి లేచుఁబో న
య్యో! యని వనచరులు గాంతు రొకొ్కః యతనిన్. 1417

క. నియతసుఖోచిత జానకి
యరుగుచు నున్నయది కంటకాటవి; కెన్నం
డెఱుఁగని వనసత్త్వంబుల
యఱపులు విని యదరి బెదరదా? యకటకటా! 1418

క. నీ కోరిక యీడేరిన
దో కైకా! విధవ వగుచు నుర్వీతలమున్
గైకొని యేలుము; నే నా
శ్రీకరు శ్రీరాము విడిచి జీవింప నోఁకన్." 1419

క. అని విలపించుచు దశరథ
జననాథుఁడు మై సెమర్ప జనవేష్టితుఁడై
చనియె మృతస్నాతునివలెఁ
బనవుచు నిశ్శ్రీకమైన పట్టణమునకున్. 1420

సీ. జనులసందడి లేని చత్వరంబులతోడఁ
గళదప్పియున్న ముంగిళులతోడ
నడపొడ లేని దేవాలయంబులతోడ
గడియలువడిన యంగళులతోడ
తేజంబు దక్కిన రాజవీథులతోడ
బడుగులై మిగిలిన ప్రజలతోడ
రామా యనెడి పంజర శుకారవముతోడ
నంబా యనెడి గోకులార్తితోడ

గీ. జానకీరాములఁ దలంచి సంతసించు
ప్రాణిగణముతో వికలమౌ నా యయోధ్యఁ
గనుచు గృహముఁ బ్రవేశించె మనుజవిభుఁడు
జలదగర్భంబునం జొచ్చు సవితఁబోలి. 1421

క. సీతారామసుమిత్రా
సూతులు లేనట్టి నగరుసొచ్చి నృపుఁడు దుః
ఖాతిశయంబునఁ గంపిత
కాతర మంద్రార్ధహీన గళమునఁ బలికెన్. 1422

ఆ. "రామమాతయైన రమణి కౌసల్య శు
ద్ధాంతమునకు నిప్పు డరుగనుంటిఁ;
జేర్పుఁ డటుకు నన్ను శీఘ్రంబ; నా కింక
నొండుచోట శాంతి యుండఁబోదు." 1423

ఆ. అనిన ద్వారపాలు రల్లనఁ గౌసల్య
యంతిపురికిఁ జేర్చి రవనిపాలు;
నతఁడు తల్పశాయి యయ్యెఁ; నచ్చటుఁ గూడ
మనసు కుదుటపడక మఱిఁగఁ దొడఁగె. 1424

క. రాముండును జానకియును
సౌమిత్రియు లేనియట్టి సదన మతనికిన్
సోమకళాహీనం బగు
వ్యోమమువలెఁ దోఁచె దుస్తమోద్రిక్తంబై. 1425

ఆ. అట్టి భవనంబు గని దుఃఖ మాఁపలేక
చేయి పైకెత్తి దశరథక్షితివిభుండు
"నాయనా! పోవుచున్నావె నన్ను విడిచి
రాఘవా!" యని యుచ్చైస్స్వరమున నేడ్చె. 1426

ఆ. "ప్రేమధాముఁడైన రాముఁ డయోధ్యకు
వనమునుండి మరలివచ్చు దాఁక
బ్రదికియుండి యతనిఁ బరిరంభణముసేయు
పురుషవర్యు లెంతొ పుణ్యులో కద!" 1427

ఆ. అనుచు దుఃఖపడుచు నవనీతలేశుఁ డా
రాత్రి తనకుఁ గాళరాత్రి గాఁగ
సభయుఁడై నిశీథసమయానఁ గౌసల్యఁ
బట్టమహిషిఁ గాంచి యిట్టు లనియె. 1428

ఆ. "తనయు రామునంటి తరలెడి నా చూపు
మరగి మరగి తిరిగి మరలకుండె;
నిన్నె గనక యుండె; నీవైన నొకసారి
పాణి నంటి నన్నుఁ బలుకరింపు." 1429

ఆ. అనుచు సెజ్జనుండి యా రామచింతచేఁ
దల్లడిల్లు విభుని దటిసి దేవి
కెలనఁ గూరుచుండి కెంగేల స్పృశియించి
వెచ్చనూర్చి వెక్కివెక్కి యేడ్చె. 1430

## 43-వ సర్గము

### రాముని వడవికిఁ బంపిన కైక తన్నెంత బాధపెట్టునో యని కౌసల్య దశరథునితో ననుట

ఆ. అట్లు పుత్త్రశోకహతిఁ గుందు కౌసల్య
తల్పమందు శోకతప్తుఁ డగుచు
బడలియున్న భూమిపతియైన పతిఁ గాంచి
యెలుఁగురాలుపడఁగ నిట్టు లనియె. 1431

ఆ. "చిన్నిరామచంద్రు జీవనాళంబులఁ
వికట కపట కలుష విషము గ్రక్కి
కుబుస మూడ్చినట్టి కోడెత్రాచునుబోలి
భయముదీరి కైక బరి తెగించె. 1432

క. నట్టడవికి నా రాముని
నెట్టి రమణి కైక కోర్కె నెఱవేఱ నిఁకన్
నట్టింటిపామువలె భయ
పెట్టుచు నను నెట్టి బాధపెట్టఁ దలఁచెనో! 1433

ఆ. కానఁ ద్రోయుకంటె నా నందనుని రాము
దాసదాసునైనఁ జేసెనేని
భైక్ష్యవృత్తినైన బ్రదుకుచు నిచట నా
కనులఁ బడుచునుండుఁ గాదె కొడుకు? 1434

ఆ. పాడిదప్పి రాముఁ బదవికి నెడఁబాపి
యీవు దానిఁ గైక కిచ్చినాఁడ;
వాహితాగ్ని పర్వమందు హవిర్భాగ
మసురులకును స్వేచ్ఛ నొసఁగినట్లు. 1435

క. వీరుం డాయతబాహుఁడు
వారణగమనుండు ధన్వి వసుధాత్మజతో
ధీరుండగు లక్ష్మణుతో
ఘోరారణ్యంబులందుఁ గుందఁగ వలసెన్. 1436

ఆ. కపటచిత్తయైన కైకమాటలు విని
యెట్టి కష్ట మెఱుఁగనట్టి వారి
నడవి కంపినాఁడ వక్కటా! సుకుమారు
లెట్టు లుండఁగలరు నట్టడవుల? 1437

ఆ. ప్రాయమునకుఁ దగిన భాగ్యభోగంబుల
ననుభవింపఁదగిన యట్టివారిఁ
గానలకును ద్రోయ దీనులై దుంపలుఁ
బండ్లు దినుచు వారు బ్రదుకఁగలరె? 1438

ఆ. జనకజాతతోడ సౌమిత్రితో రాముఁ
డడవినుండి వచ్చునట్టి వేళ
శోక ముడుగువేళ శుభవేళ నిప్పుడే
భాగ్యవశత నేను బడయ రాదె? 1439

చ. కల గని మేలుకన్నటులె కాననవాసము దీర్చి వేడ్కతో
నలఘుపరాక్రమాఢ్యులగు నన్నయుఁ దమ్ముఁడు గూడి రాఁగ ము
త్పులకితగాత్రులౌ ప్రజలతో ధృతకేతుపతాకపాళితోఁ
గలకలలాడు నిప్పురము గ్రమ్మఱఁ గన్గొను టెన్నఁడో గదా! 1440

ఆ. వనమునుండి తిరిగివచ్చిన పురుషసిం
హులను రామలక్ష్మణులను గాంచి
పర్వదినమునందుఁ బాథోనిధిం బోలి
యీ యయోధ్య యెప్పు డెలమి గనునొ? 1441

ఆ. స్యందనమున ముందు జానకి చెలువంద
బాహుబలుఁడు రామభద్రుఁ డెలమి
గోవువెంటవచ్చు గోరాజ మట్టు లీ
పట్టణంబుఁ జేరు భాగ్య మెపుడొ? 1442

క. అరి దమనులు నా కొమరులు
మరలఁ బురికి రాఁగ రాజమార్గమునఁ బ్రజల్
విరులున్ సేసలు చల్లుచు
గురుతరహర్షమున నెదురుకొనఁ గను టెపుడో! 1443

క. కుండలధారులు వర కో
దండాయుధపాణులైన తనయులు శిఖరో
ద్దండ గిరు లట్లయోధ్యకుఁ
బండువుగా రాఁగఁ గాంచు భాగ్యం బెపుడో! 1444

క. కన్నియలకు విప్రులకున్
గ్రొన్ననలును ఫలము లిచ్చుకొనుచు నెలమి నా
చిన్నికుమారులు క్రమ్మర
ని న్నగరిఁ బ్రదక్షిణింప నెపు డరయుదునో! 1445

ఆ. బుద్ధివృద్ధిఁ దగుచు నిద్ధతేజంబునఁ
త్రిదశుఁడైన ధర్మవిదుఁడు రాముఁ
డాడుకొనుచువచ్చు మూఁడేండ్లబాలుని
లీల నెపుడుఁ గౌఁగిలించుకొనునొ! 1446

ఆ. దశరథేంద్ర! పాలు త్రాగు పాపల నెట్టి
తల్లిచన్నుగవలఁ దొల్లి యెపుడొ
క్రూరమతినిఁ బట్టి కోసితిఁ గాఁబోలుఁ
గాక నాకు నిట్టి గతి గలుగునె.? 1447

ఆ. లేగ గోవువోలె నేఁ గూర్మిఁ గాంచు నా
పట్టి నన్నుఁ బాపె బలిమిఁ గైక
ముద్దు బాలవత్సమును గోవునెడఁ బాయఁ
జేసినట్టి క్రూరసింహ మట్లు. 1448

గీ. లేకలేక కాంచినయట్టి యేకపుత్రు
సకలసుగుణాభిరాము విజ్ఞానధాము
రఘుకులాంబుధిసోము నా రాముఁ బాసి
నే బ్రదుక నేర్తునే యొక్కనిముసమైన? 1449

క. ఆ రమణీయాకారుని
నా రాజితతేజు సుబలు నాయతభుజుఁడౌ
నా రాకేందు నిభానను
నా రామునిఁ బాసి బ్రదుక నా తర మగునే? 1450

ఆ. పుత్త్రశోక దుఃఖ భూరి దావానల
మేర్చి పేర్చి నను దహించుచుండె;
ఘననిదాఘకాల ఖరకర కిరణాలి
క్షితితలముఁ దపింపఁ జేసినట్లు." 1451

# 44-వ సర్గము

## సుమిత్ర కౌసల్య నూఱడించుట

ఆ. అన్నుమిన్నయైన యా కోసలాత్మజ
యట్లు విపులదుఃఖ మందుచుండ
నాలకించి ధర్మశీలయైన సుమిత్ర
యనునయమున నిట్టు లని వచించె. 1452

ఆ. "అఖిల సుగుణధాముఁ డగు రామచంద్రునిఁ
బరమపురుషుఁ గన్న భాగ్యవతివి
పుత్రమోహవశతఁ బొగులుచు నీ రీతి
నతనికొఱకు దుఃఖ మందఁ దగునె? 1453

ఆ. దేవి! నీ సుతుండు దివ్యతేజుం డయ్యు
రాజ్యమును త్యజించి రాజుఁ దండ్రి
సత్యవాదిఁ జేయఁ జనియుండె వని కిట్టి
సాధుకృత్య మెవఁడు సలుపఁ గలఁడు? 1454

ఆ. ఆర్య సమ్మతంబు నాముష్మికఫలోద
యంబునైన ధర్మ మాచరించి
శ్రేష్ఠుఁడైన యట్టి శ్రీరామునిం గూర్చి
యిట్లు దుఃఖపడుట యేటి కమ్మ? 1455

ఆ. పుణ్యరతుఁడు సర్వభూత హితుండు ల
క్ష్మణుఁడు భక్తితోడ సంతతంబు
నా మహాత్ముసేవ లాచరింపఁగ నేగె
నింతకంటె భాగ్య మేమి గలదు? 1456

క. వనవాస మెంత కష్టమొ
వినియును సుఖనిరతయైన వెలఁదుక యయ్యున్
జనకజ ధర్మాత్ముని నీ
తనయు ననుసరించి చనె స్వధర్మనియతయై. 1457

ఆ. తన విశాలకీర్తి ధరణీతలమున కే
కాతపత్ర మగుచు నలరుచుండ
నిత్యసత్యధర్మనిరతుఁడౌ రాముండు
సేమముగ నయోధ్యఁ జేరఁగలఁడు. 1458

ఆ. అతని పారిశుధ్య మాతని మాహాత్మ్య
మెంత యుత్తమములో యెఱిఁగి నట్టి
ఖరకరుండు నైజకరముల శ్రీరాము
సంతపింపఁజేయ జాలఁ డెందు. 1459

క. అనిలుఁడు మంగళకరుఁడై
ఘనశీతోష్ణముల విడిచి కడుసుఖ మిడుచున్
వనులం దిరిగెడి రాముని
ననిశము సేవించుచుండు ననుకూలుండై. 1460

ఆ. పరమపూరుషుండు ప్రభుఁడు శ్రీరాముండు
రేలఁ బవ్వళింప లీల వచ్చి
యమృతకరము లొలయ నతనిఁ గౌఁగిటఁ జేర్చి
చంద్రుఁ డెలమిఁగూర్చు జనకుఁ బోలి. 1461

గీ. దనుజు శంబరు నా తిమిధ్వజుని సుతుని
జంపి బ్రహ్మచే దివ్యాస్త్రసమితిఁ గొన్న
పురుషసింహుఁడు శూరుఁడు భుజబలుండు
నిలువఁ గలఁ డింటు బలెఁ గాన నిర్భయముగ. 1462

గీ. తన నిశాతాస్త్రముల నెదుర్కొనిన యట్టి
వైరివీరులఁ బరిమార్చు వీరవరుఁడు
రాఘవుండు సర్వంసహారాజ్యలక్ష్మి
నెల్లఁ బాలించుటకు నర్హుఁ డేలగాఁడు? 1463

క. శ్రీరాముఁడు నిజతేజము
వీరపరాక్రమము వెలయ విజయాభ్యుదయ
శ్రీరమతోఁ గైకొనఁగలఁ
డీ రాజ్యము వనమునుండి యేతెంచి వెసన్. 1464

ఆ. అతఁ డినుల కినుఁడు; నగ్నికి నగ్ని; రా
జులకు రాజు; కీరుతులకుఁ గీర్తి;
క్షమకు క్షాంతి; దైవతములకు దైవంబు;
భూతి భూతి; కజుఁడు భూతతతికి. 1465

ఆ. దేవి! యట్టి దివ్యతేజోవిరాజి నీ
యాత్మజునకు రాజ్యమందుఁ గాని
పురమునందుఁ గాని భువి నెం దయినఁ గాని
పగతుఁ డగుచు నెవఁడు బ్రదుకఁ గలఁడు? 1466

చ. వనమున కేగుచున్న రఘువర్యునిఁ గానఁగలేక చింతలన్
మునిఁగిన పౌరకోటికిఁ బ్రమోదముఁ గూర్పఁగ వచ్చి వేగమే
తన సతి సీతతోడ వసుధానతితో జయలక్ష్మితోడ నీ
తనయుఁడు పట్టభద్రుఁడగుఁ దప్పదు దేవి! విచార మేటికిన్. 1467

గీ. నారలను గట్టి దర్భాసనంబుఁ బట్టి
విపినముల కేగు శ్రీరాము విజయధాము
సీతతో రాజ్యలక్ష్మియుఁ జేరి చనియె
నింక నతనికి దుర్లభ మేమి కలదు? 1468

క. నానాస్త్రశస్త్రధరుఁడై
ధానుష్కుఁడు లక్ష్మణుండు తత్పరమతి ముం
దై నిలిచి కొలుచుచుండఁగఁ
గానల రామునికి లోటు గలుగునె దేవీ? 1469

క. వనవాసము దీరిచి వెనఁ
బునరాగతుఁడైన రాముఁ బురుషోత్తము నీ
తనయునిఁ గనెదవు నిజ మిది
వనటయు జింతయును మదిని వదలుము దేవీ! 1470

క. సదమలచరిత! శుభాంగి!
ముద మొదవఁగ మరళ వచ్చి ముందు నిలిచి నీ
పదములకు మ్రొక్కు రాముని
నుదయేందునింబోలి చూతు వుడుగుము వంతన్. 1471

ఆ. విజయలక్ష్మితోడ విచ్చేయు వానిఁ బ
ట్టాభిషిక్తుఁ డగుచు నలరువాని
సూను రాముఁ గాంచి యానందబాష్పముల్
గురియఁ గలవు సుఖముఁ బొరయఁ గలవు. 1472

క. ఎట్టి యమంగళమును గను
పట్టదు రామునెడ దుఃఖపడకుము తల్లీ!
యిట్టి కనెద వాతనిఁ దోఁ
బుట్టువుతో సీతతోడఁ బురి కేతేరన్. 1473

ఆ. మాన్యచరిత! దేవి! మముబోటి జనముల
నూఱడింపవలసి యున్న నీవె
యుల్లమునఁ గలంగి తల్లడిల్లుచునుండ
నెవరు దిటవుఁగూర్తు రింక మాకు? 1474

క. రాముని నాత్మజుగాఁగ
నోమి కనినయట్టి నీకునున్ దుఃఖంబా?
రామునికంటెను ధార్మికు
నీ మహి నెవరైనఁ గాంచిరే నీవు వినా? 1475

గీ. శీఘ్రముగ రాముఁ డిటకు విచ్చేసి మరల
నెచ్చెలులఁ గూడి భక్తితో నీకు మ్రొక్క
నరసి యానందబాష్పముల్ గురియఁ గలవు
వార్షికాబ్దమాలిక చిల్కు వానఁ బోలి. 1476

ఆ. ప్రతిన దీర్చి వచ్చి భక్తిమై రాముండు
నీ పదాబ్జసేవ నెఱప నతని
హర్షబాష్పవారి నభిషిక్తుఁ జేసెదు
పర్వతేంద్రు జలదపంక్తిఁ బోలి." 1477

ఆ. మంచిమాటలాడి మది కూఱటం గూర్పఁ
జాలు చారుశీల సతి సుమిత్ర
సాంత్వనోక్తి రాముజనయిత్రి నిటు దేర్చి
యూఱడించి యంత నూఱకుండె. 1478

గీ. అపుడు లక్ష్మణజనయిత్రి యగు సుమిత్ర
పలుకు విన్నంత రాజేంద్రపట్టమహిషి
రామమాతకు మది విచారంబు దీఱె
శారదాకాశమున నల్పజలద మట్లు. 1479

## 45-వ సర్గము

### రాముని వెంబడించిన రాజ పరివారము మరలుట పౌరులు మాత్రము వెంబడించుట

ఆ. రాము వెంబడించు రాజు సుహృత్తులు
వెనుక కెల్లొ మరలి చనిరి గాని
య మ్మహాత్మునెడల ననురక్తి వెంటాడు
జనులు తిరిగి పోవఁ జాల రైరి. 1480

ఆ. అనుపమానకీర్తి యమల గుణస్ఫూర్తి
రాముఁ డెపుడు పూర్ణసోముఁ బోలి
నాయకుండు హర్షదాయకుఁడై యుండె
నా యయోధ్య ప్రజల కందఱికిని. 1481

ఆ. ప్రజల బిడ్డలట్లు భావించు నా రాముఁ
డాత్మజనకు సూనృతాత్ముఁ జేయ
నెంచి తన్నుఁ బౌరు లెంత ప్రార్థించిన
వినక యిట్టు లనియెఁ గనికరమున. 1482

క. "నాయెడ మీ మనములయెడఁ
బాయని గౌరవముఁ బ్రేమభావము నాకై
నా యనుజుఁడు భరతునిపై
నీ యెడఁ జూపంగవలయు నెల్లవిధములన్. 1483

క. ఆ కల్యాణచరిత్రుఁడు
కైకేయ్యానందకరుఁడు కరుణాకరుఁడున్
నాకుం దమ్ముఁడు భరతుఁడు
మీకుం బ్రియహితము లెసఁగ మిమ్ముఁ బాలించున్. 1484

ఆ. చాల చిన్నయయ్యు జ్ఞానవృద్ధుండును
మృదులహృదయుఁ డయ్యు మేటిబలుఁడు
నైన యతఁడు మీకు ననుకూలభర్తయై
యభయ మిచ్చి మిమ్ము నరయఁ గలఁడు. 1485

క. నరవరగుణకలితుండగు
భరతుని యువరాజుగాఁగఁ బ్రభుఁడు నిలిపె ని
త్తఱి; మీరు నేను నా సో
దరులును దలఁ దాల్పవలయు దశరథునాజ్ఞన్. 1486

ఆ. ఇంతప్రేమ నన్ను నెడయఁ జాలని మీరు
హితము నాకుఁ గూర్ప నెంతురేని
వనికి నేను జనఁగ జనపతి ననుఁగూర్చి
శోకమందకుండఁ జూడవలయు." 148

ఆ. ప్రజలరాక నిట్లు ప్రతిఘటించుచు రాముఁ
డచలధర్మనిష్ఠుఁడైన కొలఁది
రాఘవుండె తమకు రాజుఁ గావలె నను
ప్రజలకోర్కి మఱియుఁ ప్రబలఁ దొడఁగె. 148

ఆ. అందువలనఁ బౌరు లా రామలక్ష్మణ
సుగుణపాశములకుఁ జొక్కి చిక్కి
మరలిపోవలేక యరదంబుతో శోక
బాష్పనయను లగుచుఁ బరుగు లిడిరి. 148

గీ. వర్చసముచేత బుద్ధిచే వయసుచేత
వృద్ధులైయున్న కొందఱు విప్రు లపుడు
తలలు వడఁకంగఁ బలుకులు తడఁబడంగఁ
గెలనఁ జేరంగ లే కిట్లు కేక లిడిరి. 149

క. "త్వరితముగ రామచంద్రుని
యరదముఁ గొనిపోవు నుత్తమాశ్వములారా!
మరలుఁడు వెనుకకు మీ ప్రభు
వరుని హితులుగందు పోవ వలవదు మీకున్. 149

గీ. అవనియందున్న సర్వజంతువులలోన
శ్రవణశక్తివిశేష మశ్వములకందు;
రట్లుగుటు మీరు మా మొఱ్ఱ నాలకించి
మరలి రండు వేగమ రఘువరునిఁ గూడి. 149

ఆ. శుభ దృఢవ్రతుండు శుద్ధాత్ముఁడును ధర్మ
రతుఁడు వీరుఁడైన రామవిభుఁడు
పురికిఁ దోడితెచ్చు పురుషోత్తముఁడుగాని
వనికిఁ జాగనంపు వాఁడుగాఁడు." 1493

ఆ. అనెడి వృద్ధభూసురార్త ప్రలాపముల్
రాముఁ డాలకించి రథము డిగ్గి
వ్రత నివిష్టుఁ డయ్యె వైదేహితోడ ల
క్ష్మణునితోడఁ బాదచారి యగుచు. 1494

క. మరియాద లెఱుఁగువాఁడును
గరుణాళుఁడు రాముఁ డపుడు గాలినడకనే
యరుదెంచు ద్విజులు దన్నుం
దటియుటకై యల్లనల్లనం జనఁ దొడఁగెన్. 1495

ఆ. అట్టు లరుగుచున్న యా రామచంద్రుని
గాంచి వృద్ధవిప్రగణము లెల్ల
భ్రాంతచిత్తు లగుచుఁ బరితాపవిహ్వల
భరితు లగుచు మరలఁ బలికి రిట్లు. 1496

గీ. "వేదవిప్రులపూజఁ గావించు నిన్ను
ననుసరించుచునుండె బ్రాహ్మణ్య మెల్ల
బ్రహ్మభుజముల నగ్నిహోత్రములు గూడ
నిన్నె వెన్నాడి వచ్చుచునున్న విదిగో! 1497

ఆ. మాకు వాజపేయమహితయాగముల ల
బ్ధంబులైన యాతపత్రము లివె
యివియు నీకు వెనుక నేతెంచుచున్నవి
శారదీయమేఘచయముఁ బోలి. 1498

గీ. ఛత్రరహితుండవై యిట్లు చనుచునుంటి
వడవిలోపల నీ వెండఁ బడకయుండ
సవనపూతంబులైన యీ ఛత్రములను
ప్రేమతోఁ బట్టెదము నీకు రామచంద్ర! 1499

ఆ. వేదమంత్రములనె విలసిల్లు మా బుద్ధి
వత్స! రామ! నిన్ను వదలలేక
వెంబడించుచుండె విపినవాస మొనర్చు
నీకు నచటఁ దోడునీడ గాఁగ. 1500

గీ. మాకుఁ బరమార్థములును సుశ్లోకములును
నగు శ్రుతులు మా మనంబులయందె యుండు
మా సతీగణమో యాత్మమహిమవలన
ననవరత భద్రగతి నింటి యందె యుండు. 1501

క. కృతనిశ్చయమతి నిన్నుం
బతిమాలెద మడవి కేగుపట్టు విడఁ దగున్
క్షితిసురుల ప్రార్థనములకు
వ్యతిరేకము సేఁత ధర్మమగునే నీకున్? 1502

ఆ. అంచ లట్లు తెల్ల నగు శిరోజములతో
నేల నైగసి యంటు ధూళితోడ
నౌదలలను వంచి యర్థించుచున్నాము
రమ్ము మరలి పురికి రామచంద్ర! 1503

క. ఆగతులగు నీ విప్రుల
లోఁగొందఱు యాగదీక్షలో నుండిరి త
ద్యాగ సమాప్తికి భవదీ
యాగమనమె వలయు విఘ్న మందింపకుమీ? 1504

గీ. రామ! నీరాక! మేము మాత్రంబె గాదు
జంగమస్థావరాత్మకజగతి యెల్ల
నిన్నె వాంఛించుచున్నది నీవుఁ గూడ
భక్తతతులపైఁ బ్రేమఁ జూపంగ వలదె! 1505

గీ. స్కంధమూలంబులైన వృక్షములు గూడఁ
గదలి వెంట రాలేక నిన్వదలలేక
యుగ్రవాయువేగోద్ధతి నూఁగి రేఁగి
యూర్చి మొఱవెట్టుచున్నట్టు లుండె రామ! 1506

క. ముడిగి ఖగంబులు మేఁతల
నుడిగి విహారంబు వెడలి యుర్విజములపై
నడలుచుఁ బిలుచుచు నున్నవి
పొడఁగని నిను ప్రభుని సర్వభూతప్రియునిన్." 1507

క. అని యిటు లాక్రందనముల
నొనరించెడి విప్రవరుల కూఱటు గాఁగన్
దనుదానె యపుడు శ్రీరా
ముని నాఁపె ననంగఁ దమస ముందటఁ దోఁచెన్. 1508

గీ. అరద మాఁపి సూతుం డప్పు డలసియున్న
తురగముల విప్పి నేలపైఁ బొరలఁ జేసి
జలములను ద్రావ నిచ్చి మేనులను గడిగి
ద్రిప్పెఁ దమసాతరంగిణీతీరభూమి. 1509

## 46-వ సర్గము

క. సీతాపతి సుందర తమ
సాతీరముఁ జేరి యపుడు జానకిఁ గనుచున్
భ్రాతయగు లక్ష్మణునితో
నీ తీరునఁ బలికె దిటవు నెంతయుఁ గూర్పన్. 1510

క. "ఇదె మన వనవాసమునకు
మొదటి రజని; కానఁ గాలు మోపితి మిపుడే;
వదలుము గృహాదిచింతల
నెద లక్ష్మణ! నీకు భద్ర మెసగుం గాతన్. 1511

గీ. స్థానములఁ జొచ్చు మృగగణధ్వానములను
గూడులను జేరు ఖగకులాక్రోశములను
దీరుసెడి సౌరు విడనాడి తేజుదక్కి
వగచుచు న్నట్టులుండె నీ వనులు గంటె! 1512

ఆ. తండ్రిగారి రాజధాని యయోధ్యయుఁ
బురిని వెడలి వనికిఁ బోవు మనల
నెడఁదఁ దలఁచి దుఃఖపడు చుండు నిప్పుడు
సకల బాలవృద్ధ జనముతోడ. 1513

క. అనఘ! గుణకలన వలనన్
మనుజపతిని నన్ను నిన్ను మన భరతునిఁ ద
మ్ముని శత్రుఘ్నుని నెప్పుడు
ననురక్తిన్ గాంత్రు గాదె యీ పురజనముల్. 1514

ఆ. జనకుఁ దలఁచి కీర్తిశాలిని యైన మా
యమ్మఁ దలఁచి దుఃఖ మందుచుంటి
వార లేడ్చి కంటినీ రోడ్చి డోడిచి
యంధు లగుదు రేమొ యక్కటకట! 1515

ఆ. పరమధర్మరతుఁడు భరతుండు ధర్మార్థ
కామయుక్తవచనకలన నెపుడుఁ
బ్రీతిఁ గూర్చి భక్తి నా తల్లిదండ్రుల
చిత్త మూఱడిల్లఁ జేయుచుండు. 1516

క. కరుణాళుం డగు భరతుని
శిరమున బితృభరము నిల్పి చింత వదలితిన్;
ధరణిజ రక్షార్థము నీ
వరుదెంచితి విటకు మేలె యైనది యనుజా! 1517

క. తమ్ముఁడ! నే నీ రాత్రి జ
లమ్ములఁ ప్రాశన మొనర్చి లఘుగతి నుందున్
సమ్మతములుగా విపుడు వ
నమ్ముల దుంపలును బండ్లు నాకు భుజింపన్." 1518

క. అని రాముఁడు లక్ష్మణుతో
ననుతాపం బెనయఁ బలికి యపుడు సుమంత్రుం
గని "సౌమ్యా! నీ వింకన్
గనఁ దగు నశ్వముల భద్రగతి" నని చెప్పెన్. 1519

ఆ. ప్రొద్దుగ్రుంకువేళఁ బొడఁగని గుఱ్ఱాల
సూతుఁ డపుడు గట్టి మేఁత వైచి
సంజ గొలిచి చేరి సౌమిత్రితో రామ
చంద్రునకును బ్రతశయ్యఁ గూర్చె. 1520

క. జనకజతో లక్ష్మణుతో
ననఘుఁడు శ్రీరామచంద్రుఁ డాకులసెజ్జన్
గనుఁగొని చని యట నుపవే
శనముం గావించె నపుడు సమ్మతితోడన్. 1521

ఆ. అపుడు రామచంద్రుఁ డర్ధాంగితో నట్లు
చెట్టుక్రింద నిద్రఁ జెందునంత
సూతుతో సుమిత్రసూతి చెప్పఁ దొడంగె
నెన్న గుణగణంబు లభినుతించి. 1522

క. సూతునితోడ సుమిత్రా
సూతి నిదుర మాని రాము సుగుణచయంబున్
బ్రీతి నటు వినుచుచుండెన్
రాతిరి చని వేగుదాఁక రవిఁ గనుదాఁకన్. 1523

క. శ్రీరాముఁడు తను వెనుకొను
పౌరజనావళులతోడ బహుగోకుల సం
చారం బగు నా తమసా
తీరంబున విడిసె నాఁటి దివసాంతమునన్. 1524

ఆ. అమితతేజుఁడైన యా రాముఁ డా రాత్రి
నిదుర మేలుకాంచి యెదుట నేలఁ
బండి నిదురఁజెందు పౌరులఁ గనుఁగొని
యనుఁగుఁ దమ్ముతోడ ననియె నిట్లు. 1525

గీ. "ఇండ్ల నిల్లాండ్ర బిడ్డల నెల్ల వీడి
వీరు మనయందుఁ గల ప్రేమ వీడలేక
కాల్నడల వెంట వచ్చి యీ గట్లమీఁద
నెట్లు నిదురించుచున్నారొ యిపుడు చూడు!

క. క్రమ్మఱ మనలన్ బురి కరు
దెమ్మను చున్నట్టి వీరి దీక్షఁ గనఁగ వ్య
ర్థమ్ముగఁ దిరుగరు; తమ ప్రా
ణమ్ము లయిన విడుతు రనుచు నాకుం దోఁచెన్. 1527

ఆ. కాన వీరు మేలుకాంచి యాఁపకమున్నె
యరద మెక్కి పోవ నగును మనకు;
నిట్లు చెట్లక్రింద నిక్ష్వాకుపురజనుల్
నిద్ర గనుట చూడ నేర నోయి! 1528

ఆ. పౌరుల కష్టము లెల్లన్
గూరిమిమైఁ దీర్చు రాచకొమరుల మయ్యున్
వారికి మనమే కష్టముఁ
గూరుచు కార్యంబుఁ జేయఁగూడునె యనుజా!" 1529

ఆ. రాముఁ డట్లు పలుక సౌమిత్రి "యో ప్రాజ్ఞ!
యదియె యుచిత" మనుచు ననువదించె;
నంత సూతుఁ గాంచి యా రాముఁ "డడవికి
నరుగ రథము సిద్ధపఱుపు" మనియె. 1530

ఆ. అన్న యంత సూతుఁ డరదంబు నాయత్త
పఱచి రాముచెంతఁ బ్రాంజలి యయి
"సిద్ధ మయ్యె రథము శ్రీరామ! తమ్ముతో
సీతతోడ నధివసింపు" మనియె. 1531

క. పరికరములతో రాఘవుఁ
డరదమున వసించి యూర్మికాకులితయు స
త్వరగమనయు నగు తమసా
తరంగిణిని దాఁటె సతియుఁ దమ్ముఁడు దానున్. 1532

క. శ్రీరాముఁ డట్టు ల వ్వలి
తీరంబును జేరి రథము దిగి సుగమంబై
భీరులకే నభయం బగు
దారి నచట భద్రమైన దానిన్ గనియెన్. 1533

గీ. మతియుతుఁడు రాముఁ డపుడు సుమంత్రుఁ జూచి
"నీవు తే రుత్తరంబుగాఁ బోవ నిచ్చి
వేగ మరలించుకొని రమ్ము వీటిప్రజలు
మనము చనుజాడఁ" గనకుండ నని వచించె. 1534

ఆ. అపుడు రామునాజ్ఞ నా సుమంత్రుఁడు దీర్చి
రాఁగ రాఘవుండు రథము నెక్కి
యవనిజాతతోడ ననుజన్ముతోఁ గూడఁ
దాపసాశ్రమముల దారి నరిగె. 1535

క. పైనమునకు శుభకరముగ
యాన ముదఙ్ముఖముచేసి యా సూతుఁడు రా
మానుమతి నడపి క్రమ్మఱఁ
బోనిచ్చెన్ పుణ్యమయతపోవనసరణిన్. 1536

## 47-వ సర్గము

క. ఆ రాత్రి వేగినంతనె
పౌరులు మేల్కాంచి రామభద్రుఁడు గానం
గా రామిఁ దల్లడిల్లుచు
హా రామా! యనుచు నవతు లైరి మహార్తిన్. 1537

ఆ. కనుల నీరు గ్రమ్మఁగా రాము నందందు
నరసి రథపరాగమైనఁ గనక
ప్రభు వియోగదుఃఖ భరితులై వాపోవఁ
దొడఁగి రిట్లు వార లడలు మిగుల. 1538

క. "ఆ సువిశాలోరస్కుని
నా సమధికబాహుబలుని నా రాము నెడం
జేసితివి పాడునిద్రా!
మోసము చేసితివి కన్నుమూసితివి గదే! 1539

గీ. భక్తరక్షకుఁడగు మహాబాహుఁ డతఁడు
ప్రజల నెన్నఁడుఁ ద్యజియించువాఁడు గాఁడు
అట్టి రాముఁడు మనల నీ యడవి వీడి
కనికరములేక యెట్లేగఁ గలిగినాఁడొ? 1540

క. పౌరులగు మనల నందఱ
నౌరససుతు జనకునట్టు లరసెడి రాముం
డీ రీతి మనల విడి కాం
తారనివాసమున కెట్లు తరలఁ గలిగెనో? 1541

గీ. ఇందుఁ బ్రాయోపవేశంబు నందియైనఁ
దిరుగకే మహాప్రస్థాన మరిగియైన
మన ముసురు వీడుదము రామమనుజవిభుని
సేవఁజేయని వెందుకీ జీవితములు? 1542

క. మెండుగ నిందం దుండిన
యెండిన కట్టియలు పేర్చి యిట నొకచితిగా
మండించి మండిపోదము
రండిఁక మనబ్రదుకు లేల రాముఁడు విడువన్? 1543

ఆ. అట్లుగా కయోధ్య కందఱ మిపుడేగి
యెల్లవారు రాముఁ డేఁడి యనఁగ
నా మహానుభావు నా ప్రియంవదు వని
కంపి వచ్చినార మనఁగఁ గలమె? 1544

ఆ. రాము వీడి మనము రాజధానికిఁ బోవ
వృద్ధబాలవనిత లెల్లఁ గాంచి
జాలిఁ జెంది కుంది సంతపించుచునుండఁ
దేజుదక్కి పురమె తెల్లఁబోవు. 1545

ఆ. వీరవిక్రముండు విజితాత్ముఁడగు రామ
విభునివెంట నంటి వెడలి వచ్చి
యిట్టు లతని విడిచి యే మొగంబులతోడ
నిప్పు డా యయోధ్య కేగఁ గలము?" 1546

క. అని యీ గతి బహువిధముల
వనటం బడి చేతులెత్తి వాపోవుచు నా
జనములు వత్సంబులఁ బా
సిన ధేనువు లట్టు లార్తిఁ జెందిరి గుములై. 1547

ఆ. అంత వార లెల్ల నరదంపుజాడల
నరసి కొంతదూర మరిగి యరిగి
యవియుఁ గాన రాక యటుఁ ద్రోవఁ గనలేక
యధికదుఃఖవిహ్వలాత్ము లైరి. 1548

ఆ. త్రోవ తెన్ను దిక్కుఁ దోఁపక వా రెల్ల
దైవవిధిని గూర్చి తలఁచి వగచి
వెనుక దిరిగి దుఃఖిజనపూరితంబగు
నా యయోధ్యఁ జేరి రార్తు లగుచు. 1549

ఆ. అట్లు రాజధాని కరిగి పౌరజనంబు
లాత్మభవనచింతయైన లేక
యెడఁద రాము నెంచి యెంచి దుఃఖించిరి
కనుల బాష్పవారి దొనలువార. 1550

ఆ. గర్భగతఫణీంద్రు గరుడుండు గొనిపోవ
మహిమదప్పియున్న మడుఁగుఁ బోలి
రామరహితమైన యా మహానగరంబు
ప్రాభవంబు దక్కి పాడువడియె. 1551

ఆ. తోయహీనమైన తోయనిధిం బోలి
చంద్రహీనమైన చదలుఁ బోలి
ప్రమదహీనమైన పట్టణముం గాంచి
యపుడు వారు దుఃఖితాత్ము లైరి. 1552

ఆ. అట్లు దుఃఖవివశులైన యా పురజనుల్
ధనసమృద్ధము లగు తమ గృహములఁ
జొచ్చియైన సతుల సుతులను బెఱవారి
నరయఁ జాలకుండి రా త్రి గ్రుంగి. 1553

## 48-వ సర్గము

ఆ. అట్లు రామువెంట నరిగి నిరాశులై
మరలివచ్చినట్టి పురజనములు
కనుల నీరు కాల్వ గట్టగా నేడ్చుచుఁ
బుడమిఁ గూలి రుసురు వెడలినట్లు. 1554

క. కొందఱు తమ యిండ్లకుఁ జని
నందనులున్ సతులఁ బ్రియజనంబులతోడన్
గ్రందుకొను దుఃఖమున నా
క్రందనమున్ జేసి రపుడు రాముఁ దలఁచుచున్. 1555

ఆ. సంతసంబు లేదు స్వాగతంబును లేదు
తెఱచు విపణి లేదు తేజు లేదు
లేదు వేల్మి సుకృతి లేదు వంటయు లేదు
పురమునందు రామవిరహచింత. 1556

క. కానని రత్నము దొరకిన
నానందము లేదు; పాతు లబ్బిన హర్షం
బే నింత లేదు; సుతుఁ దొలి
కానుపునం గన్నఁ గౌతుకము లే దెందున్. 1557

క. ప్రతియింటను దురపిల్లెడు
సతివలు శ్రీరాము విడిచి యరుదెంచిన యా
పతులం గని కరి నంకుశ
హతిఁ గూల్చిన యట్లు నొవ్వ నాడిరి పెలుచన్. 1558

ఆ. "ఇంతు లిష్టు లేల? యిల్లు వాకిళు లేల?
తనుజు లనుజు లేల? ధనము లేల?
శుభము సుఖము లేల? చుట్టుపక్కము లేల?
కన్నులార రాముఁ గననినాఁడు. 1559

క. రాముని కాకుత్థ్సాన్వయు
భూమిజతోఁ గూడఁ భక్తిఁ బూజింపంగా
నోమి వెనువెంట నేగిన
సౌమిత్రి యొకండె భాగ్యశాలి జగమునన్. 1560

ఆ. అచట రామచంద్రుఁ డవగాహనముచేయు
నాపగలును వారిజాకరములు
పుష్కరిణులు ఝరులు పుణ్యతీర్థములగు
వానిసుకృతి నెన్న వశమె మనకు? 1561

క. కమనీయకాననంబులు
విమలతరంగిణులు సానువిలసిత జల పా
తములగు నున్నత గిరులున్
బ్రమదం బొనఁగూర్పఁ గలవు రఘురామునకున్. 1562

క. దరి కరిగిన రాముని గని
గిరిగాని వనముగాని గిరికొనుభక్తిన్
బురుషోత్తముఁడే యతిథిగ
దొరకె ననుచుఁ దృప్తిఁ గూర్ప దొరకొనకున్నె? 1563

ఆ. తలనుదావిపూలు నిలువెల్లఁ మంజరు
లలరఁ గ్రమ్ముకొన్న యళిరవముల
స్వాగతంబుఁ దెలిపి చక్కని వృక్షంబు
లనఘు రామచంద్రుఁ దనుపఁగలవు! 1564

ఆ. వేళగానియట్టి వేళల యందైనఁ
బరువములగు పూలఁ బండ్లతోడఁ
దమ సమీపమునకు దయసేయు రాముని
సత్కరింపఁ గలవు శైలతతులు. 1565

ఆ. చిత్రగతులఁ బాఱు సెలయేఱులను జూపి
తేటనీట గిరులు దేర్చుచుండ,
గిరితరువ్రజంబు విరిచామరలు వీచి
యనఘు రామచంద్రుఁ దనుపఁ గలవు! 1566

క. శూరుం డాయతబాహుఁడు
శ్రీరాముఁడు దాశరథి వసించిన చోటున్
జేరవు భయపరిభవములు
చేరుద మాతనినె యాలసింపఁగ నగునే? 1567

గీ. అ మ్మహాత్ముని రాముని యడుగునీడ
బ్రదుకుదము రండు ప్రభుఁడు ది క్కతఁడె మనకు
సీత కుపచారములు మేము చేయఁగలము
విభుని రాముని మీరు సేవింపఁ గలరు. 1568

క. రాముఁడు పని మీ యోగ
క్షేమంబులఁ గాంచి రక్షసేయును మిమ్మున్
భూమిజ యబలల మగు మా
సేమంబుల నరసి ప్రోదిసేయును మమ్మున్. 1569

ఆ. పేరుపెంపులేక పీడితజనులతోఁ
బ్రతిభ దక్కి దుఃఖభరిత మగుచు
పాడువడినయట్టి పట్టణంబున నింక
నెవ్వఁ డుండి బ్రదుక నిచ్చగించు? 1570

క. అనయంబున నీరాజ్యం
బనాథయుం బోలి కైక దయిపోయినచో
మన కిచట నునికి యేలా?
ధనమేలా? తనయు లేల? తనువులు నేలా? 1571

గీ. కేవ లైశ్వర్యకాంక్షచేఁ దీవరించి
తనయు రాముని భర్తను దశరథేంద్రుఁ
జెండనాడినయట్టి యా చెనఁటి కైక
స్వార్థపరత నెవ్వరి వీడనాడ దింక? 1572

ఆ. ఆమె బ్రదికియుండు నంతగాలంబు నా
కైకరాజ్యమందుఁ గాలు నిలిపి
సేవకులము వోలి జీవింపఁ జాలము
నిమిషమాత్రమైనఁ గొమరులార! 1573

ఆ. దయ యొకింతలేక దాశరథిని రాము
నటవి కనిపినట్టి కుటిలచరిత
పాపచిత్త కైక పాలనంబున నింక
బ్రదికి యెవఁడు సుఖముఁ బడయఁ గలఁడు? 1574

ఆ. ఈ యరాజకంబు నీ నిరాధారంబు
నీ యుపద్రవంబు నెల్ల నిపుడు
కైకమూలముననె గలిగె రాజ్యమునకు
నిది వినాశకాలమే నిజంబు. 1575

క. ఆ విధి రాముం డడవికిఁ
బోవఁగ వగ దశరథప్రభుఁడు జీవింపం
బోవం; డా ధర్మప్రభుఁ
డే పీడినఁ బ్రజకు దుఃఖమే యిఁక గతియా. 1576

గీ. అకృతపుణ్యులు నిర్భాగ్యు లైనమీర
లిపుడు నిశ్చయ మొనరింపఁ డేదొ యొకటి
విషమరణ మందుటో రామువెంటఁ జనుటో
వార్త లందని పరదేశవసతి గనుటొ! 1577

ఆ. రాము సీతతోడ సౌమిత్రితోఁ గూడఁ
గపటవర్తనమునఁ గాన కంపి
పసులఁ గటికవానిపజ్జఁ బెట్టిన యట్లు
ప్రభుఁడు మనల భరతుపాలుఁ జేసె. 1578

సీ. రాకేందువదనుండు రాజీవనయనుండు
కుంజరగమనుండు గూఢజత్రుఁ
డంబుదశ్యామలుం డాజానుబాహుండు
భువనమోహనమూర్తి పూర్వభాషి
భూరిప్రతాపుండు పురుషశార్దూలుండు
హతవిమతుండు మహారథుండు
సౌమ్యస్వభావుండు సత్యవ్రతుండు సు
ధాకరనిభశుభదర్శనుండు

గీ. సదమలచరిత్రుఁ డగు రామచంద్రమూర్తి
కాంత జానకితోడ లక్ష్మణునితోడ
నిచ్చమై విహరించుచు నేగుచుండ
నెల్లవనములుఁ గూడ శోభిల్లఁ గలవు." 1579

ఆ. అనుచుఁ బౌరకాంత లతిదీనవదనలై
విపులదుఃఖతాపవివశ లగుచు
భయదమృత్యువేళఁ బరితపించిన యట్లు
తెలుఁగు మిన్నుముట్ట నేడ్చి రపుడు. 1580

ఆ. పౌరకాంత లాత్మభవనంబులను రామ
భద్రుఁ గూర్చి దుఃఖపడుచునుండ
నప్పు డరుణకిరణుఁ డస్తంగతుం డయ్యె
నిరులుకొనుచు రేయి యరుగుదెంచె. 1581

గీ. ఆహితాగ్నుల యగ్నికార్యములు లేక
ధరణిదేవుల వేద నాదములు లేక
కోవిదుల పుణ్యసత్కథాగోష్ఠి లేక
యంధకారబంధుర మయ్యె నా యయోధ్య. 1582

ఆ. హర్ష మెడలి యాశ్రయము లేమి వర్తకుల్
విపణు లెల్ల మూసివేసి నంత
చిన్నవోయి నగరి చెన్నుదొఱంగె న
క్షత్రహీనమైన గగన మట్లు. 1583

ఆ. తమ్ముఁడో సుతుండొ త మ్మెడఁబాసిన
ట్లతివ లెల్ల రాము నాత్మఁ దలఁచి
యెలుఁగు రాలుపడఁగ నేడ్చిరి వారల
కతఁడు సుతులకంటె నధికుఁడు గద! 1584

ఆ. అప్పు డా యయోధ్య యాటపాటలు లేక
వాద్యములును నుత్సవములు లేక
విపణిచయము లేక విభవంబు సెడియుండె
వట్టిపోయినట్టి వనధిఁ బోలి. 1585

## 49-వ సర్గము

క. పురుషవ్యాఘ్రుఁడు రాముఁడు
పురజనముల విడిచి ప్రొద్దుపొడువక మున్నే
త్వరితగతిని గడుదూరం
బరిగెను జనకాజ్ఞఁ దీర్చు నాత్రముతోడన్. 1586

ఆ. అట్లు రామచంద్రుఁ డరుగుచు నుండంగ
వేగుదోఁచె రాత్రి వెడలిపోయె
నా ప్రభాతసంధ్య నాతఁ డుపాసించి
యాత్మదేశసీమ నపుడు దాఁటె. 1587

ఉ. క్రొన్ననలం గుబుల్కొనెడు కోనలఁ గాంచుచు సాగుచేయఁగా
దున్నిన భూములం గనుచు దొడ్డవి చిన్నవి యైన యూళ్ళయం
దున్న జనంబు లాడుకొను చుండిన మాటలు వించు మెల్లఁగాఁ
జన్నటు లేగె రాఘవుఁడు చయ్యన గుఱ్ఱము లేగుచుండినన్. 1588

గీ. "కామవశుఁడయి దశరథభూమిపాలుఁ
డెట్టి దుష్కృతమున కొడిగట్టినాఁడు
పాపమతి కైక క్రూరస్వభావ యగుచుఁ
గాపథముఁ బట్టి యిపు డెంత ఘాతఁజేసె. 1589

గీ. ప్రాజ్ఞు విజితేంద్రియుని ధర్మపరుని సదయు
జనవరాత్మజు శ్రీరామచంద్రమూర్తిఁ
గానలకుఁ ద్రోసి మర్యాద గాసిచేసి
క్రూరమతి కైక ప్రజ కెంత గోడు తెచ్చె! 1590

ఆ. పరమపూజ్యురాలు నిరతసుఖోచిత
జనకతనయ భూమిజాత సీత
క్రూర మృగ విహార ఘోరాటవుల నెట్లు
మెలఁగి యిడుమలందఁ గలుగు నకటః 1591

క. అక్కట! దశరథనృప! నీ
మక్కువసుతు సుజనహితుని మాన్యు ననఘు ని
ట్లక్కటిక మెడలి రాఘవు
నెక్కరణిన్ వెడలఁ గొట్టి తిది తగ వగునే?" 1592

ఆ. అనుచు గ్రామజనము లప్పు డా నృపుని దు
ర్బుద్ధి కైక నాడిపోయుచుండ
వినుచుఁ గోసలేంద్రుఁ డనఘుండు రాఘవుం
డాత్మదేశసీమ నతిగమించె. 1593

క. స్వాదుజలవిలసితం బగు
వేదశ్రుతినామ పుణ్యవిశ్రుత వేణిన్
వే దాఁటి యపుడు కోసల
భూదయితుఁడు దక్షిణాభిముఖుఁడై చనియెన్. 1594

ఆ. చాల దూర మట్లు చని చని రాముండు
గోసమూహసన్నివాస మగుచు
సరసవారిఁ దేఱి సాగరగమనయౌ
గోమతీస్రవంతిఁ గూడ దాఁటె. 1595

క. తురగంబులు వడివడిగా
నరదము గొనిపోవ రాముఁ డటు చని దాఁటెన్
వరకేకీకలహంసా
కరమై యలరారు స్యందికానదిఁ గూడన్. 1596

గీ. రాముఁ డప్పుడు కోసలసీమఁ జూపి
జానకీ! మున్ను దీని నిక్ష్వాకునకును
మను వొసంగెను బహురాష్ట్రమహితమైన
యిది విశాలదేశం బని యెఱుకపఱిచె. 1597

ఆ. పురుషపుంగవుండు భూరితేజోనిధి
రఘుకులోత్తముండు రాముఁ డంత
మద మరాళ మృదుల మధుర స్వరంబున
నా సుమంత్రు సూత! యనుచుఁ బిలిచి. 1598

క. "జననీజనకు లెలమిఁ గన
ఘనతర మృగయా వినోద కాంక్షలు దీఱన్
వనకారుల నీ సరయూ
వనులం గ్రీడింప నెపుడు వత్తునొ మరలన్? 1599

ఆ. అడవులందు వేటలాడెడు పని పర
లోకసుఖముకొఱకుఁ గాకయున్న
నిహమునందు రాజఋషులగు వారిచే
నిది వినోదముగ గ్రహింపఁ బడియె. 1600

గి. మేదినిజనంబు నిత్యనైమిత్తికముల
కస్త్రసాధనపరులు లక్ష్యంబుకొఱకు
గోరుదురు వేఁట; మత్కులాచారసరణి
నేను దానిని గోలఁదిగా నిచ్చగింతు." 1601

క. అని యైక్ష్వాకుఁడు రాముఁడు
జనవరచరితములఁ గూర్చి సరసమృదూక్తిన్
వినిపించుచు సారథితోఁ
జనియెన్ బహుదూర మట్లు స్యందనగతుఁడై. 1602

## 50-వ సర్గము

క. భాసురకోసలదేశ మ
హాసీమం దాఁటి లక్ష్మణాగ్రజుఁడు ప్రియా
వాస మయోధ్యకు నభిముఖుఁ
డై సన్నుతిఁ జేసె నపుడు ప్రాంజలి యగుచున్. 1603

చ. సెలవిడుమమ్మ! "నాకు దయచేసి పురీవరమా! యయోధ్య! కా
నలఁ జరియించి నా పితృఋణంబును దీర్చి క్రమ్మఱంగ మ
త్కులపతు లేలినట్టి నినుఁ గొల్వఁగ వచ్చెద నమ్మ! నీయెడ
న్నెలకొనియున్న దేవతలు నెమ్మి ననుం గృపఁజూచుచుండఁగన్."

క. కను లెఱ్ఱవాఱ బాష్పా
నను(డై రాముండు వీడనాడక వెంటన్
జనుదెంచు జానపదులం
గని యిట్లనెఁ గేలుసాచి కరుణాళుండై. 1605

క. "మీరలు నాయెడఁ జూపిన
గారవము సహానుభూతి గణ్యములు; చిరం
బీ రీతి దుఃఖపడక గృ
హారామము లరసికొనుటు కరుగుం" డనినన్. 1606

క. చింతాకులులై సీతా
కాంతునకుఁ బ్రదక్షిణించి కడ కెటు లెటులో
వంతన్ వీడ్కొని యెడనెడ
నంతంతం దిరిగి కనుచు నరిగిరి వారల్. 1607

ఆ. జనము లట్లు రామజనవిభు విడలేక
చనుచు నార్తు లగుచుఁ గనుచునుండ
సంజవెనుక ప్రొద్దు చనినట్లు వారికి
రవికులుండు కనుమొఱంగి చనియె. 1608

సీ. బహుధనధాన్యసంపదల నొప్పెడు దాని
దానశీలజనాఢ్య మైన దాని
పావనచైత్యయూపావృతం బగు దాని
నభయశుభామోదమైన దానిఁ
జూత వనోద్యాన శోభితం బగుదాని
ధేనుగణాకీర్ణ మైన దాని
నమృత సంపూర్ణ పద్మాకరం బగుదాని
హర్ష జనావాస మైన దాని

గీ. నిరత వేద నాదములచే మొఱయుదాని
మహిపులకుఁ గూడ జూడ రమ్య మగు దాని
వివిధరాష్ట్రోత్తమములచే వెలయు దాని
న మ్మహాకోసలము రాముఁ డతిగమించె. 1609

క. ధీరవరుఁడు రాఘవుఁ డపు
డారామశ్రీవిశాల మగు కోసలమున్
భూరమణభోగ్యమై తగు
స్వరాజ్యమున్ వీడి యడివిఁ జనియె నిరీహన్. 1610

గీ. స్వాదు జల విశిష్ట శైవాల విరహిత
శుభద త్రిపథగమన సుందరాంగి
పరమఋషినిషేవ్య భాగిరథీదేవి
దటిసె నపుడు రామధరణివిభుఁడు. 1611

శా. శ్రీమ త్పుణ్యతపో ధనాశ్రమపద శ్రేణీభవ త్తీరమునన్
సామీప్యోపవనాభిముఖ్యసుమనస్సంతానసంచారమున్
క్ష్మామందారము దివ్యనీరము వియద్గంగార్ఝరీపూరమున్.
రాముం డారసె శృంగిబేరనగరీరాజన్మణీహారమున్. 1612

క. శ్రీరాముఁడు కనె జగదా
ధారన్ గంగాఖ్య పుణ్యధనవిస్తారన్
తారాపథగళితామృత
ధారన్ రత్నాకరేంద్రు దార నుదారన్. 1613

క. నురుపులు చిఱునవ్వులుగా
మరాళరుతు లెలమి దెలుపు మాటలుగా నె
త్తరఁగలు వితిదండలుగాఁ
బరగంగా గంగ యాఁడుపడుచుగఁ దోఁచెన్. 1614

గీ. దేవ దానవ గంధర్వ సేవిత మయి
దివ్యపుష్పోపవనశతాధికయుత మయి
సుర విహార లీలా శైల శోభిత మయి
కనులపండువు సేసె గంగాభవాని. 1615

సీ. జడలుగా వేణికల్ సవరించు నొకచోట
సుడులుగా నొకచోటఁ జుట్టుకొనును
స్తిమితగంభీరయై గమనించు నొకచోట
వఱదయై యొకచోటఁ బరుగువారు
గలువకన్నులు విప్పి తిలకించు నొకచోటఁ
బలుకాడు నొకచోటఁ బక్షిరుతుల
విరిదమ్మిపూవుల తెర లెత్తు నొకచోట
నలగేల నొకచోట నభినయించుఁ

గీ. దేటిరవముల నొకచోటఁ బాటపాడు
దరితరులపూల నొకచోట దండఁ గూర్చు
నిట్టు లీలాగతులఁ బ్రవహించుకొనుచుఁ
జనుచునుండె భాగీరథి జలధివంక. 1616

ఆ. వేగజలనిపాత వికటాట్టహాసయు
భంగఘోషణోగ్రభైరవియును
నతిగభీర భీక రావర్తయై గంగ
చండతాండవమునఁ జనుచునుండె. 1617

ఆ. విమలకమలవదన వికసితోత్పలనేత్ర
పుష్పసురభిళాంగి పులినజఘన
మదమరాళగమన మధురభాషిణి యయి
సాగిపోవుచుండె జహ్నుకన్య. 1618

ఉ. పాపవినాశినిన్ సుకృతభాసిని విష్ణుపదాబ్జవాసినిన్
దాపనివారిణిన్ సుజలధారిణి క్షామభయాపహారిణిన్
వ్యాపృతకీర్తినిన్ శివజటాంతరవర్తిని దివ్యమూర్తి న
య్యాపగ శృంగిబేరనగరాగ్రమునన్ రఘుసూతి గన్గొన్. 1619

ఉ. కిన్నరకామినీ సలిలఖేలన రమ్య సరోవరాళిచే
నున్నత దంతి సింహ శరభోగ్ర మృగాకుల కాననాళిచేఁ
బన్నగ గోధికా మకర భైరవ సత్త్వమహోగ్రహ్రదాళిచే
సన్నుతసత్ప్రభావ యగు జాహ్నవి దోఁచె ననేకమూర్తులన్.

ఆ. అలల సుడుల నెగసి యత్యగాధం బయి
పొంగి పొరలుచున్న గంగ గాంచి
యా మహారథుండు రాముండు సూతుతో
నిందు నేఁడు విడిసి యుంద మనియె. 1621

క; "విరుల నలరు నీ తాపస
తరుమూలమునన్ వసించి ధర జీవులకున్
సుర కిన్నర గంధర్వా
సురులకు సేవ్యఁ యగు గంగఁ జూతము వేడ్కన్." 1622

క. అనినం దమ్ముఁడు లక్ష్మణుఁ
డనుమోదించుటయు సూతుఁ డటు కరదం బ
ల్లన నడుప నింగుదీచ్ఛా
యను దిగెఁ బ్రభుఁ డతివతోడ ననుజన్మునితోన్. 1623

క. అరదము దిగి సూతుండును
వరతురగంబులను విప్పి వైచి, ప్రభునకున్
గుఱుఁగటను నిలిచెఁ దాపస
తరుమూలమునందు భక్తి తాత్పర్యమునన్. 1624

ఉ. అంతట రామచంద్రునకు నాత్మసఖుండు చతుర్దిశాంత వి
శ్రాంత యశోవిశాలుఁడు నిషాదవిభుండు గుహుండు జానకీ
కాంతుఁడు వచ్చె నాత్మకటకంబున కంచు నెఱింగి మంత్రి సా
మంత జనాళితోడ బహుమానపురస్సరుఁడై యెదుర్కొనెన్. 1625

ఆ. ఆ నిషాదనాథు నల్లంత దూరానఁ
గని రఘుప్రసూతి యనుజుతోడఁ
గూడి చేరుకొనఁగ గుహుఁడు దుఃఖార్తుఁడై
యతనిఁ గౌఁగలించి యనియె నిట్లు. 1626

గీ. "ఓ రఘువరేణ్య! రామ! యయోధ్యఁ బోలి
యస్మదీయపురంబు నీ యదియ గాదె
యేమి కావలెనో సెలవిమ్ము నాకు
నిట్టి పరమప్రియాతిథి యవని కబ్బు?" 1627

క. గుహుఁ డిటు కొనియాడి వెసన
"బహురుచిరాన్నములు నర్ఘ్యపాద్యంబు లివే
గ్రహియింపుము రామా! యీ
మహి నీయది యేలుకొనుము మాకుఁ బ్రభుఁడవై. 1628

ఆ. భక్ష్య భోజ్య లేహ్య పానీయములు వీని
నారగింపవలయు నాదరమున
నమ్మతింప నగును శయ్యాసనము లివే
గుఱ్ఱములకు మేఁత కొఱఁతలేదు." 1629

ఆ. అనిన "బాదచారినై వచ్చి మమ్మిట్లు
ప్రియముమీఱ నాదరించుకతన
సకలవిధుల మమ్ము సత్కరించినయట్లె
చెలిమికాఁడ! తృప్తిగలిగె మాకు." 1630

చ. అనుచు రఘూత్తముండు గుహు నర్మిలిఁ గౌఁగిటఁ జేర్చిపట్టి "యో
యనఘ! మదీయభాగ్యమున నారయఁ గంటి సబాంధవమ్ముగా
నినుఁ గుశలిన్ మనఃప్రియుని; నీ పరిపాలనమందు నెల్లెడన్
జనులును సేనలుఁ సకలసంపదలుఁ నిరుపద్రవంబులే? 1631

గీ. ఇపుడు ప్రేమ నా కిచ్చిన వెల్ల నీకె
యిచ్చుచున్నాఁడ; నే గ్రహియింపఁ జాల;
నను గ్రహింపుము వన్యాశనునిఁ దపస్వి
వల్కలాంబరధరు వనవాసి ననుచు. 1632

గీ. హయములకుఁ మేపు గూర్పింపు మంతె చాలు
నతిథి నన్నుఁ బూజించినయట్లె యగును;
మా జనకుఁడైన దశరథరాజవిభుఁడు
కూర్మితోఁ జూచుకొనుచునుండు గుఱ్ఱము లివి." 1633

క. అనినంత నిషాదేశుఁడు
తన భృత్యులఁ గని హయాళి దనియఁగఁ బ్రియఖా
దనములఁ బానీయంబుల
నొనగూర్పుఁడు వేగ" మనుచు నుత్తరు వొసఁగెన్. 1634

ఆ. వల్కలాంబరోపవస్త్రుఁడై శ్రీరాముఁ
డా దినాంతసంధ్య నపుడు గొలిచి
స్వయముగాఁగఁ దెచ్చి సౌమిత్రి యిడిన ఖా
గిరథీజలంబు నారగించె. 1635

ఆ. అడుగుదోయి కడిగి యాచమనముచేసి
దేవితోడ రామభూవిభుండు
నేలఁ బండియుండ నా లక్ష్మణుఁడు వచ్చి
గారచెట్టుచెంతఁ గాచుచుండె. 1636

ఆ. సూతుతో సుమిత్రసూనునితో నప్పు
డనునయింపుమాట లాడుకొనుచు
నా గుహుండు శరశరాసనధారియై
యప్రమత్తుఁ డగుచు నచట నుండె. 1637

చ. అటు పవళించియుండిన మహాత్ముఁడు ధీమహితాత్ముఁడున్ సము
త్కటయశుఁడున్ సుఖార్హుఁడును గష్టవిదూరుఁడు నైన రాఘవుం
డటఁ గనుమూసియున్ నిదురనందక యుండఁగ రాత్రి యెంత సే
పటికిని దెల్లవాఱక యపార మనంతముగాఁ గనంబడెన్. 1638

# 51–వ సర్గము

## గుహుఁడు లక్ష్మణుని నిద్రించు మనుట

ఉ. అన్నకునై యదంభమతి నట్టులు మేల్కనియున్న లక్ష్మణుం
గన్న గుహుండు జాలిగొని "నాయన! నీ సుకుమారమూర్తికిన్
జన్నె వ్యథాభరంబు; సుఖశయ్య యిదే పవళింపు; మేము మీ
సన్నిధి నిల్చి కాచెదము; జాగరణంబులు మాకు లెక్కయే? 1639

క. రామవిభుకంటె నాకుం
బ్రేమాస్పదుఁ డెవఁడు లేఁడు పృథివీస్థలిలో
నా మాట నమ్ము సత్య
ప్రామాణ్యముగాఁగ రామరక్ష యొనర్తున్. 1640

క. శ్రీరాముని కృపచేతనె
పేరును పెంపుఁ గననుంటిఁ బ్రియుని శయానున్
దారయుతు నితనిఁ గాచెద
నీ రేయి సబాంధవముగ ధృతధర్ముఁడనై. 1641

క. ఈ యడవిని దిరిగెడి నా
కీ యెడ నెఱుఁగనిది లే దహీనబలుఁడనై
మాయింపఁ గలను శత్రు ని
కాయంబుల రథగజాశ్వగణసహితముగాన్." 1642

ఆ. అన సుమిత్రసూతి "యనఘ! నీ రక్షణ
గన్న మాకు భయముఁ గలదె? యైన
రమణితోడ దాశరథి నేల శయనింపఁ
జూచు నాకు నిదురసుఖముఁ గలదె? 1643

క. ఎవని సురాసురు లైనం
బవరంబున నెదిరి నిలిచి బ్రదుకఁగలేరో
యవిజేయుఁ డట్టి రాఘవుఁ
డవనిన్ దృణశయ్యఁ బండె నక్కట! కంటే! 1644

క. వ్రతముల జపములఁ దపముల
నతికష్టములంది కన్న యాత్మసదృశుఁడున్
హితసుతుఁడు రాముఁడు ప్రవా
సితుఁ డైనన్ దశరథుండు జీవించునొకో! 1645

గీ. విభుఁడు మరణింప భూదేవి విధవ యగును
రాణు లొనరించు దుస్సహాక్రందనముల
మొరయు నంతిపురం బంత ముచ్చుముడిగి
నీరవం బగు నని యెంతు నిశ్చయముగ. 1646

గీ. రామజనని కౌసల్యయు రాజుతోడ
మజ్జననిగూడ మరణించుమాట నిజము;
బ్రదుకుదురయేని నీయొక్క రాత్రి మాత్ర
గడపఁ గలరేమొ యెంత దుఃఖంబు వచ్చె? 1647

గీ. తనయు శత్రుఘ్ను నిం జూచుకొనుచు నైన
నా జనని నిల్చుఁగాక ప్రాణములతోడ
వీరవరుఁడైన రామకుమారు విడిచి
పట్టపుందేవి కౌసల్య బ్రదుకఁ గలదె? 1648

క. అనురక్త జనాకీర్ణము
ననిశ సుఖప్రదము లోకహర్షాన్వితమై
తనరు నయోధ్యానగరము
జననాథునిఁ బాసి యింక నసి చెడకున్నె! 1649

ఆ. పూజ్యుఁ బ్రియుని జ్యేష్ఠపుత్త్రుఁ గానక ప్రభుం
డొడల నుసురు నిలిపి యుండఁ గలఁడె!
కాంతుఁ డెడసెనేనిఁ గౌసల్య మరణించుఁ
దోనె నా జననియు మేను విడుచు. 1650

క. బేజారుపడఁగ నేమగు
చేఁజాఱిన దానికింక; శ్రీరామవిభున్
రాజుం జేయక చెడియెను
నా జనకుఁడు కామితంబునకు దూరగుఁడై. 1651

గీ. మరణకాలంబునందు దగ్గఱనె యుండి
మృతుఁ డయినతండ్రి కుత్తరక్రియల నెల్ల
శ్రద్ధతోఁ దీర్పఁ గల యదృష్టంబుపట్టెఁ
గలదె సిద్ధార్థులైన పుత్త్రులకుఁ గాక! 1652

సీ. రమణీయ గృహ చత్వరప్రదేశములతో
సువిభక్త సుపథ వైభవముతోడ
ప్రాసాదసౌధ సంపద్విలాసంబుతో
భూరికల్యాణసంస్ఫూర్తితోడ

రథగజాశ్వాకీర్ణ రాజమార్గములతో
వివిధమంగళతూర్యరవముతోడ
గణికాంగనామణీ గానన్మృత్తములతో
సంతుష్ట పరిపుష్ట జనముతోడ

గీ. వరగృహోపవనారామ గరిమతోడ
సంతతోత్సవజన సమాజములతోడ
నొప్పు మా తండ్రి యేలు నయోధ్యయందు
హాయిగా నుండెదరు సుఖులైనవారు. 1653

క. జీవించునె దశరథుఁ డిఁక
జీవించునయేని ప్రతినఁ జెల్లించి తగన్
శ్రీవిలసితు సత్యవ్రతు
నా విభు దర్శించుభాగ్య మబ్బునె మాకున్? 1654

క. ఈ రాముఁడు వనవాసము
దీరుప మే మరుగుదెంచి ధీరుఁ గుశలు ధ
ర్మారూఢు జనకుఁ గొలుచుచు
గారవముం గని సుఖింపఁ గలమె యయోధ్యన్?" 1655

క. అని యనఘుం డా దశరథ
తనయుఁడు దుఃఖార్తి నిట్లు తలపోయుచు రో
దన మొనరించుచు గుహునకు
వినిపించుచు నిలిచి యుండ వేగెన్ దమియున్. 1656

చ. జనహితుఁ డా నృపాత్మజుఁడు సత్యము నిట్లు వచించుచుండఁగా
విని గుహుఁ డూర్పుపెల్లగయ విహ్వలుఁడై ఘనసౌహృదంబునన్
గనికర ముప్పతిల్ల నధికం బగు శోకభరంబునన్ జ్వరా
ర్తినిఁ గరిఖైవడి న్వెలుపరించెను బాష్పములన్ వ్యథార్తుఁడై. 1657

# 52-వ సర్గము

క. రాతిరివేగిన యంతనె
యాతతభుజకీర్తిశాలియగు రాముఁడు వి
ఖ్యాతశుభలక్షణుండగు
భ్రాతన్ లక్ష్మణుని గాంచి పలికెఁ బ్రియమునన్. 1658

చ. "భగవతి రాత్రి యేగినది; భాస్కరదర్శనకాల మయ్యెఁ; ది
య్యగ సువినీలసుందరవిహంగము కోకిల కూయుచుండెఁ; దీ
రగహనమందుఁ గేకి నికరస్వనముల్ వినవచ్చెఁ; నింక శీ
ఘ్రగమనసాగరాభిముఖ గంగఁ దరింతము సౌమ్య! లక్ష్మణా!"

గీ. అనిన రామాజ్ఞ విని భావ మాకళించి
మిత్రహర్షదుఁడైన సౌమిత్రి యప్పు
డరిగి గుహ సుమంత్రులకుఁ గార్యంబు దెలిపి
నెమ్మదిగ వచ్చి యన్న సన్నిధిని నిలిచె. 1660

ఉ. అంత గుహుండు రామవిభునానతి నౌదలఁదాల్చి మంత్రులన్
జెంతకుఁ బిల్చి "మీరిపుడు చెచ్చెర నేగి మనోహరంబు న
త్యంత దృఢంబు నావికయుతంబు సుగమ్యము రాజయోగ్యమౌ
సంతరణిన్ నదీతటము సన్నిధి రేవునఁ జేర్చి రం"డనన్. 1661

ఆ. అంత గుహు నమాత్యు లట్లె సుందర నౌక
తీరమందు నిలిపి తెలుపుటయును
ప్రభునిఁ జేరి గుహుఁడు ప్రాంజలి గావించి
'నావ సిద్ధపఱచినాఁడ' ననుచు. 1662

ఆ. "జలధిగామిని యగు జాహ్నవిఁ దరియింప
మదిగో నౌక దాని నధివసింపు;
మానతిమ్ము నాకు నవ్వలికార్యంబు
శతమఖాత్మజన్మసదృశ రామ!" 1663

క. అన విని విక్రమనిధి యగు
జనవరతనయుండు రామచంద్రుఁడు గుహునిం
గని "సిద్ధార్థుఁడ నైతిని
నినుచుము సామగ్రి నావనీ విపు" డనుచున్. 1664

ఆ. రవికులేంద్రు లంతఁ గవచముల్ ధరియించి
ఖడ్గతూణకార్ముకములఁ దాల్చి
జనకజాతతోడఁ జనిచని జాహ్నవీ
తీరతీర్థమునకుఁ జేరుకొనిరి. 1665

క. సూతుఁడు సుమంత్రుఁ డప్పుడు
చేతులు జోడించి ధర్మశీలుం డగు నా
సీతాపతి కడ నిలిచి వి
నీతి "నా కేమి యాజ్ఞ నృపవర!" యనినన్. 1666

గీ. పావనంబైన వలకేలఁ బ్రభువరుండు
దాశరథి సారథిని వెన్నుదట్టి నిమిరి
"యో సుమంత్ర! వేగంబ యయోధ్య కేగి
యప్రమత్తుఁడవై యుండు మధిపుచెంత. 1667

క. నను నరదముపై నిడుకొని
కొనితెచ్చితి వింతదాఁక గురునాజ్ఞమెయిన్
జను మీవు పురమునకుఁ గా
ననమునకే బోదుఁ గాలినడకనె యింకన్." 1668

క. అని తన కానతి సేయఁగ
ననఘుఁడు సారథి సుమంత్రుఁ డార్తిన్ మనుజేం
ద్రుని నైక్ష్వాకుని రామునిఁ
గని యిట్లని విన్నవించె ఘనవినయమునన్. 1669

గీ. "రఘువరా! నీవు దుర్గమారణ్యసీమఁ
ప్రాకృతునిఁ బోలి సీతతో భ్రాతతోడ
వాస మొనరించు యోగంబు వాయఁ జేయ
లోకమం దొక్కఁడైనను లేకపోయె. 1670

గీ. సౌహృదము బ్రహ్మచర్యంబు సత్యపరత
యాగమాధ్యయనంబు గన్నట్టి నీకె
కనవినఁగ రాని కడగండ్లు గలిగె నకట!
యట్టి నియమనిష్ఠల కిదియా ఫలంబు? 1671

క. అనుపమ విక్రమమున నీ
యనుజునితో సీతతోడ నడవి వసింపన్
జను నీవు త్రిభువనంబుల
ఘనవిజయముఁ గాంచి కీర్తిఁ గాంతువు రామా! 1672

క. దురితాత్మ కేకయాత్మజ
పరిపాలనమునకుఁ బాలుపడి మే మెల్లన్
నిరతిశయదుఃఖపరతన్
గరుణాకరు నిన్నుఁ బాసి గడపఁగ వలసెన్." 1673

క. అని ప్రాణసముఁడు రాముఁడు
తన కెడమై పోవనుంటఁ దలపోసి మదిన్
మునుకొన్న దుఃఖమునఁ బె
ల్చన నేడ్వఁ దొడంగె వృద్ధసారథి యంతన్. 1674

ఆ. అట్టు లేడ్చి యేడ్చి యశ్రువుల్ దొలఁగించి
యాచమించి శుద్ధుఁడైన సూతు
గారవించి పలికె శ్రీరామచంద్రుండు
మధుర భంగి మెఱయ మఱియు మఱియు. 1675

క. "నీవంటి సుహృద్వర్యుం
డీ వసుధాస్థలిని గలఁడె యిక్ష్వాకులకున్?
నీవేగి దశరథుఁడు నా
కై వగవక యుండ నెట్లొ కాపాడఁ దగున్. 1676

క. శుద్ధాత్ముండై కామా
విద్ధుండును బుత్త్రశోకవిహ్వలమతియౌ
వృద్ధునిఁ బ్రభునిం దేర్చుట
సద్ధర్మము నీకు నాకు సచివవరేణ్యా! 1677

గ. ఆ మహాత్ముండు దశరథభూమివిభుఁడు
కైకప్రియమున కేమేని కాంక్షచేసి
యాజ్ఞ యిడినంత నీవు సేయంగ వలయు
నించుకేనియు నెద సంశయింపకుండ. 1678

క. అనతులు దప్పకుండుచు
పూనిన కార్యముల జయముఁ బొందుటెకద భూ
జానులు రాజ్యము నేలం
బూనుటకున్ దగిన ఫలము బుద్ధిం దలఁపన్. 1679

క. ఏ కార్య మెట్టు చేసిన
క్ష్మాకాంతునకుం బ్రియంబొ సతత మతఁడు ని
శ్శోకుండై యెట్లుండునో
యా కార్యము లట్లుసేఁత నగును సుమంత్రా! 1680

క. వగపెఱుఁగని కడు వృద్ధుఁడు
సుగుణఖని వినిర్జితారి సుశ్లోకుం డా
జగతీపతికి న్నామా
టుగ బ్రమొక్కి వినీతి నిల్లెఱుంగం జెపుమా. 1681

ఆ. పుట్టి పెరిగినట్టి పుర మయోధ్యను వీడి
వనులఁ దిరుగ వలసివచ్చె ననుచు
వగ పొకింత నాకు వైదేహికిని లేదు
లేదు లక్ష్మణునకు లేశ మైన. 1682

క. ఈ రేడేఁడులు వనసం
చారము గావించి వేగ చనుదెంచిన నా
కూరిమితమ్ముని నన్నున్
ధారుణిసుత సీతఁ గాంచి తనిసెదు తండ్రీ! 1683

క. అని యిటు నామాటలుగా
జనకునికిన్ విన్నవించి జననికి మఱియుం
జనయిత్రులకున్ గైకకు
వినిపింపందగు సుమంత్ర! వినయ మెనయఁగన్. 1684

క. మాయమ్మకుఁ గౌసల్యకు
ని యవనిజ నేను నార్యుఁ డీలక్ష్మణుఁడున్
శ్రేయముగ నుంటి మనియు వి
ధేయులమై మ్రొక్కితి మని తెలుపంగఁ దగున్. 1685

ఆ. భరతుఁ బిలువనంపి పట్టభద్రునిఁ జేసి
కూర్మి నతనిఁ జూచుకొందు వేని
మమ్ముఁ బాయుచింత మఱచిపోఁ గలవని
ధరణిపతికి మఱియు నెఱుఁగఁ జెపుమ! 1686

క. ధరణిపతిఁ గొలిచినట్టులె
తరతమములు లేక సమతఁ దల్లుల నెల్లన్
బరిసేవింపగఁ దగు నని
భరతుని కేఁ జెప్పినట్లు ప్రవచింపఁ దగున్. 1687

క. నినుఁ గన్న కైక శత్రు
ఘ్నునిఁ గన్న సుమిత్ర నీవు గొలిచిన యట్లే
ననుఁ గన్న దేవి కౌస
ల్యనుగూడం జూడుమంటి ననుము భరతుతోన్. 1688

క. జనకుని ప్రియముం దీర్పఁగ
ననుపమ యువరాజ్యపదము నందిన నీ వా
తని నుభయలోకసుఖముల
నెనయింతు వటంచు మఱియు నేర్పడఁ జెపుమా!" 1689

క. అని రాముఁడు సెలవిచ్చుట
విని సూతుఁడు శోకదుఃఖవిహ్వలుఁడై యా
తని సార్థకసందేశం
బునకుం బ్రియమంది వినయమున నిట్లనియెన్. 1690

గీ. "చనవుచే నిర్భయుండనై సాహసించి
వినుచు నా విన్నపంబు మెప్పునకుఁ గాక
దేవ! భక్తిచేతనె నివేదించినట్లు
నీవు భావించి నన్ను మన్నింపవలయు. 1691

గీ. ఈవు నన్నిట్లు విడనాడితేని రామ!
కాతరతఁ జిక్కి నీ వియోగంబుచేతఁ
బుత్రశోకార్తయుంబోలి పొగులుచున్న
యా యయోధ్యకు నే నెట్లు లరుగఁ గలను? 1692

ఆ. అపుడు రాముతోడ నలరు నా రథమును
గన్నులారఁ గాంచి యున్న ప్రజకు
రామరహితమైన రథము నిప్పుడు గన్న
వగలు మిగిలి గుండె పగుల కున్నె? 1693

క. నేత తమువీడి కదన
క్ష్మాతలమునఁ బడఁగఁ గలఁగు సైన్యమువలెనే
సూతావశిష్టమగు రథ
మేతేర నయోధ్య పొగులదే దుఃఖార్తిన్? 1694

ఆ. ఇపు డయోధ్యనున్న యెల్లవారలుఁ గూడఁ
దమకు నీవు మివుల దవుల నున్న
నెదుటనున్న యట్లె యెంచి ధ్యానించుచు
నన్నపానరహితు లగుదురు గద! 1695

ఆ. వనికి నేగువేళఁ గనుగొంటి గద రామ
నిలుపవేని ప్రజల విలపనములు;
వట్టిరథముతోడ వచ్చిన న్గన్నంత
వారి యేడుపులకు మేరయున్నె? 1696

ఉ. అమ్మరో రాము మాతులగృహంబున డించితినందునా యన
త్యమ్మగుఁ గానలోన; విడనాడితి నాతని నందునా యని
ష్టమ్మగు; మాత కే మనఁగఁ జాలుదు నేఁ జని రామచంద్ర! నన్
బొమ్మని యంటిగాని హయముల్ చనునే నినువీడి వీటికిన్? 1697

క. అటుగావున నో రాఘవ!
యిటు నినువిడి నే నయోధ్య కేగం గలనే?
యటవికి సీతో నరుదెం
చుటకున్ సెలవిచ్చి కరుణఁజూడుము నన్నున్. 1698

గీ. ఇంత ప్రార్థించు ననుఁ ద్యజియింతు వేని
నీ రథముతోడ నిచటనే యీ క్షణంబె
చిచ్చునంబడి మేను త్యజించువాఁడ!
రామ! నినువీడి నేనెట్లు బ్రదుకఁ గలను? 1699

క. వని నీకుఁ దపోవిఘ్నము
లొనరింపఁగ వచ్చు నుద్ధతోగ్రమృగములన్
దునుముచు నుండెద రథగతి;
యనుమతి యిడవలయు వెంట నరుదెంచుటకున్. 1700

క. నీ కృపచే నీ యరదము
నీకుఁ గడపినట్టి సుఖము నేఁ గన గంటిన్;
నాకిఁక వని నినుఁ గొలువఁగఁ
జేకుఱు సౌఖ్యంబు గలుగఁజేయుము కరుణన్. 1701

గీ. అడవి నీ యండనుండఁగా నభిలషింతు;
"రమ్ము సూతోడ" నని వర మిమ్ము నాకు
విపినవాసుని నిన్ను సేవించునేని
పరమగతి నందఁ గలుగు నీ తురగములును. 1702

క. కానల నివసించుచు నీ
యానతి శిరసా వహించి యర్చింతు నినున్;
నే నా యయోధ్యనే కా
దా నాకమునైన నొల్ల నధివసియింపన్. 1703

క. దురితాత్ముండగు నాతఁడు
సురనాథుని రాజధానిఁ జొరలేనిక్రియన్
జొరఁ జాల నే నయోధ్యా
పురము న్నిను విడుతునేనిఁ బుణ్యచరిత్రా! 1704

క. వనవాసవాసరంబులు
చన నీ రథమునననె మిమ్ము సంతోషముతో
మన నగరమునకుఁ గ్రమ్మఱ
వెనుకొని పోవంగ నెంతొ వేడుక నుంటిన్. 1705

క. వనమునఁ బదునాల్గేండ్లును
నినుఁ గొలుచుచు నున్నఁ గడచు నిమిషంబులుగా
నిను వీడిన నా కవియే
కనుపట్టున్ శతగుణాధికంబుగ రామా! 1706

క. సేవకవత్సల! రఘుకుల
సేవకుఁడను భక్తజనుఁడ స్థిరధర్ముఁడనై
నా విభునందను నిన్నున్
సేవింపఁగఁ గోరు ననుఁ ద్యజింతువె రామా! 1707

క. అని మఱిమఱి బహువిధములఁ
దను దీనత వేఁడుచున్న దశరథసచివున్
గనుఁగొని రఘుకులవర్యుం
డనుకంపాకలితహృదయుఁడై యిట్లనియెన్. 1708

గీ. "భర్తృవత్సల! నాయందుఁ బరమభక్తి
నున్నవాఁడని నిను మదిఁ గన్నవాఁడ;
నిపు డయోధ్యకు నిన్నంపు హేతు వేమొ
చెప్పుచున్నాఁడ నది నీవె సేయవలయు. 1709

ఆ. పిన్నతల్లి కైక నిన్నాగతునిఁ గాంచి
నన్ను వనగతునిగ నమ్మఁ గలదు;
అపుడు నృపుఁడు ధర్మ మాచరించె నటంచు
చింత విడిచి సంతసింపఁ గలదు. 1710

ఆ భరతు శాసనమునఁ బరిపోషితం బగు
పుత్త్రరాజ్యవిభవమును గ్రహించి
సవతితల్లి కైక సంతోషపడుటయే
యస్మదీయ నిశ్చయాభిమతము. 1711

క. కావున నీ విఁక నాకున్
భూవిభునకుఁ బ్రియముసేయుపొంకె రథముతోఁ
బోవలయుం బురమునకున్
నా వారికిఁ దెలుపవలయు నా నుడులు దగన్." 1712

క. ధీరుఁడు రాముం డీ గతి
సారెకు సారెకును సూతు సరళోక్తులచే
నూఱడిలఁజేసి గుహునిం
గారవమునఁ గని సహేతుకముగ నిటు లనెన్. 1713

గీ. "జనకునాజ్ఞ తపోవనాశ్రమములందు
వాస మొనరించుటే నా కవశ్య మగుట
జనులతో నిండియున్న యీ వనపదమున
శబరనాయక! యింక నిల్వఁ జనదు నాకు. 1714

క. భూమిపతికి భూమిజకున్
సౌమిత్రికి హితముగాఁగ సంయమదీక్షా
గామినయి జడలుదాల్చెద
నో మిత్రమ! మఱ్ఱిపాల నొసఁగుము నాకున్." 1715

ఆ. అనిన గుహుఁడు పాల నప్పుడ తెప్పించి
నృపకుమారవరున కిచ్చుటయును
దానితోన జటలు దమ్మునకుం గట్టి
జనవిభుండు తాను జటిలుఁ డయ్యె. 1716

ఆ. ఆజానుబాహులును మృగ
రాజాధిక విక్రములును భ్రాతలు నగు నా
రాజసుతు లజినజటులై
రాజిల్లిరి కాన మౌనిరాజుల యోజన్. 1717

క. సానుజుఁడై రాముఁడు వై
ఖానసధర్మానుసరణిఁ గల్పోక్తముగా
వానప్రస్థవ్రతమును
బూని యపుడు శబరవిభునిఁ బోడఁగని యనియెన్. 1718

గీ. "శబరనాయక! యెంతొకష్టము వహించి
యాత్మరాజ్యంబు రక్షింప వగును గాన
సైన్య కోశ దుర్గంబుల జనపదముల
నప్రమత్తుండ వగుచుఁ గాపాడు మీవు." 1719

గీ. అనుచు నిక్ష్వాకు వంశనందనుఁడు రాముఁ
డా గుహుని వీడుకొల్పి యవ్యగ్రమతిని
సితతో లక్ష్మణునితోడ శీఘ్రగతినిఁ
జేరుకొనియె భాగిరథీతీరమునకు. 1720

క. ఒడయఁడు రాముఁడు దరిఁ గల
పడవం గని జడధివంకఁ బరిపరిగతులన్
వడివడిఁ జను గంగానది
గడవన్ లక్ష్మణునివంకఁ గని యిట్లనియెన్. 1721

ఆ. "నరవరేణ్య! లక్ష్మణా! తీరమందున్న
పడవ గదలకుండఁ బట్టి నిలిపి
మృదుల హృదయ సిత మెల్లన నెక్కంగ
నీవు గూడ నోడ నెక్కవలయు." 1722

క. అనినంత నా సుమిత్రా
తనయుండు కుశాగ్రబుద్ధి తనయగ్రజు శా
సనముం దప్పక తీర్పఁగ
ననంతరము రాముతోడ నధిరోహించెన్. 1723

క. క్ష్మావిభుఁడు రాముఁ డప్పుడు
భూవిబుధక్షత్రియార్హ్యమును దివ్యమునౌ
నావారోహణమంత్ర మ
యావహ విధిజపముచేసె నాత్మహితమతిన్. 1724

క. సీతారామ సుమిత్రా
సూతు లెలమి నాచమించి శ్రుతిహితసరణిన్
జేతములు పొంగ గంగా
మాతకుఁ బ్రణమిల్లి రపుడు మానితభక్తిన్. 1725

ఆ. అంత రామచంద్రు డానతి గుహుఁడును
నావ నడపుఁ డనియె సేవకులను
సపరివారు గుహుని సచివు సుమంత్రుని
వీడుకొలిపి రామవిభుఁడు వెడలె. 1726

గీ. నేరు పోరుపు గల కర్ణధారు లపుడు
తరణిఁ బదిలంబుగా నరిత్రములఁ ద్రోయ
నది యగాధనదీసలిలాంతరములఁ
జీల్చి చిమ్ముచుఁ బయనించె శీఘ్రగతిని. 1727

క. పావనజలముల నీ గతి
నావ నడచుచుండ భక్తి నమితాంజలియై
దేవియగు సీత గంగా
దేవిం గని యిట్లు ప్రస్తుతింపం దొడఁగెన్. 1728

సీ. ధీమంతుఁడును సార్వభౌముఁడౌ దశరథ
భూపతి కితఁ డగ్రపుత్త్రుఁ డమ్మ!
అనురూపవర్తనుఁ డార్యుఁడౌ నీ సుమి
త్రాసూతి కితండు భ్రాత యమ్మ!

జనకరాజర్షికి నను(గునందననైన
నాకు నితఁడు ప్రాణనాథుఁ డమ్మ!
తండ్రియాజ్ఞను దీర్పఁ దమ్ముతో నాతోడ
నడవి కితం డేగనయ్యె నమ్మ!

గీ. పదియు నాల్గేండ్లు వనినుండి ప్రతినఁ దీర్చి
రాముఁ డీతండు సుమనోభిరాముఁ డగుచు
మరల మాతోడ నిటకు సేమముగ వచ్చి
దేవి! నినుఁ గొల్వ నాశీర్వదింపు మమ్మ! 1729

ఆ. సర్వకామితార్థ సంపన్నురాలనై
యేను మరల నగరి కేగునపుడు
సుభగవైన నిన్ను విభునితో దర్శించి
కూర్మి పేర్మిమీఱఁ గొల్తు నమ్మ! 1730

క. భువనత్రయిఁ ద్రిపథంబులఁ
బ్రవహించుచుఁ గాంతు వీవు బ్రహ్మపదంబున్
భువి సాగరసతివై మా
కవలోకనభాగ్య మొసఁగె దమ్మ భవాని! 1731

ఉ. సేమ మెలర్పఁగా మనుజసింహుఁడు రాముఁడు ప్రాప్తకాముఁడై
ధామముఁజేరి భూభరముఁ దాల్చినయంతనె భూసురాళికిఁ
గామిత గోసహస్ర ధన కాంచన రత్నచయాన్నదానముల్
మే మొసరింతు మమ్మ! యెలమిం బరమేశ్వరి! నీకుఁ బ్రీతిగన్ 1732

ఆ. మరల నే నయోధ్య కరుదెంచినంతనే
పరమభక్తిభావభరిత నగుచు
మద్యఘటసహస్ర మాంసాన్నములతోడ
దేవి! నీకు మ్రొక్కుదీర్తు నమ్మ! 1733

క. నాతోడ భ్రాతతోడన్
బూతచరిత్రుండు రామమూర్తి మరలఁ దా
నేతెంచుఁ గాక యోధ్యకు
మాతా! నీ కరుణ వ్రతసమాప్తిఁ గుశలియై." 1734

క. అనఘచరిత్ర సుదక్షిణ
జనకజ సద్భక్తి నిట్లు జాహ్నవి గంగన్
వినుతించుచుండఁ దరణియుఁ
జని దక్షిణతీరమునను జయ్యనఁ జేరెన్. 1735

క. తీరమున నోడ దిగి రఘు
వీరుఁడు పురుషోత్తముండు విజితవిమతుఁడౌ
శ్రీరాముఁడు లక్ష్మణుతో
ధారుణిసుత సీతతోడ దారిం జనుచున్. 1736

క. "అనుజా! లక్ష్మణ! నీ విఁక
జనపదముల జనులు లేని చక్కటులందున్
ఘనరక్షణ సేయవలయు
వనపదముల రక్షణంబు వలయుం గాదే! 1737

క. చను మీవు ముందు లక్ష్మణ!
జనకజ నీ వెనుకవచ్చు జాగ్రత్త మెయిన్
నిను సీతను గాపాడుచు
వెనుకనె నే వచ్చుచుండు విల్లమ్ములతోఁ. 1738

క. నరవర! మన మొండొరులము
పరిరక్షణసేసికొనుట భావ్యంబగు; నె
త్తెఱఁగున నాపద లొదవని
కరణిం జనుటొప్పు వెనుకఁ గలఁగుటకంటెఁ. 1739

గీ. జనులనందడి లేక సస్యములుఁ దోఁటు
లుపవనులు లేక విషమమౌ విపినమునకు
సీత వేడుకపడుచు వచ్చినది గాన
నిపుడు వనవాసకష్టంబు నెఱుగఁ గలదు." 1740

ఆ. అన్న యన్నమాట విన్న లక్ష్మణుఁ డంత
నగ్రగామి యగుచు నరుగుచుండ
నతనివెనుక సీత, యా వెన్క రాముఁ డ
య్యడవిత్రోవ నడువఁ దొడఁగి రపుడు. 1741

ఆ. గంగదాఁటి యవలిగట్టున దిగి రాముఁ
డరుగుచుండ సూతుఁ డార్తిఁ గనుచు
దవ్వుచనిన ప్రభునిఁ దా నింకఁ గనలేక
కనుల నీరునించె వనటఁ జిక్కి. 1742

క. సురవరనిభుఁడు మహాత్ముఁడు
వరదుఁడు శ్రీరాముఁ డట్లు వరుసగఁ జని సుం
దరసస్యమాలినియు సు
స్థిరవిభవయు నైన వత్ససీమం జేరెన్. 1743

ఉ. ఆఁకలిగొన్న దాశరథు లప్పుడు దుప్పిని నల్లదుప్పితో
నేకలముం గురంగమును నేర్తెర నేసి తదీయమాంసమున్
జేకొనితెచ్చి వండికొని సీతయుఁ దాము భుజించి యేగుచున్
జీఁకటిగాకమున్నె యొకచెట్టుకడ న్వసియించి రవ్వనిన్. 1744

## 53–వ సర్గము

క. జనరంజనుఁ డభిరాముం
డనఘుండగు రామచంద్రుఁ డచ్చట సాయం
తనసంధ్యవార్చి లక్ష్మణుఁ
గని యిట్లనె వర్తమానగతచింతనుఁడై. 1745

తే. "దేశసీమ దాఁటితిమి మన మిప్పు డ
చనె సుమంత్రుఁ డిచట మనల విడిచి
మన ప్రవాసగమనమున కిదే తొలిరేయి
యనుచుఁ దలఁచి చింతఁ గనకు మనుజ! 1746

క. ఏమరక యిదే మొదలుగ
యామినులం సీత నిదుర నందెడువేళం
సేమము గనుచుండం దగు
సౌమిత్రీ! మనము మిగుల జాగరితులమై. 1747

క. చీఁకటిపడినది; దొరకిన
యాకులతో మనమె శయ్య లమరుచుకొని యె
ట్లో కడపుద మీ రాతిరి;
వేకువ యగుదాఁక నిందె విడిసి కుమారా!" 1748

గీ. అని ప్రబోధించి సుఖశయనార్హుఁడైన
ప్రభుఁడు రామచంద్రుఁడు నేలపై వసించి
యాదరంబున లక్ష్మణు నపుడు గాంచి
హిత నయోచిత సూక్తుల నిట్టు లనియె. 1749

ఆ. "ఇపుడు నృపుఁడు దుఃఖవిపులసంతప్తుఁడై
కళవళించుచుండుఁ గలఁత నిదుర
నభిమతార్థసిద్ధినందిన కైకేయి
చిత్తమందు సంతసించుచుండు. 1750

ఆ. తాతయింటినుండి తనయుండు భరతుండు
తిరిగిరాఁగఁ జూచి తెగువఁ జేసి
రాజ్యలోభ వశత రాణి కైకా నృపాల
తిలకు ప్రాణములను దీయదుగద! 1751

ఆ. దిక్కుమాలి జరతఁ జిక్కి నెమ్మది దక్కి
నన్నుఁగూడ విడుచుకొన్న తండ్రి
కామవశతఁ గైక కైవసమై పోయి
చివర కింక నేమి చేయ గలఁడు? 1752

క. ఇంతటి కాంతావ్యసనము
నింతటి మతివికృతి ముట్టి నృపు నిటుసేయన్
జింతింతుఁ గామబలమే
యెంతయు ధర్మార్థములను నెక్కు డటంచున్. 1753

ఆ. ఆఁడుదానిమాట లాలించి యెట్టి య
జ్ఞానియును విధేయుఁడైన సుతుని
వెనుక ముందుఁ గనక విడుచునే లక్ష్మణా!
అయ్యొ నన్ను వీడనాడినట్లు 1754

క. కైకసుతుఁడు భరతుండే
యేకైక మహామహీతలేశ్వరుఁడై సు
శ్రీకంబగు నీ కోసలఁ
జేకొని సతితోడ సుఖముఁ జెందునె యింకన్? 1755

ఆ. తండ్రి వృద్ధు డగుచుఁ దల్లడిల్లుచునుండ
నే నరణ్యములకు నేగియుండ
సకలరాజ్యమునకు సర్వాధికారియై
యెదురులేక భరతుఁ డేలఁ గల్గఁడు. 1756

క. ఎవ్వఁడు ధర్మార్థంబుల
దవ్వులకుం ద్రోసి కామదాసుం డగునో
యవ్వాఁడు దశరథునివలె
నెవ్వగలం జిక్కి స్రుక్కి నెగులుచు నుండున్. 1757

క. నెపమిడి పతిఁ జంపుటకున్
విపినంబుల కిట్లు నన్ను వెడలించుటకున్
నృపు భరతుఁ జేయుటకుఁ బా
పపుఁ గైకమ్మ మనయింటఁ బడినది సౌమ్యా! 1758

క. సౌభాగ్యమదాన్వితయై
యే భయమున్ లేక కైక యింక సుమిత్రన్
బ్రాభవయుతఁ గౌసల్యన్
క్షోభింపఁగఁ జేయదే యసూయ న్నాకై. 1759

క. పావనచరిత సుమిత్రా
దేవికి నాకారణమున దీనత గలుగం
గావలదు రేపకడనే
పోవందగు నీవు మరలి పురమున కనుజా! 1760

చ వని కిఁక సీతతోడఁ జనువాఁడ నొకండనె నీవు వీటికిన్
జని యసహాయ నా జనని సన్నిధినుండి దురాత్మ కైక పీ
డనమునఁ జిక్కి స్రుక్కి వనటం గనకుండఁగఁ జూచుకొంచు నా
మెను భరతుండుగూడ నెలమిం గనఁజేయుము ప్రాజ్ఞఁ డాతఁడున్.

క. వెనుకటి భవమున నెందఱు
జనముల బిడ్డలను బాపఁ జాలినదో మా
జనని యిపు డిట్టి దుఃఖము
లనుభవముం గాంచవలసె నక్కట యనుజా! 1762

గీ. ఎన్నొ కష్టాలుపడిపడి నన్నుఁ గాంచి
యెత్తిపెంచిన నా జనయిత్రి నిట్లు
ఫలసమయమందు దుఃఖాలపాలు చేసి
యేగుచున్నాఁడ విడిచి నాదేటి బ్రదుకు? 1763

ఆ. తుది యెఱుంగ నట్టి దుఃఖంబు గూర్చితి
జనని కోసలాత్మజాత కేను
నన్నువంటికొడుకు నెన్నఁడే తల్లియుఁ
గనకయుండుఁగాక! యనుజ! యింక. 1764

చ. వనముల కేగఁగావలసివచ్చె ననుజ్ఞ యొసంగు మంచు నా
జననినిఁ గోరుచో ననుజ! శారిక శత్రుపదంబులం జఱు
క్కనఁ గఱుమంచుఁ జిల్కఁగని యాడుట వింటివిగాదె; యమ్మపైఁ
బినిచిన పిట్టకూర్మి కని పెంచిన నా యెడఁ గానవచ్చెనే? 1765

గి. శోకవివశ యభాగిని యేకపుత్ర
యైన నా తల్లి కౌసల్య కాశదీఱ
నన్నుఁ గనిపెంచిన ప్రయోజనమ్ము లేక
యుపకరింపని కొడుకనై యుంటి నోయి! 1766

ఆ. మందభాగ్యురాలు మాతల్లి కౌసల్య
నేను పీడనాడి కాన కేగ
సతత దుఃఖ శోక సాగర పతితయై
పల్లటిల్లకున్నె పనవి పనవి? 1767

క. క్రోధమున నొక్కఁడనె యరి
యోధులఁ బరిమార్చి నే నయోధ్య యొకటె కా
దా ధరణివలయ మంతయు
సాధింపనె? బలమున కిది సమయ మఁటోయీ! 1768

క. పరలోకమున కధర్మా
చరణమునకు భయముఁ జెంది సౌమిత్రీ! రా
జ్యరమాభిషేక కార్యము
విరమించితి నిపుడు ధర్మవిహితాత్ముఁడనై." 1769

క. అని యిటు పరిపరివిధముల
వినిపించుచు జాలిగదుర విజనవనమునం
దనఘుఁడు రాఘవుఁ డా సిసిఁ
బనవి పనవి యూరకుండె బాష్పవదనుఁడై. 1770

ఆ. వేగ మెడలియున్న సాగరునింబోలి
యర్చు లెడలియున్న యనలుఁ బోలి
పనవి యూరకున్న ప్రభు రాముఁ గని లక్ష్మ
ణుండు సాంత్వనోక్తి నుడివె నిట్లు. 1771

ఆ. మేటిమగల కెల్ల మిన్నవైయున్న యో
యన్న! నిన్ను వీడి యున్నకతన
నీ యయోధ్య యిపుడు నిస్తేజమైయుండు
రాజు లేకయున్న రాత్రిఁ బోలి. 1772

క. పురుషోత్తమునకు నీ కిది
తఱియే శోకింప? యెట్లు తల్లడ పడుచున్
ధరణిజను నన్నుఁ గూడన్
బరితప్తులఁ జేయఁ దగునె ప్రాజ్ఞుఁడ వయ్యున్. 1773

ఆ. జలము వాసి మత్స్యములు ముహూర్తంబైన
నేలమీఁద బ్రదుకఁ జాలనట్లు
నిన్ను విడిచి బ్రతుకనేరము సీతయు
నేను నెందు నొక్కనిముస మైన. 1774

గీ. తండ్రిఁ గాని తమ్మునిఁ గాని తల్లిఁ గాని
కాంచఁ గోరను; గోర స్వర్గంబునైన
నన్నుఁ బొమ్మన్న నిటనె ప్రాణముల విడుతు
నరిజనవిరామ! రామ! లోకాభిరామ!” 1775

చ. అని యిటు లక్ష్మణుండు సముదారసముంచితసాంత్వనోక్తులన్
వినుపఁ బరంతపుండు రఘువీరుఁడు రాముఁడు సమ్మతంబుగన్
విని సుచిరవ్రతంబు నడపం బదునాలుగువత్సరంబులున్
దన యనుజన్ముతోడనె యథావిధి దీర్పఁ దలంచె దీక్షతోన్. 177

గీ. అంతఁ జేరువనున్న వటాంతికమునఁ
బత్రతల్పముల్ సౌమిత్రి భద్రపఱుప
ననఘులైన సీతారాము లచటి కేగి
నిశ్చలమనస్కులై శయనించి రపుడు. 177

క. నరవిరహిత మగు నా వని
స్థిరమతి రఘువంశకరులు జితవిమతులు దా
శరథు లభయులై యుండిరి
గిరిసానునివాసయుగళకేసరుల వలెన్. 1778

## 54–వ సర్గము

క. సీతారామసుమిత్రా
సూతులు వటతలమునందు శుభకర మగు నా
రాతిరి నట్టులు గడపి ప్ర
భాతం బగుటయును లేచి పయనించి రొగిన్. 1779

ఆ. గంగతోడ యమున గలయు పావనవత్స
గహనసీమనుండి కదలి వార
లత్యపూర్వములును నత్యద్భుతంబులౌ
జనపదాంతరములఁ గనుచుఁ జనిరి. 1780

క. సేమంబుగ నానావిధ
భూమిజములఁ గనుచుఁ జనుచుఁ బ్రొద్దు మరలఁగా
రాముఁ డపుడు దన తమ్ముని
సౌమిత్రిం గాంచి సంతసమున నిటు లనెన్. 1781

గీ. "తమ్ముఁడా! చూచితే ప్రయాగమ్ముఁ జుట్టి
యగ్నిదేవుని కేతనమైన యట్టి
ధూమ మత్యున్నతంబయి తోఁచునదిగో!
మునిపదము చేరువనె యున్నదని తలంతు. 1782

క. గంగాయమునాతటినీ
సంగమతలమునకు మనము చనుదెంచితి ము
త్తుంగ తరంగ పరస్పర
సంగధ్వని విన్నఁగ వచ్చె సామీప్యమునన్. 1783

క. అనుజా! యి వ్వని వనజీ
వనులు దునుము తరులె గానవచ్చు మొరడులై
మునివర్యుఁ డా భరద్వా
జుని యాశ్రమ తరుల పెంపు సొంపులుఁ గంటే!" 1784

ఆ. అని పథంబు దెల్పుకొని యా సుధన్వులు
గంగతోడ యమునఁ గలయుచోటు
మౌనిచంద్రు నాశ్రమముఁ బ్రవేశించిరి
వరుణదిశకుఁ బ్రొద్దువ్రాలువేళ. 1785

ఆ. అంత రామచంద్రుఁ డాశ్రమ ఖగ మృగ
గణము తన్నుఁ జూచి కలఁగిపాఱ
నల్ల నల్ల నేగి యా భరద్వాజ మ
హర్షి సన్నిధానమందుఁ జేరె. 1786

క. భూరమణసుతులు సమబల
వీరులు రాఘవులు సీతవెంబడి రాఁగా
దూరమునుండియె సముచిత
గౌరవములతోడ నేగి కని రమ్మౌనిన్. 1787

చ. సురుచిరతేజు శిష్యగణశోభితు సువ్రతు ధ్యానచింతనా
పరునిఁ దపస్వి దివ్యమతి భద్రచరిత్రు హుతాగ్నిహోత్రు న
వ్వరమునిచంద్రుఁ జేరి రఘువర్యుఁడు సీతయుఁ దాను దమ్ముఁడున్
గరములుమోడ్చి మ్రొక్కి యధికంబగు భక్తినియుక్తి నిట్లనెన్.

సీ. "మునినాథ! రఘుకులాంబుధి సుధాకరుఁ డైన
దశరథరాజనందనుల మేము
అం దగ్రజుండ రామాభిధానుఁడ నేను
మత్సహోదరుఁడు లక్ష్మణుఁ డితండు
కల్యాణి జనకభూకాంతాత్మజాత యీ
యవనిజ సీత యర్ధాంగి నాకు
సత్యప్రతిజ్ఞుఁడౌ జనకునానతి నేను
విపినవాస మొనర్ప వెడలవలసె

ఆ. సీత యనఘచరిత నాతోడ నిటువచ్చె
భ్రాత లక్ష్మణుఁడును బయలుదేఱె
ననుచు రాముఁ డప్పు డార్యభరద్వాజ
ఋషికి నాత్మవృత్త మెఱుకపఱచి. 1789

క. జనకాజ్ఞం దీర్పఁ దపో
వనమునకుం బోయి యచట వన్యాశన దీ
క్షను ధర్మవిధుల నెఱపఁగఁ
జనుచుంటిమి మువ్వురమును సంయమిచంద్రా!" 1790

చ. అన విని రామచంద్రుఁ గని యాశ్రమపక్షికురంగశిష్యవే
ష్టనుఁడగు మౌనిచంద్రుఁడు వృషంబును నర్ఘ్యజలంబుఁ దెచ్చి య
ర్చన మొనరించి స్వాగత మొసంగుచు నన్నరసాక్తవన్యభో
జనములుగూర్చి మీ రిటనె సమ్మతి నుండుఁ డటుంచుఁ గోరినన్

ఆ. అతిథిపూజ లంది యా రామచంద్రుఁడు
ధరణిజాతతోడఁ దమ్ముతోడ
నటు వసించియుండ నా భరద్వాజుఁడు
హితమితోక్తి మఱల నిట్టు లనియె. 1792

క. "నాకుం జిరకాలమునకుఁ
గాకుత్స్థవరేణ్య! నిన్నుఁ గన నయ్యెఁ నిటున్;
నీ కాననప్రవాసము
నాకర్ణించితి నకారణాత్మక మనుచున్. 1793

క. ఇది యుభయనదీక్షేత్రం
బిది పుణ్యద మిది పవిత్ర మిది రమణీయం;
బిది తాపసోచితం బగు
పద మిందుండఁ దగు; రామభద్ర! సుఖముగన్. 1794

చ. అనజనరంజకుండయిన యా రఘురాముఁడు "మౌనిచంద్ర! యీ
వనమున నున్న మమ్ముఁ గనవచ్చుచునుందురు చెంత పౌరులున్
జనపదవాసు లయ్యది ప్రశాంతికి భంగముగాన మాకు నీ
జనకజకున్ సుఖార్హ మగు శాంతవనంబు మఱొండు దెల్పనే!"

క. సేమమునకు నిటు పలికిన
రాముని శుభవచనములు భరద్వాజముని
గ్రామణి విని పరమార్థ
ప్రామాణ్యంబైన వచనభంగి నిటు లనెన్. 1796

ఉ. "నాయన! మౌనిమానిత మనంతసుఖాస్పదమున్ బవిత్రమున్
శ్రేయము ఋక్షవానరనిషేవితమై తగి గంధమాదనం
బో యనఁ జిత్రకూట మను నొక్క మహీధర మొప్పు యోగ్యమై
యీ యెడ నా సమీపమముననే పదికోసుల దూరమందునే. 1797

క. ఏ నరుఁడు చిత్రకూట మ
హానగశృంగములఁ గని కృతార్థుం డగునో
యా నరుఁడు పుణ్యకృతులనె
యే నాడుం జేయుఁ; జేయఁ డెన్నఁ డఘమ్ముల్. 1798

క. ఆ సానుమంతమున శీ
ర్షాసనలీలన్ మునీంద్రు లబ్దశతంబుల్
జేసి తపము సశరీరా
వాసంబుగఁ జూఱఁగొనిరి స్వర్గపదంబుల్. 1799

క. ఏకాంతవాస మది యని
నీకున్ సుఖ మొసఁగు ననియు నే భావింతున్
గాకున్న వనవ్రతమును
మా కడనే యుండి తీర్చుమా రఘురామా!". 1800

క. అని తెల్పి ప్రియాతిథులగు
జనకసుతారాఘవులను సౌమిత్రినిఁ బూ
జన సత్క్రియాదికంబులఁ
దనియించెన్ మునివరుండు ధర్మవిదుండై. 1801

క. వా రా ప్రయాగసీమనె
కూరిమితో మాటలాడుకొనుచుండఁగాఁ
జేరుకొనె ప్రొద్దు పశ్చిమ
వారినిధిఁ; బ్రసన్న యగుచు వచ్చె రజనియున్. 1802

క. సీతాతృతీయుఁడగు రఘు
సూతి[1] సుఖోచితుఁడు బడలి సుమహితశాంతో
పేత మగు న త్తపోవని
రాతిరి యంతయును సుఖకరంబుగఁ గడపెన్ 1803.

గీ. ఆ విభావరి వేగినయంత లేచి
పూరుషోత్తముఁ డగు రామభూమివిభుఁడు
వరతపస్తేజుఁడగు భరద్వాజుఁ గాంచి
యెలమి వెలయంగ వినతుఁడై యిట్టు లనియె. 1804

ఆ. "నిత్యసత్యశీల! నీ సన్నిధిని సౌఖ్య
కరముగాఁగ రాత్రి గడపినాము;
నీ వచించినట్టి తావునకుం బోవ
నింక మా కనుజ్ఞ నీయవలయు. 1805

ఆ. అనిన మౌనిచంద్రుఁ డా రాముఁ గనుఁగొని
కమ్మదేనె పండ్లు కందములను
గొల్ల లగుచుఁ జిత్రకూటంబునందుండు
నది నివాసయోగ్య మగును మీకు. 1806

సీ. కిన్నర పన్నగ కేళీవిలసితంబు
 వివిధమహీరుహావేష్టితంబు
కేకి కేకారవాకీర్ణదిశాంతంబు
 మదగజరాజ సమంచితంబు
ఫల పుష్ప తరు లతోపవనాభిరామంబు
 ప్రవహదచలఝరీపావనంబు
కద్రమ ఫల మరంద కంద సమృద్ధంబు
 సిద్ధయోగి మునీంద్ర సేవితంబు

గీ. వివిధ సాధుమృగిమృగ విహరణంబు
నక్షిపర్వంబు మానసాహ్లాదకరము
నైన చిత్రకూటాఖ్యవిఖ్యాతగిరిని
వాస మొనరింపఁ బయనింపవచ్చు రామ! 1807

క. అచ్చటి గిరిఝరులు నదులు
నచ్చటి గిరికందరములు నచ్చటి గిరికూ
టోచ్చయము సీతతో నీ
వచ్చట విహరించువేళ నానంద మిడుఁ. 1808

క. కలకంఠీ కోయష్టిక
కలరవములతోడ హరిణగజయూథముతోఁ
జెలు వెసగుఁ జిత్రకూటా
చల మాశ్రమముగ వసింపఁ జను రఘురామా!" 1809

## 55-వ సర్గము

చ. అన విని నిర్జితారులగు నా రఘువీరులు సీతతోడ న
మ్మునికి నమస్కృతుల్ సలిపి ముువ్వురునుం బయనంబుగాఁగ న
య్యనఘుఁడు పేర్మి వారలకు స్వస్త్యయనం బొనరించి తండ్రి నం
దనులను బోలి వెన్కొనుచుఁ దాఁ జని రామున కప్పు డిట్లనెన్.

ఆ. "జనవరేణ్య! మీరు జాహ్నవీయమునలు
గలయు చోటి కరిగి గంగ వడినిఁ
బడమటికిని దిరిగి పాఱు కళిందజా
తీరముననె చనుఁడు తెరువుఁబట్టి. 1811

ఆ. అట్టు లరిగి యరిగి యటఁ బరిపాటిగా
జనులు దాఁటు రేవుదనుకఁ బోయి
కొయ్యతెప్పఁ గట్టుకొని మెల్ల మెల్ల నా
తరణివలన నదిని దాఁటువలయు. 1812

గీ. అద్దరిం జేరి యచట సిద్ధాభిగమము
వివిధ తరువేష్టితంబు సువిస్తృతంబు
హరిత దళ రమ్యమైన శ్యామాఖ్యవటముఁ
గొలువఁ దగు సీత శుభములు గోరి మ్రొక్కి. 1813

ఆ. అలసె నేని సీత యటఁ గొంతసేపాఁగి
యవల గ్రోశమాత్ర మరిగి నంత
ఘనపలాశ బదరికా యమునావేణు
కలిత నీలవనముఁ గాంచఁ గలరు. 1814

గీ. ఆ వనమునుండి చిత్రకూటాద్రివఱకు
రమ్యమై మృదువై దావరహిత మైన
దారి సుగమమై యున్నది: దానిఁ బట్టి
యెన్నొసారులు నే నట కేగియుంటి." 1815

ఆ. అనుచుఁ జిత్రకూటమునకు మార్గముఁ జెప్పి
మునివరేణ్యుఁ డంత ముదల యిడఁగ
రామచంద్రుఁ డా భరద్వాజునకు మ్రొక్కి
వెడలివత్తు మనుచు వీడుకొనియె. 1816

క. ముని యటు తమ కనుమతి నిడి
చనఁ దమ్ముని గాంచి రామచంద్రుం "డనుజా!
మనయెడ నీ భగవానుని
యనుగ్రహము గలుగుటన్ గృతార్థులము సుమీ!" 1817

ఆ. అనుచు మెచ్చుకొనుచు నినకులుల్ ధీరులై
జనకజాత ముందుఁ జనుచు నుండ
నప్రమత్తు లగుచు నా యమునానదీ
తీరముననె బయలుదేర చనిరి. 1818

క. చని చని వా రటు రేవున
ఘనభంగతరంగ వేగగమనన్ యమునన్
గని దాని నుత్తరింపఁగ
మనమునఁ దలపోసి మౌని మాటు దలఁచుచుఁ. 1819

గీ. స్వయముగా రాఘవులు దారుశకలములను
నెండిన వెదుళ్ల వనినుండి యేరితెచ్చి
చదునుగా గూర్చి యొకపెద్ద సంతరణిగ
వట్టివేళ్లతో బిగియించి కట్టి రపుడు. 1820

క. వీరుఁడు లక్ష్మణుఁ డప్పుడు
నేరెడుకొమ్మలను దెచ్చి నిలిపి తరణిపై
నేరుపునఁ బ్రబ్బతీగలఁ
గూరిచెఁ జీరంబు సీత గూర్చుండుటకై. 1821

ఆ. అపుడు దశరథేశు నాత్మజుఁ డగు రాము
డాదిలక్ష్మిఁబోలి యలరుచుండి
సిగ్గుపడుచునున్న సీతను బ్రియురాలి
కూరుచుండఁ బెట్టె కోలమందు. 1822

క. పిమ్మట జానకి కౌశే
యమ్ములు సొమ్ములును బార్శ్వ మందుంచి స్వకీ
యమ్ములగు పరికరమ్ముల
నమ్ముల న య్యాంతికమున నాతఁడు చేర్చెన్. 1823

ఆ. అపుడు విక్రమాఢ్యు లగు రామలక్ష్మణుల్
తాముఁగూడ నెక్కి తరణి నడుప
నడుప మేటినడుమ నడతెంచుటం గాంచి
సీత ప్రార్థనంబు చేసె నిట్లు. 1824

ఉ. "ప్రస్తుతు లాచరింతు పరపారముఁ జేర్పుము మమ్ముఁ బావనీ!
స్వస్తి యెలర్ప మద్విభుఁడు సత్యముదీర్చి యయోధ్యఁ గాలిడన్
వాస్తవ మమ్మ! యప్పుడె సవత్సములైన సహస్రధేనులన్
శస్తమధుప్రపూర్ణశతసంఖ్యఘటంబుల నిన్నుఁ గొల్చెదన్.

క. వరవర్ణిని యగు జానకి
కరములు ముకుళించి యట్లు కాళింది నదిన్
స్థిరమతి వేడుచు నుండగఁ
దరణియుఁ జేరుకొనె నంత దక్షిణతటమున్. 1826

క. సీతయు రాముఁడు లక్ష్మణుఁ
డా తీరమునందు డిగ్గి యవ్వనిఁ జనుచున్
శీతలము హరిత్పర్ణ
స్ఫీతమునగు శ్యామవటముఁ జేరిరి భక్తిన్. 1827

చ. క్షితిసుత యమ్మహావటముఁ జేరి నమస్కృతిఁజేసి "యో వన
స్పతివర! నా విభుండు కృతసద్వ్రతుఁ డయ్యెడుఁగాక యత్త్రిలో
స్తుతమతి కోసలాత్మజను శుద్ధచరిత్ర సుమిత్ర నే శుభ
స్థితి దరిసింతుఁగాక కృపసేయుము మా కటువంటి భాగ్యమున్."

చ. అని యిటు లర్థి వేఁడుచు వటావనిజంబుఁ బ్రదక్షిణించు న
వ్వినయనిధిన్ మనఃప్రియను విశ్రుతశుద్ధచరిత్ర సీతఁ గ
న్గొని రఘురాముఁ డో "పురుషకుంజర లక్ష్మణ! నీవు ముందుగాఁ
జనదగు శస్త్రధారివయి జానకివెంబడి నేను వచ్చెదన్. 1829

క. ఏ సుమధురఫల మైనను
నే సుందర కుసుమమైన నీక్షించి ధరి
త్రీసుత గాంక్షించినచోఁ
గోసి యొసఁగుచుండు మా మెకున్ ముద మొదవన్." 1830

క. అని రాముఁడు చెప్పిన క్రియఁ
జనుచుండిన దశరథాత్మజన్ముల నడుమన్
జనకతనయ గనుపట్టెన్
ఘనగజయుగమధ్య రమ్యగజవధువు గతిన్. 1831

క. తా నెన్నఁడు మును గానని
కానన కుసుమతరు వల్లి కాగుల్మాఖ్యల్
జానకి రాముని నడుగఁగ
వాని పువులఁ దెచ్చి మఱఁది వదినె కొసంగున్. 1832

క. పలువన్నె లినుకతిన్నెలు
జలవేణులు మెఱయ హంస సారస రుతముల్
సెలఁగ ప్రవహించు యమునన్
దిలకించుచు సీత ప్రియముతోఁ జనుచుండెన్. 1833

ఆ. అన్నదమ్ములైన యా రామలక్ష్మణు
లడవి క్రోశమాత్ర మట్టు లరిగి
వివిధ వర మృగముల వేఁటాడి పచనించి
చేరి సీతతో భుజించి రపుడు. 1834

ఉ. దినత యెన్నఁడుం గనని ధీరు లుదారులు రామలక్ష్మణుల్
జానకియుం బ్లవంగ గజ సంకలితంబు మయూరకూజిత
ధ్వానమునైన య వ్వనపదంబున లీలఁ జరించి తృప్తిమై
నా నదియొద్దనన్ సమతలాశ్రయులై శయనించి ర న్నిశిన్. 1835

## 56-వ సర్గము

ఉ. ఆ రఘురాముఁ డంత నట యామిని వేగఁగ మేలుకాంచి కన
గూరుకుఁజెందు లక్ష్మణుఁ గనుంగొని "తమ్ముఁడ! కాననంబునన్
జారువిహంగరావము వినంబడుచుండెను లెమ్ము; పైనముం
దీరుప వేళయయ్యె శయనించుటకున్ దఱిగాదు" నావుడున్. 1836

గీ. అలయిక యు బద్ధకంబును నపనయించి
లక్ష్మణుం డల్లనల్ల మేల్కాంచుటయును
యమునయందు ముప్పురును గాల్యములఁ దీర్చి
తరలి రా చిత్రకూటపథంబుఁ బట్టి. 1837

క. అనుజునితో రాఘవుఁ డటు
చనుచుఁ జానకిని గాంచి "జలజాక్షీ! యా
మని విరియఁబూచి మోదుగు
లనలశిఖావళుల మెఱయున ట్లుండెఁ జుమీ! 1838

క. ఫుల్లకుసుమలలితంబులు
పల్లవ కలితములు పక్వఫల వినతము లీ
భల్లాతకముల దరి రా
నొల్లదు ప్రజ గాన శాంతి నుందమె యిందుఁ." 1839

గీ. అనుచు లక్ష్మణుఁ గని రాముఁ డనియె నప్పు
"డనుజ! యాఢకతుల్యంబు లగుచు వ్రేలు
తేనెటీఁగలు గూర్చిన తేనెపెరలు
కనఁబడుచునుండె చెట్టుచెట్టునను గంటె. 1840

క. తెరతెరలై రాలిన క్రొ
వ్విరిపఱపుల నుల్లసిల్లు విపినమ్మున సు
స్వరం మెత్తు వానకోయిల
కురుగితము నెమ్మిఁ గూర్చు చున్నది వింటే! 1841

గీ. సమదగజయూధగమనశబ్దములతోడ
విహగ కలకలాలాపముల్ వినఁగ వచ్చె;
గగనచుంబితోత్తుంగశృంగములతోడ
నదిగో! కనవచ్చెఁ జిత్రకూటాద్రి వత్స! 1842

క. సమభూతలరమ్యంబును
సుమధుర ఫలపుష్పభూజ శోభితమును బు
ణ్యమునైన చిత్రకూటో
త్తమవని సుఖముగ వసింపఁదగు మన కనుజా!" 1843

ఆ. అనుచు ముచ్చటించుకొనుచు రాఘవులు భూ
జాతతోడఁ బాదచారు లగుచు
నరిగి యరిగి రమ్యమై మనోహరమైన
చిత్రకూటనగముఁ జేరుకొనిరి. 1844

ఉ. సుందరమై లతాతరువిశోభితమై మధుతోయపూర్ణమై
కందఫలప్రవృద్ధమయి కాంత శకుంతతరు ప్రకీర్ణమై
కందర శైల సాను కటకస్థ మహాముని సేవ్య మౌచు మి
న్నందెడు నా నగంబు గొనియాడిరి కన్గొని రామలక్ష్మణుల్.

క. అగు నిది మన కాశ్రమముగఁ
దగు నిది యని చెప్పుకొనుచు ధరణిజతో నా
ముగురుఁ జనిరి వాల్మీకిముని
భగవానుని యాశ్రమంబుపజ్జను భక్తిన్. 1846

ఆ. వార లట్లు లేగి వాల్మీకి దర్శించి
ప్రాంజలించి వినతిఁ బ్రణతిసేయ
స్వాగతంబు దెలిపి సద్ధర్మమతి మౌని
యతిథిపూజ వారి నాదరించె. 1847

ఆ. అపుడు రామచంద్రుఁ డన్వయ నామ గో
త్రములతోడఁ గూడఁ దమ చరిత్ర
తగిన రీతిఁ దెలిపి ధన్యవాదములతో
వినయ మెనయ మౌని వీడుకొనియె. 1848

గీ. రామచంద్రుఁ డంత సౌమిత్రి గన్గొని
సౌమ్యములు దృఢప్రశస్తము లగు
దారువులను దెచ్చి తగు పర్ణశాలఁ గా
వింపు మిచట మనము విడియుకొఱకు. 1849

ఆ. అన్న మాటమాత్ర నా లక్ష్మణుం డేగి
యర్హ పరికరముల నరసి తెచ్చి
రమ్యమును దృఢావరణశోభితం బగు
పర్ణశాలఁ గూర్ప ప్రభుఁడు మెచ్చి. 1850

ఆ. "అనుజ! యాయురర్థులైనగృహస్థులు
వాస్తుశాంతి సేయవలయుఁ గాన
మనమ విధిగ నేణమాంసంబుతో గృహ
దేవతార్చనంబు దీర్పవలయు. 1851

ఆ. నేఁడు శుభదినంబు నీ వేగి వేగంబ
యిటకుఁ దెమ్ము నల్లయిఱ్ఱిఁ గొట్టి
శాస్త్రదృష్టి మనము చరియింపఁ దగుఁ గదా
ధర్మవిధిని మదిని దలఁపు మనుజ!" 1852

ఆ. అన సుమిత్రసూతి హరిణంబుఁ గొనితేర
సంతసించి రామచంద్రుఁ డపుడు
సన్ముహూర్త మిపుడె సమయంబు దప్పక
యుండ దీని వేగ వండు" మనియె. 1853

ఆ. ఆ ప్రతాపశాలి యగు లక్ష్మణుం డంత
నా మృగంబుగొని యగ్నిశిఖల
న్రస మిగురు దాఁక నంతలోఁ బచనించి
యన్న రాముఁగాంచి యనియె నిట్లు. 1854

క. "ఈ కృష్ణమృగాంగంబులు
సాకల్యము గాఁగ బచనసంస్కృతి గని యా
లోకింప నయ్యెఁ; మునువలెఁ
జేకొని గృహదేవతల యజింపఁ దగు ప్రభూ! 1855

క. నీ వన్నిఁటఁ గుశలుండవు
దేవసమానుఁడవు ధర్మదీక్షామతివై
సేవింపం దగు నవగృహ
దేవతలన్ మంత్రజపవిధిన్ రఘురామా! 1856

ఆ. జపవిశారదుండు సద్గుణుండగు రాముఁ
డపుడు స్నానవిధుల నాచరించి
వాస్తు శాంతి మంత్ర వర్గంబుతోఁ దీర్చె
సర్వకర్మములను సంగ్రహముగ. 1857

గీ. దాశరథి యట్లు గృహదేవతల యజించి
దివ్యతమతేజుఁ డానందభరితుఁ డగుచు
జానకీదేవితోడ లక్ష్మణునితోడ
సవకుటీరప్రదేశంబు నవధరించె. 1858

ఆ. వైశ్వదేవ రౌద్ర వైష్ణవబలులఁచే
శాస్త్రరీతి వాస్తుశాంతిఁ గూర్చి
మంగళప్రదములు మంత్రముల్ జపియించి
రాముఁ డపు డవాప్తకాముఁ డగుచు. 1859

ఆ. మహిపసూనుఁ డంత మాల్యవతికి నేగి
శాస్త్రసరణి మరల స్నానమాడి
పాపనాశకమ్ము పరమోత్తమంబు నౌ
భూతబలిని దీర్చి పూతుఁ డయ్యె. 1860

ఆ. అంత రామచంద్రుఁ డాశ్రమోచితములౌ
వివిధబలివిధానవేదికలును
నగ్నిహోత్రగృహము లాయతనంబులు
నేరుపఱచె నా కుటీరమందు. 1861

మ. ఫలమూలంబులతో సుమావళులతోఁ బక్వామిషాన్నంబుతో
జలసేకంబులతో సమిత్కుశలతో సన్మంత్రపాఠాళితో
స్థలశాంతిప్రద భూతసత్కృతులు శాస్త్రప్రక్రియన్ దీర్చి ని
శ్చలులై చేరిరి పర్ణశాలను ధరాసంజాతతో రాఘవుల్. 1862

క. తరుపర్ణచ్ఛదము మనో
హరము నివాతంబు యోగ్యమగు పర్ణకుటిన్
సరగునఁ జేరిరి ముువ్వురు;
సురలు సుధర్మాఖ్యసభను జొచ్చిన భంగిన్. 1863

క. నానాఖగమృగవిహృతము
నానాచిత్ర సుమగుచ్ఛ నగశోభితముఁ
నానాజంతుధ్వనితము
నైన వనంబందు నుండి రస్నియతాత్ముల్. 1864

గీ. కలవిహంగమ మృగకుల కలితమైన
విమలమాల్యవతీ సుతీర్థమును గనుచు
నతిమనోహర చిత్రకూటాద్రినుండి
పురవిరహదుఃఖ మపుడు దాశరథి మఱచె. 1865

# 57–వ సర్గము

## గుహుఁడు సుమంత్రునితో శృంగబేరమును జేరుట

ఆ. ప్రభకుమారుఁ డట్లు భాగిరథిని దాఁటి
దక్షిణంపుదరిని దరలుచుండ
గుహుఁడు వగచి రాముగుణములఁ బొగడుచుఁ
జనియె సుమంత్రుతోడ స్వపురమునకు. 1866

గీ. అంత నొకనాఁడు గుహుచారు లరుగుదెంచి
దాశరథు లట్లు చని భరద్వాజుఁ గొలిచి
చిత్రకూటంబుఁ జేరి వసించుదాఁక
వినిచిరి సుమంత్రునకు సర్వవృత్తములను. 1867

## సుమంత్రుఁడు తిరిగి యయోధ్య కేగుట.

ఆ. గుహుని వీడుకొల్పుఁ గొని సుమంత్రుం డంత
హయవరములఁ బూన్చి యరదమునకు
రాకొమరుల విరహ శోకార్తిఁ జిక్కి దీ
నాస్యుఁడై యయోధ్య కరుగఁ దొడఁగె. 1868

గీ. వలచు వనములు సరసులు వాహినులును
నూళ్లుఁ బురములుఁ గ్రమముగా నుత్తరించి
యతఁడు మూఁడవనాఁటి సాయాహ్నమునకుఁ
జెలు వెడలియున్న నగరంబుఁ జేరుకొనియె. 1869

ఆ. పొడువడినయట్లు ప్రజల సందడిలేక
యొల్లఁబోవు నా యయోధ్యఁ గాంచి
యా సుమంత్రుఁ డప్పు డతితరదుఃఖార్తిఁ
జిక్కి యిట్లు చింతసేయఁ దొడఁగె. 1870

క. "రామవిరహదుఃఖాగ్నిన్
సామజతురగములతోడ జనగణములతో
సామంతులతో నీ పురి
భూమీశునితోడఁ గాలిపోలేదు గదా ?" 1871

ఆ. అనుచు వగచి సూతుఁ డశ్వంబుల నదల్చి
వేగ పురముఖమున నేగుచుండ
"రాముఁడేఁడి యనుచుఁ బ్రజలెల్ల గుంపులై
పోయి యతనిఁ జుట్టుముట్టికొనిరి 1872

ఆ. అప్పుడా సుమంత్రుఁడా పౌరులం గాంచి
"విశ్వపూజ్యు ధర్మవిదుని రాము
విభుని గంగదరిని విడిచి యాతనిసెల
వంది వచ్చినాఁడ" నని వచింప. 1873

క. సీతారాఘవు లటు గం
గాతటినిన్ దాఁటి పోయినా రనువార్తన్
సూతువలన విని యా ప్రజ
"హా తండ్రీ! రామ!" యనుచు నడలిరి పెలుచన్. 1874

గీ. యజ్ఞ దాన వివాహ సభాంతరముల
కాధ్యుఁ డైవచ్చు ధార్మికుఁ డైనరాము
మనము దర్శింపఁ గలమె క్రమ్మఱ నటంచుఁ
బ్రజలు విలపింపఁ దొడఁగిరి బ్రదుకు రోసి. 1875

క. మన యిష్టము మన సుఖమున్
మన శుభమున్ మన హితంబు మదిఁ గని మనలన్
జనకునివలెఁ బ్రోచెడి య
య్యనఘుని విడనాడి బ్రదుక నగునే మనకున్." 1876

క. అను జన పరిదేవనముల
ఘన సౌధాంగణ గవాక్ష గత పురనారీ
జన రోదనముల సూతుఁడు
వినుచున్ మన మెఱియ రాజవీథిం జనియెన్. 1877

ఆ. జనులదుఃఖములను గనలేక వినలేక
శిరము వంచి సూతుఁ డరిగి యరిగి
రాజగృహముఁ జేరి రథ మాఁపి దిగి కక్ష్య
లెల్ల దాఁటి లోని కేగుచుండ. 1878

క. భాసురవిమానసౌధ
ప్రాసాదంబుల మెలంగు భామిను లెల్లన్
రాసుతుఁడు లేక వచ్చిన
యా సూతుం గాంచి యేడ్చి రతిదుఃఖితలై. 1879

క. తరళాయతనయనంబులఁ
దొఱఁగెడు నశ్రువులతోడ దుఃఖవివశలై
పరితప్తచిత్తముల నొం
డొరులం గనుఁగొనుచు నూరకుండిరి వారల్. 1880

ఆ. అప్పు డంతిపురికి నరుగు సూతునిఁ గాంచి
రాజగృహములందు రాణు లెల్ల
రాకుమారుఁ గనక శోకసంతప్తలై
యిట్లు వగవఁ దొడఁగి రెలుఁగుఁదక్కి. 1881

ఆ. "అపుడు రాముఁగూడి యరిగిన యీ సూతుఁ
డిపుడు రాము వీడి యేగుదెంచి
పుత్రశోకవశతఁ బొగిలెడు కౌసల్య
కెంతకేగి యేమి చెప్పఁ గలఁడు? 1882

క. కడుపారఁగన్న కూరిమి
కొడు కడవులఁ బట్టిపోవఁ గొనయూపిరితోఁ
బడియున్న కోసలాత్మజ
గడెయైనను నింక బ్రదుకఁ గలదే యకటా!" 1883

క. అను వారి సత్యవాక్కులు
తన చెవులకు ములుకులట్లు తాఁకుచు నుండఁ
ఘనశోకాగ్నిజ్వాలలు
మునుకొనినట్లున్న యంతిపురి కతఁ డేగెఁ. 1884

క. అష్టమకక్ష్య సుమంత్రుఁడు
కష్టంబునఁ జొచ్చి కృశునిఁ గడుదీనునిఁ బ్రా
ణేష్టసుతవిరహదుఃఖా
విష్టుని సౌధాంతరస్థు విభుఁ గన్గొనియెన్. 1885

ఆ. అప్పు డా సుమంత్రుఁ డాసీనుఁడై యున్న
నరవరేణ్యు దర్శనంబుచేసి
మ్రొక్కి రామువచనములు యథోక్తములుగా
వినయ వినతుఁ డగుచు విన్నవించె. 1886

క. విని పుత్రవిరహదుఃఖం
బున మివులఁ గృశించియున్న భూపతి యొండే
మన కార్తివశత గతచే
తనుఁడై మూర్ఛిల్లి పడియె ధరణీతలమునన్. 1887

క. క్షితిఁ దమ పతి యాగతి మూ
ర్ఛితుఁడై పడునంత నగరి చేడియ లెల్లన్
ధృతులు సెడి యేడ్వఁ దొడఁగిరి
మితిమీరిన వగల నెలుఁగు మిన్నులు ముట్టన్. 1888

ఆ. అపుడు తత్తరమున నడలుచుఁ గౌసల్య
చని సుమిత్ర తనకు సాయపడఁగఁ
బతితుఁడైన భూమిపతినిఁ జేతులఁ బట్టి
యెత్తి సేదదేర్చి యిట్టు లనియె. 1889

గీ. ఇతరదుష్కరకార్యదీక్షితుని సుతుని
వచనములు విన్నవింపఁగా వనమునుండి
దూతయై వచ్చినట్టి యా సూతుతోడ
"నో మహాభాగ! మాటాడ కుంటివేమి? 1890

గీ. చెడు గపుడుచేసి యిపు డేల సిగ్గుపడెదు?
శుభ మగుంగాత! నీకు నీ సుకృతివలన
లెమ్ము దుఃఖాన కిది సమయమ్ము గాదు;
రఘుకులాంబుధిచంద్ర! ధరాతలేంద్ర! 1891

ఆ. ఎవతె భయమువలన నీవు నీ రాముని
కుశల మడుగఁ గొంకుగొనెద వట్టి
కైక యిచట లేదు గాన నిర్భయముగా
మాటలాడు మిఁక సుమంత్రుతోడ." 1892

క. శోకాతిరేకవిహ్వల
యై కోసలరాజతనయ యటు చెప్పుచు బా
ష్పాకులితనయన గద్గది
కాకంపితకంఠ యగుచు నవనిం బడియెన్. 1893

ఆ. అట్లు నేల వ్రాలినట్టి కౌసల్యను
మూర్ఛ మునిఁగియున్న భూమిపతిని
గాంచి యంతిపురపుఁగామిను లెల్లరు
నేడ్చి రొక్కసారి యెలుఁగు లెత్తి. 1894

అంతిపురములోని యార్తనాదంబులు
విన్నయంతఁ దరుణవృద్ధు లైన
నరులు నారు లేడ్వఁ బురము గగ్గోలయ్యె
నపుడె రాముఁ డడవి కరిగినట్లు. 1895

# 58-వ సర్గము

## దశరథుఁడు సూతుతో రాముఁ డే విధముగా నెచ్చటెచ్చట ఏమి తిని నిద్రించెనో చెప్పుమనుట

క. కొంతవడి కంత ధరణీ
కాంతుఁడు తెలివంది లేచి క్రమ్మఱ సుతు వృ
త్తాంతము విను నాత్రముతోఁ
జెంత నిలిచియున్న సూతుఁ జేరం బిలిచెన్. 1896

చ. తనయవియోగదుఃఖమునఁ దగ్గతచింతనుఁడైనవాని నూ
తనముగఁ బట్టువడ్డ వనదంతివిధంబున రోఁజువాని రో
గనిహతిఁ జిక్కు సామజముకైవడి నూర్చుచునున్నవాని వృ
ద్ధునిఁ బ్రభుఁజేరి మ్రొక్కి వినతుండయి సూతుఁడు చెంత నిల్చినన్.

ఆ. దుఃఖితుండు ధూళిధూసరితాంగుండు
నశ్రుపూర్ణనేత్రుఁ డతికృశుండు
నైన దీను సూతు నరసి మానవనాథు
డెలుఁగు రాలుపడఁగ నిట్టు లనియె. 1898

క. "నిరతిశయధర్మనిరతుఁడు
పరమసుఖోచితుఁడు రామభద్రుఁ డడవి నే
తరువుకడ నేమి తిని యె
త్తెఱఁగున నెందున్నవాఁడొ తెలుపుము సూతా! 1899

క. ఎఱుఁగఁడు కష్టము మెత్తని
పఱుపులఁ బవళించు రామభద్రుఁడు ధరణీ
వరనందనుఁడై యుండియు
బరి నేలను దిక్కుమాలి పవళించె నటే! 1900

గీ. ఎవఁడు బయలుదేఱ నే వేళ వెనువెంట
దంతి తురగ రథ పదాతిచయము
చనునో యట్టి రామచంద్రుండు నేఁ డెట్లు
నిర్జనాటవులను నిలువఁ గలిగె? 1901

క. దారుణ మృగ సంకీర్ణము
క్రూర భుజగ పూర్ణమైన ఘోరాటవిలో
నే రీతి సీతతో సుకు
మారులు మెలఁగుదురు నా కుమారులు చెపుమా! 1902

గీ. ఎండకన్నును వానక న్నెఱుఁగనట్టి
చిగురుఁబోణి యా భూజాత సీతతోడ
రాఘవులు రామలక్ష్మణుల్ రథముడిగ్గి
యడుగు లొత్తంగ నడచిరే యడవినేల? 1903

క. ఘనమందర నగమున న
శ్వినులు ప్రవేశించి నట్లు విపినంబున నా
తనయు లడుగిడుటఁ గన్నులఁ
గని సిద్ధార్థుండ వైతిగాదె సుమంత్రా! 1904

క. రాముం డేమని చెప్పెను?
సౌమిత్రియు నేమి నుడివె? జనకాత్మజ తా
నేమన్నది? యటఁ గానన
సీమకుఁ జనువేళఁ దెలియఁ జెప్పు సుమంత్రా! 1905

క. ఎచ్చటువసించె రాముం
డెచ్చట శయనించె నాతఁ డెచట భుజించెన్
దచ్చరిత వినుచు; సాధుల
ముచ్చటలను విను యయాతిఁ బోలి బ్రదికెదన్." 1906

క. అని యీ గతి నాత్రమునన్
దను మాటికి మాటి కడుగు దశరథవిభునిం
గని యెల్లు తొట్రుపడ యి
ట్లనియె సుమంత్రుండు కనుల నశ్రు లొలుకుచున్. 1907

## సూతుఁడు రాముఁ డవిన మాటలు దశరథునకుఁ జెప్పుట

గీ. "ఓ మహారాజ! ధర్మమే యూతగాఁగ
బ్రాంజలించి శిరంబుతోఁ బ్రణతిఁ జేసి
ప్రీతి రాముండు నీకు విన్పింపు మనిన
యీ నుడులె విన్నవించెద నవధరింపు. 1908

గీ. ధర్మనిరతుండు ప్రత్యక్షదైవతంబు
ననఘుఁడు మహీవిభుండు మహాత్ముఁ డైన
నా జనకు పాదములకుఁ బ్రణామశతము
శిరమువంచి చేసితి నని చెప్పు మనియె. 1909

ఆ. తరతమములు లేక యెఱిఁగింపు నా క్షేమ
వార్త యంతిపురపు వనితలకును
నర్హరీతి వారి కభివాదనంబులు
చేసినాఁడ నని వచింపు మనియె. 1910

క. ఏమఱక మదీయంబగు
క్షేమము నభివాదనంబుఁ జెప్పుము మొదటన్
నా మాతకుఁ గౌసల్యకు
నీ మాటలు గూడదెల్పు మీ వని నుడివెన్. 1911

ఆ. ధర్మనిరతవై యథాకాలమున నగ్ని
హోత్రగృహము నరయుచుండు మమ్మ!
ఆత్మవిభుని దైవ మటు లెంచి తత్పాద
సేవ విడక యెపుడు సేయు మమ్మ! 1912

గీ. తల్లి! మానావమానములఁ దడవఁబోక
తోడి రాణుల నొకరీతిఁ జూడుమమ్మ!
రాణి కైకేయికిని మహారాజునకును
బ్రీతిఁ దప్పక యుండ వర్తింపు మమ్మ! 1913

క. ఒడమికలిమినే జ్యేష్ఠతఁ
బడయు నృపాలుఁ డనుమాటఁ బాటించుచు నీ
కొడుకైన భరతుఁ బుడమికి
నొడయండని యెఱిఁగి మసలుచుండుము తల్లీ! 1914

క. అని మాయమ్మకుఁ జెప్పిన
వెనుకన్ నా మాటగాఁగ వినిపింపుము నా
యనుగుం దమ్ముఁడు భరతున
కని యిటు రాముఁడు వచించె నాదరముమెయిన్. 1915

సీ. నాసేమ మెఱిఁగించి నాతమ్ము భరతుతో
నమ్మల సమరీతి నరయు మనుము
పదవి నొల్ల నటంచు ముదుసలియగు తండ్రి
తలఁపున కెదురాడ వలవ దనుము
యౌవరాజ్యపదంబునందుండి జనకుఁడౌ
నృపుని యాజ్ఞలను మన్నింపు మనుము
ఇక్ష్వాకువంశ సమిద్ధకీర్తి సెలంగఁ
బ్రజలుగాఁ బ్రజలఁ గాపాడు మనుము

గీ. తండ్రి సేవించుచుండుటే ధర్మ మంచు
భావమున నెంచి యేమరుపాటులేక
యఖిలరాజ్యభోగములతో హర్ష మెసఁగ
నవని యువరాజవై యేలు మంటి ననుము. 191

క. తనయునకై వగచెడి నా
జనని న్నీజననివలె నజస్రము నరయం
జను మని నా తమ్మునితో
నను మనె రాముండు మఱియు నస్రుశునయనుఁడై. 1917

క. ఈ విధముగ రాముఁడు రా
జీవారుణనయనుఁ డగుచుఁ జెప్పుచు నస్రు
ప్లావిత వదనాంబుజుఁడై
యో వసుధాకాంత! యంత నూఱకయుండెన్. 1918

## లక్ష్మణుఁ డే మనెనో సూతుఁడు చెప్పుట

క. నీ కొడుకు లక్ష్మణుం డటు
గాక మహాక్రోధవహ్ని గనుగెం పడరన్
గాఁక వడినిడుదయూర్పులు
పైకెగయుఁగ నిట్లు లనియెఁ బార్థివముఖ్యా! 1919

క. అపరాధ మేమి చేసెను
నృపసుతుఁడగు రాఘచంద్రుఁ డిట్లు త్యజింపన్?
గృపణకు కైకకు వశుఁడై
నృపుఁ డపకృతిఁ జేసెఁగాక యిపు డిందఱికిన్. 1920

ఆ. వరము కారణముగఁ దరలించితిని రాముఁ
గాన" కన్నుఁ దప్పుగాకయున్నె?
"రాజ్యలుబ్ధయైన రమణికై విడిచితిఁ
దనయు" నన్న మఱియుఁ దప్పుగాదె. 1921

క. అతఁ డధీశుఁడు గావునఁ
జేతంబునఁ గోరి యిట్లు చేసె నకృత; మే
రీతిం గాంచినఁ గానీ
యే తప్పును లేదు రామునెడ సించుకయున్. 1922

ఆ. బుద్ధిలేక వెనుక ముందుఁ గానఁగ లేక
యగ్రసుతుని రాము నడవి కంపి
జన విరుద్ధకార్య మొనరించి తాఁ జేసి
కొన్న ఫలము నందుచున్నవాఁడు. 1923

క. అతఁడు ప్రభుఁడగుఁ గాతన్
నా తండ్రిగఁ దలఁప నింక నాకుఁ బ్రభుండుఁ
నా తండ్రీ, నాకు బంధుఁడు,
భ్రాతయుఁ, ద్రాతయును నాకు రాముఁ డొకండే. 1924

ఆ. అఖిలభూతహితుని నఖిలలోకప్రియు
ప్రేమధాముఁడైన రాము విడిచి
పాపకృత్యమునకుఁ బాల్పడ్డ తనుఁ బ్రజ
లెవరు గొల్చువార లింక మీఁద? 1925

క. జనరంజకుఁడును ధార్మికుఁ
డనఘుండగు రామచంద్రు నడవి కనిపి భూ
జనమతవిరుద్ధ మగు నీ
ఘనరాజ్యము నెట్టు లేలఁ గలఁడతఁ డనియెన్. 1926

గీ. నృపవరేణ్య! యపుడు నిట్టూర్పు విడుచుచు
మృదులహృదయ సీత మేను మఱచి
కదల మెదల లేక కళలేక భూతంబు
సోఁకినట్టు లట్టె చూచుచుండె. 1927

క. ఏనాఁడు నెట్టికష్టం
బే నెఱుఁగని యట్టి చాన యిద్ధచరితయౌ
జానకి దుఃఖంబున నా
తో నేమని చెప్పుటకును దోఁచక యుండెన్. 1928

ఆ. మ్లానవదన యగుచు మహిజాత యా సీత
యాత్మవిభుని మోము నట్టె గనుచు
రాకొమరుని సెలవు గైకొని నే వచ్చు
వేళఁ గనుల నీరు వెట్టుకొనియె. 1929

గీ. అట్టె రాముండు కైమోడ్చి యశ్రు లొలుక
లక్ష్మణుని దీర్ఘబాహువల్లరుల నొరగె
నపుడు జానకి యేడ్చుచు నరుగుచున్న
రాజరథమును నను గాంచి భ్రమనుపడియె. 1930

## 59-వ సర్గము

### రాముఁ డరణ్యమున కేగఁగా ప్రకృతి యెట్లున్నదో సూతుఁడు చెప్పుట

చ. అప్పుడు నేను రాఘవుల కంజలిచేసి రథంబు నూరికిన్
ద్రిప్పగఁ బోవ నశ్వము లుదీర్ణ కవోష్ణజలంబు గన్నులం
గప్పఁగ నార్తి ముందడిక్కిఁ గా లిడ వయ్యె మఱెంత దేర్చినన్
జెప్పెడి దేమి రామగతచింత మునింగిన వెల్లజీవముల్. 1931

క. క్రమ్మఱ రాముఁడు నన్నున్
రమ్మనునో యనుచు శబరరాజు గుహుని వే
శ్మమ్మున నాతని యాతి
థ్యమ్మునఁ గొన్నాళు లుండి తరలితి నిటకున్. 1932

క. అలఘుగుణు రాము వీడిన
కలఁతన్ నీ దేశమందుఁ గల తరు లెల్లన్
మొలకలతో మొగ్గలతో
నలరులతో వాడిపోయినవి వసుధేశా! 1933

క. చెలమలఁ గొలఁకుల నదులం
గల నీళులు సలసలమని గ్రాఁగుచునుండెన్
లలితోపవనవనంబులు
విలుళిత తరు పత్ర విహృతి వికృతము లయ్యెన్. 1934

క. మెదలని వ్యాళంబులతో
గదలని సత్త్వములతోడ గానన మెల్లన్
ముదము సెడి రాము నెడసిన
యదవదఁబడి ముచ్చముఁడిగిన ట్లుండెఁ బ్రభూ! 1935

ఆ. అడఁగి పోయెఁ దామరాకులు నీటిలో
వలపుదమ్మిపూలు వాడిపోయె:
మీన విహగచయము లీనమై పోయెను
గలఁగిపోయె నీరు కొలఁకులందు. 1936

క. నీటం బుట్టిన విరులను
దోఁటలఁగల పూలుఁ బండ్లుఁ దొల్లిటిరీతిన్
దేటయుఁ బరిమళ మొందక
నీటరి పాటవముదక్కి నెటిసెడి యుండెన్. 1937

ఆ. కలవిహంగముల కలనాదములు లేక
యొప్పుదప్పె నిచటి యుపవనములు
తీరుతీయ మెడలి యా రామవాటికల్
పెంపుదక్కి చూడ సొంపుగావు. 1938

ఆ. నగరిఁ జొచ్చు వేళ నిన్నుఁ గాంచి యొకఁడైన
సంతసించినట్టి జనుఁడు లేఁడు
రామవిభుఁడు లేని రథము గాంచిన మాత్రఁ
దల్లడిల్లిపోయి రెల్లవారు. 1939

ఆ. వీరు మిత్రు లంచు వీ రమిత్రు లటంచు
వీరు సము లటంచు వేరు లేక
ప్రభు కుమారవిరహ పరితప్తచిత్తులై
యేడ్చి రొక్క లాగె యెల్లవారు. 1940

ఉ. ఊరుపుగాడ్పు లెల్లెడల నుబ్బుకొనన్ బహుళార్తనాదముల్
మేరలు మీఱఁగా నవధిలేని వెతంబడు పౌరకోటితోఁ
గూడినచింత గుందు హయకుంజరసంతతితో నయోధ్య పె
ల్లారటమందె రాము విడనాడిన కోసలపుత్రికైవడిన్. 1941

ఉ. నావుఁడు దుఃఖమంది నరనాథుఁడు కన్నుల నశ్రు లొల్కుచున్
"గేవలపాపచిత్తయగు కేకయనందనపల్కు వింటచే
నీ వెత గల్గె సూత! యొకయింత సుహృత్తులకైనఁ దెల్పకే
నే వెడబుద్ధిఁ జేసితి వినిందితకృత్య మిఁకేమిసేయుదున్? 1942

క. హితసచివులకైనఁ బురో
హిత పౌరజనాళికైన నెఱిఁగింపకయే
సతికై కామాంధతఁ జే
సితి నపచారంబు సాహసించి సుమంత్రా! 1943

క. బలవద్దుఃఖముపాల్పడి
కులగౌరవములు నశించి కూలఁగ నిపుడా
చలపాది దైవమే యిటు
దలపెట్టిన దంచు నిశ్చితంబుగఁ దలఁతున్. 1944

గి. ఏ నొకింత మేల్సేసితినేని నీకు
నన్నుఁ గొనిపొమ్ము రాముని సన్నిధికిని;
సచివ! యింకను నా యాజ్ఞ జరుగునేనిఁ
దనయుఁ గొనితెమ్ము నా సన్నిధానమునకు. 1945

క. మన, జాల నిమిష మేనియుఁ
గనులారఁగ రామచంద్రుఁ గనకున్న; ననున్
ఘనుఁ డతఁడు దూర మేగక
మునుపే గొనిపొమ్ము వేగముగ నరదమునన్. 1946

గీ. ఆయతధనుర్ధరుఁడు లక్ష్మణాగ్రజుండు
కుందకుట్మలరదనుండు కోమలాంగుఁ
డెచట నెట్లున్నవాఁడొ? మహీజతోడ
రాముఁ గనకుండ నిచట నే బ్రదుకఁ గలనె? 1947

గీ. తొగలజిగిఁ దులకించు కందోయివాని
లలితసౌవర్ణమణికుండలములవాని
న మ్మహాభాగు రాము గుణాభిరాము
విడిచి క్షణమైన నేను జీవింపఁ గలనె? 1948

గీ. మూఁడు వయసులు చెల్లిన ముసలి నయ్యుఁ
ఘనతరేక్ష్వాకువంశవర్ధనుని రాముఁ
జూచుకొనుచు సుఖింపఁగా నోచనైతి
నింతకంటెను దురదృష్ట మేమి కలదు? 1949

క. హా రామా! హా లక్ష్మణ!
హా రమణీకులమణీ! ధరాత్మజ! సీతా!
మీరెఱుఁగరుగద నే నిటు
దారుణదుఃఖాగ్నిశిఖల దగ్ధుడ నగుటన్." 1950

క. అని విలపించుచు దశరథ
జనపాలుఁ డగాధశోకజలధి పతితుఁడై
మన మెరియ దేవి కౌస
ల్యను గని యి ట్లనియెఁ గనుల నశ్రువు లొలుకన్. 1951

సీ. "శ్రీరామ విరహార్తి భూరివిస్తృతిగాఁగ
ధరణిజాభావంబు తటముగాఁగ
తప్తనిశ్వసనముల్ తరఁగలు సుడులుగా
నశ్రువర్షణము ఫేనాంబువులుగ
బాహువిక్షేపముల్ పాఠీనములుగాఁగ
ఘోర రోదనము నిర్ఘోష గాఁగ
పాపాత్మ కైకేయి బడబానలంబుగా
మంథర కఱపులు మకరములుగ

గీ. గళితకేశముల్ నాచుగాఁ గైకవరమె
యుద్ధతిగ రామచంద్ర వియోగచింత
పొడవుగా మామకాశ్రులఁ బుట్టిపొంగు
నుగ్రశోకాబ్ధిఁ బడి చచ్చుచుంటి దేవి! 1952

క. చూడం గలనే లక్ష్మణు
తోడన్ నా రాము నింక; దురదృష్ట మిటుల్
మూడె నని ఱేఁడు" వగచుచుఁ
బోడిమిచెడి పడియెఁ దల్పమున మూర్ఛితుఁడై. 1953

క. జనవిభుఁడు రాము నెడసిన
వనటున భరియింపలేక వసమటి పడినన్
దనయుని ప్రవాసమునకే
మునికెడి కౌసల్య ద్విగుణముగ భయపడుచున్. 1954

## 60_వ సర్గము

క. భీతిల్లి కోసలాత్మజ
భూతము సోఁకినవిధానఁ బొరిపొరి వగలన్
భూతలమునఁ బడి పొరలుచు
సూతుం గని యిట్లు లనియె శోకాకులయై. 1955

చ. "ఒకక్షణ మిందు నే నిలువ నోపను రాముని( జూడకుండ; జా
నకియు సుమిత్రసూను(డును నా కొమరుండు వసించుచున్న దం
డకవనవాటికిన్ రథమునన్ నను( దోడ్కొనిపొమ్ము జాగుసే
యకు మతులైన నా యుసురు లా(గవు మేన నమాత్యశేఖరా!" 1956

క. అని బాష్పవేగహతయై
వనటం దల్లడిలి యట్లు వాపోయెడి దే
విని( గని సూతుం డిట్లని
యనునయమున( దేర్చ( దొడ(గె( బ్రాంజలి యగుచున్. 1957

గీ. "జనని శోకమోహసంభ్రమంబులు పీడి
శాంతి నుండు మమ్మ! చింతలేక
యడవియందు రాము( డతివతో ననుజుతో
నెలమి నుండె( గష్ట మెఱు(గ కుండ. 1958

క. సౌమిత్రి జితేంద్రియు(డై
రామపదాభ్యర్చనాభిరతు(డై యటవీ
సీమన్ సేమముగా( బర
ధామము సాధించుచుండె ధర్మజ్ఞుండై. 1959

క. సీతాదేవియు వనమున
నైతము భవనమున( బోలి చరియించుచు ని
ర్భీతిన్ శ్రీరామపదా
బ్జాతార్చనమందె మనసుపడి సుఖముండెన్. 1960

క. వనవాసదుఃఖ మనునది
కనుపింపదు సీతయెడల( గొంతయు నో
జననీ! యలవాటుగ( గా
ననమం దున్నట్లె యామె నాకుం దోచెన్. 1961

ఆ. పూర్ణచంద్రవదన పూఁబోఁడి సువ్రత
బాల సీత రామభక్తి నిరత
యుపవనమున నాడుచున్నట్టులే ఘోర
విజన విపినసీమ వేడ్క నుండె. 1962

క. హృదయాబ్జము శ్రీరాముని
పదపీఠమునందె యుంచి పతిజీవితయౌ
సదమలమతి సీతకుఁ బతి
వదలి చనిన యీ యయోధ్య వనమేకాదే! 1963

మ. చనుచోఁ ద్రోవ నయోధ్యవీడి యొకక్రోశం బేగియుఁ జెంతలన్
మనవృక్షంబుల నిర్ఝరంబులఁ బుర గ్రామంబులం గాంచుచున్
జనకక్ష్మావిభుపుత్త్రి రామవిభుసన్ సౌమిత్రిఁ బల్కించి య
ల్లనఁ దద్వృత్తము లెల్ల వించుఁజనె నాహ్లాదంబు రెట్టింపఁగన్.

ఆ. అపుడు సీత కైక ననెఁ జటాలున నేదొ
స్మృతికిరాకయుండె నిపుడు నాకు"
నని ప్రమాదవశత వినిచి సూతుఁడు మాట
మలఁచి దేవి కిట్లు మరలఁ బలికె. 1965

క. "బీరెండవేళఁ గరువలి
మీరి విసరువేళ సంభ్రమించెడి వేళన్
దారిఁ జను వేళ జానకి
చారుతనుప్రభ యొకింత నడలదు దేవి! 1966

సీ. శతపత్రనిభ పూర్ణచంద్రప్రభంబైన
వదనబింబ మొకింత వాడలేదు;
నిరలక్తకము లయ్యుఁ జరణపల్లవములు
జలజ కోరకకాంతిఁ దొలఁగలేదు;

ముక్తభూషణ యయ్యు మునుపటివలె నామె
సవిలాసగమనంబు నడ్పలేదు;
వ్యాఘ్రాది ఘోరసత్త్వములఁ గాంచిన నైన
భయకంప మింత చూపట్టలేదు;

గీ. ఉగ్ర వనసీమలకుఁ బోవుచున్న నైన
నెన్నఁ డెఱుఁగని నడ నేఁగుచున్న నైనఁ
బ్రాణవిభుఁ డగు శ్రీరాముఁ రక్షఁ గన్న
సీత రవ్వంతయును జెక్కుచెదర లేదు. 1967

ఆ. అమ్మ! వారి కెట్టి యపమతియును లేదు
వారికొఱకు మనము వగవ రాదు
ప్రభుఁడు గూడఁ జింతపడఁ గాదు లోక మీ
చరిత మఱచిపోదు శాశ్వతముగ. 1968

ఉ. సీతయు రామలక్ష్మణులు చింత దొఱంగి ప్రహృష్టచిత్తులై
పూతమహర్షి ధర్మమును బూని వనీ ఫలమూలభుక్తులై
తాత యొసంగు నాజ్ఞను యథావిధిఁ దీర్చుచునున్నవారు వి
ఖ్యాతచరిత్రు లట్టి సుగుణాఢ్యులకై వగవంగ నేటికిన్?" 1969

ఆ. అని సుమంత్రుఁ డెంత యాశ్వసించుచు నున్న
వినియుఁ బుత్త్రశోకవివశ యగుచు
"హా కుమార! రామ! హా రాఘవా!" యను
నార్తరవము మాన దయ్యె దేవి. 1970

# 61-వ సర్గము

## నిర్దయుఁడవై రాముని యడవికి పంపఁదగునా యని కౌసల్య దశరథుని దూషించుట

గీ. అఖిలధర్మవిద్వరుఁడు లోకాభిరాముఁ
డైన యేకపుత్త్రుఁడు రాముఁ డడవి కేగ
నధికదుఃఖార్త్తయై కోసలాత్మజాత
యాత్మవిభు భూమివిభుఁ గని యనియె నిట్లు. 1971

క. "దయగలవాఁడు వదాన్యుఁడు
ప్రియవచనుఁడు దశరథుఁ డని త్రిభువనముల న
వ్యయకీర్త్తి గనియు నిటు దు
ర్ణయకృత్యముసేయఁ గూడునా నీకు ప్రభూ! 1972

క. భూతలవర! సుకుమారులు
నీ తనయులు సీతతోడ నిర్జనవనులం
దే తీరునఁ జరియించెద
రే తీరునఁ గష్టముల సహించెద రకటా! 1973

క. సీత సుకుమారి సుఖవతి
లేఁతవయసు చాన యర్మిలిం బెరిగినదై
శీతాతపవాతంబుల
నే తెఱఁగున సైపఁ గలుగు నినవంశమణీ! 1974

ఆ. స్వాదు భక్ష్యములను సరసాన్నము భుజించు
నంబుజాయతాక్షి యైన సీత
నిర్జనాటవులను నివ్వరిమెదుకులఁ
దినుచు నకట! యెట్లు తిరుగఁ గలదు? 1975

గీ. సరస సంగీత వాద్య నిస్వనము లెపుడు
శ్రవణపర్వంబుగా విను జనకజాత
యడవిఁ బలలాశనోగ్రసింహాదికముల
వికృత భీకరారావముల్ వినఁగఁ గలదె? 1976

ఆ. ఇంద్రధనువుఁ బోలి యొప్పుచుండు వి
క్రమభుజోన్నతుండు రాఘవుండు
బరియగోలవంటి కరము తలాడగా
నెటు పరుండఁ గలఁడు కటికనేల? 1977

గీ. పద్మసంకాశమును నేత్రపద్మయుతము
పద్మగంధంబు నగు రామభద్రు నలక
దామభూషితమైన నెమ్మోము నకట!
కన్నులారంగ నే నింకఁ గాంచఁ గలనె? 1978

గీ. రామచంద్రునిఁ గానని నా మనంబు
యీ యెడఁద టాయియో కాక యినుమొ వజ్ర
నిర్మితంబో యైయుండును నిశ్చయముగ 1979
వేయివ్రక్కలుగా ప్రీలి విరియ దేమి?

క. నిరత సుఖోచితు లగు మ
త్పరమాప్తుల వెడల నడపి బడుగులభంగిన్
దిరుగం జేసితి వడవుల
నరనాయక! యెంత దారుణం బిది కంతే! 1980

క. పదునైదవయేఁడైనన్
బదిలుండై వచ్చి రామభద్రుఁడు మరలన్
వదలుకొను రాజ్యపద ధన
పదములఁ బడయుననుకొనను భరతునివలనన్. 1981

చ. ధనకృపణత్వబుద్ధిఁ దనదగ్గఱబంధులఁ బిల్చి శ్రాద్ధ భో
జన మిది యిష్టపంక్తికిని సద్ద్విజులం బిలువంగ వత్తురే
మును భుజియించు పైతృకపుభోక్తలు భూసురులైనఁ గర్త యి
చ్చిన దమృతంబె యైన ద్విజసింహులు పండితు లారగింతురే! 1982

ఆ. అవమతించి వెనుక నామంత్రణముసేయ
నుర్విదేవుఁ డెవ్వఁ డొప్పుకొనును?
శృంగభంగమునకు నంగీకరించునే
యిష్టవిహృతిఁ గన్న వృషవరంబు? 1983

క. శ్రేష్ఠగుణాకరుఁడు వయో
జ్యేష్ఠుండగు రామభద్రుఁ డీ రాజ్యపదా
ధిష్ఠితుఁ డగునే మరలఁ? గ
నిష్ఠుఁ డనుభవించి విడుచు నేలం గొనునే? 1984

క. పురుషోత్తముఁ డగు రాముఁడు
పరభుక్తంబైన రాజ్యపద మొల్లఁడు; క్షు
ద్భరమున నైనన్ వ్యాఘ్రము
పరమృగభుక్తావశిష్టపలలముఁ గొనునే? 1985

గీ. ఆజ్యము హవిష్యమును బురోడాశనంబు
ఖాదిరాదికమగు యూపగణము గుశలు
సవన వినియోజనావశిష్టములు మరల
నన్యయాగకర్మముల కర్హంబు లగునె? 1986

గీ. సారహీనమైనట్టి యాసవముఁ బోలి
నష్టసోమమైనట్టి యజ్ఞంబుఁ బోలి
యన్యపరిభుక్తమైన రాజ్యంబు మరల
నచ్చినను రాఘవుఁడు దాని నందుకొనఁడు. 1987

గీ. రఘుకులాభరణుండైన రామచంద్రుఁ
డింత యవమానమును సహియింపఁ గలఁడె?
సటలఁ బట్టి యూపెడి తిరస్కారమునకు
నుగ్రమృగకులేంద్రుఁడు సైచి యూరకున్నె? 1988

క. లోకము లన్నియు రణమున
నేకంబై వచ్చి రాము నెదురం గలవే?
కాకుత్స్థుఁడు ధర్మాత్ముఁడు
పోకార్చు నధర్మచయముఁ బ్రోచు జగములన్. 1989

క. వీరుం డాయతభుజుఁడగు
శ్రీరాముఁడు హేమపుంఖశితశరములచే
వారిధులే నింకించును
దారుణ లయవహ్నిభూతతతిఁ గాల్చు క్రియన్. 1990

ఆ. అట్టి సింహబలుని నట్టి వృషేంద్రాక్షు
నట్టి పూరుషేంద్రు నట్టి రాముఁ
జంపుకొంటి వీవె జనకుడవ్వైయుండి
మీను కన్నబిడ్డ మ్రింగినట్లు. 1991

ఆ. అనఘు ధర్మనిరతుఁ దనయు శ్రీరాముని
నడవి వెడల నడచినట్టి నీకు
వేదచోదితంబు విప్రసమ్మతమునౌ
ధర్మఫల మదెట్లు దక్కఁ గలదు? 1992

క. సతికిం బతియే మొదలిటి
గతి; రెండవగతి సుతుండు; జ్ఞాతిగుణంబుల్
క్షితి మూఁడవగతి; నాల్గవ
గతి యనునది లేదు లేదు గాదే జగతిన్. 1993

ఆ. నా సపత్నిఁ గూడి నాకీవు లేవైతి
వనుఁగుసుతునిఁ గాన కనిపినావు;
ఇల్లు విడువనేర నెల్లవిధంబుల
నాథ! నన్నుఁ జంపినాఁడ వీవు. 1994

ఉ. కూలిచినావు రాజ్యమును గూలితి వీవు నమాత్యకోటితోఁ
గూలిచినావు నన్గొమరుఁ గూలిచినాఁడవు పౌరసంతతిన్
గూలిచినాఁడ వందఱను గొంకక యింక సుఖింపనిమ్ము నీ
యాలిని గైకనుం బ్రియతమాత్మజునిన్ భరతున యథేచ్ఛగన్” 1995

క. అని కర్ణకఠోరంబుగ
వినిచిన కౌసల్యనుడులు విని దుఃఖితుఁడై
మునుఁ జేసిన యొక దుష్కృతి
మునుకొని మది దాఁక విభుఁడు మూర్ఛితుఁ డయ్యెన్. 1996

## 62–వ సర్గము

ఆ. శోకవశత నట్లు సోలిన నరపతి
దీర్ఘకాలమునకుఁ దెలివిఁ గాంచి
యంతికమునఁ గోసలాత్మజఁ గనుఁగొని
యెంతొ జాలిగదుర నిట్టు లనియె. 1997

ఆ. “నేను గేలుమోడ్చి నిన్ను బ్రార్థించెద
దేవి! నన్నుఁ గరుణఁ దేర్పు మీవు;
వరగుణాఢ్య వీవు పరమశత్రువు నైన
దయ క్షమించుట్టి దాన వీవు. 1998

క. “సతతస్వధర్మరత యగు
నతివకు సుగుణాఢ్యుఁ డైన నవగుణుఁ డైనన్
బతియే సాక్షాత్కృత దై
వత మని పెద్దలగువారు వచియింత్రుగదా! 1999

ఆ. అట్టి ధర్మచరిత వనయ నయంబులఁ
దెలియఁ జాలినట్టి దేవి వయ్యు
నేడ్చుచున్న నన్ను నింకను నేడ్పింప
నప్రియంబు లిట్టు లాడఁ దగునె?" 2000

## దశరథుని క్షమింపుమని కౌసల్య కోరుకొనుట

ఆ. అనుచు దీనుఁడైన యధిపుఁడు గనికర
ముట్టిపడఁగ నాడినట్టిపలుకు
లాలకించి రాణి యశ్రుధారల నొల్కె
సౌధనాళి వర్షజలముఁ బోలి. 2001

ఆ. అపుడు ధర్మభీత యగు దేవి శోకంబు
మునుకొనంగ విభుని మోడ్పుగేలుఁ
దమ్మిదోయిఁ బోలెఁ దలఁ దాల్చి తొట్రిల్లు
నీరెలుంగుతోడ నిట్టు లనియె. 2002

క. "నీ యడుగులఁ బడి వేఁడెద
నా యెడలఁ బ్రసన్నుఁ డగుము నాథా! యిటు నీ
చే యాచితనై పొందిన
నా యఘమున కర్హదండనము చేయఁదగున్. 2003

క. మతిమంతుఁడు గుణయుతుఁ డగు
పతిచేఁ బ్రార్థింపఁబడిన పాపాత్మికయౌ
సతి కిహపరలోకంబుల
గతి లేదని యుగ్గడింత్రుఁ గాదె నయజ్ఞుల్. 2004

క. ఎఱుఁగుదు ధర్మము నిన్నే
నెఱుఁగుదు ధర్మజ్ఞఁ గాఁగ ఋతవాదివిగా
నరవర! పుత్త్రవ్యథచే
మఱుఁగుచు నేమేమొ యంటి మన్నింపఁ దగున్. 2005

క. శోకము ధైర్యముఁ జెఱుచును
సహనమ్ముఁ జెఱుచు శ్రుతముం జెఱుచున్;
శోకము సర్వముఁ జెఱుచును
శోకసమవిరోధి నెందుఁ జూడము నాథా! 2006

క. ఆకస్మికముగ శత్రువు
దాఁకి ప్రహారింప నోర్వఁ దగు నెట్లెటులో
యాకస్మిక దుఃఖాహతి
సోఁకోర్వం గలమె యెంత సూక్ష్మం బైనన్? 2007

క. వనవాసమునకు రాముఁడు
చని యైదుదినంబు లయ్యె సరిగ గణింపన్
జననాథ! దుఃఖవశమునఁ
గన నయ్యెన్ నాకు నవి యుగంబులు గాఁగన్. 2008

ఆ. తనయు రాముమీఁది తలఁపులు మది నిండఁ
బట్టరాని వంత ప్రబలుచుండె;
వాహినీచయప్రవాహవేగమున నం
బుధిజలంబు పొంగి పొరలినట్లు." 2009

ఆ. అనెడి రామమాత యనునయోక్తులు విని
రాజు తేరుకొనియె; రవియుఁ గ్రుంకె;
రాత్రి యేగుదేర రామచింతనతోనె
కుంది కుంది విభుఁడు గూర్కుఁ జెందె. 2010

# 63-వ సర్గము

## దశరథుఁడు కౌసల్యకు తన తొల్లిటి దుష్కృతమును దెల్పుకొనుట

క. వనికిం దనయులఁ ద్రోసిన
వనట న్నిదురింపలేక వాసవనిభుఁడౌ
జనపతి విపదార్తింబడె
ఘనరాహుగ్రస్తుఁడైన గ్రహపతిఁ బోలెన్. 2011

క. పటుతరశోకంబున నె
ప్పటి కప్పుడె దేవి కెఱుకపఱచు తలఁపుతో
నటమటిలు విభుఁడు తన తొ
ల్లిటి దుష్కృతిఁ గూర్చి యుమ్మలించుచు నుండెన్. 2012

ఆ. అడవి కట్లు రాముఁ డరిగిన యాఱవ
నాటిరాత్రి విభుఁడు చేటు దలఁచి
తనయవిరహశోకతప్తయౌ కౌసల్యఁ
గాంచి యిట్టు లనియె గరుణవుట్ట. 2013

క. "దేవి! యెఱిఁగియొ యెఱుఁగకొ
కావించు శుభాశుభాదికర్మంబులకున్
దావలములైన ఫలములు
పోవనుభావ్యములుగాక పురుషుని కెందున్. 2014

క. కార్యాకార్యంబుల యూహం
తర్కంబుల మేలుగీళ్లఁ దలపోయకయే
కార్య మొనరించి చేసిన
చర్య కవల వగచువాఁడు జాల్ముఁడు గాఁడే? 2015

ఆ. పువ్వురంగుఁ గాంచి పోడము నీ రీతినే
పండుగూడ ననుచు భ్రాంతినొంది
మోకమావిగొట్టి మోదుగుఁబెంచువాఁ
డవల దుఃఖఫలమె యనుభవించు. 2016

ఆ. ఎడఁద మంచిచెడ్డ లించుక యెంచక
కార్యముల నొనర్పఁ గడఁగువాఁడు
రతనములను విడిచి రాలను గ్రహియించు
నతనివలెనె దుఃఖ మనుభవించు. 2017

గీ. అట్టి దుర్మతినిం బోలి నట్టి నేను
బాల్యమున వేఁటుతమినిఁ బాపంబుచేసి
సౌఖ్యముల నందఁ దగిన యీ సమయమందుఁ
బుత్త్రునెడఁబాసి దుఃఖంబుఁ బొందుచుంటి. 2018

ఉ. "ఈతఁడు శబ్దవేది" యని యెంతయు ఖ్యాతివహించియున్న నా
లేఁతవయస్సునం దొక శిలీముఖఘాతముచేసి చేసితిఁ
బాతకమొండు; వ్యాళవిషపానముచేసిన బాలులీల నే
నీ తఱిఁజచ్చుచుంటి నది యిప్పుడు నా కనుభోగ్యమౌటచేఁ 2019

శా. దేవీ! నే నినుఁ బెండ్లియాడుటకు ముందే తండ్రిచే యౌవరా
జ్యావాప్తిం గని నిర్వహించునెడ జీవానందసంధాయకం
బై వర్షావసరంబువచ్చె; నరనార్యంతస్స్మరప్రాభవ
ప్రావిర్భావము దుస్సహాతప తిరోభావంబు గావించుచుఁ. 2020

సీ. రవి భువి రగిలించి రసమెల్ల గ్రసియించి
తిరిగి ప్రేతాధిపు దెస వసించె
కేకి సారంగ మండూక హర్షదములై
చల్లని జలదముల్ జాలువాఱె

జడిగొన్న మత్తగజంబు నిర్భంగమౌ
జలరాశివోలి నిశ్చలత నుండె
పక్షముల్ దడిసిన పక్షులు జడిగాలి
దులిపిన వృక్షాగ్రములను జేరె

గీ. స్వచ్ఛ మయ్యును వర్షప్రవాహవారి
శిఖరిధాతుయోగంబునఁ జిత్రవర్ణ
కలితమై దావధూళిచేఁ గప్పుఁగాంచి
భుజగలీలలఁ బ్రవహించి పోవుచుండె. 2021

గీ. అట్టి యానందమయ సమయంబునందు
వేఁటుతమ్మకంబు నా మది వేఁగిరింప
ధనువుశరములు దాల్చి రథంబు నెక్కి
వెడలితిని సరయూనదీ విపినమునకు. 2022

క. ఆ నదికిందగగొని జల
పానమునకు నేగుదెంచు భయదమృగమునో
యేనుఁగునో యెనుబోతునో
పూనిక సేయంగ నుంటి పొంచి చపలతన్. 2023

క. అంతం గన్నులు గానని
సంతమసంబునను నాకు జలమధ్యమునన్
ముంత మునుచు బుడబుడ రొద
దంతావళఘీంకృతివలెఁ దాఁకెన్ శ్రుతులన్. 2024

క. నే నపుడు క్రూరసర్ప స
మానంబగు తీవ్రశరము మౌర్వీఁ దొడఁగి పెన్
బూనిక శబ్దమె గుఱిగా
నేనుఁగనుచు చంపనెంచి యేసితి దానిన్. 2025

ఆ. అంతలోనె నీటికై వేకువనె వచ్చి
యస్మదీయబాణహతిని దూలి
యేటc బడిన యొక్క యాటవికుని మొఱ్ఱ
యచటునుండి వినcగ నయ్యె నిట్లు. 2026

క. "నేను దపస్విని; నాపై
నీ నారస మెట్లు పడియె? నెవ్వం డేసెన్?
నా నేర మేమి? యెవ్వరు
గానని సమయమున నీటికై వచ్చితినే! 2027

క. మునికులుని నహింసామతి
వనచరజీవనుని వసనవల్కలుని జటా
జినధరునిc దపోనిష్ఠుని
నను@ జంపcగ నేమివచ్చినది యాతనికిన్? 2028

ఆ. ఎట్టిఫలము లేక యే కారణము లేక
యిట్టి హింస చేసినట్టి చెనcటి
పరమపాపియైన గురుతల్పగునిc బోలి
లోక నికృతిపాలు గాకయున్నె? 2029

ఉ. చావున కే నొకింతయు విచారము నొందుట లేదుగాని నా
సేవయె దిక్కుగా బ్రదుకు చీcకులు వృద్ధులు తల్లిదండ్రు లిం
కేవిధి పుత్రశోకము సహింతురొ పాపును బ్రోపు లేక తా
మేవగ జీవితంబుల వహింతురొ యంచుc దలంచి కుందెదన్. 2030

క. మతిహీనుం డకృతాత్ముం
డతిదుష్టుం డగుచు నొక్కయమ్మున నన్నుం
బితరుల వృద్ధుల నకటా!
మృతులం గావించె నతని కేమి లభించెన్?" 2031

క. అని కరుణ ముట్టిపడఁగా
వినవచ్చిన మానుషార్తవిలపనములకున్
మన మెరియఁ బాపభీతిం
గను నాకే ల్లాటిపడియెఁ గార్ముకశరముల్. 2032

ఉ. ఆ నిసి నట్టిదుఃఖకరుణాలపనంబులు విన్నయంతనే
నేను విచేష్టితుండ నయి నెవ్వగ నచ్చటి కేగి కాంచితిన్;
దీను బ్రవిద్ధవారిఘటుఁ దీవ్రశరాహతు శీర్ణ కేశునిన్
మౌనికుమారు భూపతితు మర్మనిపీడితు శోణితాంగునిన్. 2033

క. దిటవుచెడి పాపభయమున
గటకటపడుచున్న నన్నుఁ గన్నుల నవల
చ్చటు లురలఁ గాంచి య మ్ముని
వటు విటు లనె నపుడు కఠినవచనోద్ధతుఁడై. 2034

క. "జననీజనకుల కుదకము
గొనిపోవఁగ నున్న నన్నుఁ గొట్టితి వకటా!
వనవాసిని మునిపుత్త్రుఁడ
జనవర! నీ కేమికీడు సలిపితిఁ జెపుమా! 2035

క. నీ నిశితబాణహతిచే
నే నిటు జచ్చుటయెకాదు నృప! నా పితరుల్
దీనులు వృద్ధులు నంధులు
గానం జచ్చెదరు దిక్కుగానక యకటా! 2036

ఆ. దిక్కులేనివారు తృష్ణార్తులగు వారు
నన్నె యెదురుచూచుచున్నవారు
ముదిమిఁ గదలలేని మునులు నా తలిదండ్రు
లెట్లు బ్రదుకువార లింకమీఁద? 2037

ఆ. క్రూరబాణనిహతిఁ గూలి నే నిచ్చట
జనకుఁ డెఱుఁగకుండఁ జావవలసె;
నెంత విద్యయైన నెట్టి తపంబైన
దైవమును మరల్ప లేవు నిజము. 2038

ఆ. కదలమెదలలేని ముదుసలి నా తండ్రి
యెఱిఁగియున్ననైన నేమిసేయు?
గాలి దూలిపడెడు సాలంబు నాపునే
చేవలేనిచెట్టు చెంత నున్న? 2039

గీ. జనవరా! శీఘ్ర మేగి నా జనకునకును
వృత్తమెల్ల నెఱింగించి వేఁడుకొనుము
కాకయున్న శపించి పోకార్చు నిన్ను
నడవిని దహించునట్టి దావాగ్నిఁ బోలి. 2040

క. ఇదె నా జనకుని యాశ్రమ
పదమునకున్ జనెడి కాలిబాట; వెడలి యా
ముదుసలిని దుఃఖితాత్ముని
సదయునిగాఁ జేసికొనుము సాంత్వనసూక్తిన్. 2041

క. నరవర! మర్మాహత మీ
శర మూడంబెఱుకు మింక శ్రమ పడఁజాలన్
బరమోన్నత మృదు తటమును
ఝురవేగమువోలి కఱచి చంపుచు నుండెన్." 2042

క. అని తెలుపఁగ విని "యీ ముని
తనయుఁడు శరవేధబాధ తాళక యుండెన్
దనువున దీనిం బుచ్చిన
మనఁగలఁడే యన్నశంక మది గలఁచె నన్నుఁ. 2043

ఆ. బ్రహ్మహత్యవలన భయమున భీతిల్లి
విపులదుఃఖశోకవికలమతిని
నటమటించుచున్న యట్టి నా హృదయార్తి
మౌనిపుత్రుఁ డంత మది నెఱింగి. 2044

ఆ. అవశితాఖిలాంగుఁ డతిదుఃఖితుం డయి
ధరణి పొరలి పొరలి మరణబాధ
నందుచున్న యాతఁ డతికష్టమున నన్నుఁ
గాంచి పలికె హీనగళరవమున. 2045

గీ. ధైర్యము వహించి శోకబాధను సహించి
చిత్తమును సుస్థిరంబుగాఁ జేసికొంటి;
బ్రహ్మహత్య చేసితి నని భయముపడకు
మధిప! నావలె నీవు ధైర్యంబు గనుము. 2046

ఆ. నేను భూమిసురుఁడఁ గా నించుకంతయు
నట్టిసంశయంబు నందవలదు;
వైశ్యువలన శూద్రవనిత గర్భంబునఁ
బుట్టినట్టివాఁడ భూవరేణ్య!" 2047

ఆ. అనుచు బాణవేధ నటునిటుఁ బొరలుచుఁ
దెలివి మఱపు లంది మఱుఁగుచున్న
యతనిఁ జేరి బాణ మల్లన నెడలించు
నంతలోనె మరణ మందె నతఁడు. 2048

క. జలసిక్తగాత్రు మర్మ
స్థలశరహతు ధరణిపతితు శ్వసితు సరయూ
తలవిలపితుఁ గన్నప్పుడె
కళవళపడి పాపభీతిఁ గలఁగితి దేవీ!" 2049

# 64–వ సర్గము

క. అని ధర్మాత్ముఁడు దశరథ
జనపాలుఁడు మునికుమారుఁ జంపిన పాపం
బును దలఁచి తలఁచి పొగులుచు
ననియె మరలఁ దేవిఁగాంచి యలజడిపడుచున్ 2050

క. దేవీ! యట్లే నెఱుఁగక
కావించిన పాపమునకుఁ గడు భయపడుచున్
భావించితి నెమ్మనమున
నే విధి శ్రేయంబు గలుగు నిఁక నా కనుచున్. 2051

క. జలపూర్ణకలశ మప్పుడు
వలమూఁపునఁ దాల్చి మౌనివటు వటు నాకున్
దెలిపిన త్రోవం జని ముని
తిలకుని యాశ్రమముఁ జేరితిని మెలమెల్లన్. 2052

సీ. అట్టు లేనేగి య య్యంధుల నబలుల
దీనులఁ జేయూఁతలేనివారిఁ
బక్షముల్ నఱికిన పక్షులకైవడి
మన్నుంటి లేవలే కున్నవారి
నేకపుత్త్రునిరాక నెదురుచూచుచు దప్పి
నతనినే తలపోసి యడలు వారి
నాచేత నాశావినాశమై పోవుట
యొక్కింతయు నెఱుంగ కున్నవారిఁ

ఆ. గదలలేనివారి గతిలేని వారి న
త్తపసిపుత్త్రు తల్లిదండ్రులఁ గని
దుఃఖహతుఁడ నగుచు దురితభయంబునఁ
గలఁగి యెంతొ తల్లడిలితి నపుడు. 2053

క. ముని నా యడుగుల సడి విని
తన సుతుఁ డేతెంచె ననుచుఁ దలఁచి పిపాసన్
"దనయా! తడవే లయ్యెను
గొనితెమ్మిటు జలము నాదుగొంతు దడిపెదన్." 2054

ఆ. ఇంత దప్పితోడ నేము గుందుచునుండ
నీఁదులాడుచుంటె యేటినీటఁ?
దల్లడిల్లుచుండెఁ దల్లి నీరాకకై
తనయ! వేగ రమ్ము దగ్గఱకును. 2055

శా. "నీవే కన్నులు గాలు గేలుగవగా నీవే శరణ్యంబుగా
నీవే ప్రాణముగాఁగ నున్న మము మన్నింపం దగున్ దప్పులే
వేవో చేసినవున్నఁ; దాపసివి గావే నీవు? మాటాడ కు
న్నావేమోయి కుమార! మా నెగులుమాన్పన్ రమ్ము జాగేటికిన్?"

క. అని ముని తహతహపడుటన్
గని నే భయమంది పలుకు గాద్గద్యంబున్
మనమును గుదురుపఱచుకొని
వినిపించితి నతని కిట్లు విప్రియవార్తన్. 2057

సీ. "ఏను నీ తనయుండఁ గాను సంయమివర్య!
సవితృకులుండను క్షత్రియుండ
నను దశరథుఁ డంద్రు నా కర్మవశమున
నార్యనిందితదుఃఖ మయ్యె నిట్లు;
వేఁటాడువేడుక విల్లునమ్ములు దాల్చి
యీ సరయువుచెంత కేగుదెంచి
నీరానఁ జేసి యే క్రూరమృగం బైన
రాఁ గలదని కన్నొంఱంగియుంటి;

గీ. జలమున ఘటంబు ముంచిన చప్పు డపుడు
శ్రవణములఁ బడ వారణభ్రాంతిఁ జెంది
శబ్దమే లక్ష్యముగఁజేసి చాపమునను
శరము సంధించి విడిచి తత్క్షణమ నేను. 2058

క. చని యంత నదీతటమున
ఘనశర నిర్భిన్నహృదయు గతచేతనునిఁ
మునితనయు ధరాపతితునిఁ
గనుఁగొంటిఁ గాతరతను గళవళపడుచున్. 2059

క. మౌనీంద్ర! యేమి చెప్పుదు
నేనుంగని భ్రాంతిఁజెంది యే నేయంగా
మానితుఁడగు నీ తనయుఁడు
నా నిశితశిలీముఖంబునకు గుఱి యయ్యెన్. 2060

ఆ. అతనిచెంత కరిగి యపచార మెఱిఁగించి
యర్థివేఁడుకొనఁగ నాలకించి
"విశిఖ మెడఁదనాఁటి వేధించుచున్నది
వేగ దీసిఁ బెఱికివేయు" మనియె. 2061

క. ఆ కరణి నే నొనర్పఁగఁ
"జీఁకులు నా పితరు లెట్లు జీవించెదరో
సాకెడువా రికఁ నెవ" రని
శోకించుచు నాతఁ డంత సురపురి కరిగెన్. 2062

క. నే నజ్ఞానవశంబున
నీ నందనుఁ జంపి పాపనిష్ఠుఁడ నైతిన్;
నా నేరమి సైరింపం
గా నీవే కర్త వగుదు గాదె మహాత్మా!" 2063

క. అను దారుణవార్తన్ విని
ముని దుఃఖోద్రిక్తబాష్పముఖుఁడై నిట్టూ
ర్పును విడిచి వినతు నన్నుం
గనుఁగొని యిట్లనియెఁ గ్రోధకంపితుఁ డగుచున్. 2064

ఆ. "జనవరేణ్య! నీవె స్వయముగా వచ్చి యీ
యశుభవార్త దెలుపకైతి వేని
నిమిషమాత్రముననె నీ తల యొకలక్ష
పఱియ లగుచు నేలఁబడక యున్నె? 2065

ఆ. ఎఱిఁగి యే నృపాలుఁ డేని వానప్రస్థుఁ
జంపెనేని యతఁడు శక్రుఁడైన
ధర్మబాహ్యుఁ డగుచుఁ దత్క్షణమాత్రన
నైజపదవినాశనంబు గనఁడె? 2066

ఆ. సంయమీంద్రు బ్రహ్మచారి నెఱింగియు
శరనిహతునిఁ జేసి చంపినట్టి
పాపకర్ము శిరము బహుధా విభిన్నమై
నేలఁ గూలకున్నె నిమిషమాత్ర. 2067

క. తెలియక యీ దుష్కృతమున్
సలిపితి వటుగాన బ్రదుకఁ జాలితి వింకన్
దెలిసియు జేసినఁ గులమే
నిలువదు నశియింపకుండ నీ వెంత నృపా! 2068

చ. జనవర! మమ్ము నయ్యెడకుఁ జయ్యనఁ దోడ్కొనిపొమ్ము భూమి శా
యిని రుధిరార్ద్రదేహుని విహీనవిచేష్టుని స్రస్తవల్కలా
జినునిఁ బరేతరాడ్వశుని జీవనదాతను మా కుమారునిన్
గని కడసారి యొద్దెదము గన్నులఁ జూచుటలేదు గావునన్. 2069

ఆ. అనుచు దుఃఖపడెడు నంధుల వృద్ధుల
మౌని దంపతులను నే నొకండఁ
గొడుకువడిన యెడకుఁ గొనిచని వారిచేఁ
దడవఁ జేసినాఁడఁ దనయు మేను. 2070

క. అనఘ తపోనిధులగు న
మ్మునిదంపతు లపుడు దుఃఖమున సుతుదేహ
మ్మునఁ బడి తడవుచు నేడ్చిరి
వనటుంబడి మఱియు మౌనివరుఁ డిటు వగచెన్. 2071

సీ. అరసి మ్రొక్కవు పలుకాడవు బరినేలఁ
బడియుంటి వేమికోపము కుమార!
నా మాట పోనిమ్ము నీ మాత నైనను
బలుకరింప విదేమి చలము తనయ!
నీ విట్టులై పోవ నిగమముల్ నా చెవి
కింపుగాఁ బఠియింతు రెవరు పుత్ర!
స్నానసంధ్యలు దీర్చి జ్వలను నుపాసించి
యెలమి నన్ దనుపువా రెవరు కొడుక!

ఆ. కదలమెదలలేని ముదుసలిచీఁకుల
మైనమాకు దిక్కులేని మాకు
నడవిపండ్లు దుంప లాహారముగ నిచ్చి
యెవరు మమ్ముఁ బ్రోతు రింక తండ్రి! 2072

క. కనుగానరాని ముసలిన్
దనయ వియోగాతి దుఃఖతప్తతపస్విన్
వనవాసిని దీనన్ నీ
జనని న్నెనెటు భరింపఁ జాలుదు బిడ్డా! 2073

ఉ. ఆఁగుము పుత్త్ర! నేఁటికి యమాలయముం దరిసింప నొంటిగా
నేఁగకు; రేపు వృద్ధులగు నేమును నీ వెనువెంటఁ దోడుగా
రాఁగల; మెట్టులుండెద మరణ్యమున న్నినువీడి కుందుచున్?
జాగున నేను దండధరుసన్నిధి వేఁడెద వే క్షమింపఁగన్. 2074

గీ. పరమధర్మాత్ముఁడును లోకపాలకుండు
నిర్మలయశుండు నగు యమధర్మరాజు
మా యనాథత నీ పితృమాతృభక్తి
నెఱిఁగి కరుణించి యభయంబు నీయఁ గలఁడు. 2075

క. పాపకృతియైన దశరథ
భూపాలుని బాణనిహతిఁ బొలియుకతన ని
ష్పాపుఁడ వైతివి; శూర
ప్రాపణమగు పుణ్యపదముఁ బడయుము తనయా! 2076

సీ. ఆహవంబునను వెన్నాడక పోరాడి
మరణంబుగను శూరు లరుగు గతికి
గోదాన భూదాన వేదాధ్యయనపుణ్య
కర్మదీక్షాపరుల్ గాంచు గతికి
గంగాది వరనదీసంగమంబులఁ దను
త్యాగంబుఁ జేయు నుత్తముల గతికి
సగర శైబ్య దిలీప జనమేజయాది మ
హారాజు లేగిన యమలగతికి

గీ. నాహితాగ్నులు తపసులు నందుగతికి
నేకపత్నీవ్రతాన్వితు లేగు గతికి
సాధుగురుజనారాధకుల్ సనెడుగతికి
నరుగుమో పుత్త్ర! నీ వట్టి పరమగతికి. 207

గీ. మా కులంబునఁ బుట్టిన మోకయైన
సద్గతినె గాని దుర్గతిఁ జనఁగఁ బోదు;
మ త్సుతుని నిన్నుఁ జంపిన మనుజవిభుఁడె
పాపహతిఁజేసి దుర్గతుల్ వడయుఁగాక!" 2078

గీ. అనుచు విలపించి మౌని భార్యయును దాను
నాత్మజుని కుత్తరక్రియ లాచరింప
నతఁడు పుణ్యవశంబున నమరపురికిఁ
జనుచుఁ బితరుల నిట్లని యనునయించె. 2079

క. "తలిదండ్రులార! మిమ్ముం
గొలిచిన పుణ్యఫల మందుకొనఁ గల్గితి; మీ
రలు గూడ వేగ నన్నుం
గలిసికొనంగలరు వగవగాఁ దగ దింకన్." 2080

క. అని మునితనయుఁడు పితరుల
ననునయమునఁ దేర్చి సురరథారూఢుండై
చనియె మహేంద్రునితోడన్
దన సుకృతింజేసి స్వర్గధామంబునకున్. 2081

ఆ. కేలుదోయి మొగిచి కెలన నిల్చిన నన్ను
గూర్చి యపుడు తపసి "క్షోణినాథ!
యేకపుత్త్రు నాకు లేకుండఁ జేసి తీ
కుందు మాన్పు నన్నుఁ గూడఁ జంపి. 2082

ఉ. పావనమూర్తి మత్సుతునిబట్టి వధించితి విట్లవిజ్ఞతన్
గావున నీకు రాజగుటఁ గల్గదు బ్రహ్మవధాఘ; మైన నో
భూవలయేంద్ర! మా వలెనె పుత్త్రవియోగజ దారుణార్తిచే
నీవును గుందికుంది మరణింతువు; కర్మఫలంబు దప్పునే? 2083

క. నను నింతటి దుఃఖంబున
మునిఁగించిన నీ వవశ్యముగఁ దత్ఫలమున్
గనియెదు జనవర! జన్నం
బున దక్షిణ లిచ్చినట్టి పురుషుని పోల్కిన్." 2084

ఆ. సంయమీంద్రుఁ డిట్టి శాపంబు నా కిచ్చి
పనవి పనవి ధర్మపత్నితోడ
నతనె యప్పుడే చితారోహణముచేసి
యమరపట్టణమున కరిగె దేవి! 2085

ఆ. శబ్దవేధి లక్ష్యసాధనవేళ బా
ల్యమున నేనుఁ జేసినట్టి యఘము
జ్ఞప్తి కిపుడు వచ్చి నను జంపుచుండె; వి
రుద్ధభోజనంబు రోగిఁ బోలె. 2086

క. మునివరుని శాప మిప్పుడు
ననుఁ బొందెన్; దమము గ్రమ్మె నా నయనములన్;
ననుఁ గరముల స్పృశియింపుము
నినుఁ గనలేకుంటి నెదుటనే నీ వున్నన్. 2087

ఆ. కరుణమాలి రాముఁ గాన కంపితి; నట్టి
తప్పుపనికి నేను దగుదుఁ గాని
యిట్టి యాజ్ఞ దీర్ప నెవఁ డోపు? శ్రీరామ
చంద్రుఁ డొకఁడు దక్క జగతిలోన?" 2088

ఆ. అనుచు దుఃఖపడుచు నధిపుఁ "డో దేవి! యే
విజ్ఞుఁడైన తండ్రి విడువఁ గలఁడు?
దుడుకుకొడుకునైనఁ దొడరి యీ యాజ్ఞ నే
కొడుకు దీర్పనెంచుఁ గూడదనక? 2089

గీ. ఎదురు చెప్పక యట్టి నా ముదలఁ దీర్పఁ
గాన కేగిన సుతుఁ గానలేని దుఃఖ
కీల నా జీవనముల నింకించుచుండెఁ
బల్వలోదకముల నాతపంబుఁ బోలి. 2090

చ. కనులను జీఁకటు ల్గవిసెఁ గానఁగ నేరను నిన్ను దేవి! నా
తను వతిభార మయ్యె స్మృతిదప్పుచునున్నది; కాలువీటికిఁ
జనియెద; రాముఁ డిత్తఱిని సన్నిధినుండినచో సుఖంబుగాఁ
దనువుఁ ద్యజింతు; బంధుజనదర్శన మవ్వలఁ గల్గనేర్చునే? 2091

ఆ. నిత్యధర్మరతుఁడు సత్యవిక్రముఁడైన
యనఘు రాము మోము నైనఁ గనక
శమన సదనమునకుఁ జనుచుంటి; నెంత పా
పంబుఁ జేసినానో ప్రాగ్భవమున? 2092

సీ. కమనీయ మణిహేమ కర్ణకుండలకాంతి
ధామమై యొప్పు శ్రీరాము మోము
శారద పూర్ణిమా శర్వరీకాంతాభి
రామమై యలరు శ్రీరాము మోము
కమలాయతాక్షంబుఁ గార్ముకసన్నిభ
భ్రూమనోజ్ఞ మగు శ్రీరాము మోము
సంఫుల్ల సరసిజ సంకాశ నవసౌర
భామోదమైన శ్రీరాము మోము

గీ. పదియు నాల్గేండ్లు వనినుండి ప్రతినఁ దీర్చి
రాజధాని కేతెంచు నా రాముమోము
కాంక్ష లూరంగఁ దమిదీరఁ గన్నులార
దర్శనము సేయువా రెంత ధన్యతములో? 2093

క. వని వీడి యీ యయోధ్యకుఁ
బునరాగతుఁ డగుచు మౌర్ఖ్యముక్తుండగు శు
క్రునిఁ బోలి వెలయు రామునిఁ
గనుభాగ్యము గల్గువారె గద పుణ్యాత్ముల్! 2094

క. ఓ దేవీ! మది దుఃఖా
వేదనఁ బడి క్రుంగుచుండె వివశం బగుచున్;
లే దింద్రియసత్త్వము; శ
బ్దాదుల గ్రహియించుశక్తి యడఁగుచు నుండెన్. 2095

ఆ. చమురు చెల్లిపోవ బ్రమిదదీపంబుల
నున్న కాంతు లడఁగు చున్నయట్లు
స్వాంత మలసిపోవ సకలేంద్రియంబుల
జీవశక్తు లుడిగి పోవుచుండె. 2096

క. ఈ తనయవ్యథ నన్ను న
చైతన్యన్ దీనుఁ జేసి చంపుచునుండెన్
స్రోతస్వినీ తరంగా
ఘాతము కూలంబు గూల్పఁ గడఁగిన రీతిన్. 2097

క. హా రామ! మహాబాహూ!
హా రాఘవ! తాపనాశనా! సదయాత్మా!
హా రక్షక! జనకప్రియ!
యో రాజీవాక్ష! యెచట నుంటివి తండ్రీ! 2098

క. దేవేరీ కౌసల్యా!
పావనచరితా సుమిత్ర! పాపమతీ కై
కా! వంశధర్మనాశిని!
పోవుచు నున్నాఁడఁ జచ్చిపోవుచునుంటిన్. 2099

ఆ. అనుచు క్షీణకంఠమునఁ బ్రలాపించుచు
మాననీయ రామమాత చెంత
నా సుమిత్రచెంత "హా రాఘవా!" యంచు
నుసురు విడిచె దశరథోర్వివిభుఁడు. 2100

క. తనయప్రవాసదుఃఖము
మనమునుఁ బీడింప నింక మనఁ జాలక య
మ్మనుజవిభుఁ డన్నిశీథిని
దనువు విడిచి చనియె శమనధామంబునకున్. 2101

## 65-వ సర్గము

క. రాతిరి వేగిన యంతనె
ప్రాతఃకాలమున స్తోత్రపాఠకజనముల్
సూతాదులు శుభగీతుల
నేతెంచి పఠింపఁ దొడఁగి రెప్పటియట్టుల్. 2102

సీ. ఉచ్చైస్స్వరంబున నుర్వీశ్వరు నుతించు
వరగీతముల నంతిపురము నిండె
ప్రభుకీర్తనలు కులప్రభు కీర్తనములతోఁ
బాణివాద్యములు సభంబు నిండె
గరతాళ కలన జాగరమందు పంజర
కలఖేటరుతులు దిక్కులను నిండె
నఖిలవాద్యధ్వను లాశీర్నినాదముల్
నిగమఘోషంబులు నగరి నిండె

గీ. నపుడు పరిపాటిమెయి సేవ లాచరించు
రాజమందిరదాసదాసీజనంబు
వలయు పరికరములతోడ వచ్చి వేగ
నియమితాత్మీయ కృత్యముల్ నెఱపఁ దొడఁగె. 2103

సీ. స్నానవిధుల్ దీర్ప స్వర్ణకుంభంబులఁ
బరిమళోదకములఁ బట్టువారు
గంధతైలంబులఁ గమ్మపూఁతలఁ బైఁడి
పాత్రల నాయత్తపఱచువారు
సమయోపయుక్త భూషణ వస్త్ర మాల్య ని
కాయముల్ సిద్ధంబు సేయువారు
ఆరోగ్యభక్ష్యభోజ్యౌషధాదికములఁ
గనకపాత్రికలందు నినుచువారు

గీ. అఖిలశుభలక్షణోపేతు లైనవారు
అమలభూషణభూషితు లైనవారు
నగుచు శుద్ధాంతపరిచారికాదు లెల్ల
నుచితకార్యప్రవిష్టలై యుండి రపుడు. 2104

గీ. అట్లు వా రరుణోదయమైన దాఁకఁ
గార్యములనుండి ప్రభురాక గానరాక
యాత్మ శంకించి ప్రభుని శయ్యాగృహమున
కేగి యల్లన మేల్కొల్పఁ జాగి రపుడు. 2105

క. ఆ పడఁతులు నయవినయము
లేపాఱఁగ వివిధగతుల నెంత తెలిపినన్
భూపతి మేల్కనకుండిన
నూపిరిగని యొల్లఁబోయి యుత్తలపడుచున్. 2106

క. జాగరనిద్రా స్వప్న వి
భాగజ్ఞలు వార లపుడు ప్రభు దశరథు నా
నాగతులఁ బరీక్షించి భ
యాగతలై తల్లడిల్లి రసువులు లేమిన్. 2107

ఆ. అపగోద్ధతికిఁ దృణాగ్రంబులం బోలి
వనట మునిఁగి వారు వడఁకుచుండఁ
బుత్రశోకహతి సుమిత్రయుఁ గౌసల్య
యొడలు మఱచి కూర్కి యుండి రపుడు. 2108

ఆ. కాంతిహీనయగుచుఁ గౌసల్య పడియుండెఁ
దమము గ్రమ్మినట్టి తారఁ బోలి
యా సుమిత్రగూడ నట్లే విసర్ణయై
దుఃఖభరత నెఱుక దొఱఁగియుండె. 2109

ఆ. మృతినిగన్న రాజు గతతేజుఁడై నట్లె
సుతవియోగదుఃఖహతిసిఁ దూలు
రాణు లిరువు రపుడు రహిఁ దక్కి పడియుండి
రసువు లెడలినట్లు లవశ లగుచు. 2110

ఆ. అట్లు నిదురదూలి యా రాణు లుండంగ
నిదుర నుసురు విడిన నృపునిఁ జూచి
కరినిఁ బాసినట్టి కరిణు లట్లేడ్చిరి
గళము లెత్తి దాసికాజనములు. 2111

క. వారల యాక్రందనముల
చే రాణులు మేలుకాంచి చెచ్చెర నధిపుం
జేరి మృతుఁ డగుట నారసి
హా! రమణా! యనుచు వ్రాలి రవనితలమునన్. 2112

ఆ. నభమునుండిపడిన నక్షత్రముం బోలి
వసుధఁబడిన నాగవధువుఁ బోలి
యార్తిఁ దూలిపడిన యా కోసలాత్మజ
పొలుపుదక్కి ధూళి పొరలుచుండె. 21

గీ. అంతఁ గైకేయి మున్నుగా నంతిపురపు
వనిత లందఱు పతిమృతివార్త నెఱిఁగి
వచ్చి యెలుఁగెత్తి యేడ్చుచు వసుమతీశుఁ
జుట్టుముట్టి విచేష్టలై సోలి రార్తి. 21

క. ఆ నారుల బహుళార్త
ధ్వానంబులు గోసలేంద్రజాధికశోకా
మానధ్వానంబులచే
నానగరు ప్రతిధ్వనించె నతిదుస్సహమై. 21

చ. నిరతసుఖప్రమోద రమణీజనసంకులమైన రాజమం
దిర మపు డట్లు రాజు మరణించిన యంతనె భూరిశోక ని
స్వనితము నార్తబంధుజనసంతపితం బతిదీనదుఃఖ ద
ర్శనము గతప్రహర్షము నశాంతము భ్రాంతమునయ్యె నెంతయుని

గీ. ఆ విమలకీర్తి పతి మరణార్తిఁ జిక్కి
రాణు లన్యోన్యసంలగ్నపాణు లగుచు
నుర్వీపతిఁ జుట్టుకొని జాలి యుట్టిపడఁగఁ
బనవి రెలుఁగులు మినుముట్ట ననద లట్లు. 211

---

* పాఠాంతరము:

ఆ. అలుగుదాఁకి పడిన యాడేనుగుం బోలి
ధరణి జారిపడిన తారఁ బోలి
యార్తిఁ దూలిపడిన యసహాయ కౌసల్య
పొలుపుదక్కి నేలఁ బొరలుచుండె. 211

# 66-వ సర్గము

ఉ. అరిన వీతిహోత్రుక్రియ నంశువు లేదిన భానుశైఖరిన్
నీరము లింకిపోయిన ధునీపతికైవడి, స్వర్గధామముం
జేరిన నాథుశీర్ష మొడిఁ జేరిచి కోసలరాజపుత్రి శో
కారుణితాస్యయై కనుల నశ్రువు లొల్కుచుఁ గైక కిట్లనెన్. 2118

క. "ఓ కుటిలహృదయ కైకా!
నీ కోరెక దీరె రాజు నిర్వృతిఁ గనె; నీ
వే కంటకమును లేకయ
యేకచ్ఛత్రముగ రాజ్య మేలుకొను మికన్. 2119

ఆ. కొడుకు నన్ను వీడి యడవులకుం బోయె
స్వామి నన్నుఁ బాసి స్వర్గ మేగెఁ
దప్పుదారిఁ దోడుదప్పియుండిన నేను
క్షణముగూడ బ్రదుకఁ జాల నింక. 2120

ఆ. పాపచిత్త యగుచుఁ బరమధర్మము వీడి
కాపథంబు ద్రొక్కు కైక దక్క
సతము హితముగూర్చు పతిదేవతఁ ద్యజించి
పడఁతి యెవతె యింక బ్రదుకఁగలదు? 2121

ఆ. గుణము ఫలముఁ దెలిసికొనక విషాన్నంబు
లోభవశతఁ దిన్న లుబ్ధుఁ బోలి
కుబ్జ బోధనంబు గొన్న యి కైకచే
హతిని గాంచె రాఘవాన్వయంబు. 2122

ఆ. నేర మేమిలేక దారతో రాముని
వనికిఁ దరిమె తండ్రి యనిన వార్త
విని విదేహవిభుఁడు జనకరా జెంతగా
నన్నుఁ బోలి వగచుచున్నవాఁడొ? 2123

గీ. అంబుజాక్షుండు ధర్మాత్ముఁ డైన కొడుకు
రాముఁ డుండి లేనట్లె దూరమున నుండి
తండ్రిమృతిఁ గాని నా యనాథతను గాని
యించుకేనియు నిపుడు దా నెఱుఁగఁడు గద! 2124

క. శోకానుచిత తపస్విని
నా కోడలు సీత జనకనందిని దుఃఖ
వ్యాకులయై భయకంపిత
యై కానలఁ దిరుగవలసెనా! యకటకటా! 2125

ఆ. క్రూరజంతు విహగ దారుణారవముల
వినుచు రాత్రులందు జనకతనయ
యతిభయప్రకంపితాంగియై విభు రాము
నొడినిఁ జేరి బ్రదికియుండఁ గలదు. 2126

క. ఎంతో వృద్ధుఁడు కాంతా
సంతానమె గలుగువాఁడు జనకుఁడు సీతా
సంతాపవార్త చెవిఁ బడి
నంతనె దుఃఖార్తి బ్రదుకునా? క్షణమైనన్. 2127

ఆ. నా పతివ్రతంబె నాకు సాయముగ ని
ష్కాంతు దేహ మేను గౌఁగిలించి
యగ్నిహోత్రశిఖలయందుఁ బ్రవేశించి
ప్రాణములను విడుచుదాన నిపుడె." 2128

క. అని కనికర ముట్టిపడన్
దనవిభు మేనిపయిఁ బ్రాలి తద్దయు దుఃఖం
బున నేడ్చెడి కౌసల్యన్
గొని చని రవ్వలికి నగరికొలువు నెలంతల్. 2129

ఆ. సుతులు చెంతలేమి పతిమృతదేహంబు
భద్రముగను దైలపాత్ర నుంచి
నెఱపఁ దొడఁగి రపుడు నృపముఖ్యకార్యముల్
సచివవరులె గురుని సమ్మతమున. 2130

క. ఆ లీల ప్రభునిదేహము
కాలికముగ రక్షసేయఁ గని శుద్ధాంత
స్త్రీ లొక్కపెట్టి నేడ్చిరి
జాలింబడి నాథుఁ డపుడె సమసిన భంగిన్. 2131

ఆ. నిత్యసత్యసంధు నిరుపమప్రియవాది
యైన రాముఁ బాసి యడలు మమ్ము
నీవుగూడ విడిచి యేగుట న్యాయమే
యేమితప్పు చేసినాము నాథ! 2132

ఆ. హితుని సుతుని రాము నెడఁబాసి పెనిమిటి
వైన నిన్నుఁ బాసి యనదల మయి
పతిని జంపినట్టి పాపాత్మ యి కైక
పజ్జనుండి యెట్లు బ్రదుకఁగలము? 2133

క. నీకును మాకును నెప్పుడు
నే కైకప్రియుఁడు ప్రభుఁడు హితుఁడు సుతుఁడు సు
శ్లోకుఁ డగు రాము విగత
శ్రీకుఁ బ్రవాసితుని నెట్లు చేసితివి ప్రభూ! 2134

క. ప్రభుఁడగు విభుఁడగు నిను జగ
దభిరాము సదారు రాము నధికబలభుజా
విభవుని లక్ష్మణు విడిచిన
యభాగ్యయగు కైక యెవనిఁ ద్యజియింప దిఁకన్. 2135

క. అని విలపించుచు దశరథ
జననాథునిసతులు బాష్పజలధారలఁ గ
న్గొనలం గురియించుచు మే
దిని బడి పొరలాడి రతివిదీర్ణహృదయలై. 2136

క. చందురుఁ బాయు విభావరి
చందంబునఁ బతి త్యజించు సతివడువున రా
జేందుఁడు విభుఁ డెడయఁగ ని
ష్పందంబై యపు డయోధ్య ప్రభ చెడి యుండెన్. 2137

ఆ. అంగనాగణముల హాహారవములతో
నశ్రు లొలుకు పురజనాళితోడఁ
బాడువాఱియున్న భవనాంగణములతో
రహి దొలంగియుండె రాజధాని. 2138

ఆ. శోకవశత రాజు నాకంబునకుఁ బోవ
నవనిఁ బొరలి రాణు లడలుచుండ
రవి నివృత్తుఁ డగుచుఁ బవలిల్లు దొలఁగంగఁ
దమి ప్రవృత్త యగుచుఁ దాపురించె. 2139

క. తనయులు చెంగట లేమిన్
జనవిభుదేహమున కగ్నిసంస్కారంబున్
బొనరుప కుంచిరి పెద్దల
యనుమతమునఁ దైలపాత్రయం దద్దానిన్. 2140

ఆ. ఖరకరుండు లేని గగనంబుకైవడి
తిక్కగములులేని రేయి వోలి
ప్రభుఁడు లేక దుఃఖభాజనంబయి రాజ
ధాని యపుడు గాంతిహీన యయ్యె. 2141

క. నరనాథుఁడు మరణింపఁగఁ
బురమున నరనారు లెల్లఁ బొక్కుచు గుములై
పరిపరివిధములఁ దిట్టిరి
భరతజనని గైక నపుడు బహుళార్తి మెయిన్. 2142

## 67-వ సర్గము

ఆ. అధికదుఃఖవశత నశ్రువు లొలుకుచు
నెల్లపురజనంబు లేడ్చుచుండ
హర్ష మెడలియున్న యా రాజధాని నా
కాళరాత్రియెట్లొ గడచిపోయె. 2143

ఉ. రే యటు లేగి పూర్వశిఖరిన్ రవి దోఁప మృకండుసూతి కా
త్యాయన వామదేవులు మహాత్ములు కాశ్యపముద్గలుల్ జగ
ద్గేయులు గౌతమా ద్య వనిదేవులు మంత్రులు గొల్వుదీర్చి ను
శ్రీయుతుఁడైన య గ్గురు వసిష్ఠున కిట్లని రొక్క రొక్కరున్ 2144

క. తనయ విరహదుఃఖంబును
మనుజేశుఁడు సైపలేక మరణించుటచేఁ
గనుపట్టె నొక్కరాత్రియె
మనకున్ శోకమున శతసమంబులు గాఁగన్. 2145

ఆ. రాజు దివినిఁజేరె రాముఁడు వని కేగె
నరిగె లక్ష్మణుండు నన్నవెంట
పరమతేజులైన భరతశత్రుఘ్నులు
ప్రీతి నున్నవారు తాతయింట. 2146

ఆ. రాజులేకయున్న రాజ్యంబు సర్వంబు
నడుపుదప్పి నాశ మగును గాన
నిపుడె నిశ్చయించి యిక్ష్వాకుకులజుని
నొకని రాజ్యపీఠి నుంపవలయు. 2147

సీ. మెఱుముల నురుముల మేఘుండు మిన్నుగ్రమ్మి
ధరణిఁ జల్లఁగ వాన గురియఁబోఁడు
వృష్ట్యభావంబున నిల దున్ని కృషికులు
శ్రమపడి విత్తనాల్ చల్లఁబోరు
ప్రసవ పుష్పోద్యాన భద్రకృత్యంబులు
నిష్ఫలశంకచే నిలిచిపోవు
కొనఁ గాను తినఁ గూడు గోష్ఠి ప్రాంతయు లేక
చోరాదిభయములు మీఱిపోవు

గీ. రక్ష లేకుండుటను జేసి రాష్ట్రమందు
జరుగు వర్తకమెల్ల నాశంబు నొందు
సౌఖ్య మొదవదు ప్రజలలో శాంతియుండ
దవనిరాజ్యం బరాజక మయ్యెనేని. 2148

క. పితృనాజ్ఞ సుతుఁడు దీర్పఁడు
పతియానతి సేయ భార్య పాల్గొన దెందున్;
సుతులకు రక్షణ యుండదు
క్షితిపతి లేకున్న నీతి చెడు నెల్లెడలన్. 2149

క. హరియింత్రు ధనము చోరులు
హరియింతురు సతుల దుష్టులగు దుర్బుద్ధుల్;
పురుషులకు గృహిణు లుండరు
నరనాథుడు లేమి సత్యనాశనమె యగున్. 2150

శా. ఆరామాదికముల్ మఠంబులును దేవాగారముల్ సత్రముల్
చోరావాసములై నశించుఁ గుజనక్షోభంబుచన్ సన్మతా
చారంబుల్ సెడు నుత్సవంబులు సభల్ సాధుప్రబోధంబులున్
దూరీభూతము లౌను దేశమునయందున్ రాజు లేకుండినన్.

క. ధరణీసురులు నిగమజ్ఞులు
సిరిగల్గియు దక్షిణ లిడి చేయరు మఖముల్;
తెరవాటుకాండ్రభయమున
నరాజకంబైన దేశమం దెల్లెడలన్. 2152

క. ధూర్త భయమ్మున నెల్లెడఁ
గీర్తిదములు హర్షదములు కృతిగీతంబుల్
నర్తక నట వృత్తములుఁ బ్ర
వర్తిల్లవు జనపదముల నరదుఁడు లేమిన్. 2315

సీ. అధికృతాన్యోన్యసాహాయ్యముల్ నశియించు
విభు కార్యములకును విఘ్న మొదవు
కరసంగ్రహము లేక తఱుఁగును గోశముల్
భృతిలేక భృత్యసంతతి దొలంగు
నానలు జవదాఁటి సేనలు చెలరేఁగుఁ
దలక్రిందులగుఁ దారతమ్యసరణి
అహమహమికలచే బహునాయకంబగు
నధికారకాంక్షఁ గయ్యములు పెరుఁగుఁ

గీ. గక్ష లుదయించి ప్రజలలోఁ గ్రౌర్య మడరు.
ధర్మకర్మంబులకు స్థిరత్వంబు దప్పు
వ్యక్తులకు నాస్తులందు స్వత్వంబు చెడును
జనపదంబులయం దరాజకమువలన. 2154

గీ. ఆతతాయుల దుష్టకృత్యములవలన
జనుల స్వేచ్ఛావిహారముల్ సన్నగిల్లు;
కథక పౌరాణిక ప్రముఖప్రబోధ
నిష్ఫలతనందుఁ బ్రజలందు నేతలేక. 2155

క. గోరక్షకులును గృషికులు
బేరులు రక్షణము లేక బెగ్గిలుదురు; ని
స్సారములై కళలు నిరా
ధారములగు నృపుఁడు లేని ధరణీతలమునన్. 2156

సీ. సాగవు స్వపరదేశముల వర్తకములు
యతుల ప్రచారంబు లడఁగిపోవు
దేవాలయంబుల దినదినంబును దీర్చు
పూజాపురస్కారములు నశించు
కవి బుధ గాయక ప్రవరగోష్ఠు లడంగు
నీతులు నియమముల్ నిష్ఠ లుడుగు
ప్రజల యోగక్షేమ పరిశీలనము లేక
శాంతిసుఖోత్సాహశక్తు లెడలు

ఆ. స్వాదు జలవిహీన వాహినికైవడి
దృణ రహిత వనప్రదేశ మట్లు
గోపకుండు లేని గోకులముంబోలి
రాజు లేని సీమ తేజరిలదు. 2157

క. అనలమునకు ధూమము స్యం
దనమునకు ధ్వజంబుఁ బోలి తనరుచు నెపుడున్
మన మనికికిఁ దావల మగు
జననాథుడు మనల విడిచి స్వర్గం బేగెన్. 2158

ఆ. చిన్నచేపఁ బెద్దచేప మ్రింగినయట్లు
లబలు ధనము సబలుఁ డపహరించు;
తమ ధనంబు ప్రజలు దాఁచుకోఁ జాలరు
రాజు లేని యట్టి రాష్ట్రమందు. 2159

క. వర్ణాశ్రమధర్మంబులఁ
బూర్ణముగాఁ ద్రోసి వైచి భువి నాస్తికులౌ
దుర్ణయులున్ బ్రభుశాసన
నిర్ణయమున శిష్టు లగుచు నెగడుదురుగదా! 2160

క. కాయమునకు దృష్టియెపుడు
నాయముపడునట్లు ధర్మసత్యాది విభుం
డై యొప్పు రాజు రాష్ట్ర
శ్రేయస్సంధాయియై ప్రసిద్ధిం గాంచున్. 2161

క. రాజే సత్యము ధర్మము
రాజే మతమును హితంబు రాజే కులమున్
రాజే జననియు జనకుఁడు
రాజే దైవంబు సకలరాష్ట్రప్రజకున్. 2162

ఆ. దక్షిణేశుకంటె ధననాయకునికంటె
సురవరేణ్యుకంటె వరుణుకంటె
దండ దాన శరణ ధర్మరక్షణముల
నధికుఁ డగునుగాదె యవనివిభుఁడు. 2163

ఆ. మంచిచెడ్డల విభజించు మనుజనాథుఁ
డుర్విమండలిఁ బాలింపకుండునేని
లోక మంతయు నొకటఁ జీకాకునొంది
చీఁకటులు గ్రమ్మినట్టులై పోకయున్నె? 2164

క వేలన్ దాఁటని సాగరు
లీలన్ నీ యాజ్ఞ మీఱ లేదెప్పుడు భూ
పాలుం డేలెడు నప్పుడె
పాలింపమె యిపుడు గురుని పలుకు శ్రుతిగతిన్. 2165

గీ. మౌనిసత్తమ! యిపుడు మా మనవి నెంచి
రాజులేక దుర్గమమైన రాష్ట్ర మరసి
మహితు నిక్ష్వాకుకులజుఁ గుమారు నొకని
నీవె గొనితెచ్చి రాజుగా నిలుపవలయు." 2166

# 68-వ సర్గము

క. ఈ రీతి మునులు సచివులు
ధారుణిసురవరులు హితులు దనుఁ గోరంగా
నా రాజగురు వసిష్ఠుఁడు
వారల కిట్లనియె సనయవచననిచయుఁడై. 2167

మ. "నరనాథుండె కుమారునిన్ భరతు భూనాథుండుగాఁ దెల్పె నా
భరతుం డిప్పుడు తాతమందిరమునన్ భద్రంబుగా నుండె సో
దరు శత్రుఘ్నునితోడ; వేగరులు దూతల్ పోయి శీఘ్రంబ యి
ప్పురికిన్ వారలఁ దోడితేఁదగుఁ దలంపుల్ వేఱ యింకేటికిన్?

క. ఓ యనఘా! సిద్ధార్థా!
యోయి జయా! యో యశోక! యోయీ విజయా!
యోయీ నందన! మీరు వి
ధేయత నా యాజ్ఞ నిపుడు దీరుపవలయున్. 2169

సీ. సత్వరంబుగ మీరు జవనాశ్వముల నెక్కి
రాజగృహాఖ్యపురంబుఁ జేరి
దుఃఖ మించుకయైనఁ దోఁపఁగా నీయక
భరతుని రఘుకులభద్రుఁ గాంచి
యడవి కేగెను రాముఁ డని గాని రాజు మృ
తిం గాంచె నని గాని తెలుపఁ బోక
నా మాటగఁ గుమారు సేమంబుఁ బ్రశ్నించి
యతిముఖ్యమైన కార్యంబుఁ దీర్ప

గీ. నాలసింపక పురికి రమ్మనుచుఁ జెప్పి
తోడుకొనిరండు శత్రుఘ్నుతోడ నతని
భరతశత్రుఘ్ను కేకయప్రభుల కొసఁగ
భూషణాంబరములఁ గొనిపొండు వెంట. 2170

క. అని ముదలచేసి వలసిన
ధన మొసఁగఁగ గురునియాజ్ఞఁ దల దాలిచి వా
రనిల జవన తురగంబులఁ
గొని పయనంబైరి రాచకొమరులఁ దేరన్. 2171

సీ. అట్లువా రరుగుచు నపరతాలాద్రికి
నంతంబునను బ్రలంబాచలమున
కుత్తరంబుగఁ బారుచుండిన మాలినీ
పూరతీరమునుండి పోయి పోయి
హాస్తిన పురిఁ జేరి యచట గంగను దాఁటి
ప్రత్యఙ్ముఖంబుగా బయలుదేఱి
చని చని యంతఁ బాంచాలదేశముఁ జొచ్చి
క్రమముగాఁ గురుజాంగలముల దరిసి

గీ. యట నటన్ వారిపూర్ణ పద్మాకరముల
నిర్మలస్వాదుజలవాహినీచయములఁ
గౌతుకంబునఁ గాంచుచుఁ గార్యపరత
నెందు నిలువక యా దూత లేగి యేగి.

2172

ఉ. సారజలప్రపూర్ణమును జారువిహంగ నిషేవితంబు వి
స్తార జనాభిశోభితము ధన్యమునౌ శరదండవాహినీ
తీరము డాసి కోరికలఁ దీరుచు నచ్చటిపుణ్యవృక్షమున్
జేరి భజించి వారు పయనించి కుళింగను జొచ్చి రంతటన్. 2173

ఆ. అచటనుండివార లభికాళపురిఁ జేరి
బోధిభవనశిఖరిఁ బుట్టినట్టి
యిక్షుమతిని దాఁటి యిక్ష్వాకు లేలు త
త్రిరజనపదముల దారిఁ గనుచు. 2174

ఆ. వేదపారగులను విప్రుల దోసెఁడు
నీరములనె బ్రదుకువారిఁ గనుచు
నరిగి రపుడు దూత లా సుదామాచల
బాహ్లదేశమధ్యపథముఁ బట్టి. 2175

చ. చనిచని య వ్వికుంఠసదృశంబగు విష్ణుపదస్థలిన్ విపా
శనదినిఁ దత్తటోల్లసితశాల్మలమున్ భజియించి పెక్కు పు
ణ్యనదులఁ బుష్కరాదుల వనాంతరసింహ గజాది జంతులన్
గనుచు నృపాలకార్యకరణత్వరఁ దీర్చిరి దూరయానమున్. 2176

ఆ. దూరగమనవశతఁ దురగంబు లలయంగ
వేగు లపుడు దూరమేగి యేగి
కేకయేశురాజగృహము గిరివ్రజ
పురము దరిసి రపుడు త్వరితగతిని. 2177

ఆ ప్రభునిప్రియముకొఱకుఁ బ్రభుకులరక్షకై
ప్రభునివంశగౌరవంబుపొంతె
రాజకార్యదీక్ష రాత్రియే వారు శీ
ఘ్రముగఁ జేరుకొనిరి రాజగృహము. 2178

## 69–వ సర్గము

ఆ. పురికి దూత లట్టు లరిగిన రాత్రి ప్ర
భాతవేళ సార్వభౌమసుతుఁడు
భరతుఁ డప్రియంపుఁ బాడు కలంగన
యుల్ల మెలియ నెంతొ తల్లడిల్లె. 2179

క. భరతుం డేటికొ చింతా
పరవశుఁ డయ్యె నని యెఱిఁగి ప్రాణవయస్యుల్
పరివేష్టించి యతనిమతి
మరలింపం జూచి రెన్నొ మార్గంబులచేన్. 2180

క. కొందఱు వాద్యంబులచేఁ
గొందఱు నృత్యములచేతఁ గొందఱు హాస్యా
నందకథానటనలచే
నంద ఱతనిఁ దేర్పఁ దొడఁగి రా సమయమునన్. 2181

క. హితులును బ్రియవాదులు నగు
మతిమంతులు సఖులు భరతుమతిఁ ద్రిప్పఁగ లే
కతనిం గని మిత్రమ! యీ
గతిఁ జింతిలుచుంట కేమి కారణ" మనినన్. 2182

సి. తనమిత్రులం గాంచి దశరథతనయుండు
సఖులార! వేకువ జామునందు
దుస్స్వప్నముంగాంచి దురపిల్లుచున్నాఁడ
నా తండ్రిదశరథ నరవిభుండు
మలినశరీరుఁడై తలముడి వీడంగ
క్ష్మాధరోన్నతశిఖాగ్రంబునుండి
గోమయహ్రదమునఁ గూలి తేలాడుచుఁ
దైలంబు దోసిళ్లఁ ద్రావికొనుచు

గీ. నువ్వులన్నంబు మెసవుచు నూనె మేనఁ
బూసికొని తలక్రిందులై పోయినట్లు
వికృతహాసంబుసేయుచు వెఱ్ఱివోలి
నూనెలో మున్గుచున్నట్టు లేను గంటి. 2183

సీ. మఱియు నా కలలోన శరధి యింకిన యట్టు
ఉడుపతి పుడమిపైఁ బడినయట్లు
కటికచీఁకటులు జగంబుఁ గప్పినయట్లు
జ్వలితానలము చల్లవడినయట్లు
భద్రేభదంతముల్ భగ్నంబులైనట్లు
భూమి విదీర్ణమై పోయినట్లు
సురుచిర తరులతల్ శుష్కంబులైనట్లు
కొండలు పొగగ్రమ్మి కూలినట్లు

గీ. కృష్ణ పింగళ వర్ణలౌ స్త్రీజనములు
కృష్ణ లోహపీఠస్థుఁడై కృష్ణవసనుఁ
డైన నా తండ్రి దశరథునంతికంబుఁ
జేరి నవ్వుచున్నట్లు వీక్షించినాఁడ. 2184

క. అరుణాంబరమాల్యాదుల
ధరియించి మహాత్ముఁడైన దశరథుఁడు వెసన్
ఖరవాహంబులఁ బూన్చిన
యరదముపై దక్షిణముగ సరుగుటఁ గంటిన్. 2185

ఆ. రక్తవసనయైన రాకాసి యొక్కతె
వికృతవదన హాసవికృత యగుచు
దశరథేశు కరము దన కరంబునఁ బట్టి
యీడ్చుచున్నయట్టు లేను గంటి. 2186

క. చేకుఱు నిక్కలవలనన్
నాకో రామునికొ లక్ష్మణకుమారునికో
నా కన్నతండ్రి రాజున
కో కీడని భయము గలుగుచుండెను మదిలోన్. 2187

క. ఖరవాహనయుక్తంబగు
నరద మధిష్ఠించి యరిగి నట్టులు కలలోఁ
బరివీక్షించిన పురుషుఁడు
త్వరితగతిఁ జితాగ్నిధూమదర్శనము గనున్. 2188

ఆ. ఇట్టి కలను గనుట నేను దీనుండనై
ప్రియుల మిమ్ము నాదరింప నైతిఁ;
గాయ మవశ మయ్యెఁ గళము శుష్కం బయ్యెఁ
మనసు చింతనుండి మరల దయ్యెఁ. 2189

క. భీతిలుట కించుకేనియు
హేతువు గనరాకయున్న నేను జుగుప్సన్
గాతరపడెద నదేమో
నా తనువునఁ గాంతి యెడలె నా యెలుఁగు సెడెన్. 2190

క. పలువిధములఁ దోఁచిన యి
క్కలఁ గని రాజేంద్రు వృద్ధుఁ గన్న జనకునిఁ
దలపోసి వగతు; దవ్వుల
నిలువఁ దగునె నాకు నాతనింబాసి యిటన్? 2191

## 70-వ సర్గము

చ. అని భరతుండు మిత్రులకు నట్లు వచించుచునుండ రేయి ప్రొ
ద్దున నరుదెంచియున్న నృపదూతలు రాట్పురిఁ జేరి కేకయేం
ద్రునకును దత్తనూజునకు మ్రొక్కి ప్రియంబున వారి మన్ననల
గని చని వేగ మా భరతుఁ గన్గొని యిట్లని రూర్జితోక్తులన్. 2192

ఆ. "కుశల మడిగె నిన్ను గురువసిష్ఠుండు సే
మంబు దెలుపు మనిరి మంత్రు లెల్ల;
నొక్క ముఖ్యకార్య మొనరింపవలె నీవు
పయన మగుము వేగ ప్రభుకుమార! 2193

క. ఓ భరత! రాజసుత! ది
వ్యాభరణాంబరచయంబు లరయుము వీనిన్
భూభర్త కతని సుతునకుఁ
బ్రాభవ మెసఁగంగ ని మ్ముపాయనములుగన్. 2194

ఆ. నృపతితాత కిచ్చు ని క్కాన్క యిరువది
కోటు లగునుగాక పాటిసేయ
నిపుడు మామ కొసఁగు నీ బహుమాన మీ
రైదుకోటులైన నగును గాక!" 2195

క. అనిన సుహృజ్జనములయెడ
ననురక్తుండైన భరతుఁ డా కానుకలం
గొని యాదరించి సత్కృతు
లను దనియంజేసి వారలకు నిట్లనియెన్. 2196

గీ. కుశలియే రాజు నా తండ్రి దశరథుండు?
సేమముగ నున్నవాఁడె శ్రీరామవిభుఁడు?
లక్ష్మణుఁడు శుభలక్షణలక్షితాంగుఁ
డన్న సేవించుచును సుఖం బున్నవాఁడె? 2197

గీ. ధర్మదర్శిని ధర్మజ్ఞ ధర్మనిరత
పరమసాధ్వి వినిర్మలచరిత యగుచుఁ
బ్రాభవామోదభాగ్యసంపన్నయైన
రామమాత కౌసల్యకు సేమమె గద? 2198

క. సముదారుని లక్ష్మణు ను
త్తమగుణు శత్రుఘ్నుఁ గన్నతల్లియయిన మ
ధ్యమమాత పూజ్యురాలగు
సుమిత్ర సురుచిరచరిత్ర సుఖవతియె కదా? 2199

గీ. ప్రాజ్ఞ మానిని కోపస్వభావ చండి
యాత్మకామయు నైన మా యమ్మ కైక
భద్రముగ నున్నయదియె మీ పయనవేళ?
బంధువుల కేమయినఁ జెప్పి పంపి నదియె?" 2200

క. అని నంతనె వేగరు ల
య్యనఘచరితు భరతుఁ గాంచి యందఱు సుఖులే;
నిను సుశ్రీవరియించుత
పనిగొనుము రథంబు సిద్ధపఱుపఁ గుమారా! 2201

క. అని వారు వేగిరింపఁగ
విని భరతుఁడు తాతకడకు వేగమ చని వం
దన మాచరించి యాతని
కనునయమున నిట్టు లనియె నాదర మొదవ౯. 2202

క. "నా తండ్రి దశరథేశుల
దూతలు వచ్చి రిటు నన్నుఁ దోడ్కొనిపోవన్
ధాతా! సెలవి మ్మిప్పుడు
నీ తలఁచిన యప్పుడె మఱల నే నేతెంతున్." 2203

క. వరరఘుకులవర్ధనుఁడగు
భరతుం డిటు దెలుప నశ్వపతి విని ప్రేమా
దరమతిఁ గౌఁగిటఁ జేరిచి
శిర మాఘ్రాణించుచున్ వచించె శుభోక్తిన్. 2204

ఆ. "అనఘచరిత! భరత! నినుఁ గన్న మా కైక
సుప్రజావతి యయి శోభఁ గాంచెఁ;
బోయి రమ్ము తండ్రిపురికి; నీ పితరుల
కిచటి కుశలవార్త నెఱుఁగఁ జెపుము. 2205

ఆ. గురున కచటి యెల్లధరణీసురులకును
సమబలులు ప్రశస్తచాపధరులు
భ్రాతృవరులునైన రామలక్ష్మణులకు
విశదపఱుపు మిచటి కుశలవార్త." 2206

చ. అని సెల విచ్చి యశ్వపతి యాతని కుత్తమసామజాది వా
హనములు నశ్వముల్ కనకహారములున్ మణిచిత్రకంబళా
జినములు రత్నభూషలు విశేషధనంబులు గాన్క లిచ్చి దీ
వనముల నిచ్చి భద్రగుణవంతులఁ దోడుగ నిచ్చె వీరులన్. 2207

క. ఐరావతైంద్రశిర మద
వారణముల సుప్రసన్నవరనాగములన్
భూరిధన జవఖరముల న
పారముగా మాతులుండు భరతుని కొసఁగెన్. 2208

గీ. మఱియు నంతిపురంబునఁ బెరిగినట్టి
యుగ్రదంష్ట్రాంకురంబుల నున్నతములఁ
జారలమెకంబులంబోలు జాగిలముల
నతఁ డుపాయనముగ నిచ్చె నల్లునకును. 2209

ఆ. పాదుకలను గన్నఁ బరితాపమునఁ జేసి
పయనమందె దృష్టిపడుటఁ జేసి
దూత లాచరించు తొందరఁజేసి కా
న్కల గణింపఁ డయ్యె కైకకొడుకు. 2210

మ. భరతుం డప్పుడు వాజివారణభటప్రావేష్టితాత్మీయ మం
దిరమున్ వెల్వడి రాజవీథిని రథాధిష్ఠాతయై స్వీయ సో
దరు శత్రుఘ్నునితోడ నేగి ప్రభునిం దత్పుత్రు దర్శించి న
త్వరుఁడై మ్రొక్కి యనుజ్ఞగాంచి చనె నంతన్ వారు వీడ్కొల్పఁగన్.

క. వరరథశతశతములతోఁ
దురగోష్ట్రభటోత్కరంబుతో గోవులతో
నరనాథుఁ డిడిన భృత్యులు
భరతు ననుసరించి చనిరి బానటుగాఁగన్. 2212

క. అనుఁగుందాత బలంబులు
దన రక్షగ నభయుఁ డగుచుఁ దమ్ముఁడు సచివుల్
వెనుకొన భరతుఁడు నాకం
బును సిద్ధుఁడువోలి వేశ్మమును వెడలి చనెన్. 2213

## 71-వ సర్గము

సీ. శ్రీమంతుఁ డిక్ష్వాకుసింధుసుధాంశుండు
పరమతేజుండైన భరతుఁ డట్లు
రాజగృహమువీడి ప్రాగభిముఖముగాఁ
జని సుదామానది సంతరించి
యరిగి వైశాలిని హ్లాదిని దరియించి
తరలి యేలాధానపురినిఁ జేరి
యచటఁ బ్రత్యగ్వాణియగు శతద్రును దాఁటి
యపరపర్పటదేశమందుఁ జొచ్చి

ఆ. శల్యకర్తనమను జనపదాంతికమున
ఘనశిలావహాపగను గమించి
చైత్రరథవనాంతసరణిని గనుఁగొంచు
నచటి గిరివరముల నతిగమించె. 2214

గీ. అటసరస్వతిఁ గూడి గంగాఖ్య నెసఁగు
నొక్క యుపనది ప్రవహించుచున్న సీమ
నుండి వీరమాత్స్యంబుల కుత్తరమునఁ
జెలఁగు భారుండ వనిఁ బ్రవేశించె నతఁడు. 2215

ఆ. త్వరితగమన హర్షదాత్రి శైలావృత
యగు కుళింగనదిని యమున చెంత
వేగ ముత్తరించి విశ్రమింపఁగఁ జేసె
భరతుఁ డచట నెల్లబలగములను. 2216

క. జలసేచనముల హయముల
యలయిక దీర్పించి భరతుఁ డా నిర్ఝర శీ
తలవారిఁ గ్రుంకి చల్లని
సలిలంబుల వెంటఁగొనుచుఁ జనెఁ బయనంబై. 2217

ఆ. అట్లు చనుచు నిర్జనారణ్యపథమున
భద్రగజము నెక్కి భరతుఁ డప్పు
డాకసంబుదాఁటు ననిలునిఁ బోలి యా
గహన మశ్రమమునఁ గడచిపోయె. 2218

గీ. అతఁ డటుపోయి యంశుధానాభిధాన
పురముకడ గంగదాఁటుగా వెలవులేమి
ప్రాగ్వటుగ్రామమున రేవుపడవలందు
దాని దరియించి కుటికోష్ఠి దరికిఁ జేరె. 2219

క. భటవాహనాదియుతుఁడై
కుటికోష్ఠినదినిదాఁటికొని రాఘవుఁ డం
తట ధర్మవర్ధనంబను
పుటభేదన ముత్తరించి పోయి క్రమముగన్. 2220

సీ. తోరణగ్రామంబుఁ జేరి జంబూప్రస్థ
పురమును దరియించి పోయి పోయి
వరమనోజ్ఞ వరూథపురవనంబును జొచ్చి
వేడ్కమై నొకకొంత విశ్రమించి

యటనుండి చని యుజ్జిహానాపురముచెంత
ఘనకదంబోద్యానవనము దరిసి
యది స్వీయరాజ్యసీమాంచలంబే గాన
నరదంబు నచట నాయ త్తపఱచి

గీ. తాను శత్రుఘ్నుతోడ రథస్థుఁ డగుచు
బలములం గాంచి "మీరు నిర్భయముగాఁగఁ
దరలిరావచ్చు" ననుచు నుత్తరువుచేసి
భరతుఁ డతివేగముగ ముందు బయలుదేఱె. 2221

ఆ. సర్వతీర్థపురికిఁ జని యాతఁ డచట ను
త్తానికాఖ్యనదిని దారినున్న
గిరిఝరాదికముల నరదంబుననె దాఁటి
కుంజరంబు నెక్కి కుటిక దాఁటె. 2222

గీ. భరతుఁ డంతట లౌహిత్యపట్టణమున
నాకపీవతినది దాఁటి యేకసాల
మహితపురిచెంతఁగల స్థాణుమతిఁ దరించి
గోమతి గమించె వినతమౌ గ్రామసీమ. 2223

ఆ. అట్లు చనుచు హయము లలయ కళింగమౌ
గ్రామసీమ సాలకాననమున
విడిసి రాత్రియందె వెడలి యయోధ్యను
దరిసె బ్రొద్దుపొడుచుతఱి నతండు. 2224

ఆ. ఏడురాత్రు లట్లు లెడయక పయనించి
పురుషవర్యుఁడైన భరతుఁ డపుడు
మను వినిర్మితంబు మహితంబగు నయోధ్యఁ
జూచి యిట్టు లనియె సూతుతోడ. 2225

ఉ. శ్రీనిధులైన యాజ్ఞికులచే సుగుణాఢ్యులచే, నధీత వి
జ్ఞానులచే మహీసురగణంబులచే మహితంబుఁ బావనో
ద్యానయుతంబు రాజఋషితల్లజపాలితమైన మా యయో
ధ్యా నగరంబుచెల్వెడలినట్లు గనంబడుచుండె నేమొకో. 2226

క. నరనారీజనసంకుల
పరమప్రియభూషణములఁ బరఁగు నయోధ్యా
పుర మిప్పుడు సిరిదొలంగిన
కరణిన్ జెలువేదియుండెఁ గాంచితె సూతా! 2227

క. లేలన్ యువమిథునంబులు
ఖేలనము లొనర్చి ప్రొద్దు కెంజాయలలోఁ
దేలుచు వెడలఁగ బెడఁగగు
పూలవనులు నేఁ డిదేమొ పొలుపరి యుండెన్. 2228

క. కరితురగరథాన్వితులై
పురజనములుసేయు రాకపోకలచేతన్
మెఱయుచునుండు నయోధ్యా
పుర మిప్పు డరణ్య మట్లు పొగులుచు నుండెన్. 2229

క. రమణీరమణులు సువిలా
సములం గలవిహగమధురసంగీతములన్
గమనీయంబగు నుపవన
సముదయ మిపు డొరపుదక్కి నసి చెడియుండెన్. 2230

సీ. వేగుమీరిననైన విభుని ప్రబోధించు
వందిస్తుతి జయారవములు లేవు
ఇరులు వాసిననైన వరవిహంగమ విహా
రములును మధురారవములు లేవు

ప్రొద్దుదోఁచినదైన బురుజుల భేరీ మృ
దంగాది మంగళధ్వనులు లేవు
అరుణోదయంబైన నవనీసురార్ఘ్య ప్ర
దానముల్ వేదనాదములు లేవు

గీ. అశుభములు క్రూరములు దుస్సహంబు లైన
దుర్నిమిత్తంబు లెన్నియో దోఁచె నిప్పు
డాత్మబంధుల కేదొ కీడయ్యె ననుచు
నడలి నా మది కళవళపడుచునుండె." 2231

క. అని భరతుఁడు సారథికిన్
వినిపించుచుఁ గాతరుండు విహ్వలమతియై
చనె నైక్ష్వాకురక్షిత
మనఘము నగు నయ్యయోధ్య కాత్రముతోడన్. 2232

క. భయపడుచు నాతఁ డలసిన
హయములతో వైజయంత మను ద్వారమునన్
రయమునఁ జొచ్చెఁ బురంబున
జయవెట్టుచుఁ దన్ను ద్వారచరులు వెనుకొనన్. 2233

ఆ. ద్వారపాలకులను దగురీతి మన్నించి
యనిపి కల్తఁతనొందు మనముతోడఁ
బ్రీతిఁగూర్చు తాత సూతుని గనుఁగొని
మరల నిట్టు లనియె భరతుఁ డపుడు. 2234

క. "నా రాకకుఁ ద్వరపెట్టుచుఁ
గారణ మేమియును లేక కబు రంపుదురే
సారథి! యే యశుభమొ చే
కూరిన దనుశంక మనసు గుందుచునుండెన్. 2235

గీ. రాజు మరణించినప్పుడు రాజధాని
విన్ననై యెట్టు లుండునో మున్ను విన్న
యట్టి దుర్లక్షణము లయోధ్యాపురమున
నిపుడు గనవచ్చుచుండె నా కెల్లయెడల. 2236

సీ. తీసినతలుపులు మూసినట్టులు లేక
ముంగిళ్ల నలుకులు ముగ్గులేక
పాకశాలలయందుఁ బచనాదికము లేక
సంసారులు భుజించు జాడలేక
అగరు శ్రీఖండ ధూపాదికమ్ములు లేక
విరులయంగడులఁ బూసరులు లేక
గార్హస్థ్య జనములఁ గళలు కాంతులు లేక
వీతిహోత్రక్రియావిధులు లేక

గీ. దేవళంబుల నుత్సవాదికము లేక
యజ్ఞయాగాదిపుణ్యకార్యములు లేక
పురమునందెల్లఁ దొల్లింటి సిరులు లేక
పాడుపడిపోయినట్లు చూపట్టుచుండె. 2237

గీ. ఆపణంబులఁ గ్రయవిక్రయములు మాని
వర్తకులు గాతఁబడుచుండి రార్తులట్లు
కోవెలలఁ జైత్యగృహముల గోపురముల
విహ్వలించుచునున్నవి విహగతతులు. 2238

ఆ. పురమునందు స్త్రీలు పురుషులు మలినులై
కనుల నశ్రువారి గ్రమ్ముకొనఁగ
విపులశోకతాపవిహ్వలస్వాంతులై
యుమ్మలించునట్టు లున్నవారు." 2239

క. భరతుం డట్లు లయోధ్యా
పురమునఁ గల దుర్నిమిత్తములఁ గనుఁగొనుచున్
దురపిల్లుచు సారథి కివి
యెఱిఁగించుచు నరిగెఁ దండ్రిగృహమునకు వెసన్. 2240

గీ. అమరపురిఁబోలి మున్నొప్పు న య్యయోధ్య
వీథులను జతుష్పథముల వేశ్మములను
సందడులులేక ధూళిధూసరిత మగుచు
జేవ్పడుటఁ గాంచి యాతండు చింతఁగుందె. 2241

క. మునుపెన్నడుఁ దనపురమున
వినియుఁ గనియు నెఱుఁగనట్టి విప్రియఘటనన్
గని దుఃఖించుచు భరతుఁడు
చనియెన్ దలవాంచి తండ్రిసదనంబునకున్. 2242

# 72-వ సర్గము

క. కని యా ప్రాసాదంబునఁ
దన జనకుఁడు గానరామి తల్లడపడుచున్
జనని యవరోధమున కా
యనఘుఁడు దాశరథి చనియె నారాటమునన్. 2243

ఆ. ఎంతొ దూరదేశ మేగివచ్చిన యట్టి
కన్నకొడుకు భరతుఁ గాంచి కైక
పరమముదముతోడ భర్మపీఠమునుండి
యిట్టె లేచి యతని నెదురుకొనియె. 2244

క. సారాచారుఁడు భరతుఁడు
శ్రీరహితంబైన జనని సితసౌధంబున్
జేరుకొని యామె శ్రీపద
సారసముల నంటి మ్రొక్కి సన్నిధి నిలువన్. 2245

ఆ. తనయుశిరము మూరుకొని కౌఁగిటఁ గదించి
యంకమందుఁ జేర్చి యాదరించి
దేవి కైక భరతు దీవించి కుశల సం
ప్రశ్న మాచరించి పలికె నిట్లు. 2246

ఆ. తాతయింటినుండి తరలివచ్చిన దాది
నెన్ని రాత్రు లయ్యె నిటకుఁ జేర;
నరదమెక్కి వేగ మరుదెంచితివి పథ
క్లాంతిగలుగలేదు గద కుమార! 2247

క. మాతామహునకు సేమమె?
మాతులుఁడున్ గుశలియే? కుమారా! నీవున్
బ్రీతిఁ సుఖముగ నుంటివె?
తాతగృహంబునను మాకు దవ్వుల నున్నన్. 2248

చ. అన విని "తల్లి! నేఁ బయనమై యిటఁ జేరఁగ సప్తరాత్రముల్
చనినవి; తాత మామయును సౌఖ్యముగా నట నున్నవారు; వా
రనిపిన కానుకల్ గొనుచు నా పరివారము వచ్చుచుండె నా
వెనుకనె; నన్ను వేగరులు వేగిరపెట్టఁగ ముందె వచ్చితిన్. 2249

ఆ. మాత! నీ సువర్ణమణిమయతల్పంబు
చెన్నుదొఱఁగి యట్లు లున్న దేమి?
తండ్రి దశరథేంద్రు దాసదాసీజను
లెలమి దక్కియుండి రేమి చెపుమ! 2250

క. నా తండ్రి రఘుకులేంద్రుం
డో తల్లీ! యిచట నెప్పు డుండు ననుచు నే
నేతెంచితి దర్శింపఁగ
నాతం డీ మందిరమున నగపడఁ డేమీ? 2251

ఆ. జనకుఁగని తదీయచరణాబ్జముల కేను
వందనంబు సేయవలయు నిపుడు;
ప్రేమ నన్నుఁ గాంచు పెదతల్లి గౌసల్య
యింట నుండె నేమొ యేగి వత్తు." 2252

గీ. అనుచు నేమియు నెఱుఁగక యటుమటించు
నాత్మజున కిది ప్రియమగు నని తలంచి
రాజ్యలోభమోహితయగు రాణి కైక
యప్రియకఠోరవార్త యిట్లని వచించె. 2253

గీ. "సాధుచరితుండు తేజస్వి సవనశీలుఁ
డగు మహాత్ముఁడు రాజు నీ యనుఁగు దండ్రి
ధరణి జనియించు నెల్లభూతములుఁ దుదకు
నెట్టిగతి కేగు. నా గతి కేగియుండె." 2254

క. అను దారుణదుర్వార్తను
విని భరతుఁ డపారశోకవేగంబున ని
ల్వనఁ గూలి కే ల్విదల్చుచు
వనట మునిఁగి జనకుఁగూర్చి వగవఁ దొడంగెన్. 2255

గీ. "అక్కటా! తండ్రి! నీవున్న యట్టివేళ
సమధికశ్రీల నెసఁగు నీ శయనతలము
చందురుఁడు లేని చదలట్లు జలములేని
యుదధియట్టులు శూన్యమై యుండె నేఁడు." 2256

క. అని భరతుఁడు దుఃఖార్తిన్
గనుదమ్ముల నశ్రు లొలుక గద్గదగళుఁడై
తన చేలాంచలమున నా
ననముం గప్పికొని రోదనము గావించెన్. 2257

చ. సురసము సూర్యచంద్రనిభశోభనతేజు మదేభసన్నిభున్
పరశునికృత్తభూరుహముభంగి ధరాపతితుం గుమారునిన్
భరతుని గాంచి కైక నరపాలక! లెమ్మిటువంటివేళ స
త్పురుషులు సభ్యసమ్మతులు పూజ్యులు నీ క్రియ నుమ్మలింతురే!

గీ. దానయజ్ఞాది సత్క్రియాసత్పరంబు
మహితశీలంబు వేదసమ్మతము నైన
నీ విమలబుద్ధి స్వస్థానసిహితమైన
సవితృతేజంబువోలి నిశ్చలము గాదె." 2259

ఆ. అనుచు బహువిధముల జనని దేర్చుచు నున్న
దుఃఖ మాఁపలేక ధూళిఁ బొరలి
తండ్రిఁ దలఁచి చాలతడ వేడ్చి భరతుండు
బాష్పకంఠుఁ డగుచుఁ బలికె నిట్లు. 2260

క. "అన్నయ్యకు నభిషవమో
జన్నమొ జరుగునను నాసఁ జనుదెంచితి నా
యెన్నిక వ్యర్థం బయ్యెను
గన్నయ్యయె లేని యిట్టిగతి ప్రాప్తించెన్. 2261

ఆ. జననీ! తండ్రి కేమి జబ్బుచేసినది? నేఁ
జెంతనుండి సేవఁ జేయనైతి;
జనకు సత్క్రియలను స్వయముగాఁ దీర్చు రా
మాదు లెంత ధన్యులైన వారు. 2262

గీ. ఆ మహారాజు నా తండ్రి యనఘకీర్తి
యే నిటకు వచ్చుటించు కే నెఱుఁగఁడు గద!
యెఱిఁగెనేని సత్వరముగా నెదురువచ్చి
నన్నుఁ గవుగలించి శిరము మూర్కొనక యున్నె? 2263

ఆ. ఎంతో దవులనుండి యేతెంచు నన్నుఁజేరి
మిపులఁ బ్రేమతోడ మేను నిమిరి
సమ్మదంబుగూర్చు జనకుసుఖస్పర్శ
యేది యింక నాకు? నెట లభించు? 2264

ఆ. అన్న తండ్రి చుట్టు మాత్మీయుఁడు ప్రియుండు
ప్రభుఁడు నింక నాకు రాముఁ డొకఁడె
దాసదుఃఖహారి దైవోపమునకు నా
యాగమనము దెలుపు మమ్మ! వేగ. 2265

క. తాతయనంతర మగ్ర
భ్రాతయె సర్వమగుఁ గానఁ బరమహితుం డా
పూతచరిత్రు భజించెద
నాతండే నాకు శరణమగు నెల్లయెడన్. 2266

ఆ. సత్యవిక్రముండు సత్యప్రతిజ్ఞుండు
ధర్మవిదుఁడు నిత్యధర్మపరుఁడు
సద్వ్రతుండు పూజ్యచరణుండు తండ్రి నా
కేమిచెప్పి దివికి నేగె నమ్మ! 2267

ఆ. మరణకాలమందు మా తండ్రి చేసిన
యాజ్ఞ యేమొ వినఁగ నభిలషింతు
నమ్మ! చెప్పు" మనిన నతనికిఁ గైక య
థోక్తరీతి నిట్టు లుగ్గడించె. 2268

క. "హా రామా! హా సీతా!
హా రామప్రాణ లక్ష్మణా! యని వగలం
గూరుచు మహాత్ముఁ డగు నా
క్ష్మారమణుఁడు సాధుపురుషసద్గతి గాంచెన్. 2269

ఉ. "ఏ యవనీసురేంద్రు ధనమేని హరించెనె? యెట్టిపాపముం
జేయనిపేదనే నధికునేని వధించెనె? యేని జాయనే
న్యాయముపీడి కూడెనె? ధరాధిపుఁ డేటికి దండకాటవిం
ద్రోయఁగఁజేసె సద్విజుని ద్రుంచిన పాతకునట్లు రాఘవున్?" 2276

ఆ. అనిన చపలచిత్త యత్యహంభావయు
స్త్రీస్వభావ యగుటఁ జేసి కైక
తన ప్రయత్న మంతయును యథాతథముగా
ననఘు భరతునకును వినుపఁ దొడఁగె. 2277

క. "అనఘుఁడు రాముఁడు విప్రుని
ధనము హరించుటయులేదు; తప్పెఱుఁగని యే
యనదను ధనికుని దునుమం
గను లే దన్యసతిఁ గంటఁ గనలేదు సుమీ! 2278

క. తనయా! రాముని యభిషే
చనవార్తన్ వినిన నేనె చయ్యనఁ జని నీ
జనకునిఁ గని యాచించితి
నిను రాజుంజేయ రామునిన్ వనిఁద్రోయన్. 2279

ఆ. నిత్యసత్యరతుఁడు నీ తండ్రి వరదాత
నా యభీష్ట మొసఁగినాఁడు నాకు
రాజ్య మిచ్చె నీకు రాముని వని కంపె
సీతతో సుమిత్రసూతితోడ. 2280

క. సురుచిర యశోవిశాలుఁడు
ధరణీపాలుండు కూర్మితనయున్ రామున్
దరిఁ గానక దుఃఖాంబుధి
దరిఁ గానక పరితపించి తనువు త్యజించెన్. 2281

ఆ. భరత! ధర్మనిరత! నరపతి వీ వైతి
విపుడు ధరణిరాజ్య మేలుకొనుము
వీ నొనర్చినట్టి యీ ప్రయత్నం బెల్ల
గొడుక! నీ ప్రియంబుఁ గోరి కాదె? 2282

క. శోకింపకు పరితాప
వ్యాకులుఁడవు గాకు నాయనా! ధీరుఁడవై
క్ష్మాకాంత నకంటకముగఁ
జేకొని పరిపాలనంబు సేయు మయోధ్యన్. 2283

ఉ. కావున వేదవేత్తలును గర్మఠులైన వసిష్ఠముఖ్య వి
ప్రావళితో మహాత్ముఁడు పరాక్రమశాలియు నైన తండ్రి ధా
త్రీవిభు నంత్యసత్క్రియలఁ దీరిచి వేగమ సర్వరాజ్య ల
క్ష్మీవిభవాభియుక్తి కభిషిక్తుఁడ వయ్యెదుగాక పుత్త్రకా!" 2284

## 73-వ సర్గము

క. జనకుఁడు మరణముఁ గాంచుట
యనుఁగు సహోదరులు గాన కంపఁ బడుటయున్
విని భరతుఁ డధికదుఃఖా
ర్తిని బడి జనయిత్రిఁ గాంచి దీనతఁ బలికెన్. 2285

ఆ. "తండ్రిఁ బాసి కన్నతండ్రితో సముఁడైన
యన్నఁ బాసి దుఃఖహతుఁడ నగుచు
బ్రదుకె భరముగాఁగఁ బరితపించెడి నాకు
రాజభోగ మేల? రాజ్యమేల? 2286

ఆ. కన్నతండ్రిఁ జంపి యన్నఁ దాపసిఁ జేసి
యార్తిమీఁద మఱియు నార్తిఁ గూర్చి
యురియు పుంటిమీఁద నుప్పువెట్టిన యట్లు
నన్ను బాధపెట్టినావు నీవు. 2287

ఆ. అకట! కాళరాత్రివై వచ్చిపడితివి
నీవు మా కులంబు నీఱుసేయ;
నెఱుకలేక మందుకొఱవిని నిన్ను మా
జనకుఁ డొడిని జేర్చుకొని నశించె. 2288

ఆ. పాపమతివి నీవె పతిని భూపతిని మా
జనకుఁ జేతులారఁ జంపినావు;
దుశ్చరిత్రురాల! తుదకు నీచేత మా
కులమునందె సుఖము తొలఁగిపోయె. 2289

గీ. అనవరతసత్యరతుఁడు మహాయశుండు
ధారుణీశుండు మాతండ్రి దశరథుండు
కోరి నినుఁ జెట్టఁబట్టిన కారణమున
వనటఁ దపియించి యిటు చావవలసి వచ్చె. 2290

ఆ. ఏమికారణమున భూమీశుఁ డైన నా
జనకు ధర్మపరునిఁ జంపినావు?
పురిని నిలువనీక పురుషోత్తముని రాము
నడవికేల వెడల నడచినావు? 2291

ఆ. తనయ విరహశోక తప్తలై కౌసల్య
యును సుమిత్ర సమయ కున్నవైన
నాకు జనని వైన నీకడ నొక్క ము
హూర్త మైన బ్రదికియుండఁ గలరె? 2292

గీ. గురుజనసమర్చనక్రియా కోవిదుండు
పరమధర్మాత్ముఁడగు రామభద్రుఁ డెపుడు
కన్నజనయిత్రిసిం బోలి నిన్నుఁ గూడ
నిండుమనమున సేవించుచుండుఁ గాదె? 2293

గీ. అట్టులే దూరదర్శిని యనఘచరిత
ధన్య కౌసల్య మాపెద్దతల్లి నిన్ను
సోదరిగ నెంచుకొనుచు సమాదరమున
నెల్లపుడుఁ జూచుకొనుచున్నదే కదమ్మ! 2294

క. ఆయమ్మ యేకపుత్రుని
శ్రీయుతునిన్ రాము నారచీరలతోడన్
ద్రోయించితి వడవికి నీ
వోయమ్మా! యింత పాప మొందునె యెందున్? 2295

క. కారణము లేకపాప వి
దూరుని శూరుని కృతాత్ము దోర్బలయశునిన్
శ్రీరామచంద్రు నడవికి
నారలఁ గట్టించి యంపినా వేమిటికిన్? 2296

క. రామునియెడ నా కెంతటి
ప్రేమగలదొ యెఱుఁగవైతి పేరానమెయిన్
నీమది గల రాజ్యపద
వ్యామోహంబుననె యీ యనర్థము లొదవెన్. 2297

ఆ. రాజసింహులైన రామలక్ష్మణుల ద
ర్శనము లేక యాదరంబు లేక
యెట్టి శక్తితోడ నీరాజ్యరక్షణ
సాహసించి చేయఁ జాలువాఁడ? 2298

క. మేరువు మేరువునుం బలె
ఘ్నారనమణుఁడు దశరథుండు సారబలుండౌ
శ్రీరాముని దోర్బలమున
భారం బిడి యుండెఁగాదె భద్రాత్మకుఁడై. 2299

ఆ. బలుపుగన్న యెద్దు భరియించు భారంబు
లేఁగదూడ మోయలేని యట్లు
లిద్ధబలుఁడు దశరథేంద్రుండు వహియించు
భూమిభార మేను పూనఁ జాల! 2300

ఆ. అట్లుగాక యోగికాత్మశక్తులచేత
వలయు బలము గలుగువాఁడ నైన
కొడుకుకోస మింత కొలగట్టుకొన్న నీ
యెలమి కొఱకు రాజ్య మేలఁ బోను. 2301

ఆ. అన్నయెపుడు నిన్నుఁ గన్నతల్లిం బోలి
గారవించుచున్న కారణమున
నతనిమనసునొచ్చు నని పాపమతివైన
నినుఁ ద్యజింపలేక వనరుచుంటి. 2302

ఆ. దుశ్చరిత్రురాల! దురితాత్మురాల! మా
వంశపూర్వపురుషవర్యు లెల్ల
నేవగించినట్టి యిట్టి దుర్బుద్ధి నీ
కెట్లుపుట్టె లోకు లీసడింప? 2303

క. మా వంశంబున జ్యేష్ఠునె
భూవల్లభుఁ జేయుచుంట పూర్వాచారం
బా విభునిఁ దమ్ములెల్లం
సేవించుచునుండుటయుఁ బ్రసిద్ధమ గాదే! 2304

ఆ. క్రూరచిత్తురాల! యీ రాజధర్మంబు
పాటిసేయవైతి పాడిదప్పి
ధరణివిభుల సంప్రదాయంబు లెల్ల సు
స్థిరములైన వనుచు నెఱుఁగ వొకొ! 2305

ఆ. అగ్రనందనులకె యభిషేక మొనరించు
టఖిలరాజకులుల యార్యధర్మ;
మందు మఱియు ముఖ్య మైక్ష్వాకులకు నిట్టి
పరమధర్మనియమపాలనంబు. 2306

ఆ. అట్టి ధర్మనిష్ఠు లట్టి సదాచారు
లవతరించినట్టి యన్వయమునఁ
గాలువెట్టి యశము గౌరవంబును గూడ
నాశనంబుఁ జేసి నావు నీవు. 2307

క. నీ పుట్టినింటివారును
భూపాలు రొనర్తు రగ్రపుత్రునె విధిగా
నే పగిదిఁ గలిగె నీ కీ
పాపపుదుర్బుద్ధి కొఱలముపరువున జెఱుపన్. 2308

ఆ. నాకు నీవె ప్రాణనాశనం బొనరించు
నిట్టివ్యథను దెచ్చిపెట్టినావు;
పాపచిత్తురాల! నీపాడుకోర్కె నె
న్నటికిఁ దీర్పఁజాల నమ్ము దీని. 2309

ఉ. నీ విటు నేడ్వఁ గానలకు నే నిపుడే చని బాంధవప్రియున్
బావను నగ్రజన్ము గుణభద్రుని రాఘవుఁ దెచ్చి రాజ్య ల
క్ష్మీవిభుఁజేసి తచ్చరణకింకరతన్ భజియించి నిత్యమున్
సేవ లొనర్చుచుందుఁదన చిత్తము రంజిల భక్తిపెంపునన్. 2310

క. భరతుం డీ గతి జననిన్
బరుషవచశ్శరనిహతుల భంజించుచు దు
ర్భరదుఃఖతప్తుఁ డయ్యున్
గిరిగుహఁ గంభీరవంబుక్రియ గర్జిలుచున్. 2311

# 74 వ సర్గము

ఆ. ఓ నృశంసురాల! యో దుష్టచారిణి!
యో యధర్మచరిత! యోసి కైక!
ఆత్మసుతునిఁ బాసి యపగతరాజ్యవై
యెట్టి దిక్కులేక యేడ్వు మింక. 2312

ఆ. క్షితిపుఁ డేమికీడు చేసెను లోకాభి
రాముఁడైన రాముఁ డేమిచేసె?
మాటలోనె పతిని మడియించి తత్సుతుఁ
గానకంపినావు కఠినురాల! 2313

క. కులనాశనంబు చేయుట
నలముకొనియె నిన్ను భ్రూణహత్యాఘము నీ
చెలువునిలోకము నీకుం
గలుగదు; నరకంబె యింక గతియగుఁ గైకా! 2314

ఆ. అతిభయంకరప్రయత్నంబు గావించి
యీవు చేసినట్టి యీ యఘంబు
విశ్వహితుని రామవిభు నన్ను నెడఁబాపి
ఘోరమైన భయము గూర్చె నాకు. 2315

క. నా తండ్రి చచ్చిపోయెను
భ్రాతయయిన రాముఁ డడవిపాలై పోయెన్
క్ష్మాతలమున నపకీర్తియె
నా తలపై నిలిచిపోయినది నీ కతనన్. 2316

ఆ. ధరణిరాజ్యకాంక్ష దశరథేంద్రునిఁ జంపి
మాతృరూపశత్రు వైతి నాకుఁ
బాపకర్మురాల! భర్తృహంతకురాల!
నీ మొగంబు గాంచనేర నింక. 2317

క. ఓ కులదూషణి! కైకా!
యా కౌసల్యయు సుమిత్ర యన్యజననులున్
నీ కారణమునఁ గాదే
శోకాబ్ధితరంగహతుల సుడివడు టెల్లన్. 2318

ఉ. మానితధర్మమూర్తి నిసి గుమారునిఁ బ్రాణసమాను రాముని౦
గానల కంపి దుర్మతిని గాంచెను మత్పిత నీకు లోఁగుటన్
భూనుతకీర్తి యశ్వపతిపుత్త్రి వె నీవు? కులంబు నార్ప దు
ర్మానముఁ గూర్ప రూపయిన రక్కసి వైతివిగాని దుర్మతీ! 2319

ఆ. ఈ వొనర్చినట్టి యీ పాపఫలమున
ననఘచరితుఁడైన జనకుఁ బాసి
ధర్మపరుల నన్నదమ్ములఁ బాసి నే
నప్రియుండనైతి నందటికిని. 2320

ఆ. పాపమతివి నరకపథగామినివి నీవు
మాన్యచరిత రామమాత నిట్లు
పుత్త్రవిరహదుఃఖమున ముంచి పొంగెదు
కైక! నీకుఁ బుట్టగతులు గలవె? 2321

ఆ. నిఖిలబంధుశరణ్యుండు నియమరతుఁడు
రాణి కౌసల్యతనయుండు రామవిభుఁడు
మాకు జ్యేష్ఠుండు జనకసమానుఁ డనుచు
నరయవే యించుకైనఁ గ్రూరాత్మురాల! 2322

క. అంగప్రత్యంగకబహి
రంగజుఁడే కాక యంతరంగజుఁడై పు
ట్టుంగన్న సుతుఁడె తల్లి క
గుంగద ప్రియతముఁడు బంధుకోటులకంటెన్. 2233

సీ. పూర్వ మొకానొకప్పుడు ధర్మవేదిని
 విబుధపూజితయైన వేల్పుమొదవు
భువిలోన నిజపుత్త్రపుంగవయుగళంబు
 హలమునుబూని తీవ్రాతపమున
నపరాహ్ణ మగుదాఁక నవని దున్నుచుఁ జాల
 నలసట నొంది మూర్ఛిలుటఁ జూచి
యా దేవి వగఁజెంది యంబా యనుచు నేడ్వఁ
 గనులఁజాఱిన యశ్రుకణ మొకండు

గీ. పరిమళించుచు శక్రుపైఁ బడఁగ నతఁడు
శిరము పైకెత్తి దుఃఖించు సురభిఁ గాంచి
జాలిఁబడి చెంగటికి నేగి కేలుమోడ్చి
వినయవినమితగాత్రుఁడై యనియె నిట్లు. 2324

క. లోకములకుఁ గల్యాణము
చేకూరుచుతల్లి! వగలజెందెద వేలా?
నీకున్ మాలో నెవ్వం
డే కీడైనఁ గలిగించెనేమో చెపుమా! 2325

ఆ. అనినఁ గామధేను వమరేంద్రునిం గాంచి
యార్య! నీకు శ్రేయ మగును గాక
నాకపురమునందు నా కొక్కఁ డేనియుఁ
గీడుచేసినట్టి వాఁడు లేఁడు. 2326

క. ఇలలోపల నా సంతతి
హలికునిచే నెన్నొ వెతల నంది యలయుటన్
దిలకించి యేడ్చుచుంటిని
గలఁతంబడి యిట్లు కన్నకానుపుగానన్. 2327

ఆ. భారపీడితులును బరమదుఃఖితులైన
యాత్మభవులు నిత్య మడలుచుండఁ
జూడఁ జాల కిట్లు శోకింతుఁ; దల్లికిఁ
బుత్త్రుకంటెఁ బ్రియుఁడు పుడమిఁ గలఁడె? 2328

గీ. జగమునిండించు సుతసహస్రంబు లున్నఁ
దనయు లిరువురి కష్టంబు గని తపించు
కామగవిఁ గాంచి యింద్రుండు కన్నతల్లి
కాత్మజునికంటెఁ బ్రియుఁడు లేఁడని తలంచె. 2329

క. కడుపెడుబిడ్డలఁ గాంచిన
పుడుకుమొదవె యట్లు వగలఁబొగిలిన దనఁగా
నడ లడర నేకపుత్త్రకు
నెడసిన కౌసల్య యింక నే గతి బ్రతుకున్? 2330

ఆ. గరిత యేకపుత్త్ర కౌసల్య కీ రీతి
నీ కతాన పుత్త్రశోక మొదవె;
యిట్టిచెట్ట మూటగట్టిన నీ కింక
నేడుపే శరణ్య మిందు నందు. 2331

ఆ. అన్న రాముఁ దెచ్చి యభిషిక్తుఁ గావించి
యడవి కేనె తపసి నగుచు నేగి
జనకుఁ బూజ్యు నగ్రజుని రాము నీ రీతి
నలరఁజేసినట్టి యశముఁ గాంతు. 2332

ఆ. పాపచరితురాల! పాపాత్మురాల! నీ
పాపకృత్యమునకుఁ బరితపించు
ప్రజల శోకతప్తబాష్పముల్ గనుచు నే
నిమిషమైన నిచట నిలువఁ జాల. 2333

క. అనలమున నుఱికి మ్రగ్గుము;
వనములఁబడి పోయి మేను వదలుము; కంఠం
బున కురి నిడుకొని చావుము;
గనుఁగొనఁగా నీకు వేఱుగతి లే దింకన్. 2334

క. నే నిపుడు సత్యవిక్రమ
ధీనిధి శ్రీరామచంద్రుఁ దిరుగన్ రాజ్య
శ్రీనాథుఁ జేసి విగత
గ్లాని నగుదు నతనిఁ గొలిచి గతపాపుఁడనై." 2335

ఆ. అనుచు భరతుఁ డిట్టు లధికరోషంబున
భుజగరాజ మట్లు బుస్స లిడుచుఁ
దోమరాంకుశహతిఁ దూలించు వనమద
దంతివోలె నట్టె ధరణి పడియె. 2336

ఆ. కన్ను లెఱ్ఱవాఱఁ గట్టుపుట్టముఁ జాఱఁ
దొడవు లెడల నేలఁబడిన భరతుఁ
డుత్సవాంతమందు నుర్విపై వ్రాల్చిన
శక్రు కేతనంబు ఛాయఁ దోఁచె. 2337

## 75-వ సర్గము

గీ. బలపరాక్రమశాలియౌ భరతుఁ డంతఁ
జాలసేపటు మ్రాన్పడి సంజ్ఞ గాంచి
కనుల నశ్రువు లొలుకఁ బ్రగ్గడల యెదుట
జననిని దిరస్కరించుచు ననియె నిట్లు. 2338

చ. "మనముననైన రాజ్య మణుమాత్రము గోరినవాఁడఁ గాను; నా
జననికి నిట్లుచేయు మని సైతముఁ జెప్పినవాఁడఁ గాను; నా
యనుజుఁడు నేను దూరమునయందు వసించుటఁజేసి యీ మెయే
మనినదొ తండ్రియాజ్ఞ యెటులైనదొ నేనెఱుఁగన్ నిజంబుగన్. 2339

ఆ. పూజ్యపదుఁడు రామభూమిపాలుఁడుఁ గాని
పూతచరిత సాధ్వి సీత గాని
మహితవిక్రముండు మా లక్ష్మణుఁడుఁ గాని
కాన కేగినట్టి యే నెఱుంగ." 2340

క. అని యిట్లాక్రోశించెడి
యనఘచరితు భరతు ఘనగళారావంబున్
విని కౌసల్య సుమిత్రం
గని యిట్లనెఁ జింత కొంత కడమపడంగన్. 2341

ఆ. క్రూరురాలు కైకకొమరుండు భరతుండు
వచ్చినట్లు గానవచ్చుచుండె;
దూరదర్శి నాకుమారుని నొకసారి
కనగఁ గోరుచుంటి ననుచుఁ జెప్పి. 2342

ఉ. మానితవర్తనుండగు కుమారునిఁ గాంచెడి సంభ్రమంబునన్
దీన వికంపమానకృశదేహవిచేతన రామమాత చే
యూని సుమిత్రపైఁ బయనమై నడతెంచుచునుండ నంత రా
మానుజుఁడైన యా భరతుఁ డామెనె సానుజుఁడై యెదుర్కొనెన్.

చ. తనయులఁ గాంచినంత నతిదారుణ దుఃఖముపొంగిపొర్ల ని
ల్వున నిలఁగూలి రెక్కొను నెలుంగున నేడ్చుచునున్నదాని, నా
ర్యను సుమనస్వినిన్ జనని నన్నయుఁ దమ్ముఁడు గౌఁగిలించి మిం
ఛిన వగఁ దూలి రోదనము సేయఁ దొడంగిర పెద్దపెట్టునన్ 2344

క. పనవి పనవి కౌసల్యయుఁ
దనయు భరతుఁ గాంచి యపుడు "తండ్రీ! నీ కో
రిన రాజ్య మకంటకముగ
నినుఁ జెందెన్ గైకఘోరనింద్యక్రియలన్. 2345

గీ. క్రూరదర్శిని క్రూరాత్మ కుమతి కైక
నారచీరలు గట్టించి నా కుమారు
రాము గెంటించెనే మహారణ్యములకు!
నెంతదారుణ మిది? తన కేమివచ్చె? 2346

క. ఏ బాధలు లేక కయిక
నాబరువుం దీర్చుకొనఁగ నను గెంటించున్,
నాబిడ్డ రామచంద్రుఁడు
నా బంగరుబొజ్జయున్న నట్టడవి కిఁకన్. 2347

క. అది యట్టులు గాదేనిన్
హృదయేశ్వరు నగ్ని వెంటనిడుకొని నేనే
ముదిత సుమిత్రయె తోడుగఁ
బదిలంబుగఁబోదు రామభద్రుని కడకున్. 2348

ఆ. నరవరేణ్యుఁడైన నాతండ్రి రాముండు
తపముసేయుచున్న విపినమునకు
నిపుడె తనయ! నన్ను నీవైన స్వయముగా
వెంటఁగొంచుఁ బోయి విడువ వచ్చు. 2349

క. ధనధాన్యసమన్వితమును
ఘనరథమత్తేభతురగకలితమునగు నీ
యనుపమవిశాలరాజ్యము
జననికరుణవలన నీకు సమకూరెఁగదా!" 2350

ఆ. అనుచు రామమాత యాయంబులను గాదు
నట్లు తన్ను నొవ్వనాడుచుండఁ
బుండుమీఁద సూదిపొడిచిన ట్లనఘుఁడౌ
భరతుఁ డెంతయేని బాధపడుచు. 2351

గీ. జననికౌసల్యచరణాంబుజముల వ్రాలి
కలఁగి విలపించి మూర్ఛిల్లి తెలిసి లేచి
తనవలెనె దుఃఖపడుచున్న తల్లిఁ జూచి
యంజలించి వినీతుఁడై యనియె నిట్లు. 2352

ఆ. ఇట్టిగొడవ లించుకేనియు నెఱుఁగని
దోషరహితు నన్ను దూఱుచుంటి
వన్న రాముఁడన్న ననుజుఁ డీ భరతుని
కెంత భక్తిగలదొ యెఱుఁగవమ్మ? 2353

ఆ. సాధుజనుఁడు సత్యసంధుండు రాఘవుం
డూరు వీడు కెఱిఁగియుంటి నేని
సద్గురూపదిష్ట సకలశాస్త్రాదిక
స్ఫురణ నాకు లేకపోవుఁ గాక! 2354

సీ. మార్తాండు నెదురుగా మలమూత్రముల నిర్వి
చారుఁడై విడు ననాచారికొడిమ
నిదురించుగోవును బదములఁ బ్రహరించి
బాధించు క్రూరునిపాతకంబు
ప్రజల బిడ్డలఁబోలి పాలించు నృపతికి
ద్రోహంబు గావించు దుష్టు దొసఁగు
పంటలో నాఱవపాలు గప్పము గొని
రైతులఁ బ్రోవని రాజునఘము

గీ. నీచు సేవించి జీవించు నింద్యునికొల్ల
యిన్నియును సంభవించి న న్నేఁచుఁగాక
పూజ్యుఁడగు రాముఁ డడవికిఁ బోవుమాట
యెఱిఁగియుంటిన యేని నా కిష్టమేని. 2355

చ. హవన మొనర్చి ఋత్విజుల కాడినదక్షిణలీనివాఁడు నా
హవమునఁ దోడిసేన విడనాడి భయంపడిపాఱువాఁడునున్
దవిలి గురూపదేశమును దప్పినవాఁడును బోవునట్టి రౌ
రవమున కేగువాఁడ రఘురామవివాసము సేనెఱింగినన్. 2356

క. రాముఁడు వనికిం బోవుట
యే మతి నెఱిఁగితినయే నహీనభుజబలున్
సోమరవితేజు రాజ్య
శ్రీమహితునిఁ గనకయే నశింతును గాత్రా. 2357

గి. పలలముఁ దిలోదనంబును బాయసంబుఁ
దేవపితరుల కిడకుండఁ దిన్నకీడు
గురుల నిందించు నఘము నా బొరయుఁ గాక
యడవి కన్న యేగుట కిష్టపడితి నేని? 2358

సీ. విహితురహస్యంబు వెల్లడించిన వాఁడు
చెలికాని కపకృతి చేయువాఁడు
నుపకారి కుపకృతి యెపుడుఁ జేయనివాఁడు
నొరులు చేసినమేలు మఱచువాఁడు
చెట్టసేఁత లొనర్చి సిగ్గుఁ జెందనివాఁడు
నాత్మహత్యకుఁ బూనినట్టివాఁడు
గృహిణికిఁ బుత్త్రుల కిడక తా నొక్కఁడే
మృష్టాన్నముల భుజియించువాఁడు

గి. హితు లయిన భృత్యులను ద్యజియించువాఁడు
బహుజనద్వేషమునకుఁ బాల్పడినవాఁడు
పోవుదుర్గతులకు నేను బోదుఁ గాక
యడవి కన్న యేగుట కిష్టపడితి నేని. 2359

ఆ. వెట్టివానిఁ బోలి పుట్టెను జేఁబూని
ప్రేలికలనుగట్టి బిచ్చమునకుఁ
దిరుగువానిగతికి నరిగెదఁ గాక దా
శరథి నడవి కంపు టెఱఁగి యున్న. 2364

సీ. సంజల నిదురించు జాల్మునిగతికిఁ గొం
పలు గాల్చి హర్షించు పాపిగతికి
గురుతల్పగమనుఁడౌ కుటిలాత్ముగతికి మి
త్త్రద్రోహియైన పాతకుని గతికి
సుజనాపకృతియైన కుజనుని గతికి సో
దరుల మోసముసేయు దురితు గతికి
పితరులఁ గొలువని మతిహీనుగతికి దే
వతల సేవింపని పతితు గతికి

గీ. ఋతుమతింగూడు నతిచారిగతికి నాత్మ
సతిని విడనాడి చను వ్యభిచారిగతికి
మద మలిన చిత్తుగతికిఁ బోవుదును గాక
యడవి కన్న యేగుట కిష్టపడితి నేని. 2365

ఆ. ధర్మరతులగతులు ధర్మాత్ముల యశంబు
ధర్మవిదుల పుణ్యకర్మములును
నాకు లేకపోవుఁ గాక రఘూత్తముఁ
డడవి కేగ నిష్టపడితి నేని. 2366

క. రాముం డడవికిఁ బోవుటఁ
గామించితి నేని పుత్త్రగణసహితముగా
లేమిం బడి దుస్సహ దుః
ఖామయపీడితుఁడ నగుచు నడలుదు గాతన్. 2367

ఆ. సైపరానియట్టి శపథంబు లొనరించి
తన్నుఁ దిట్టుకొనుచుఁ దనువు మఱచి
ధరణిఁ బడిన సుతుని భరతునిఁ గాంచి కౌ
సల్య యిట్టు లనియె సకరుణముగ. 2374

ఆ. "పుత్ర! యిట్లు పొంగిపొరలు దుఃఖంబున
మునిఁగిపోవు ప్రాణములను గూడ
నిష్ఠురంబు లైన నీ సత్యశపథంబు
లొడల నిలువరించుచుండె నోయి! 2375

ఆ. భాగ్యవశత ధర్మపథమందె నీ వుంటి
వనుజుఁడైన లక్ష్మణుని విధమున;
నిత్యసత్యశపథనిర్వాహకుండవై
సాధుజనుల జాడఁ జనుము తండ్రి!" 2376

క. అనుచుం గోసలనందన
యనుజ్ఞప్తియుఁ బుత్త్రు భరతు నాయతబాహున్
దన యొడిఁ జేరిచి కౌఁగిట
నెనయించి యెలుంగు మిగుల నేడ్వఁ దొడంగెన్. 2377

గి. పరమ దుఃఖాకులాత్ముఁడై వనపుచున్న
య మ్మహాత్ముఁడు భరతున కపుడు ప్రేమ
గారవించుచుఁ గౌసల్య యూఱడించు
కొలఁది శోకంబు మినుముట్టి కలపఁ దొడఁగె. 2378

క. కలఁగుచు భరతుం డా గతి
విలపించుచు నేల వ్రాలి విగతస్పృహుఁడై
పలవించుచు నిట్టూర్పుల
వెలరించుచు నుండ రాత్రి వేగుచుఁ జనియెన్. 2379

## 76-వ సర్గము

ఆ. పలుకుబడులఁ బెద్దపలుకులజాణ వ
సిష్ఠపరమమౌని శేఖరుండు
శోకతప్తు భరతుఁ గైక కొమరుఁ గాంచి
యనునయమున నిట్టు లనియె నపుడు. 2380

క. "రా కొమర! భరత! యిఁక నీ
శోకంబును విడుము; యశము శుభమగు నీకున్;
నీ కన్నతండ్రి మృతునకు
నాకావాసోచితక్రియలఁ జేయఁ దగున్." 2381

ఆ. అను వసిష్ఠుమాట లాలించి స్మృతిఁ గాంచి
పరమధర్మవిదుఁడు భరతుఁ డపుడు
ధృతి వహించి పితకుఁ బ్రేతకార్యంబులుఁ
జరుపఁ బూనె శాస్త్రసమ్మతముగ. 2382

గీ. తైలఘటినుండి తరలించి ధరణినుంపఁ
బచ్చవారి నిద్రించెడి పగిది నున్న
ప్రభునిదేహంబు రత్నతల్పమునఁ జేర్చి
వగ మిగుల నిట్లు భరతుఁ డేడ్వంగఁ దొడఁగె. 2383

క. "దూరంబున నే నుండఁగ
శ్రీరాముని ధర్మనిరతు సీతాసహితున్
సౌరబలు లక్ష్మణుని నే
కారణమున నంపినావు కానకు జనకా! 238

క. పురజన సుఖదాయకుఁ డగు
పురుషోత్తము రాము వీడి పొక్కెడి మమ్మున్
వెర వరసి యూఱడింపక
నరనాయక! యెచటి కరిగినాఁడవో చెపుమా! 238

క. శ్రీరాముఁడు వని కేగెను
స్వారాజ్యముఁ జేరినావు జనకా! నీవున్
నీ రాజ్యశ్రేయంబుల
నారయువా రెవ్వ రింక నవనీనాథా! 2386

ఆ. విభుఁడ వైన నీవు విడిచిన విధవయై
ధరణికాంత పొలుపు దక్కియుండె;
చందమామ లేని చలువవెన్నెల లేని
రేయివోలె నుండె నీ యయోధ్య!" 2387

క. అని దీనత వగచెడి నృప
తనయు భరతుఁ గాంచి గురుఁడు "తండ్రీ! శ్రద్ధన్
జనకుని యపరక్రియలం
బొనరుపఁ దగు నన్యచింతఁ బోనాడి వెసన్." 2388

ఆ. అనెడి గురునియాజ్ఞ నౌదలఁ దాలిచి
యార్య గురు పురోహితాళిఁ బిలిచి
గౌరవించి యఖిలకర్తవ్యములఁ దీర్పఁ
డనుచు నపుడు భరతుఁ డానతిచ్చె. 2389

ఆ. బయటఁ జేర్చియున్న ప్రభు నగ్నిహోత్రమున్
ద్విజులు శాస్త్రవిధిని దెచ్చినంత
నధిపుమృతశరీర మందలంబున భృత్యు
లునిచి వనట నెత్తికొనుచుఁ జనిరి. 2390

క. నరపతి శిబికకు ముందుగఁ
బురజనులు సువర్ణరజతముద్రలు చీనాం
బరములను జల్లుకొనుచుఁ
దరలి చనిరి దుఃఖశోక తప్తహృదయులై. 2391

క. నరవరుని సతులు సచివ
త్కరము గురులు భరతుతోడఁ దర్పణములు భూ
వరున కిడి చని యథావిధిఁ
దరలించిరి సూతకంబు దశదివసములున్. 2398

## 77-వ సర్గము

సీ. అట్లు దశాహంబు లరుగ నేకాదశా
హంబున శుచియై నృపాత్మజుండు
ద్వాదశాహమున శ్రాద్ధక్రియల్ దీర్చి య
వ్వారిగా మృష్టాన్నవస్త్రములను
ధనకాంచనముల రత్నముల నుత్తమవస్తు
తతుల బ్రాహ్మణులకు దాన మిచ్చి
ఛాగసమూహముల్ గోగణంబులు దాస
దాసీజనములు నివాసములును

గీ. రజతరాసులు వాహనప్రకరములును
బహుళ వస్తూత్కరంబుతో భక్తితోడఁ
దండ్రి యుత్తరక్రియలందు దక్షిణలుగఁ
బాఱులకుఁ బుష్కలంబుగాఁ జూఱ లిడియె. 2399

గీ. పదియు మూఁడవనాఁటి ప్రభాతవేళ
నస్థిసంచయనార్థమై యరిగి భరతుఁ
డధికశోకభరంబున నవశుఁ డగుచు
ఖిన్నకంఠస్వరమున దుఃఖించె నిట్లు. 2400

క. "న న్నొప్పగింప నేలెడి
యన్న రఘూత్తముఁడు రాముఁ డడవికిఁ బోవన్
న న్నీవును దెసమాలిన
తెన్నున విడనాడి పోయితే నా తండ్రీ! 2401

గీ. అమ్మ కౌసల్య కెందు దిక్కైన యట్టి
తనయుఁడగు రాముఁ డడవికిఁ [illegible]ఖముఁ బడియె;
నీవునుం గూడ నిట త్యజియించిపోయి
చివర కామె ననాథను జేయఁ దగునె?" 2402

గీ. అనుచు వగఁగుంది కుంది భస్మారుణమగు
నధిపుదగ్ధాస్థిమండలం బరసి యరసి
తండ్రి యపుడె పోయినయట్లు తలఁచి తలఁచి
బావురని యేడ్చె భరతుండు పనవి పనవి. 2403

క. చితిఁ గాంచి యట్లు లేడ్చుచు
స్మృతి దప్పఁగ భరతుఁ డపుడు క్షితిపైఁ బడె ను
ద్ధృతహరికేతువు యంత్ర
చ్యుతమై నుర్వీతలమున కొఱఁగిన కరణిన్. 2404

క. భరతుని పాటుంగని చె
చ్చెరఁ జని యా కొమరు చట్టుఁ జేరిరి సచివుల్
సురపురి విడి గతసుకృతిన్
ధరఁ బడిన యయాతి ఋషులు దటిసిన భంగిన్. 2405

క. ఘనశోకనిహతు భరతుం
గనుఁగొని శత్రుఘ్నుఁ డాపగా రాని వ్యథన్
జనకుఁ దలఁచి బిట్టెలుఁగునఁ
బనవుచు స్మృతిదప్పి కూలఁబడియెం బుడమిన్. 2406

*.౧ మఱుగుజ్జు ముఖంబునఁ బుట్టి కైకయన
ఽత మధ్యమమై వరదానరూపకో
యతిదారుణ దుఃఖసముద్రమగ్నతన్
నంచుఁ బలవించి యతండు పితన్ స్మరించుచున్.

క. "పాలింపఁ దగిన కొమరుఁడు
బాలుఁడు భరతుఁ డిటు దుఃఖపడుచుండంగా
లాలింపక యాతని మొఱ
నాలింపక యిప్పు డెచటి కరిగితి తండ్రీ! 2408

క. విలువగల నగలు వలువలు
పలువిధముల భక్ష్యభోజ్యపానీయంబుల్
వలసినవి గొనుం డని మా
కెలమి నిఁకఁ గూర్చువార లెవ్వరు? తండ్రీ! 2409

గీ. ధర్మవిదుఁడు మహాత్ముండు త్రాతయు నగు
విభుని నిను వీడి సుంతైన వ్రీలకుండె
వజ్రసన్నిభమైన యీ వసుధగుండె
ప్రళయకాలంబునం గూడఁ బగుల దేమొ? 2410

గీ. జనక! నీ వేగినా విట్లు స్వర్గమునకు;
నన్న రాముండు పురివీడి యడవి కేగె;
జ్వలన కుండంబునం బడి చచ్చుకంటె
నింక జీవితసామర్థ్య మేది నాకు? 2411

గీ. పావనేక్ష్వాకు కులుల యేల్బడుల నలరి
యున్నయును నీవు లేక శూన్యమయి యున్న
యీ యయోధ్య నే నింకఁ గాలిడఁగఁ జాల
నడవులకు నేగి జడదారి నగుదుఁ గాని." 2412

క. అని యన్నదమ్ము లిరువురుఁ
బనవుచు వాపోవుచుండఁ బ్రగడలు గురులున్
జనతతులు మూగి మఱలన్
వనటు మునిఁగి రెల్లవారు వారిం గనుచున్. 2413

గీ. అట్లు దుఃఖార్తులై గుండె లవియునట్లు
రోదనముచేసి భరతశత్రుఘ్ను లలసి
పుడమిపైఁ బడి పొరలాడఁ దొడఁగి రంత
భగ్నశృంగములగు వృషభముల భంగి. 2414

క. నుతశీలుఁడు సర్వజ్ఞుఁడు
క్షితిపు పురోహితుఁడు నగు వసిష్ఠుఁ డపుడు రా
సుతు భరతుఁ దేర్చి సముచిత
హితధర్మాచరణసరణి నిట్లు వచించెన్. 2415

క. "ఇది పదుమూఁడవదివసము
సదమలమతితోడ నస్థిసంచయనంబున్
గొదవడక యుండఁ దీర్పుము
చెదరిన ధృతి నింక జాగుసేయకుము ప్రభూ! 2416

గీ. అఖిలజనులకు శోకమోహములు క్షుత్పి
పాసలును జరామరణముల్ ప్రాపకంబు
లపరిహార్యంబు లవి; జ్ఞానివైన నీవు
వాని గణియింపఁ దగ" దని యానతిచ్చె. 2417

గీ. అంత శత్రుఘ్ను మతిమంతుఁ డగు సుమంత్రుఁ
డల్లనల్లన నెత్తి సమాదరోక్తి
మతి కుదురఁ జేసి ధర్మసమ్మతములైన
సాధుబోధల నతనిఁ బ్రసన్నుఁ జేసె. 2418

గీ. అమలకీర్తులు పురుషసింహములు నైన
తోడఁబుట్టులు భరతశత్రుఘ్ను లట్లు
తేరుకొని యెండవానల బారిఁ జిక్కి
సురవరధ్వజయుగ మట్లు మెఱసి రపుడు. 2419

క. కన్నీ రొత్తుకొనుచుఁ దొగ
కన్నులతో మెల్లమెల్లఁగాఁ బ్రగ్గడ ల
య్యన్నాదమ్ములఁ దండ్రికిఁ
బున్నెఁపుఁ గర్మములఁ దీర్పఁ బురికొల్పి రొగిన్. 2420

# 78_వ సర్గము

గీ. అపరసత్క్రియల్ దీర్చి గృహంబుఁ జేరి
యన్న రాముని దర్శింప నభిలషించు
శోకసంతప్తు భరతునిఁ జూచి లక్ష్మ
ణాను జుం డగు శత్రుఘ్నుఁ డనియె నిట్లు 2421

క. "ఆపన్నుల కెల్లరకున్
బ్రాపగు శ్రీరాముఁ డొక్కపడఁతి పనుపుచే
నాపదల కోపి ఘోర వ
నోపగతుం డయ్యె శక్తియుండియు నకటా! 2422

గీ. రామునను జుఁడై లక్ష్మణనాముఁ డొకఁడు
నరనుతపరాక్రమాఢ్యుఁ డున్నాఁడు గాదె?
తిరుగఁబడి తండ్రి నతఁడైన ధిక్కరించి
యన్న వనవాసమును మాన్పఁ డయ్యె నేమి?" 2423

క. అని వచియించుచు లక్ష్మణు
ననుజుఁడు శత్రుఘ్నుఁ డుగ్రుఁడై యుండఁగఁ జ
క్కనివేషముతో మంథర
పనివడి నడతెంచుచుండెఁ బ్రాగ్ద్వారమునన్. 2424

చ జినుగులుఁ బూఁతలున్ నగలుఁ జేరిచి కూరిచినట్టి కోఁతి లా
గున నరుదెంచుచున్న మరుగుజ్జుఁ గనుంగొని సేవకాళి యీ
చెనఁటియె తెచ్చిపెట్టినది చేటు పురంబున కంచు శత్రు మ
ర్దనుఁడు సుమిత్రసూనునకు దాని కుతంత్రముఁ జెప్పి చూపుచున్.

క. "ఈ ముండ మూలముననే
రాముఁ డడవిఁ బట్టె; గిట్టె రాజును; నగర
శ్రీమాసెఁ; బ్రజల కెల్లన్
సేమము సెడె; దీనిఁబట్టి శిక్షింపఁ దగున్." 2426

క. అన విని శత్రుఘ్నుండును
కనలున వడి నేగి దాసికాపరివృతఁ గు
బ్జనుఁ బట్టి యీడ్వ భయమున
మునుకుచు నదియేడ్చె నంతిపుర మ్మదువంగన్. 2427

గీ. దోర్బలపరాక్రముండగు శత్రుఘ్నుఁ గాంచి
ఖిన్నమతి నంతఁ గుబ్జాసఖీజనంబు
లతఁడు తముఁ గూడఁ బట్టి పల్లార్చు ననుచు
భయముపడి పల్కికొని రిట్లు పరువు లిడుచు. 2428

క. "కరుణామతి ప్రియవాదిని
నిరుపమ సద్ధర్మకీర్తినిధి కౌసల్యన్
వరదాయినిఁ బ్రార్థింతము
శరణం బా యమయె మనకు సర్వవిధములన్." 2429

ఆ. అనుచుఁ బఱచుచుండ నపుడు శత్రుఘ్నుండు
కుబ్జఁ బట్టి యీడ్చుకొనుచు రాఁగ
నామెభూష లురలి యందందుఁ జిందంగ
నలరె నగరు శారదాభ్ర మట్లు. 2430

ఆ. కినుక నట్లు మంథరను బట్టి కొట్టుచుఁ
దీవరముగఁ దన్నుఁ దిట్టుచున్న
శమనమూర్తియైన శత్రుఘ్నుఁ గని కైక
వెఱచి పఱచి భరతుమఱుఁగుఁ జొచ్చె. 2431

చ. భరతుఁడు తల్లిపాటుఁ గని బన్నముఁ బడియేడ్చుచున్న మం
థరఁ గని ధర్మభంగిఁ గని తమ్ముఁ గనుంగొని యప్పు "డో సుధీ
వర! జగమందు స్త్రీగణ మవధ్యము గాదె! సమస్త జీవులన్
ద్వరపడి యిట్లు తాల్మి విడువం దగునా?"యని హెచ్చరించుచున్.

గీ. "మాతృహంతకుఁ డనుచు ధర్మజ్ఞుఁ డైన
యన్న నను దూఱు నను భయ మయ్యెఁ గాని
కలుషచారిణిఁ బాపాత్మఁ గైకఁ బట్టి
చంపకుందు నటోయి! తత్క్షణము నందె. 2433

క. ఈ మంథర యైనను నిం
దే మడియుట యయ్యెనేని నీ వృత్తంబున్
రామవిభుఁడు విని యిఁక మన
మోముఁ గనునె? పలుకు వినునె? మున్నిటివోలెన్." 2434

గీ. అను భరతు మాట విని లక్ష్మణానుజుండు
దుష్టదమనుండు నైన శత్రుఘ్నుఁ డపుడు
క్రోధమును వీడి శాంతుఁడై క్రూరకుటిల
వృత్తియగు మంథరనుగూడ విడిచి వైచె. 2435

ఆ. అట్లు బంధముక్తయైన యా మంథర
యపుడు బ్రతుకుజీవుఁడా యటంచుఁ
గైక కడకు నొక్కగంతునఁ జని యామె
యడుగుదోయి వ్రాలి మిడుకఁ దొడఁగె. 2436

క. శత్రుఘ్నుని యీడ్పుల క్షత
గాత్ర యయిన కుబ్జయట్లు క్రౌంచి విధమునన్
ధాత్రిఁ బడి యేడ్చుటం గని
యాత్రపడుచుఁ గైక దాని నాశ్వాసించెన్. 2437

# 79-వ సర్గము

క. పదపడి నృపాభిషేచన
విదులు వెడలి కార్యవిధులు విభు భరతునకున్
విదితముగఁ దెలిపి రిట్లని
పదునాల్గవనాఁటి సుప్రభాతమునందున్. 2438

ఉ. "శ్రీనిధి రామునిన్ సుతుని జ్యేష్ఠుని లక్ష్మణుతో బలాఢ్యుతోఁ
గానల కంపి రా జడలి కాలగతిం గనె; ఱేఁడు లేమి లో
లోనఁ బ్రజాళి నే గొడవలున్ ఘటియిల్ల వదృష్ట మిన్ని నా
ళ్లైనను; నిప్పు డీవు దొరవై ధరణీభర మూనఁగాఁ దగున్. 2439

క. పరిచారకు లభిషేచన
పరికరముల నెల్ల సిద్ధపఱచిరి సచివుల్
పురజనములు పరిజనములు
దొరపడుచున్నారు నిన్ను దొరఁ జేయంగన్. 2440

క. పితృపైతామహ మగు నా
యత ధరణీరాజ్యమునకు నభిషిక్తుఁడవై
సుతుల వలె మమ్ముఁ బ్రోవుము
వ్రతనిరతా! భరత! విబుధవరనుతచరితా!" 2441

క. అన విని భరతుం డభిషే
చనవస్తుచయమ్ముఁ జేరఁ జని వలగొనుచున్
జనగణముల నెల్లం గని
వినయానతుఁ డగుచు నిట్లు విజ్ఞాపించెన్. 2442

క. "మా వంశాచారసరణి
భూవల్లభుఁ డగుట జ్యేష్ఠపుత్రునికె తగున్;
కేవల మిది మీ రెఱిఁగియు
నీ విధమునఁ బలుకు టుచితమే నాతోడన్? 2443

గీ. అధిపుఁ డగుఁ గాక మాయన్న యతని బదులు
వనుల నేనుండుఁ బదునాల్గువత్సరములు;
నేనె చతురంగబలముతో నేగి వేగ
వేఁడుకొని తోడుకొనివత్తు విభుని రాము. 2444

గీ. అభిషవద్రవ్యములు గొని యడవి కేగి
యటనె పట్టాభిషిక్తుగా నతనిఁ జేసి
యజ్ఞముననుండి హవ్యవాహనునిఁబోలి
వేఁడుకొని తోడుకొనివత్తు విభుని రాము. 2445

క. తల్లి ననుకొనెడి కైకకు
నుల్లంబున నున్నకోర్కి నొడఁగూర్పను; నే
నిల్లువిడిచి వని నుండెద
నెల్ల మహీతలము రాముఁ డేలుంగాతన్. 2446

ఆ. మెరకపల్లములను దెరలించి బాటల
శిల్పివరులు తీరిచెదరుగాక
నడవ నెడములేని యడవిదారు లెఱుంగు
నెఱుకుగుంపు ముందె యేగుఁగాక!" 2447

ఆ. అనుచు నానతిచ్చు నా భరతుం గాంచి
జనులు సంతసించి సాధుశీల!
ప్రభుని రాముఁ జేయఁ బ్రతినఁ బూనిన నిన్ను
సాకుఁగాత సతము లోకమాత." 2448

క. అని సత్యవ్రతు భరతునిఁ
గొనియాడుట లాలకించి గురుజనములు న
య్యనఘుని నభినందించిరి
కనుదమ్ముల హర్షబాష్పకణములు దొఱఁగన్. 2449

ఆ. అట్లు సభ్యులెల్ల నానందభరితులై
ప్రభుకుమార! భరత! భవదనుజ్ఞ
మార్గచోదకులను మాన్యుల శిల్పులఁ
బంపువార మనుచుఁ బలికి రపుడు.

## 80-వ సర్గము

సీ. అయ్యనంతరమున నవనీస్థలజ్ఞులు
సూత్రకారులు మార్గశోధకులును
వనపథరక్షకుల్ ఖననోపజీవులు
కార్మికుల్ బహుయంత్రకారకులును
స్థపతిశేఖరులు వృక్షచ్ఛేదకులు నియో
గులు దర్శకులు యంత్రకోవిదులును
కూపకారులు వర్ధకులు మేదరులు సుధా
కారులు నన్యోన్యకార్యకరులు

గీ. నందఱును రామచంద్రవీక్షాభిలాషఁ
బొంగుచు నృపాజ్ఞఁ దలఁదాల్చిపోవుచుండ
నా జనసమాజ మప్పుడు తేజరిల్లె
నిండుపున్నమనాఁటి మున్నీటిఁ బోలి.

గీ. మార్గకల్పనక్రియల సమర్థు లైన
వారు తెగ కొక్కగుంపుగాఁ జేరికూడి
తమకు నియమింపఁ బడిన కృత్యములఁ దీర్పఁ
దగిన యుపకరణములతోఁ దరలి చనిరి.

సీ. దారి కడ్డైన లతాగుల్మములఁ దూల్చి
ధరణీరుహంబుల నఱికి వైచి
యెండలు చొరఁబాఱునెడల మోకలు నాఁటి
పాషాణఖండముల్ పగులఁ గొట్టి

తివియరా కలమిన యవుర్ధుగడ్డి దహించి
చనరాని గుట్టలఁ జదునుచేసి
పథనిరోధకములౌ బావుల నెఱియల
మిట్టపల్లంబుల మట్టుపఱచి

గీ. కఱకురాలను జూర్ణంబుగా నొనర్చి
తెరువునాఁగెడు నేళ్ల వంతెనలు గట్టి
కట్టు లవియించి చెఱువులఁ గప్పివైచి
నెఱపఁ దొడఁగిరి పెనుబాట నేరుపరులు. 2453

గీ. శైలధారలఁ గలిపి నిర్ఝరులఁ జేసి
యఖిలఝరుల మహాప్రవాహముగఁ జొనిపి
యూషరక్షేత్రములను నిమేషమాత్ర
సరసులు ఘటించి రపుడు సాగరము లట్లు. 2454

క. ఏడనెడ వలసినచోటులఁ
గడునుత్తమములును వేదికామండితముల్
నడబావుల నిర్మించిరి
వెడలెడు సేనలకుఁ బానవిశ్రాంతులకై. 2455

ఆ. సన్నరాలు నిసుక సున్నంబును మెదించి
ఘట్టనంబుచేసి గారవెట్టి
యధ్వ మెల్లఁ దీర్చి రద్దంబులాగున
సిద్ధహస్తులైన శిల్పకరులు. 2456

చ. సురపురిరాజవీథివలె సొంపుల పెంపున నింపు నింపు నా
పఱపగు గచ్చు బాట యిరుప్రక్కలఁ దీర్చిన పువ్వుదోఁటలన్
దిరిగెడి పక్షిపాటలను నిద్దపు గొజ్జఁగినీటిచల్లులన్
నెఱవిరి తావిపెల్లునను నిండి మనోహర మయ్యెఁ జల్లనై. 2457

ఆ. బాటనిట్లుగూర్చి ప్రభునాజ్ఞ డేరాలు
ఫలవనములచెంతఁ బాదుకొలిపి
నృపుఁడు మెచ్చునట్లు నేరుపుఁ జూపి కై
చేసి రెల్లవారిఁ జిత్రకరులు. 2458

గీ. శుభదినంబున శుభతార శుభముహూర్త
సమయమున నంత వాస్తుశాస్త్రజ్ఞు లెల్ల
వివిధశిబిరంబులను రాజవేశ్మములను
గడఁగి నిర్మింపఁ దొడఁగిరి కౌశలమున. 2459

సీ. వలచుట్టి వాలుకాతలముల నెలయించి
యగడిత లా వెన్క ననువుపఱచి
నలువంక నున్నని నడబాట లమరించి
ప్రాకారములఁ జుట్టుఁ బాదుకొలిపి
ఫలపుష్పతరు లతోపవనముల్ నిర్మించి
ధ్వజపతాకాస్తంభతతులు నిలిపి
విమలపుష్కరిణుల వెలయించి యా విశా
లాయతస్థలిని దేవాలయములు

ఆ. నింద్రకీలభూధరేంద్రతుల్యము లైన
రాజవేశ్మశిబిరరాజములును
దెరువు నిరుదెసలను దీరిచి కట్టి ర
యోధ్యనుండి గంగయొడ్డుదాఁక. 2460

ఆ. అశనంబునోరయు నా విమానగృహాళి
సకలభవనశిబిరచయముఁగూడ
దేవలోకమందు దివ్యమందిరము ల
ట్లతిమనోహరంబు లగుచుఁ దోఁచె. 2461

గీ. మెఱయు చుక్కలతోడఁ జందురునితోడ
రాత్రిరివెలుంగు వినువీథిరీతి నపుడు
శిల్పి కుశల నిర్మితమై విచిత్రకళల
రాజమార్గంబు రమ్యమై తేజరిల్లె. 2462

## 81-వ సర్గము

సీ. అధ్వనిర్మాతల నట్లుపంపిననాఁటి
యాభ్యుదయికమైన యపరరాత్రి
భరతు నుద్దేశించి భద్రగీతంబుల
సూతమాగధులు ప్రస్తుతులు సేయఁ
గాలసూచకబుగాఁ గనకదండాహతి
భేరికాధ్వానముల్ బోరుకొనఁగ
వరశంఖ మర్దళ మురజ కాహళ వాద్య
మంగళరావముల్ మాఱుమ్రోఁగ

గీ. నా మహారంభసంరంభ మాలకించి
యదరిపడి లేచి దుఃఖించి యపుడు భరతుఁ
డేను రాజుఁ గానని వాని మానిపించి
యనుజు శత్రుఘ్నుఁ గనుఁగొని యనియె నిట్లు. 2463

క. "లోకమున కెంత యపకృతి
కైకమ్మ యొనర్చినదియొ కంటివె యనుజా!
క్ష్మాకాంతుఁడు దశరథుఁడో
నా కీ దుఃఖముల నిచ్చి నాకముఁ జొచ్చెన్. 2464

ఆ. ధర్మమూలమైన ధరణిరాజ్యేందిర
నావికుండులేని నౌకఁ బోలి
ధర్మరాజు ననఘు దశరథునిం బాసి
యొల్లఁబోయి తల్లడిల్లుచుండె. 2465

ఆ. వీతధర్మయైన నా తల్లి కైకేయి
మనకు రక్షకుఁడగు ననఘు రాము
వనికిఁ బంపివైచె" నని యేడ్చుటను విని
పొగులఁ దొడఁగి రంతిపురపు సతులు. 2466

చ. అనఘుఁడు రాజధర్మవిదుఁడైన వసిష్ఠుఁ డనర్ఘరత్న కాం
చనమయమై సురేంద్రపరిషన్నిభమైన ధరామరేంద్రు కొ
ల్వున కపు డేగి శిష్యవరులుం బరివారముతోడఁ గూడి చ
య్యన మణిహేమపీఠమునయందు సుఖాస్తరణోపవిష్టుఁడై. 2467

క. ముని యంత భృత్యులం గని
"ఘనకార్యముఁ దీర్పవలయుఁ గావున మీరల్
చని బ్రహ్మక్షత్రవణి
గ్జనగణవల్లభులఁ బిలువఁగాఁ దగు మఱియున్. 2468

ఆ. నృపవరాంతరంగభృత్యసంయుక్తు శ
త్రుఘ్ను మహితు భరతుతోడఁ గూడ
రాజసచివులగు యుధాజిత్సుమంత్రుల
నఖిలహితులఁ దేరనగును వేగ." 2469

క. అని పనుప భృత్యు లటు చని
మునియానతి వినుప వేగముగ వా రెల్లన్
ఘనగజతురగాదిక వా
హనరవములు మిన్నుముట్ట నరిగిరి సభకున్. 2470

క. పురజనులు దశరథునివలె
భరతుని శత్రుఘ్నుఁ గాంచి భద్రోక్తుల ని
ర్జరవరు లింద్రునిఁ బొగడిన
కరణిం గొనియాడి రధికకౌతుకమతులై. 2471

చ. ఉరగ తిమి ప్రవృత్తము సముత్కటనిశ్చలవారిపూర మాం
తర నవరత్న శంఖసికతాతలమైన హ్రదంబుఁ బోలి దా
శరథుల రాఁక నాఁటిసభ సమ్మతమై విలసిల్లె నప్పు డా
ధరణితలేంద్రుఁడౌ దశరథప్రభుఁడే కొలువున్న కైవడిన్. 2472

## 82-వ సర్గము

క. గురుముఖ్యగ్రహగణ వి
స్తరమగు యామినిని బూర్ణచంద్రుఁడు వోలెన్
గురుముఖ్య సచివ నరవర
పరిశోభిత సభను గాంచె భరతుం డెలమిన్. 2473

ఆ. ఆర్యు లైన సభ్యు లా రీతి నరుదెంచి
య ర్హపీఠములను నధివసింప
వారి యంగరాగ వసన భూషణకాంతు
లొలసి వెలసె నప్పు డోలగంబు. 2474

క. పండిత జనమండిత మగు
నిండుసభ వెలింగె నపుడు నిర్మేఘంబై
నిండునెలతో వెలుంగుచు
నుండు శరద్రాత్రివలె సముజ్జ్వల మగుచున్. 2475

ఆ. సభకు వచ్చియున్న సామంతరాజులు
సచివవరులు నార్యజనులు వినఁగ
గురుఁడు ధర్మవిదుఁడు భరతుఁ గనుంగొని
హితమ్ము దూక్తు లొలయ నిట్టు లనియె. 2476

క. "అనఘుఁడు దశరథనరపతి
ధనధాన్యసమృద్ధమైన ధరణీస్థలికిన్
నినుఁ బ్రభునిఁ జేసి ధర్మం
బును వీడక చనియె నమరపురికిఁ గుమారా! 2477

గీ. ఉదితశశి నైజకౌముది వదల నట్లు
సాధుసజ్జన ధర్మానుసారి యగుచు
జనకునానతిఁ దలఁదాల్చి సత్యరతుఁడు
రామచంద్రుండు చనియె నరణ్యములకు. 2478

క. పితృసోదరదత్తం బీ
గతకంటకరాజ్యలక్ష్మిఁ గైకొని యభిషే
చితుఁడ వయి వేగ సచివులు
హితులు ప్రజలు నలరి మెచ్చ నేలుము వత్సా! 2479

ఆ. ఉర్విపతికి నీకు నుత్తరపశ్చిమ
దక్షిణులును బ్రాచ్యధరణివరులు
ద్వీపనృపులు యవనభూపతుల్ మాణిక్య
కోటి గానుకలుగఁ గూర్తుగాక!" 2480

క. ఆ కరణి గురుఁడు దెలుపఁగ
శోకంబున మునిఁగి ధర్మశూరుఁడు భరతుం
డేకాగ్రచిత్తమున ధ
ర్మాకాంక్షితుఁడై స్మరించె నగ్రజు రాముః. 2481

క. కలితవయస్కుఁడు భరతుఁడు
కలహంసగళస్వనుండు కన్నీ రొలుకః
విలపించి సభాంతరమునఁ
కులగురువరు మాట పాటిగొన కిట్లనియెః. 2482

ఆ. "మౌనివర్య! యెంతమాటాడితివి? యిట్టి
సభ్యసమితి నీ యసాధుబోధ
సేయ నగునె? ధర్మశీలుండ వయ్యును
గులపురోహితుఁడవు గురుఁడ వయ్యు. 2483

ఆ. బ్రహ్మచర్యమూని బహువేదశాస్త్రముల్
చదివి స్నాతకుఁడగు సదమలమతి
ధర్మనిష్ఠు రాము ధరణిరాజ్యంబు నా
యట్టి తమ్ముఁ డెవ్వఁ డపహరించు? 2484

గీ. అట్టి ధర్మాత్ము దశరథునాత్మభవుఁడ
నైన నే నెట్లు రాజ్యాపహారి నగుదు?
రామవశులమె నేనైన రాజ్య మైన
ధర్మనిర్దేశ మిటుఁ జేయఁ దగు మహాత్మ! 2485

గీ. జ్యేష్ఠుఁడును ధర్మశీలుండు శ్రేష్ఠగుణుఁడు
నరనుతచరిత్రుఁడు దిలీప నహుష సముఁడు
ప్రథిత కాకుత్థ్సకులుఁడు శ్రీరామవిభుఁడె
దశరథునిఁ బోలి ధరనేలఁ దగినవాఁడు. 2486

క. పరసుఖదూరము దుష్టా
చరితము నగు పాప మేను జలిపితినేనిన్
బరమేక్ష్వాకుకులంబును
జెఱుపన్ జనియించినట్టి చెనఁటిని గానే? 2487

ఆ. అడవులందునున్న యన్న కిం దుండియే
ప్రణతు లాచరించి పలుకుచుంటి;
అమ్మ చేసినట్టి యఘమున కేను బా
ధ్యుండఁ గాను సమ్మతుండఁ గాను. 2488

క. పురుషోత్తముఁడగు రాముఁడు
ధరణీభారంబె కాదు త్రైలోక్యంబున్
భరియింప నర్హుఁ డాతని
చరణంబుల కేను సేవ సలుపుచు నుందున్. 2489

ఆ. సాధుజనులముందు సచ్చరిత్రులముందు
బత్తిఁ గోరియైన బలిమి నైన
శక్తి కొలఁది రామచంద్రుఁ డోడ్తేరంగ
యత్నముల నొనర్తు నఖిలగతుల. 2490

క. నే నెంత వేఁడుకొనినను
మానితుఁడగు రామవిభుఁడు మఱలక యున్నన్
నే నార్యలక్ష్మణుని వలె
నా నరవరుఁ గొలిచియుండు నడవులయందున్. 2491

గి. అధ్వకల్పకపరిశోధకాధికృతులఁ
బంపితిని మున్నె మార్గ మేర్పఱచుటకును
సపరివారుండనై యన్నసన్నిధికిని
త్వరగఁ బయనంబు గావింప వలయు" ననిన. 2492

క. పరమార్థసంయుతములగు
భరతుని యా నుడుల విని సభాసదు లెల్లన్
మరిమరి పొగడిరి రాముని
స్మరియించుచు హర్షబాష్పసలిలనయనులై. 2493

గి. ధర్మనిరతుండు భ్రాతృవత్సలుఁడు భరతుఁ
డిటు లెఱింగించి తనకుఁ జెంగటనె యున్న
మంత్రకోవిదుఁడైన సుమంత్రుఁ గాంచి
యా సభామధ్యమున నిట్టు లానతిచ్చె. 2494

గి. "అనఘ! వేగ నీవేగి నా యాజ్ఞదెలిపిఁ
సైనమునకు సేనల సిద్ధపఱపు" మనిన
నది తనకు నిష్ట మగుటచే నతిముదమున
నా సుమంత్రుండు చని చెప్పినట్లు చేసె. 2495

క. భరతుండు రామచంద్రుని
బురికిం గొనితేర వనికిఁ బోయెడు వార్తన్
బరమానందంబున విని
పురజనులు దళాధిపతులుఁ బొంగిరి మదులన్. 2496

క. నరవరుఁడగు రఘురాముని
దరిసెనము లభించునన్న తాత్పర్యమునన్
బురికొల్పుచుఁ దమభర్తలఁ
ద్వరపెట్టిరి సకలయోధదారలు వేడ్కన్. 2497

గీ. భరతు నాజ్ఞను దలదాల్చి ప్రమద మెసఁగ
రథ గజ తురంగ శకటవర్గములతోడ
భట తతులతోడ వాహినీపతులు వేగ
బలము నాయత్తపఱచిరి పయనమునకు. 2498

ఆ. అట్లు సిద్ధపడిన యా సేనలం గాంచి
గురునినమ్ముఖమున భరతుఁ డప్పు
డన్నరాము చెంత కరుగు సంభ్రమమున
నా సుమంత్రుఁ గాంచి యాదరమున. 2499

క. "గురువరులను బురముఖ్యుల
బరమహితుల నధికృతులను బంధుజనంబున్
బరివారంబుల నాయిత
పఱుపు" మనుచుఁ జెప్పి యతనిఁ బంపించుటయున్. 2500

ఆ. ప్రతిగృహంబునుండి పయనమై యరుదెంచి
రుర్విసురులు క్షత్రియోత్తములును
వైశ్యవరులు శూద్రవర్యులు రథగజ
హయఖరోష్ట్రముఖ్యయానములను. 2501

# 83-వ సర్గము

గీ. అంత భరతుండు ముషఃకాల మందు లేచి
శ్రీరఘూత్తము రాము దర్శించువేడ్క
నఖిలపరివారజనము ద న్ననుసరింప
ధర్మమణిపుష్యరథముపై బయలుదేఱె. 2502

క. జవన హయసంయుతములై
సవితృరథముఁబోలునట్టి స్యందనముల వై
భవమున మంత్రి పురోహిత
నివహ మరుగ దొడఁగె భరతునికి ము న్నగుచున్. 2503

సీ. భరతుని వెంబడి భద్రేభ నవసహ
స్రారూఢులైన యోధాగ్రణులును
ఆ వెన్క షష్టిసహస్ర శతాంగాప్తిఁ
బ్రథనదుర్జయులైన రథికవరులు
నావల శతసహస్రాశ్వోపవిష్టులై
యరిభయంకరులైన యాశ్వికులును
అతుపిమ్మట సమర్థయాన వాహనములఁ
బ్రభు భక్తులగు నార్యపౌరవరులు

గీ. జలధరశ్యామదేహు నాజానుబాహు
సువ్రతు ననంతబలు లోకశోకహరుని
సద్గుణోపేతు లక్ష్మణసహితు రాము
దర్శనం బబ్బు ననువేడ్కఁ దరలి చనిరి. 2504

క. లోకాభిరాము రామునిఁ
దోకొనివత్తు మనుకోర్కితో హర్షముతోఁ
గేకయసుతయు సుమిత్రయు
నా కౌసల్యయును నేగి ర థ్వాశిబికలన్. 2505

గీ. ప్రొద్దుచీఁకటి విరియించుపోలిక మన
దుఃఖతమము దర్శనమాత్రఁ దొలఁగఁ జేయు
నినుఁ డతం డని శ్రీరాము ననఘచరిత
లభినుతించుచుఁ బయనించి రఖిలజనులు. 2506

సీ. అవల రాముని కిష్టులై భజించెడి తమ్మ
పడిగకూర్పరులును నడపకాండ్రు
పరిమళస్నానముల్ పచరించువారలు
నగరుధూపముల నీరార్చువారు
మడుఁగు లిచ్చెడువారు నడుగు లొత్తెడువారుఁ
దోరంపుఁ దొడవులఁ దొడుగువారు
నమిలికన్నులవీవనల వీచువారును
వెజ్జులు వంటరుల్ వేగరులును

గీ. గంధకారులు నాసవకల్పకులును
విట విదూషక గాయక నటకవరులు
చిత్రకారులు నవరత్నసూత్రకరులు
నరుగఁదొడఁగిరి ప్రభుదర్శనార్థు లగుచు. 2507

గీ. సాలె లగసాలెలును బూలమాలకరులు
గుమ్మరులు దరిజీలును గమ్మరులును
చాకళులు మంగళులు నెల్లసౌకిరులును
సాముగరిడీలవారును జనిరి వేడ్క. 2508

గీ. నిగమసంవేదులును యోగనిష్ఠులును స
నాతనాచారులగు బ్రాహ్మణప్రముఖులు
వృషభశకటాధిరూఢులై వేనవేలు
భరతు వెంబడి నేగిరి ప్రమద మెసఁగ. 2509

క. అందఱు సమ్మర్దవాహను
లంద ఱమలవసన భూషణాలంకృతులే
యందఱు శ్రీచందనధరు
లందఱు నానందమతులె యా బలఁగమునన్. 2510

ఆ. అన్న రాముఁ దేర నడవి కఱ్ఱగెడు
భ్రాతృవత్సలుఁడగు భరతువెన్క
నఖిలసైనికులు మహానందమగ్నులై
హర్షపులకితాంగు లగుచుఁ జనిరి. 2511

గీ. అట్లువా రధ్వమున దూర మరిగి యరిగి
రామునెచ్చెలి గుహుఁ డేలు సీమ నున్న
శృంగిబేరపురముచెంత గంగదరికి
నేగి తమ వాహనములతో నాఁగి రచట. 2512

గీ. అపుడు భరతుండు తన్ను వెన్నంటివచ్చు
సైన్యముం గని మంగళసలిల చక్ర
వాకవిలసిత గంగాభవానిఁ గాంచి
యఖిలసచివులతో నిట్టు లని వచించె. 2513

క. "సేనలను నిల్పుఁ డెడనెడ
నీనాఁ డిట విడిసి యుందమే? నీ గంగన్
స్నానం బొనర్చి స్వర్గతుఁ
డైన పితకుఁ దర్పణంబు లర్పింప వలెన్. 2514

ఆ. ఎల్లి గంగదాఁటి యేగంగఁ దగు"నని
ప్రీతి నానతీయఁ బ్రెగడ లెల్లఁ
దమకు నచ్చినట్టి తావుల సేనల
విడియఁ జేసి రపుడు విశ్రమింప. 2515

గీ. భరతుఁ డట్లు గంగదరిని సర్వసమృద్ధ
విపులసైన్యములను విడియఁ జేసి
మరల రామవిభునిఁ బురికిఁ దోడ్తెచ్చు ను
పాయ మాత్మఁ జింత సేయఁ దొడఁగె. 2516

## 84-వ సర్గము

క. అంతట గుహుఁ డా జాహ్నవి
చెంతటఁ గుమిగూడియున్న సేనలఁ గని వి
భ్రాంతుఁ డయి భిల్ల సేనా
కాంతుల బంధువులఁ బిలిచి కడకఁ బలికెన్. 2517

క. "మున్నీటిఁ బోలి కడ లే
కున్నది యీ సేన; వచ్చె నుద్ధతి భరతుం
డి న్నేలకు; రథముపయిం
గన్నారే కోవిదారఘనకేతనమున్. 2518

క. మన చెంబడీంద్ర నందఱి
ననువున బంధించు తలఁపొ యది గాదేనిన్
మనలం దనసేనలతో
ననిమొన వధియించు తలఁపొ యగు నీతనికిన్. 2519

గీ. అట్లు గాకున్న జనకాజ్ఞ నడవి నున్న
రాజదుర్లభమగు రామరాజ్యమెల్లఁ
గరగతముఁ జేసికొను కాంక్ష కైకపట్టి
యన్నఁ జంపుటకే పోవుచున్నవాఁడొ? 2520

క. దాశరథి రాముఁడే నా
కీశుండును సఖుఁడు నతనిహిత మొనరింపన్
దాశానీకముతో మీ
రీ శత్రుల గంగదాఁటనీయకుఁ డెందున్. 2521

ఆ. దాశయోధులెల్ల దళములుగాఁ గూడి
గంగ నాశ్రయించి కదలకుండఁ
బలల కంద మూల ఫలముల మెసవుచు
రేవు లెట్టులైనఁ గావవలయు. 2522

క. కైవర్తవీరయోధులు
నావకు నూఱేసిమంది నానాయుధులై
కావం దగు నీ తీరము
పోవం దగు నైదునూర్ల పోతములపయిన్. 2523

క. శ్రీరాముని యెడల భరత కు
మారునకున్ ద్రోహచింత మదిలేదే నీ
తీరగతసేనతో భా
గీరథిఁ దరియింప నతనికిన్ సాధ్య మగున్." 2524

ఆ. అనుచు నాయకులకు నానతుల్ గావించి
మత్స్యమాంసములును మధువు గొనుచుఁ
బ్రభుకుమారుఁ జూడఁ బఱతెంచు గుహుఁ గాంచి
పలికె సూతుఁ డపుడు భరతుతోడ. 2525

క. "ఈతఁడు గుహుఁడను నాతఁడు
జ్ఞాతిబలుఁడు భిల్లవిభుఁడు కడువృద్ధుఁడు నీ
భ్రాతృసఖుఁడు దండకపథ
మీతని నఖదర్పణ మని యెఱుఁగుదును ప్రభూ! 2526

క. నీ వీతనికిన్ దర్శన
మీవలయును నిశ్చయముగ నీతఁడు మనకున్
దీవరులు రామలక్ష్మణు
లే వనమున నున్నవారో యెఱిగించుఁ దగన్." 2527

ఆ. అను సుమంత్రు పలుకు లాలించి భరతుఁడు
వల్లె యనఁగ బంధువరులతోడ
గానుకలను గొనుచు నా నిషాదవిభుండు
ప్రభునిఁ జేరి మ్రొక్కి పలికె నిట్లు. 2528

క. "మీ యింటి పెరడుగాదే
మా యీ దేశంబు; ముందు మాయెఱుఁగమిచేఁ
జేయము ప్రత్యుత్థానము
మా యింటన్ నేఁడు నిలిచి మఱిపోవఁ దగున్. 2529

క. ఈ వన్యమూలఫలములు
నీవారము వివిధమాంసనివహము తేనెల్
మా వారు తెచ్చియిడెదరు
నీ వారము విందుగొనుము నీ బలఁగముతోన్. 2530

గీ. అఁగుఁగాక నీ సైన్యంబు లలపుదీరఁ
గొందుఁగాక మా పూజలఁ గోర్కిదీర
రాత్రి మీ రెల్ల నిందె విశ్రాంతి నంది
రేపకడ లేచి గంగఁ దరింత్రు గాక!" 2531

# 85–వ సర్గము

క. అన విని భరతుఁడు గుహుఁ గని
"యనఘా! మా యన్న సఖుఁడ వగు నీ వొకఁడే
నను నీ సేనలఁ దనిపెదఁ
బనిగొను మనె; దదియ చాలుఁ బ్రమదం బయ్యెన్. 2532

గీ. ముని భరద్వాజు నాశ్రమంబునకుఁ జేర
నే పథంబునుబట్టి మే మేగవలయు?
కాననము దుర్గమం బయ్యె; గంగకూడ
నుత్తరించుట కలవి గాకుండె నిపుడు." 2533

ఆ. అనిన గుహుఁడు వినతుఁడై "ధనుర్ధరులు నా
వారితోడఁగూడి వనపథమున
నిన్నుఁ గొలిచి వత్తు నేనును నీకు నా
వంతయైనఁ జింతవలదు గాని. 2534

క. కలనైన నొరుల కపకృతి
జలుపని సదయుఁడగు రామచంద్రుని యెడలన్
దలఁపవుగద ద్రోహము; నీ
యలఘుబలముఁ జూడ సందియం బగుచుండెన్." 2535

ఆ. అనిన సత్ప్రథంబునట్లు నిర్మలుఁడైన
భరతుఁ డపుడు శబరపతిని గాంచి
"నాకు గురుఁడుఁ బితయు నా యన్న రాముఁడే
యిట్లు నీవు సంశయింప వలదు. 2536

క. సహజన్ముని రామప్రభు
గహనంబులనుండి యెట్లొ క్రమ్మఱఁ దేఁగన్
బహుయత్నంబునఁ జనియెద
గుహుఁడా! సత్యమిది శంక గొనకుము మదిలోన్." 2537

గీ. అనిన గుహుఁడు ప్రమోదాంచితాస్యుఁ డగుచు
ధన్యుఁడవు నీవె భరత! యీ ధాత్రిలోన
నప్రయత్నలబ్ధంబైన యట్టి రాజ్య
మెవఁడు నీవలెఁ ద్యజియించుఁ దృణముఁ బోలి? 2538

క. శోకోపహతుని రామ
క్ష్మాకాంతునిఁ గ్రమ్మఱింపఁ జనుచుంటిగదే
లోకాలోకస్ఫూర్తిన్
నీ కీర్తి తిరంబుగాఁగ నిలుచుం గాతన్" 2539

ఆ. భరతు నట్లు గుహుఁడు ప్రస్తుతించుచు నుండఁ
దరణి కాంతిఁ దొరఁగె; విరిసె రజని;
సేన విడియఁజేసి తాను శత్రుఘ్నుతో
భరతుఁ డపుడు మరలఁ బాన్పుఁ జేరె. 2540

క. శోకానర్హుఁడు ధర్మ
వ్యాకీర్ణాంతరుఁడు నసఘుఁ డగు భరతునకున్
రాకుండె నిద్ర రామ
క్ష్మాకాంతైకాగ్రచింత మదిఁ బొదలుటచేన్. 2541

గి. గహన దహన ప్రతప్తమౌ ఘనతరువును
గర్భగతవహ్ని గనరాక కాల్చునట్లు
ప్రబలచింతాప్రతప్తుఁడౌ భరతవిభుని
యుల్లము దహింపఁ దొడఁగె శోకోజ్జ్వలాగ్ని. 2542

ఆ. ప్రబలశోకతప్త భరతుని నెమ్మేన
శ్రమజలంబు గ్రమ్మి జాలువాఱె
ఖరకరాంశుపాళిఁ గ్రాఁగిన హిమగిరిఁ
దుహినవారిధార దొరఁగి నట్లు. 2543

సీ. కడలేని ధ్యానమే ఘనశిలోచ్చయముగా
నిట్టూర్పులే ధాతునివహములుగ
నాయాసశోకంబులే యగ్రశిఖలుగా
సమ్మోహమే జంతుసమితిగాఁగ
దైన్యమే వివిధపాదప సమూహంబుగా
సంక్షోభమే ప్రభంజనముగాఁగ
సంతాపమే వనస్పతివంశసమితిగాఁ
గన్నీరె సెలయేటి కాలువలుగ

గీ. దుర్ముఖము దుర్గమంబును దుస్సహంబు
నతిభయంకర మచలం బనంత మైన
దుఃఖరూపక కర్కశోత్తుంగశిఖరి
విఱిగి పైఁబడ భరతుండు విహ్వలించె. 2544

క. నరవరుఁడగు భరతుం డపు
డురుతరదుఃఖార్తి వెచ్చనూర్చుచు మూర్ఛం
బొరలుచు మతిచెడి మందన్
దొరఁగిన వృషభంబు కరణి దోఁచుచు నుండెన్. 2545

గీ. ఆత్మపరివారయుతుఁడు సమాహితుండు
పూజ్యుఁడగు భరతుం డట్లు పొక్కుచుండ
సన్నిధినె దుఃఖపడుచున్న శబరవిభుఁడు
రామసేమంబుఁ దెల్పి యూఱడిలఁ జేసి. 2546

## 86-వ సర్గము

ఆ. గహనగోచరుండు గుహుఁడు సాంత్వనసూక్తి
నప్రమేయు భరతు నపుడు గాంచి
అనఘుఁడైన లక్ష్మణార్యు సద్భావంబు
నెఱుక పఱుపఁ దలఁచి యిట్లు లనియె. 2547

క. "అనుఁగుసహోదరుఁ గావఁగఁ
గనుమూయక నాఁటిరాత్రి క్షణ మేమఱ కే
ధనురస్త్రకృపాణములన్
గొని నిలిచిన సుగుణు లక్ష్మణుని కిట్లంటిన్. 2548

ఆ. "రఘుకుమార! ధర్మరతసుఖోచిత! నీకుఁ
బాన్పుఁ గూర్చినాము పండుకొనుము
కష్టసహుల మేము కాచియుందుము రాము
ఱెప్పవాల్పకుండ రేయి యెల్ల. 2549

క. రామువిభుకంటె నాకున్
ప్రేమాస్పదుఁ డెవ్వఁడు లేఁడు పృథివీస్థలిలో
నా మాట నమ్ము; సత్య
ప్రామాణ్యముగాఁగ రామరక్ష యొనర్తున్. 2550

క. శ్రీరాముని కృపచేతనె
పేరును బెంపుఁ గననుంటిఁ బ్రియు శయనగతున్
దారయుతు నితని గాఁచెద
నీ రేయి సబాంధవముగ ధృతధర్ముఁడనై. 2551

క. ఈ యడవిని దిరిగెడి నా
కేయెడ నెఱుఁగనిది లే దహీనబలుఁడనై
మాయింపఁ గలను శత్రు ని
కాయంబుల రథగజాశ్వగణసహితముగాన్." 2552

ఆ. అన సుమిత్రసూతి "యనఘ! నీ రక్షణ
గన్న మాకు భయము గలదె? యైన
రమణితోడ దాశరథి నేల శయనింపఁ
జూచు నాకు బ్రదుకుసుఖము గలదె? 2553

క. ఎవని సురాసురులైనన్
బవరంబున నెదిరి నిలిచి బ్రదుకఁగలేరో
యవిజేయుఁ డట్టి రాఘవు
డవనిన్ దృణశయ్యఁ బండె నక్కట! కంటే! 2554

క. వ్రతముల జపములఁ దపముల
నతికష్టము లంది కన్న యాత్మసదృశుఁడున్
హితుఁడు సుతుఁడు రాముఁడు ప్రవ
సితుఁడైనన్ దశరథుండు జీవించునొకో? 2555

గీ. విభుఁడు మరణింప భూదేవి విధవ యగును
రాజు లొనరించు దుస్సహాక్రందనముల
మొఱయు నంతిపురం బంత ముచ్చముడిగి
నీరవం బగు నని యెంతు నిశ్చయముగ. 2556

గీ. రామజనని కౌసల్యయు రాజుతోడ
మజ్జనని గూడ మరణించుమాట నిజము
బ్రదుకుదుర యేని నీయొక్కరాత్రి మాత్ర
గడపఁ గల రేమొ యెంత దుఃఖంబు వచ్చె! 2557

గీ. తనయు శత్రుఘ్నునిన్ జూచుకొనుచు నైన
నా జనని నిల్చుఁగాక ప్రాణములతోడ
వీరవరు రాము నేకకుమారు విడిచి
పట్టపుందేవి కౌసల్య బ్రదుకఁ గలదె? 2558

క. బేజారుపడఁగ నే మగు
చేజాఱిన దాని కింక; శ్రీరామవిభుఁ
రాజ్యం జేయక చెడియెను
నా జనకుఁడు కామితంబునకు దూరుండై. 2559

గీ. మరణకాలంబునందు దగ్గఱనెయుండి
మృతుఁ డయినతండ్రి కుత్తరక్రియల నెల్ల
శ్రద్ధతోఁ దీర్పఁ గల యదృష్టంబు పట్టఁ
గలదె సిద్ధార్థులైన పుత్రులకె గాక! 2560

సీ. రమణీయ గృహ చత్వరప్రదేశములతో
సువిభక్త సుపథవైభవముతోడఁ
బ్రాసాద సౌధ సంపద్విలాసములతో
భూరి కల్యాణ సంస్ఫూర్తితోడఁ

రథగజాశ్వాకీర్ణ రాజమార్గములతో
వివిధ మంగళతూర్యరవముతోడ
గణికాంగనామణీ గాననృత్తములతో
సంతుష్టపరిపుష్టజనముతోడ

గీ. వరగృహోపవనారామగరిమతోడ
సంతతోత్సవజనసమాజములతోడ
నొప్పు మా తండ్రి యేలు నయోధ్యయందు
హాయిగా నుండెదరు సుఖులైన వారు. 2561

క. ఆరణ్యకవ్రతంబును
దీరిచి మే మరుగుదెంచి ధీరుఁ గుశలు ధ
ర్మారూఢుఁ దండ్రి గొలుచుచు
గారవముంగొని సుఖింపఁగలమె యయోధ్యన్. 2562

క. అనఘాత్మ! లక్ష్మణుఁడు నీ
యనుజుఁడు దుఃఖార్తి నెంతొ యలమటఁబడి రో
దన మొనరించుచు నాకున్
వినుపించుచు నిలిచి యుండ వేగెన్ దమియున్. 2563

క. అరుణోదయమైనంతనె
ధరణీవరసుతులు జటులు దాలిచి గంగన్
దరియించిరి ధరణిజతోఁ
దరణిపయిన్ జాగరూకతన్ నే ననుపన్. 2564

ఆ. భద్రగజములట్లు ప్రబలు రా సోదరుల్
జడలుదాల్చి వల్కలములు గట్టి
శత్రుభీకరముగ శరచాపహస్తులై
యవనిజాతతోడ నరిగి రపుడు." 2565

## 87-వ సర్గము

ఆ. అనుచు గుహుఁడు దెలుప నాలించి భరతుఁ డం
దందుఁ దనకు నప్రియంబు లైన
విషయములఁ దలంచి విహ్వలుం డగుచుఁ ద
దేకచింతనమున నేమునింగె. 2566

చ. అతిసుకుమారుఁడున్ దరుణుఁ డంబుజనేత్రుఁడు దర్శనీయుఁ డూ
ర్జితమతి యున్నతాంసుఁడును సింహబలుండును నైనయట్టి రా
సుతుఁడు ధృతిన్ వహించియును శోకభరంబును సైఁప కంకుశా
హతి మదవారణంబుక్రియ నట్టె పడెన్ స్మృతి దప్పి భూస్థలిన్.

ఆ. భరతుపాటుగాంచి సరిసెజ్జ నున్న శ
త్రుఘ్నుఁ డట్టె లేచి తొట్రుపడుచు
నన్నఁ గౌఁగిలించి ఖిన్నుఁడై యేడ్చుచుఁ
జేష్ట దొఱఁగి సొమ్మసిల్లి పడియె. 2568

సీ. పతివియోగదుఃఖబాధిత లుపవాస
కృశలు భరతమాత లెల్ల నపుడు
ధరణిపతితుఁడైన తనయుని దరిఁజేరి
యేడ్వఁగాఁ దొడంగి రెలుఁగు లెత్తి. 2569

గి. సాధుశీలయౌ దేవి కౌసల్య యంతఁ
దల్లడిల్లుచు గోవు వత్సంబుఁ జేరు
కరణిఁ దనయుఁ జెంగటి కేగి కౌఁగిలించి
యొలుఁగు రాల్పడ నేడ్చుచు నిట్టు లనియె. 2570

క. "కొడుకా! యేమేనియు నీ
యొడలికి నలసట ఘటిల్లి యుండదుగద! యే
డ్గడలేని రాజవంశం
బొడయని నిన్నుఁ గని బ్రదికియున్నది సుమ్మీ! 2571

ఆ. అనుజుతోడ రాముఁ డడవి కేగినవైన
స్వామి స్వర్గమునకుఁ జనినవైన
నిన్నుఁ జూచి బ్రదికియున్నాను నాయనా!
నీవె రక్షకుఁడవు గావె మాకు! 2572

ఆ. సతినిగూడి వనికిఁ జనియున్న నా యేక
పుత్త్రుఁడైన రామమూర్తి కైన
ననుజుఁడైన లక్ష్మణునికైన నేదైనఁ
గష్టమొదవలేదుగద కుమార!" 2573

ఆ. పట్టమహిషి యిట్లు పనవుచుఁ దనుఁ దేర్ప
భరతుఁ డల్లనల్లఁ బ్రజ్ఞఁ గాంచి
యేడ్చి యేడ్చి యామె నెట్టెటో యోదార్చి
కడనె యున్న గుహునిఁ గాంచి పలికె. 2574

ఆ. "అన్న రాముఁ డెచట నా రేయి వసియించె?
సిద్ధచరిత సీత యెచట నుండెఁ?
దమ్ముఁ డెచట నిలిచెఁ? దా మేమి భుజియించి?
రెచట నిదురఁ గాంచి రెఱుఁగఁ జెపుమ! 2575

ఆ. అనిన హృష్టచిత్తుఁడై నిషాదేశుండు
హితకరుండు ప్రియుఁడు నతిథి యైన
రామవిభుఁడు నాఁటిరాత్రిఁ దా నొనరించు
సేవ లెట్లుగొనెనొ చెప్పఁ దొడఁగె. 2576

ఆ. "రాకుమార! భరత! రామచంద్రునకునై
బహువిధాన్నపానభక్ష్యభోజ్య
దివ్యఫలచయములఁ దెచ్చి యర్పించితి
నారగింపు మనుచు నపుడు నేను. 2577

# 88-వ సర్గము

చ. ఎద గరగంగ భిల్లపతి యిట్లు వచింపఁగ మంత్రియుక్తుఁడై
తుదివఱ కాలకించి భరతుం డపు డంబలు వెంబడింప నిం
గుది కడకేగి చూచి కడుఁ గుందుచు" నగ్రజు దర్భశయ్య యి
య్యదె కనుఁగొంటిరే యనుచు నార్తినిఁ దల్లులకెల్లఁ జూపుచున్.

క. ఆగర్భశ్రీనిధి సుఖ
భోగార్హుఁడు దశరథేంద్రపుత్త్రుండు మహా
భాగుఁడు ధీనిధి రాముం
డీ గతిఁ గుశశయ్యఁ బండెనే యకటకటా! 2585

క. మెత్తని పఱపులదిండుల
నత్తమిలి పరుండి నిదుర నందెడి రాముం
డెత్తెఱఁగుననునునెమ్మే
నొత్తఁగఁ బవళింప నోపె నీ బరినేలన్? 2586

సీ. సురవిమాన సమాన సురుచిరాగ్రములతో
ధవళిత వలభి సంతతులతోడ
వరరత్న కంబళాస్తరణ తల్పములతో
మణిహేమమయ కుట్టిమములతోడ
చందనాగరుధూపచయ సుగంధములతో
రమణీయ పుష్పచిత్రములతోడ
పాండురాభ్రప్రభా భాసురద్యుతులతో
వరకీరశారీరవములతోడ

ఆ. శైత్యసౌరభముల సతతంబుఁ గూర్చు ప్రా
సాదములను మేలిశయ్యలందుఁ
బవ్వళించు రామభద్రుఁ డే రీతిగాఁ
గటికనేలఁ బండఁ గలిగె నకట! 2587

క. అంగనల నగల రవముల
మంగళగీతముల వందిమాగధ నుతులన్
బొంగుచుఁ దెలివిం గను నృప
పుంగవుఁడు మృగాదిఘోషముల మేల్కనెనే? 2588

గ. ఇయ్యది నా విభ్రాంతియొ
యియ్యది నా కలయొ కాక యెటు నమ్ముదు నే
నియ్యది సత్యంబే యని
యి య్యడవిని రామచంద్రుఁ డెట్లు పరుండున్? 2589

క. భూవిభుతనయుఁడు రాముం
డీ విధమున నేలపై శయించుటఁ దలఁపన్
దైవముకంటెను కాలమె
త్రోవంగా రాని దనుచుఁ దోఁచెన్ మదికిన్. 2590

క. మిథిలేశ్వరు నందన దశ
రథేశ్వరుని కోడలైన రామప్రియ స
త్పథచారిణి ప్రియదర్శిని
పృథివీసుత సీత నేలనే పండినదా? 2591

ఆ. భ్రాత రామవిభుఁడు పండిన పా న్పిదే
శ్రమ యొకింతయైన సైఁపలేక
కటికనేల నాతఁ డిటు నటు పొరల న
య్యొత్తిడులను గుశలు మెత్తగిల్లె. 2592

క. అలయిక నెమ్మొయి సొమ్ములు
దొలఁగింపక సీత నిదురదోఁగిన శయ్యా
తల మిదె యగు; నగ లొరయఁగ
నెలసిన కుందనపువన్నె లెడనెడఁ దోఁచెన్. 2593

గీ. అపుడు వైదేహి యుత్తరీయాంబరంబు
దర్భలకు నిశ్చయంబుగాఁ దగిలియుండు
నివిగొ కౌశేయతంతువు లిందునందుఁ
జిక్కికొని మిక్కిలిగఁ బ్రకాశించుచుండె. 2594

గీ. అకట! బాలిక సుకుమారియైన సీత
కష్ట మెఱుఁగక పవళించెఁ గఠినశయ్యఁ;
బ్రతనిరత లైన యుత్తమసతుల కెందు
స్వామితోడి శయ్యయె సుఖాస్పదము గాదె! 2595

క. శ్రీరాముఁడు జానకితో
ధారుణిపై నిట్టి కఠినతల్పమునందున్
జేరి శయనించె నన్నుం
గూరిచియే కాదె? యెంత క్రూరుఁడ నైతిన్. 2596

చ. అతులితసార్వభౌమవిభవాన్వయసంజనితుండు లోక స
మ్మతుఁడు జనప్రియుండు సుకుమారుఁడు శ్యామలకోమలాంగుఁ డూ
ర్జితుఁడు సుఖోచితుండు రఘుసింహుఁడు రాముఁ డనంతరాజ్య మా
గతి విడనాడి వచ్చి తృణకల్పితతల్పమునన్ శయించెనే! 2597

గీ. ఓ మహాభాగ! లక్ష్మణా! యో శుభాంగ!
కష్టకాలంబునందు నగ్రజుని రాము
విడువకయె యుండి భక్తి సేవించు నీవె
తమ్ములను ధన్యుఁడవు ధన్యతముఁడ వోయి! 2598

క. పెనిమిటియగు రామునితో
వని కేగిన సీత లోకవందిత యయ్యెన్;
చన మ మ్మహాత్ముతోడన్
మన మెల్లర మతనిసేవ మనకు దొరకునే? 2599

ఆ. దశరథేశ్వరుండు ధర వీడి దివి కేగె
రాముఁ డడవి కేగె రాజ్య మెడలి
నావికుండు లేని నౌకను బోలి భూ
మండలంబు దిక్కుమాలి యుండె. 2600

ఆ. అడవినున్న నైన నా రాముభుజబల
రక్షణంబు గన్న రాజ్యపదము
నాక్రమింప మనసునందైనఁ దలఁపరు
వెఱపుఁ జెంది యిరుగుపొరుగు నృపులు. 2601

సీ. ప్రాకార గోపుర పరిరక్షణలు లేక
సన్నద్ధ సామజాశ్వతతి లేక
యర్గళాబద్ధ సింహద్వారములు లేక
యాహవోత్సాహసైన్యంబు లేక
శత్రుమర్దన రణ సాధనంబులు లేక
నగరసీమాపాలనంబు లేక
దళవిభాగ విధాన దండనాథులు లేక
పరిపూర్ణ వస్తుసంపత్తి లేక

గీ. రామచింతనే మునిఁగిన ప్రజలతోడ
రక్షణము లేకయున్న యీ రాజధాని
గరళ కలితాన్నముం బోలి యరినృపాలు
రాహరింపఁగఁ దలపెట్టరైరి భీతి. 2602

చ. మునివలె నే నిదే మొదలు మూలఫలంబులఁ దించు వల్కలా
జినములఁ దాల్చి కానల వసించి భువిన్ దృణశయ్యఁ బండుచున్
దినములఁ బుత్తు రాముఁడు ప్రతిజ్ఞ యొనర్చిన యన్నినాళ్లు న
య్యనఘునికై; తదీయ సమయంబును సత్యము నిట్లు నిల్పెదన్.

క. సీతాపతి తన రాజ్యము
భ్రాతన్ లక్ష్మణునిఁ గూడి పరిపాలించున్
నా తమ్ముఁడు శత్రుఘ్నుఁడు
నాతోనేయుండుఁ గాననంబులయందున్. 2604

క. కాకుత్స్థుని రాముని నభి
షేకింతురుగా కయోధ్య క్షితిసురు లెల్లన్
నా కోర్కుల నిలవేల్పులు
చేకూర్చి ఫలించునట్లు చేయరె కరుణన్. 2605

చ. పదముల వ్రాలి మ్రొక్కి బహుభంగుల నెంతగ వేఁడికొన్న నా
మదిఁ గల కోర్కిఁ దీర్ప నభిమానముఁ జూపఁడయేని నేను నుం
డెద వనమందె న య్యనఘునిఁ భజియించుచు నింతమాత్ర మా
సదయుఁ డనుగ్రహించి నను సన్నిధి నిల్పుకొనం దలంపఁడే?"

## 89-వ సర్గము

గీ. భరతుఁ డా రాత్రి యా గంగదరినె గడపి
ప్రొద్దుననె మేలుకాంచి శత్రుఘ్నుఁ గాంచి
"తమ్ముఁడా లెమ్ము వే గొనిరమ్ము గుహుని
నదిని దాఁటించు మనల నందఱ నతండు." 2607

క. అని భరతుఁ డెచ్చరింపఁగ
విని శత్రుఘ్నుండు మిగుల వినయంబున "నో
యనఘా! నేనును రాముని
ఘనగుణచింతనల మేలుకనియే యుంటిన్." 2608

ఆ. మనుజసింహు లిట్లు మాటాడుకొనుచుండ
నపుడు గుహుఁడు వచ్చి యంజలించి
"ప్రభుకుమార! యిందు రాణువతోడ సౌ
ఖ్యముగ నీవు రాత్రి గడపినావె?" 2609

ఆ. అనిన రామునందె మనసున్న భరతుండు
చెలిమి దెలుపు గుహుని పలుకులు విని
"శబరరాజ! నీ వొసంగు సత్కృతుల సౌ
ఖ్యముగ రాత్రియెల్లఁ గడపినాము. 2610

క. నీ వార లెల్ల మమ్ముల
నావ లనేకములు గూర్చి నది దాఁటింపం
గా వలె"నన ప్రభు నుడి శిర
సా వహియించి గుహుఁ డేగి శబరుల కనియెన్. 2611

క. "మేలుకొని రండు వేగమ
మేలగు మీ కెల్లరికిని మేలిపడవలన్
గూలమున నిలుపఁ డవ్వలి
వేలన్ జేర్పఁ దగు భరతు విపులబలయుతున్." 2612

క. వల్లభుఁ డిటు లానతి యిడ
భిల్లు లపుడు వడిగ నేగి పృథుతరగంగా
కల్లోలినీ తటంబున
నెల్లెడలన్ వరుస నిలిపి రేనూఱోడల్. 2613

గీ. మఱియు నుత్తమ ఘంటికా మండితములు
సుప్రశస్త పతాకాభిశోభితములు
దృఢములును సౌఖ్యదములు స్వస్తికసమాఖ్య
నావలను గూడఁ జేర్చి రా రేవునందు. 2614

గీ. శుభ్రకంబళావృతమును శోభనంబు
స్వస్తికాఖ్యంబు ఘంటికాస్వరిత మైన
యోడ నొకదానిఁ దానె గుహుండు దేర
ననుజుతోఁ గూడ భరతుఁడం దధివసించె. 2615

క. తరువాత గురు పురోహిత
ధరణిసుర పురస్సరముగ దశరథు రాణుల్
మఱియుం దక్కిన దారలు
వరుస నధిష్ఠించి రచటి వరతరణులపై. 2616

గి. అరదములు బండ్లు వస్తువు లాపణములు
నోడలం జేర్చువారియు వీడిపోవు
తావులదహించువారియు రేవులందు
దిగెడువారియు ఘోషలు దివిని ముట్టె. 2617

క. పఱతెంచు గాలివాలునఁ
దెరచాపలఁ గేతనముల దీపించెడు న
త్తరణులు శబరులు నడపఁగఁ
జరచరఁ జనె నిండియున్న జనములతోడన్. 2618

క. కొన్నింటను స్త్రీజనములు
గొన్నింటను వాహనములు గొన్నిఁట రథముల్
గొన్నిఁట వృషభాశ్వంబులు
గన్నులపండువుగ నుండఁ గదలెన్ నౌకల్. 2619

క. అటు చని చని నది యవ్వలి
తటిని జనాదికము దింపి దాశప్రవరుల్
పటుచిత్రగతుల నడపఁగ
నటనము గావించుకొనుచు నావలు మఱలెన్. 2620

క. విజయపతాకలతో సా
మజములు మావంతు లెక్కి మరలింపఁగ గాం
గజలంబులఁ దరియించుచు
ధ్వజకలితనగేంద్రముల విధంబునఁ దోఁచెఁ. 2621

క. కొందఱు నౌకలమీఁదఁ
గొందఱు దోనియలమీఁదఁ గొంద ఱబకలఁ
గొందఱు బాహుల నీఁదుచు
నందఱు దాఁటంగఁ దొడఁగి రా గాంగఝురిఁ. 2622

గీ. పూజ్యభాగిరథీస్నానపూత మైన
య మ్మహాసేన శబరనాయకసహాయ
మొంది నదిదాఁటి మైత్ర ముహూర్త మందు
సేమముగఁ బ్రయాగ వనంబుఁ జేరుకొనియె. 2623

గీ. అపుడు భరతుండు సేనల నచట నిలిపి
గురు పురోహితుల్ బోధించు తెఱఁగుఁబట్టి
ఋషివరుఁడు వయోజ్ఞానవృద్ధుఁడైన
ఘను భరద్వాజుఁ గన నేగెఁ గాలినడనె. 2624

చ. అమర పురోహితుండును మహాత్ముఁడు విప్రవరుండు బ్రహ్మవి
త్సముఁ డగు మౌనియాశ్రమము దగ్గఱ కా భరతుండు చేరి ర
మ్యములగు పర్ణశాలలఁ దదంతిక పుష్పఫలాభిశోభిత
ద్రుమ వనభూములం బ్రముదితుండయి వెల్వలనుండి కాంచుచుఁ.

# 90-వ సర్గము

చ. అనఘచరిత్రుఁ డా భరతుఁ డ మ్మునివాటికిఁ గ్రోశదూరమం
దునె దనసైన్యము న్నిలిపి తూపులు విల్లును భూషణాదు లో
య్యన విడి పట్టుగట్టి వినయంబున మంత్రి పురోహిత ద్విజుల
దన వెనువెంటరాఁగఁ జని తాపసు నాశ్రమసీమ చేరువన. 2626

క. ఆ రఘువరుఁడగు భరతుఁడు
భారద్వాజాశ్రమంబుపజ్జ సచివులన్
బేరిమిని నిలిపి ఋషివరుఁ
జేరంగా నరిగె గురువసిష్ఠునితోఁడన్. 2627

ఆ. ఆ వసిష్ఠుఁ గాంచినంత భరద్వాజుఁ
డాసనంబునుండి యట్టె లేచి
యాత్మశిష్యవరుల నర్ఘ్యంబు దెమ్మని
యెలమి న మ్మునీంద్రు నెదురుకొనియె. 2628

ఆ. ప్రబలతేజుఁడగు భరద్వాజుఁ డప్పుడు
ముని వసిష్ఠుఁ జేరి తనకు భక్తి
ప్రణతుఁడైన యట్టి భరతుని దశరథా
ధిపుని తనయుఁగాఁగ దెలిసికొనియె. 2629

ఆ. అంత ఋషివరేణ్యుఁ డానుపూర్వికముగా
గురు వసిష్ఠునకును భరతునకును
నర్ఘ్యపాద్యములను నమలఫలంబులఁ
గూర్చి ధర్మభంగిఁ గుశల మడిగి. 2630

క. బలకోశమంత్రతతికిఁ
జెలికాండ్ర కయోధ్యలోన క్షేమమె యని య
ర్మిలి భరతు నడిగి దశరథు
పలుకెత్తం డతఁడు మృతిని బడయుట వినుటన్. 2631

ఆ. ఆ వసిష్ఠభరతు లప్పు డా మునిఁగాంచి
"యనఘచరిత! నీకు నగ్నులకును
నాత్మశిష్యులకును నాశ్రమతరులకుఁ
బక్షిమృగములకును భద్రమె గద!" 2632

క. అనవుడు మునిభగవానుం
డనుకూలమె యిందు మాకు నందఱ కనుచున్
జనపతిసుతుఁ డగు భరతుం
గని రామస్నేహబంధనమున నిటు లనెన్. 2633

సీ. "ఆనందవర్ధనుం డరిబలదమనుండు
గడుపారఁ గౌసల్య కన్నకొడుకు
పడఁతిమాటకు లోఁగి పదునాలుగేఁడులు
జనకుండు వని కంపఁ జనిన సుకృతి
భ్రాతతో భార్యతో బహుకష్టముల కోర్చి
వనవాస మొనరించు ఘనయశస్వి
యెన్నఁ డెవ్వరియెడ నే పాప మైనను
దలపెట్టి యెఱుఁగని యలఘుశీలుఁ

గీ. డైన రాముని నాతని యనుజుఁబట్టి
కష్టములఁ బెట్టి రాజ్య మకంటకముగ
నేలుకొను పాపబుద్ధితో నిప్పు డిట్టు
లరుగుదేఱంగ లేదుగదయ్య నీవు." 2634

గీ. అని భరద్వాజుఁ డడుగంగ నకట! యిట్టి
నుడులు విననయ్యెనే యని యడలు వడుచుఁ
బలుకు దొట్రిలఁ గన్నీరు దొలఁకి యొలుక
భరతుఁ డప్పుడు మునిఁ గాంచి పలికె నిట్లు. 2635

ఆ. "పడితిఁ జెడితి నకట! భగవానుఁ డగు నీవె
యిట్లు నన్ను సంశయించినాఁడ;
వెన్నఁ డెట్టి పాప మేని నే నెఱుఁగ నీ
యడుగులాన నొవ్వనాడ వలదు. 2636

ఆ. నా పరోక్షమందు నా తల్లి చేసిన
దాని నేను గోరనైన లేదు
వినిన యప్పుడైన వేడుకఁ జెందలే
దెడఁద నైన నిష్టపడఁగ లేదు. 2637

క. పురుషోత్తముఁడగు రాముని
చరణంబుల కెఱఁగి సుప్రసన్నుని గావిం
చి రయము గనే నయోధ్యకుఁ
దిరిగి యతనిఁ దేఱ బయలుదేరితి ననఘా! 2638

క. తగ నే వచ్చిన కార్యము
భగవానుఁడ వీ వెఱింగి పరమప్రీతిన్
జగతీపతి గుణధాముం
డగు రాముం డెచటునుండె నానతి యీవే!" 2639

క. అని భరతుఁడు ప్రార్థింపఁగ
మునులు వసిష్ఠాది విప్రముఖ్యులు గూడన్
దను వేఁడ భరద్వాజుం
డనుకంపామతిఁ బ్రసన్నుఁడై యి ట్లనియెన్. 2640

క. "నరపుంగవ! యో భరతా!
గురుశుశ్రూషయును దమము గురుజనసాధూ
త్కరసేవయు రఘుకుల శే
ఖరుఁడ వయిన నీకుఁ దగునుగాదే దలఁపన్. 2641

క. నీ మదిగల సద్భావం
బే మెఱుగుదు మైన దాని నిటు దృఢపఱుపన్
నీ మహితకీర్తి నినుమడి
గా మహి వెలయింప నడుగఁ గడగితిమి సుమీ! 2642

క. ధర్మజ్ఞుఁడు రాముఁడు సహ
ధర్మిణి యగు సీతతోడఁ దమ్మునితోడన్
బేర్మి నివసించి యుండెన
శర్మద మగు చిత్రకూటశైలమునందున్. 2643

క. రే పచటికిఁ బోవచ్చును
మాపటి కిటనుండు మీవు మంత్రులతోడన్
నీ పొందిత్యోదారత
లే పారఁగ నా యభీష్ట మీడేర్పఁ దగున్" 2644

క. అనిన నుదారుఁడు ప్రభు నం
దనుఁడగు భరతుండు సమ్మదంబున మౌనీం
ద్రుని యానతిఁ దలఁదాలిచి
యనుమతముం జూపె రాత్రి యట నివసింపన్. 2645

## 91-వ సర్గము

### భరద్వాజుని విందు

క. మునివరుఁ డీ గతి భరతుం
డనుమోదముఁ దెలుప నెంతొ హర్షంబున "నో
యనఘా! నా యాతిథ్యము
గొనఁ దగు నీ రే" యటంచుఁ గూరిమిఁ గోరెన్. 2646

ఆ. భరతుఁ డపుడు మృదులభంగి మౌనిం గాంచి
వనమునను లభించు వస్తుసమితి
నర్ఘ్యపాద్యవిధుల నాతిథ్య మొసఁగితి
వాదరంబు చాలదా? మహాత్మ!" 2647

క. నా విని యెల నవ్వొలయం
గా వినతుం బ్రీతు భరతుఁ గని మునివర్యుం
"డో వత్సా! ని న్నెఱుఁగుదు
భావంబున నల్పమాత్రపరితుష్టునిగన్. 2648

క. మనుజోత్తమ! నీ సైనిక
జనమునకున విందుసేయు సంకల్పమునన్
నిను నర్థించితి నా యీ
మనోరథము తప్పకుండ మన్నింపఁ దగున్ 2649

క. "అలఘుచరిత! యేమిటికై
బలముల దూరమున నిలిపి పఱతెంచితి వీ
నెలవునకు? సేనతోడం
గలసియె రావైతి వేమికతమునఁ జెపుమా!" 2650

ఆ. అనిన మునికి భరతుఁ డంజలి గావించి
"నీ తపమ్మునకును నియమములకు
నంతరాయ మగునో యను భయంబునఁ జేసి
నేన వచ్చినాఁడ సేనవీడి. 2651

క. తన బలములతోఁ గూడన్
జనునెడ రాజైన రాజనందనుఁ డైనన్
మునియాశ్రమముల కలజడి
నెనయింపక దూరమందె యేగంగఁ దగున్. 2652

క. భగవానుఁడ! నా వెంటన్
నగ నిభ మత్తేభ హయగణంబులు ప్రజలున్
జగ మీని నట్లు తోఁచెడి
యగణితసైన్యములు నున్నయవి యట్లగుటన్. 2653

ఆ. వానివలన నిచటి వర సరోవరములు
పర్ణశాల లఖిలఫలతరువులు
నాశ్రమ స్థలంబు లదవద లగునని
యెంచి యిట్లు లేగుదెంచినాఁడ." 2654

క. అనిన విని భరద్వాజుం
డనఘుఁ భరతుఁ గాంచి "వారి నందఱిని దపో
వనికిన్ రావింపం దగు"
నని యానతి సేయ నాతఁ డట్లొనరించెఁ. 2655

ఆ. అంత న మ్మునీంద్రుఁ డగ్నిశాలం జొచ్చి
యాచమించి మార్జితాస్యుఁ డగుచు
నఖిలదేవతలను నాతిథ్యమున సాయ
పడఁగఁ గోరి పిలువఁ దొడఁగె నిట్లు 2656

క. "రావోయి! విశ్వకర్మా!
నీ విటఁ దగు వసతు లెల్ల నిర్మించుటకున్.
భూవిభుసుతు భరతునికిన్
గావింపఁగ వలయు విందు ఘనసైన్యముతో. 2657

క. అమర వరులతో నింద్రుఁడు
యమ వరుణ కుబేరముఖ్యు లాశాపతులున్
సుముఖులయి వచ్చి యాతి
థ్యముఁ దీర్పఁగ నాకు సాయ మగుదురు గాతన్. 2658

క. తూరుపుదెసఁ బ్రవహించెడి
యేఱులుఁ బడమటికిఁ బాఱు నేఱులు దివిపై
ధారుణిపైఁ గల వన్నియుఁ
జేరుంగా కిటకు విందుసేయు పనులకై. 2659

ఆ. చెఱకుపానకముల కరణిని దీయనై
చలువ లొలుకు సలిలములను గొన్ని
మద్యములను గొన్ని మైరేయములఁ గొన్ని
నిండి నదులు దొలఁకుచుండుఁ గాక. 2660

క. అహాబాహు ల్విశ్వావసు
హాహాహూహూలు దేవతాప్సరసలు స
మ్మోహనమూర్తులు గాంధ
ర్వీహరిణేక్షణలు వేగవిచ్చేయఁ దగున్. 2661

గీ. శైలవాహిని హేమయు విశ్వాచి నాగ
దంతయును మిశ్రకేశి ఘృతాచి హేమ
య య్యలంబుస యనియెడు నప్సరసలు
శీఘ్రముగఁ బిల్వఁబడినె వచ్చెదరుగాత. 2662

ఆ. శక్రుఁ గొలుచునట్టి చక్కనిచుక్కలు
నలువకొలువుసేయు చెలువ లెల్ల
దొడ్డగాణయైన తుంబురుతో దివ్య
వస్తుతతులతోడ వత్తు గాత! 2663

క. వరభూషణ కౌశేయో
త్కరములు దళములుగఁ బండ్లు సురరమణులుగాఁ
గురుభూమి నెసఁగు యక్షే
శ్వర దివ్యోపవన మిటకు వచ్చుంగాతన్. 2664

ఆ. భక్ష్య భోజ్య లేహ్య పానీయములతోడ
బహురసాన్నములను భద్రపఱచి
నేను బిలిచినంతనే వచ్చి భగవానుఁ
డమృతకరుఁడు సాయ మగునుగాక! 2665

క. పరమోషధీశుఁ డిందుఁడు
తరుణ విచిత్రప్రసూన దళ దామములన్
సరస మధుర మద్యంబులఁ
బరువపుఁ బలలముల సిద్ధపఱచుంగాతన్." 2666

క. అని శిక్షాస్వరయుతముగ
ఘనయోగతపఃప్రభావ కలితాత్ముఁడౌ
మునివరుఁడు భరద్వాజుం
డనఘమతిఁ దేవగణము నాహ్వానించెన్. 2667

ఆ. ప్రాంజలించి మౌని ప్రాగ్దిశాముఖుఁ డయి
ధ్యాననిష్ఠ నాత్మఁ దలఁచినంత
సర్వదేవతలును వేర్వేఱ విచ్చేయ
దొడఁగి రతని పలుకుఁబడినె యటుకు. 2668

గీ. మలయ దర్దుర ఘనశైలవలయితుఁడగు
గంధవాహుండు హాయిగాఁ గదలి వచ్చి
చెమ్మటల నార్చి తాపులఁ జిమ్ముకొనుచు
ఋషితపోవనమున విహరింపఁ దొడఁగె. 2669

క. సురవరులు విరులవానలఁ
గురిసిరి వినువీథినుండి గుములై వేడ్కన్
సురదుందుభినాదంబులు
మొరసె విపంచీనినాదములతోఁ గూడన్. 2670

క. పాడిరి గంధర్వోత్తము
లాడిరి తాళానుగతుల నచ్చరవెలఁదుల్
కూడి విహరించెఁ జల్లని
గాడుపు లనుకూలగతుల గంధవహములై. 2671

ఆ. నృత్త గీత వాద్య నిబిడ నిర్ఘోషముల్
భూ నభోంతరముల బోరుకొనుచు
శ్రుతిహితములు దాళగతిసమన్వితములై
విశ్వమోహనముగ వినఁగ నయ్యె. 2672

క. వీనుల విందుగ మొరసెడు
నా నినదం బల్లనల్ల నాఁగిన యంతన్
గానంగ నయ్యె భరతుని
సేనలకుఁ విశ్వకర్మచిత్రము లెల్లన్. 2673

క. మేదినిపై నెటు సూచిన
నైదామడమేర శాద్వలాచ్ఛన్నంబై
వైదూర్య నీల రత్నా
చ్ఛాదితమో యన్న యట్లు చదునై తోఁచెఁ. 2674

క. ఫలగుచ్ఛోజ్జ్వలితములై
వెలఁగలు పనసలును బిల్వవృక్షంబులు మా
వులు బీజపూరములు నా
మలకంబులు వొడమె నచట మంత్రించుక్రియఁ. 2675

క. సొత్తెంచెఁ జైత్రరథ మపు
డుత్తర కురుభూమినుండి యురుతర భోగా
యత్తంబై తీరగతా
త్యుత్తమ తరు ఝరులతోడ నుట్టిపడి నటుల్. 2676

క. విమల చతు ర్గృహములు సౌ
ధములుం బ్రాసాదచయము దంతితురంగో
త్తమ శాలలుఁ దోరణములు
గ్రమముగఁ బొడసూపె నందుఁ గన్నులవిందై. 2677

సీ. సమచతురస్ర విశాలోపసదనంబు
మణిహేమమయ కుట్టిమ స్థలంబు
కోమల సితపుష్ప దామాభిరామంబు
దివ్యసౌరభ సముద్దీపితంబు

ననుపమ శయన యానాసనాకీర్ణంబు
స్నాన భోజన సుఖాసన సమృద్ధ
మతిరుచ్య భక్ష్య భోజ్యాన్న సంపన్నంబు
పరిశుద్ధ భోజనోత్కరయుతంబు

గీ. బహుళ కౌశేయవసన వి|భాజితంబు
మహిత మణిపుష్ప తోరణ మండితంబు
నమల శరద|భ సన్నిభంబైన రాజ
వేశ్మ మంతలో నచట నావిర్భవించె. 2678

క. ఉరుభుజుఁడు కైకసుతుఁడగు
భరతుండు సమస్తవస్తు భరితంబగు నా
వరరాజ భవనసభ కపు
డరిగె భరద్వాజమౌని యానతిసేయన్. 2679

క. అతనితోడఁ బురోహితుఁ
డాతనితో సచివవర్యు లందఱుఁ జని సం
ప్రీతిం గాంచిరి తద్భవ
నాతత విభవప్రశస్తి కబ్బురపడుచున్. 2680

క. ఆ సభ నృపపీఠమునకు
భాసిలు చామరల కాతపత్రంబున కా
రాసుతుఁడు రాజునకుఁ బలెఁ
జేసె ప్రదక్షిణము సచివశేఖరయుతుఁడై. 2681

క. భరతుఁ డపుడు శ్రీరాముని
స్థిరమతి భావించి మ్రొక్కి సింహాసనముఁ
గురుభక్తిఁ గొల్చి వింజా
మరముం గొని కూరుచుండె మంత్రులవరుసన్. 2682

ఆ. అతనివెనుక మంత్రు లార్యపురోహితుల్
ప్రబల దండనాథ శిబిరపతులు
నుపవసించి రప్పు డుచితాసనంబులఁ
దరతమములఁ గ్రమము దప్పకుండ. 2683

క. నిరత తపఃస్థిరుఁడగు ముని
పరమేశ్వరు నాజ్ఞఁజేసి భరతుని పజ్జన్
సురభిక్షీరోదన ని
ర్ఘరిణులు ప్రవహించె నింద్రజాలము భంగిన్. 2684

క. ఆ మునిభగవానుని యి
చ్ఛామతి నా పాయసాన్నఝురుల కిరుగడన్
సోమమణీమయ సుందర
ధామము లావిర్భవించెఁ దత్క్షణమాత్రన్. 2685

క. పరమేష్ఠిపంపకంబున
సురుచిర మణిభూషణములు సొంపులు నింపన్
సురసుందరు లిరువదివే
లరుదెంచిరి మౌనివర్యు నద్భుతమహిమన్. 2686

ఆ. కనక రత్న మౌక్తిక ప్రవాళాదిక
నవ్యభవ్యభూషణములు మెఱయఁ
గదలి వచ్చి రటకు ద్విదశసహస్రంబు
లప్సరసలు ధనదు నాజ్ఞఁ జేసి. 2687

ఆ. కాంచు పురుషవరులఁ గరఁగించి మరఁగించు
నఖిలలోకమోహనాంగు లైన
యప్సరసలు వచ్చి రయుతద్వితయసంఖ్య
నందనోపకాననంబునుండి. 2688

క. నెరపిరి గానము మధుర
స్వరయుతముగ నపుడు భరతు సమ్ముఖమునఁ దుం
బురు నారద గోపముఖుల్
వరగంధర్వేశ్వరులు దివాకరతేజుల్. 2689

గీ. పుండరీకయు న య్యలంబుసయు మిశ్ర
కేశియును వామనయు నాఁగఁ గీర్తిఁ గన్న
యచ్చరలు వచ్చి భరతుని యంతికమున
నాడఁ దొడఁగిరి మునియాజ్ఞ నద్భుతముగ. 2690

క. బలవైరినందనంబున
నలకాధిపుఁ జైత్రరథవనాంతరమందున్
గల యలరు లెల్ల సరులై
పొలిచెన్ జిత్రముగ మునితపోవని నెల్లన్. 2691

క. మారేడులు మార్దంగికు
లై రావులు నటుగణంబులై అక్షధరి
త్రీరుహములు లయకాండ్రై
భారద్వాజాజ్ఞ భరతుపజ్జ నటించెన్. 2692

ఆ. సరళ తాళ తిలక చిరిబిల్వములు కుబ్జ
వామనాకృతులను వరుసఁ దాల్చి
సంతసమునఁ బనుల సంతరింపఁ దొడంగె
మౌని సుప్రభావ మహిమవలన. 2693

ఆ. అగురుతరులు జంబు లమృతభూజాదులు
జాజి మల్లె సన్నజాజి లతలు
ప్రమద మెసఁగ నపుడు ప్రమదాకృతులఁ దాల్చి
భరతుసేనఁ గూర్చి పలికె నిట్లు. 2694

క. “కావలసినంత మద్యము
త్రావుఁడు; పరమాన్నమాంస రాజాన్నంబుల్
సేవింపుఁడు తృప్తిగ; స్వే
చ్ఛావృత్తిన్ మెలఁగుఁ డిందు సైనికులారా!” 2695

క. వెలఁదు లిటు పలికి సేనల
నెలయించుచు నొకని కేడ్గు రెనమండ్రుగురై
తలయంటి మేన నలుఁగిడి
జలకము లాడించి రమలఝురతీరములన్. 2696

క. సురుచిర నయనలు వన సుం
దరు లప్పుడు వారిమేనఁ దడియార్చి నవాం
బరము లిడి యడుగు లొత్తుచు
వరుసన్ ద్రావించి రాసవము లొండొరుచేన్. 2697

క. కరి హయ ఖరోష్ట్రములకున్
వరవృషభంబులకుఁ గూడ వాహననాథుల్
పరమర్షి శాసనంబునఁ
బరితృప్తిగ మేఁత లిడిరి బహురూపములన్. 2698

క. చెఱకులుఁ దేనెలుఁ బేలలు
వరణీయేక్ష్వాకుయోధవాహములగు కుం
జరములచేఁ దినిపించిరి
పరమ మునీంద్రప్రభావభవులగు భృత్యుల్. 2699

ఆ. అశ్వరక్షకులకు హయచింతనములేక
మావటీండ్ర కేన్గు మాటలేక
మద్యపానవశత మదమత్తచిత్తులై
యెలమి కలిమి నుండి రెల్లవారు. 2700

క. ఆ గతి సైనికు లెల్లరు
భోగంబులఁ జిక్కి వేల్పుబోఁటుల బిగువుం
గౌఁగిళ్లఁ దక్కి కర మను
రాగంబునఁ జొక్కి వాచఱచి రీ రీతిన్. 2701

ఆ. "మే మయోధ్య కేగఁ బోము; దండకవని
కేగఁ బోవ; ముందు మిందె వేడ్క;
భరతునకును నెందు భద్రం బగుంగాక!
సేమ మగును గాక రామునకును." 2702

క. అని కాలిబంట్లు జోదులు
ఘనగజహయరక్షకులు సుఖప్రముదితులై
తనకుం దానే ప్రభుఁడని
యనుకొని మైమఱచియుండి రా వేడుకలన్. 2703

క. భరతు వెనువెంట వచ్చిన
పరిజనములు వేనవేలు ప్రత్యేకసుఖాం
తరులై యఱచిరి "మా కిదె
పరమపదము స్వర్గ" మనుచుఁ బ్రమదాన్వితులై. 2704

క. ఆడుచుఁ దందనపదములఁ
బాడుచు వెడనగవు నగుచుఁ బరుగుల నిడుచున్
గూడుచు వీడుచు జోదులు
వేడుక విహరించి రపుడు విరిసరు లూఁగన్. 2705

క. అమృతమయ భక్ష్యములతో
నమృతాన్నము పొట్ట విచ్చునట్లు మెసవి ది
వ్యము లగు భోజ్యములం గని
తమకంబున మరలఁ దినఁగ దలఁచి రనేకుల్. 2706

క. సైనిక పరిచారికలును
సైనికదాసీజనములు సైనికవధువుల్
నానావిధ నవవస్త్రము
లూని సగర్వముగఁ దిరుగు చుండిరి సేనన్. 2707

క. అచ్చటి ఖరోష్ట్రగణములు
నచ్చటి మృగఖగము లచటి హయకరినిచయం
బచ్చటి వృషములు మునికృప
నిచ్చిన మేఁతలను దనిసి యెఱుఁగ వితరమున్. 2708

ఆ. మలినవసనుఁడైన మలినాంగుఁడైనను
క్షుభితకేశుఁడైన క్షుధితుఁడైన
నపరితృప్తుఁడైన ననలంకృతుండైన
సేన నొక్కఁడైనఁ గానరాఁడు. 2709

ఉ. కలిత వరాహ మేష పలఖండములున్ దగు వ్యంజనంబులున్
ఫలరసశర్కరాదులును భవ్యసుగంధ రసంబులున్ సుధా
మల రుచిరాన్నసూపము లమర్చిన యట్టి ప్రసూనకేతనో
జ్జ్వల నవహేమ పాత్రము లసంఖ్యములై యట దోఁచె వింతగన్.

ఆ. బావు లెల్ల నిండె పరమాన్నములతోడ
నాలు వలసినన్ని పాలుఁ బిదికె;
కురిసెఁ దేనెవాన విరిమోక లలరారి
మునివరేణ్యు ఘనతపోవనమున. 2711

అచటి నడబావు లెల్ల మద్యముల నిండి
పక్వమృగకుక్కుటమయూరపలలపూర్ణ
కుంభకలితంబులై యింపుగొలుపుచుండె
భరతు వెన్నంటివచ్చిన బలఁగములకు. 2712

క. వేలును లక్షలు కోట్లుగఁ
గ్రాలుచుఁ బరమాన్నభక్ష్యఖాదనపాత్రల్
తాలింపుఁ బెరుఁగు పాత్రలు
లీలాగతిఁ దోఁచె నచట లెక్కకుఁ బెక్కై. 2713

ఆ. దోరవెలఁగపండుతోఁ దుల్యమగు కమ్మ
తావు లొలయునట్టి తక్రరసము
నిండియున్న చెలమ లుండె నే యెడఁగన్నఁ
ద్రావఁగోరువారి తనివి దీఱ. 2714

క. సరసులను గొన్ని కమ్మని
పెరుఁగులతోఁ బొగచినట్టి పెరుఁగులతోడన్
బరమాన్నంబులతో శ
ర్కరతోఁ బూరీలతోడ రాజిలుచుండెన్. 2715

ఆ. కమ్మనూనియలును గంధంపుఁబొడులును
దావి నలుఁగుబిండ్లు దానములకుఁ
వలయు నెల్లవస్తువులును గాబులనిండి
నదులరేవులందుఁ బొదలుచుండె. 2716

క. మును పెన్నఁడు వినినదియున్
గనినదియుంగాక స్వప్నగతచిహ్నముగా
మునిభగవానుఁడు భరతుని
కొనరించిన విందుఁగని యహో! యనిరి ప్రజల్. 2717

సీ. ధవళంపుఁగుంచెల దంతకాష్ఠంబులు
స్వచ్ఛచందనకల్కసంపుటములు
నిర్మలీకృతములౌ నిలువుటద్దంబులు
నుతికిన మడుఁగుదోవతుల జతలు

బహుళసంఖ్యాకముల్ పాదరక్షలజోళ్లు
 పన్నని నున్నని పావకోళ్లు
కాటుక బరణులు నీటైన దువ్వెనల్
 గుజ్జుమీసల దిద్దు కూర్చికలును

గీ. కార్ముకములు శస్త్రమ్ములు కవచములును
వివిధశయ్యాసనంబులు వేనవేలు
మంతరించినయట్లు లా మౌనిమహిమఁ
బొడవుసూపుచునుండె నబ్బురముగాఁగ. 2718

చ. తురగ ఖరోష్ట్ర వారణతతుల్ జలపానము సేయునట్టి పెం
దొరువులు మున్ని స్నానములఁ దోఁగఁగఁ జాలినయట్టి కల్వ తా
మరల కొలంకులున్ బసులమందలు దృప్తిగ మేయునట్టి నీ
లరుచుల నొప్పు శాద్వల తలంబులు వింతగఁ దోఁచె నెల్లెడన్. 2719

క. నందనవనమున వేల్పుల
చందంబున భరతు సర్వసైనికులు మహా
నందమున మునితపోవన
మందున్ విహరించుచుండ నా రేయి చనెన్. 2720

క. అరుదారఁగ గంధర్వులు
సురవరు లచ్చరులు నరులు చూచుచు నుండన్
బరమర్షి యాజ్ఞ గైకొని
యిరమ్మదము లట్టు లేగి రెవరికి వారై. 2721

ఆ. కాని యచటి ప్రజల గంధంపుఁబూఁతలు
వారు గ్రోలు నాసవముల మత్తు
వారి దివ్యకుసుమహార సువాసన
లనుభవించుచున్నయట్లె యుండె. 2722

సీ. సరసాన్నపాన భక్ష్యము లారగించిన
తీయని త్రేన్పు వాతెఱనె యుండ
తమిఁ గౌఁగిలించి గాంధర్వి ముద్దిడి యొసం
గిన కమ్మతమ్మ పుక్కిటనె యుండ
కొసరి యూరించి జిత్తుల జాణ యిడు మద్య
కనకపాత్రము కరంబుననె యుండ
నరుగుచు మేల్కొల్ప నచ్చర విసరిన
పూబంతి పేరురంబుననె యుండ

గీ. ఆనవా లిది యని వేల్పుసాని నగుచు
నినుచు కొనగోటి నొక్కు చెక్కుననె యుండ
బల్లునం దెల్లవాఱ విభ్రాంతిఁ జెంది
వెల్లబాఁఱి దొడంగి ర వ్వీరభటులు. 2723

## 92-వ సర్గము

ఆ. పరిజనంబుతోడ భరతుఁ డా రేయెల్ల
నతిథి యగుచు విందు నందుఁ గడపి
యన్న రాముఁ జూచు నభిలాషమునఁ జేసి
సెలవుగొనఁగఁ దపసిచెంత కరిగె. 2724

ఆ. ఆహ్నికములఁ దీర్చి నట్టి య మ్మునిఁ తన
యొద్దఁ బ్రాంజలించి యున్నవాని
నరవరేణ్యు భరతు నరసి యాదరమున
హితమృదూక్తు లొలయ నిట్టు లనియె. 2725

క. "ఓ యనఘచరిత! భరతా!
మా యాశ్రమమందు నీకు మా విందులతో
రేయి సుఖంబుగఁ గడచెనె?
హాయి న్నీసేన తృప్తినందెనె చెపుమా!" 2726

క. అని యాశ్రమమును వెలువడు
మునికిన్ దశరథసుతుండు మ్రొక్కి "మహాత్మా!
కనినాఁడ సచివబల వా
హనయుతముగఁ దృప్తి తావకాతిథ్యమునన్. 2727

క. పరిజనులు మొదలు మేమం
దఱమును శ్రమదీఱ దివ్యధామములందున్
బరమాన్నభోజనాదులఁ
బరితృప్తుల మగుచు సుఖముఁ బడసితి మనఘా! 2728

క. మునిభగవానుఁడ! యింకన్
నిను వీడ్కొని యన్న రామునిం గన నుంటిన్
బనిగొనఁగాఁ దగు గరుణం
గనఁగాఁ దగు బ్రేమ నంపఁగాఁ దగు నన్నున్. 2729

ఆ. ధర్మవిదుఁడ! పరమధార్మికుండు మహాత్ముఁ
డైన రామచంద్రు నాశ్రమమున
కేదిత్రోవ? యిచటి కెంతదూరం బది?
దయ నెఱుంగఁ జెప్పఁ దగును నాకు." 2730

క. అని భరతుఁడు రాముం గన
మనమునఁ ద్వరపడుచుఁ బలుకు మాటలు విని య
మ్మునికులశేఖరుఁడు తపో
ధనుఁడు భరద్వాజుఁ డనియె దయ దయివాఱన్. 2731

సీ. భరత! యిచ్చోటికిఁ బదిక్రోశములదూర
మందు నిర్జనమైన యడవి దోఁచు
నట రమ్యతరుపంక్తు లలరు నెత్తములతోఁ
జిత్రకూటసమాఖ్య శిఖరి వెలయు

నా నగంబున కుత్తరాశ మందాకిని
తీరపుష్పవనాలఁ బాఱుచుండు
నా శైల దివ్యాపగాంతరపావన
స్థలమున ఘనపర్ణశాల యలరు

గీ. నందు శ్రీరామచంద్రుఁ డర్ధాంగియైన
సీతతో లక్ష్మణునితో వసించి యుండు
తండ్రియానతిఁ బాలించు తలఁపుతోడ
నే నెఱుంగుదు నియ్యది నిశ్చయంబు. 2732

క. నీ విచటి నుండి వలకడ
త్రోవ నయిన నిరృతిదిక్కుత్రోవనె యైనన్
నీ విపులవాహినులతోఁ
బోవచ్చును; రాము నచటఁ బొడఁగన వచ్చున్." 2733

క. ప్రియముగ ముని యిటు దెలిపెడి
పయనపువార్తలను విన్న పంక్తిరథసతుల్
నయగతి నేగిరి వాహన
చయముల దిగి మౌనిచంద్రు సందర్శింపన్. 2734

ఆ. కంపమానదేహ కడుఁ గృశ కౌసల్య
మిగుల దీనయై సుమిత్రతోడఁ
గలసి మౌనిపాదకమలంబులనుబట్టి
భక్తి మీఱ నపుడు ప్రణతిఁజేసె. 2735

క. కోరిక వమ్మై పోఁగా
నేరమునకు లోకనింద నెత్తిఁ బడంగాఁ
గూరిన సిగ్గున గైకయు
యా రుసి చరణముల కెఱఁగె నవనతముఖియై. 2736

ఆ. అంతలోన లేచి యా కైక భగవానుఁ
డైన మౌనిమొగము నరయ లేక
యలఘుతేజు నతని వలగొను నెపమునఁ
జింత భరతువెన్కఁ జేరి నిలిచె. 2737

క. ఆ మౌని భరద్వాజుఁడు
భూమిపసుతు భరతు నపుడు పొడఁగని "వత్సా!
నీ మాత లెవ్వ లెవ్వరొ
నామంబులు వేఱువేఱ నాకుం జెపుమా!" 2738

క. అని ధీమంతుండగు న
మ్మునిచంద్రుఁడు ప్రశ్న సేయ మోద్పుంగేలన్
జనసుతుఁడు వాగ్విశారదుఁ
డనఘుండగు భరతుఁ డిట్టు లనియె వినతుఁడై. 2739

చ. "అనవరత వ్యథావికలితాత్మ యభుక్త కృశాంగి దీన నా
జనకుని దొడ్డరాణి హరిఁ జక్రధరుం గను దేవమాత య
ట్లనుపమతేజు రాముఁ గడుపారఁగఁ గాంచిన కోసలేంద్రనం
దన యదె దేవతాప్రతిమ నా పెదతల్లి తపోధనాగ్రణీ! 2740

మ. కణమై రాలిన గోఁగుపూవుకరణిన్ గౌసల్య గేల్వట్టియే
ప్రణతిన్ నీ కొనరించె; నీమెయె సుమిత్రాదేవి నా తండ్రి రా
జ్ఞణికిన్ రెండవభార్య; నా జనసులన్ మధ్యస్థ; యా వీర ల
క్ష్మణ శత్రుఘ్నులఁ గన్న భాగ్యవతి సుమ్మా తాపసోత్తంసమా!

సీ. ఎవతెచేఁ బురుషపుంగవులైన రామ ల
క్ష్మణుల జీవిత మలజడులఁ బడియె
నెవతెచే దశరథాధీశుండు దుఃఖించి
సుతవియోగమున స్వర్గతినిఁ గాంచె

నెవతెచే సుప్రసిద్ధేక్ష్వాకురాజాన్వ
యమున కింతటి యపయశము గలిగె
నెవతెచే నాకు సహింప శక్యముగాని
దారుణదుఃఖంబు దాఁపురించె

గీ. నట్టి యైశ్వర్యకామ పాపాత్మ కుటిల
గోముఖవ్యాఘ్రము నృశంస క్రోధశీల
అజ్ఞ సౌందర్యగర్వితయైన కైక
యీమె ననుఁ గన్నతల్లి మహామునీంద్ర!" 2742

క. మునినాథున కిటు దెలుపుచు
గనుఁగవఁ గెంపొదవ బాష్ప గద్గద గళుఁడై
జననాథసుతుఁడు భరతుఁడు
గనలిన యహిఁ బోలి యూర్పుగాడ్పులు విడిచెన్. 2743

క. అను భరతుని పలుకులు విని
యనాగతజ్ఞుఁడగు మౌని "యనఘా! యిది నీ
జనని యొనర్చిన తప్పని
కన లొందఁగ వలదు దైవగతి యిట్లుండెన్. 2744

క. సురవరులకు దానవులకుఁ
బరమర్షులకును హితంబు బరమార్థంబై
పురుషోత్తముఁ డగు రాముని
యరణ్యగమనంబు శ్రేయ మగు జగములకున్". 2745

క. అని తెలుపఁ దేటి భరతుఁడు
మునికిఁ బ్రదక్షిణముచేసి మ్రొక్కి వినతుఁడై
పనిగొని యా క్షణమందే
యనుమతి నిడె సేనలకుఁ బ్రయాణముసేయన్. 2746

ఆ. అంత పవనజవనహయములఁ బూన్చిన
రత్నకనకరమ్యరథము లెక్కి
భరతసేనలోని బహుజనగణములు
ప్రమద మెసకమెసఁగఁ బయన మైరి. 2747

క. కరిణీ కరి యూథము బం
గరుగొలుసులు కేతనములు గంట లులియఁగా
నుఱుముచు గ్రిష్మాంతంబునఁ
బఱతెంచు ఘనాఘనములభంగిం గదలెన్. 2748

క. పెద్దలు పిన్నలు ముదితలు
ము ద్దినుసుల వాహనముల ముఖ్యులు చనఁగాఁ
దద్దయు వేడుక నడచిరి
దిద్దినటుల వరుసదారి తెన్నున సుభటుల్. 2749

గీ. అంతఁ గౌసల్య మొదలగు నంతిపురపుఁ
గాంత లెల్లరు శ్రీరాముఁ గాంచువేడ్క
స్వాంతముల నిండ నర్హవాహనము లెక్కి
పయనమై చని రాశ్రమపదమునుండి. 2750

క. గురునానతి శ్రీమంతుడు
భరతుఁడు పయనం బొనర్చె పరివారముతో
నరవిందమిత్రశశినిభ
సురుచిరమణికనకఖచితశుభశిబికపయిన్. 2751

క. కరితురగరథాకులమై
తరువనగిరిఝరులఁ గడచి దక్షిణదిశగాఁ
బఱచు ఘనాఘనమో యన
నరిగె మహాసేన గంగ యవలితటమునకు. 2752

క. పరమానందాన్వితమై
కరి తురగ భటాళితోడఁ గాన నరుగు నా
భరత చమూనిర్ఘోషన్
వెఱచి పఱచె నచటి సకలవిహగమృగంబుల్. 2753

## 93-వ సర్గము

క. ఆ గతి ననంతవాహిని
యేగుచు నుండంగ వనమదేభఘటులతో
నాగేంద్రంబులు భయపడి
వేగంబుగఁ బాఱె దూరవిపినంబులకున్. 2754

ఆ. గిరుల ఝరుల దరులఁ దిరుగుచు నుండెడి
హరిణ ఋక్ష రురు మృగాళిఁ గనుచు
నతుల గతుల మొరయు చతురంగబలముతో
భరతుఁ డట్లు ప్రీతి బయలువెడలె 2755

చ. కరితురగాళితో రథనికాయముతో భటకోటితోడ సా
గరనిభమై నభంబు పయిఁ గ్రమ్మినవార్షికవారిదంబు నా
భరతు ననంతసైన్య మిలఁ బట్టక నెట్టన నేగుచుండఁగా
ధరణి యొకింతసే పయిన దాఁక గనంబడదయ్యె నయ్యెడన్.

ఆ. చాల దూరమట్లు చని చని వాహకు
లలసియుంట భరతుఁ డరసి ముఖ్య
మంత్రియగు వసిష్ఠమౌనీంద్రుఁ గనుఁగొని
యా పథంబుఁ జూపి యనియె నిట్లు. 2757

క. "మన మూహించిన యదియును
మును నే విన్నదియు మౌనిముఖ్యుఁడు మనకున్
వినిచినదియు నగు నెల విదె
యనుమానము లేదు నిశ్చయము గురువర్యా! 2758

క. ఇదె చిత్రకూటగిరివర;
మిదిగో! మందాకినీమహానది; నీలాం
బుద నిభమై దూరంబున
నదె సాంద్రవనంబు కనుల కగపడుచుండెన్. 2759

గీ. కొండలం బోలు మన మదకుంజరంబు
లవిగో! గిరిసానువుల నడయాడుచుండె;
వార్షికాబ్దముల్ జలధార వదలునట్లు
పూలఁగురియుచునున్నవా పొగడతరులు." 2760

క. అని శత్రుఘ్నుం గనుఁగొని
"యనుజా! కనుఁగొంతె కిన్నరాంచిత మగు నీ
ఘనగిరిమృగసంకులమై
కనుపట్టెన్ బహుళమకరగతజలధివలెన్. 2761

ఆ. పవనవేగవశత దివి దూలియాడెడు
శారదాభ్రఖండ చయముఁ బోలి
మనదు సైన్యవితతి ఘనతరార్భటి కోడి
చెదరి పాఱుచుండె జింక లవిగో! 2762

ఆ. జలదనిభ వినీల శాఖాగ్రములఁ జూచి
పరిమళించు నిచటి తరులు వొలుచు
నీలకాంతు లొలుకు నెఱి సిగచుట్టుల
ననలఁ దాల్చు దాక్షిణాత్యు లట్లు. 2763

క. జనసంచారము లేకయె
కనులకు మును వెఱపుగొలుపు కానన మయ్యున్
మన జనములచే నిపు డిది
కన వచ్చెన్ నా కయోధ్యకైవడి వత్సా! 2764

క. తురగ ఖురోత్థిత ధరణీ
పరాగములు రేఁగ వేగ పైకొని వానిన్
దెరలించి చూపుచుండెన్
దెరువు ప్రియునిఁబోలి వాయుదేవుఁడు మనకున్. 2765

గీ. సారథులు వేగ నడపించు స్యందనముల
భీషణాఘోషణములకు బెగ్గడిల్లి
బర్హిముఖ్యంబులగు వనపక్షితతులు
చెదరి పాఱుచునుండెఁ జూచితివె యనుజ! 2766

గీ. పరమ రమణీయమైన యీ భవ్యపదము
నాకుఁ జూపట్టుచున్నది నాకమట్టు;
లిది తపోధనులైన మునీశ్వరులకు
సర్వతమ పావనక్షేత్ర మని తలంతు. 2767

క. తెలిచుక్కలు నెమ్మేనులఁ
జెలువందఁగ లేడు లాఁడుజింకలతోడన్
గలసి వనిన్ విహరించుచు
నలరులఁ జిత్రించినట్లు లగపడుచుండెన్". 2768

క. అని వినిపించుచు భరతుఁడు
తన సేనలఁ గాంచి "రామధరణివిభుం డే
వనమున నెందున్నాఁడో
కనుఁగొనిరం" డనుచు నాజ్ఞ గావించుటయున్. 2769

ఆ. వార లేగి వెదకివచ్చి సంతసమున
భరతుఁ గాంచి "దూరపదమునందు
ధూమపటలిఁ గాంచినా మట రాముఁడో
యట్టి మునియొ యుండ నగు" నటన్న. 2770

గీ. సముచితములైన వారి వాక్యముల కలరి
భరతుఁ "డేను సుమంత్రుండు గురునితోడ
నచటి కేగెద; మిందె మీ రాఁగు" డనుచు
బలఁగముల నిల్పి పోగవంక బయలుదేఱె! 2771

క. భరతుని యానతి సేనలు
శిరసా వహియించి ప్రియుని శ్రీరామువెసన్
దరిసింతు మనుచుఁ బొగదెస
నరయుచు నటు నిలిచి యుండె నౌత్సుక్యమునన్. 2772

# 94–వ సర్గము

## శ్రీరాముఁడు సీతతో చిత్రకూటమున విహరించుట

చ. గిరివనదర్శనప్రియుఁడు కేవలదేవసమానమూర్తి దా
శరథి చిరాధివాసఘనశైలవరంబగు చిత్రకూట భా
సురవిభవంబు జానకికిఁ జూపుచు వేడ్కఁ బులోమజాతతో
హరిహయుఁబోలి య న్నగమునందుఁ జరింపఁ దొడంగె నామెతోన్.

ఆ. అపుడు రామచంద్రుఁ డవనిజఁ గనుఁ గొని
"మంగళాంగి! రాజ్యభంగ మేని
హితవియోగ మేని నెద నన్ను బాధింప
వీ మనోజ్ఞగిరినిరీక్షఁ జేసి. 2774

క. సీతా! చూచితె నానా
జాతివిహంగమ విహార సంశోభితమై
ద్యోతలము నొరయు సురుచిర
ధాతుశిఖల మెఱయు నీ యుదారాచలముఁ. 2775

క. కనకకేతక పుష్పార్కకాంతు లొలయ
రజతరసరక్త చిత్రవర్ణములు వెలయ
నెల్లెడల సద్రుచుల నొప్పు నీ నగంబు
కనులపండువుగా నుండెఁ గనుము దేవి! 2776

గీ. వరమునిగణంబులకు సదావాస మగుటఁ
గ్రూరసాధుజంతువులు శకుంతములును
సహజవైరముల్ విడి యిందు సంచరింప
శాంతిసదనమై యున్నది శైలవరము. 2777

చ. చలువల నీడలన్ బ్రసవసత్ఫలసంపదలన్ జెలంగు శ్రీ
ఫలపనసామ్ర జంబ్వసన పర్ణక సాల మధూక దాడిమీ
తిలక ధవ ప్రియాళు ఘనతిందుక కోల కదంబ కీచకా
మలక ముఖాఖిల ద్రుమ సమంచిత మీ నగశోభ గాంచితే!

క. తిలకించువారి మేనులు
పులకింపఁగ శైలసాను పుష్పవనములన్
మెలఁగెడి కిన్నరదంపతి
విలాసఖేలనలఁ గంటివే కల్యాణీ! 2779

గీ. కమ్మవిరిగొమ్మలందు ఖడ్గములఁ గూర్చి
సరిగ వలువలఁ గుసుమ వల్లరులఁ జేర్చి
యలరి విహరించుచున్న విద్యాధరులను
వారిచెలువలఁ గంటివే వనజనయన! 2780

ఆ. జాలువాఱుచున్న జలపాతములు నూట
బుగ్గలందునందుఁ బూరటిల్ల
నిన్నగంబు వొలుచుచున్నది కనుఁగొంటె
దానధార లొలుకు దంతిఁ బోలి. 2781

క. ఈ నగగుహాగతములై
నానావిధ సూన వాసనల ఘ్రాణసుఖ
శ్రీనించు చలువతెమ్మెర
లేనరునకు నైనఁ గూర్పవే ప్రమదంబుల్? 2782

గీ. సాధ్వి! సీతోడ భ్రాత లక్ష్మణునితోడఁ
గలసి యీ చిత్రకూటనగంబునందుఁ
జింతలును వంతలును దరిఁజేరకుండ
నెన్నియేండ్లైన నే వసియింపఁ గలను. 2783

క. సుమ ఫల సంభరితంబై
ప్రమద ద్విజవిహరణాగ్ర భాస్వంతంబై
రమణీయంబగు నీ గిరి
తమిఁ గొల్పుచునుండె సంతతము నామదికిన్. 2784

క. జనకాజ్ఞఁదీర్చి ఋణమో
చనుఁడ నగుట భరతుప్రియముఁ జలుపుట యను నీ
యనఘఫలయుగము నా కీ
వనవాసమువలన నబ్బె వనజాతాక్షీ! 2785

గీ. సీత! నాతోడ నీవు నీ చిత్రకూట
చిత్రచిత్రభావంబుల చెలువుఁ గనుచుఁ
ద్రికరణంబులఁ దనుపు నీ దివ్యసిమ
నెలమి విహరణ మొనరింప నిచ్ఛగింతె! 2786

గీ. రాణి! వైదేహి! మాపూర్వరాజఋషులు
భవము దరియింప సంసారబంధ మెడలి
స్వర్గము గమింప నీ వనవాసనియమ
ముత్తమం బని వచియించి యుండిరి సుమి! 2787

క. తెల్లని పచ్చని యెఱ్ఱని
నల్లని రంగుల నెసంగు నానాశ్మరుచుల్
పెల్లుగ వెల్లివిరియ రం
జిల్లెడు నీచిత్రకూటశిఖరిం గంటే! 2788

ఆ. ఈ నగేంద్రమందు నెన్నియో యోషధు
లనలశిఖలఁ బోలి యాత్మరుచులు
దెసల నలమికొనఁగఁ దేజరిల్లుచునుండు
రాత్రివేళలందు రాజవదన! 2789

క. ఒకయెడ గృహములుగా నొం
డొకయెడ నుద్యానవనసముత్కరముగ వే
ఱొకయెడ సువిశాలశిలా
సకలముగా నిమ్మనోజ్ఞశైలము దోఁచున్. 2790

గీ. నేలఁ జీలుచుకొనివచ్చి నింగిముట్టి
కొలువుదీర్చినట్లున్నదీ గోత్రధరము;
దీనిశిఖరమణిప్రభల్ దెసలఁ బర్వి
యేలుకొనుచున్న వెల్లెడ మేలుకొలిపి. 2791

క. కలువలు పున్నాగంబులు
పలువిధములఁ జెలువుగులుకు ప్రసవమ్ములతో
నలినదళ భూర్జ పత్ర
మ్ములఁ దగు కిన్నరుల శయనములు గనుఁగొంటే! 2792

ఆ. నలఁగి చెలువ మెడలు నలరులదండలు
నారగింప మిగిలినట్టి పండ్లు
గానవచ్చుచుండెఁ గాముకుల్ వెడలిన
శయనతలములందు సకియ! కంటె! 2793

గీ. అలకకంటె నుత్తరకురుతలముకంటెఁ
జెలువ లొలుకు సౌగంధికసరసికంటె
బహుళఫలమూలజలములఁ బరిఢవిల్లు
నీ నగం బెల్లెడల వన్నె కెక్కుచుండె. 2794

క. ప్రేమమయి! సీత! నీవును
సౌమిత్రియు వెంటనుండ సాధుపథమునన్
నేమము నే నిటుఁ దీరిచి
శ్రీమత్కులధర్మసిద్ధిఁ జెందుదు నెలమిన్." 2795

## 95-వ సర్గము

గీ. అనుచు నీరీతిఁ జిత్రకూటాద్రిఁ బొగడి
చంద్రవదన వరారోహ జనకజాత
కంత మందాకినీ స్రవంతిఁ జూపి
యబ్జనేత్రుండు రాముఁ డిట్లని వచించె. 2796

చ. నలువగు చిత్రచిత్రపులినంబులతో నళినీ వనాళితోఁ
గలరవహంస సారస వికాసముతో ఫలపుష్పభూజ సం
కలిత తటాంత మైన యలకావిభు గంధసరోవరంబు నాఁ
జెలువగు ని మ్మహానది విశిష్టతఁ జూచితివే సులోచనా? 2797

సీ. మృగయూధ మొకచక్కి దగ వోవఁ దిగిత్రావ
గలఁగిన రేవులజలముతోడ
జడదారు లొకచోట స్నానముల్ పచరింపఁ
దరఁగలు గ్రమ్ముతీర్థములతోడ
సద్వ్రతు లొకచాయ సవిత కర్ఘ్యము లీయ
రవణించు జలసుస్వరములతోడఁ
దటతరు లొకవంకఁ దావిపూ ల్గురియంగ
నెఱిమించి మెఱయు వేణికలతోడ

ఆ. మౌక్తికాభమైన మధురజలంబుతోఁ
బ్రియము గూర్చు పులినచయముతోడ
సిద్ధసేవ్య మగుచుఁ జెలఁగు మందాకినీ
విలసనములఁ గంటె జలజనయన! 2798

చ. చల దనిలాహతిన్ దరుల జాఱిన క్రొవ్విరు లి మ్మహానదీ
జలములఁ దీరదేశముల జాలయి తావులనించు సెజ్జ ల
ట్లలరఁగ జక్కవల్ కలగళారవముల్ చెలువార వానిపై
నెలమి విలాసకేళిఁ జరియించుచున్నవి కంటె జానకీ! 2799

ఆ. బోఁటి! నాకుఁ జిత్రకూటువాసంబు మం
దాకినీ స్రవంతి దర్శనంబు
మన యయోధ్యకంటె నినుఁ బ్రేమమైఁ జూచు
కొనుటకంటె ముదముఁ గూర్చుచుండె. 2800

ఉ. ఓ కమలాననా! శమదమోరుతపస్వులు ధూతకల్మషా
నీకు లశోకులౌ ఋషుల నిత్యనిమజ్జనపూతమైన మం
దాకినివారి నెచ్చెలి విధంబున నన్నవగూడి వేడ్కమై
కోకనదాబ్జముల్ సెదరఁ గ్రుంకులువెట్టుచుఁ జల్లులాడవే! 2801

క. తిరిగెడు నీ వనమృగములఁ
బురజనులుగఁ జిత్రకూటభూధ్ర మయోధ్యా
పురముగ మందాకిని నే
సరయువుగా నరయు మింక జనకతనూజా! 2802

గీ. జానకీ! ధర్మమూర్తి లక్ష్మణుఁడు నీవు
నస్మదీయాజ్ఞలం దేర్చి యహరహంబు
నప్రమత్తులై నాకుఁ బ్రియంబుఁ గూర్ప
నుచితగతి సేవ గావించుచున్నవారు. 2803

గీ. కాంత! నీతోడఁగూడి త్రికాలములను
నీ నదీస్నాన మొనరించి తేనె లాని
మూలఫలభుక్తిఁ గడపుటే చాలు నాకు
గోర నిఁక రాజ్యము నయోధ్యఁ గోరఁ బోను. 2804

చ. హరిణగణంబు నిర్భయవిహార మొనర్ప స్వజాతివైరముల్
మఱచి మదేభసింహములు మచ్చిక నొక్కెడ నీరుఁ ద్రావఁ బూల్
చెరివి తరుల్ దరుల్ నినుప సేవ్యము దివ్యము భవ్యమైన యీ
వరనదిఁ గ్రుంకులాడి శ్రమవాయ నెవండు సుఖింపకుండెడిన్?"

క. జనకజ కిటు రఘురాముఁడు
మన మలరఁగ జిత్రకూటమందాకినులన్
గనిపించుచు వినిపించుచు
ననుపమ సమ్మోదభరితుఁడై విహరించెన్. 2806

## 96-వ సర్గము

క. పదపడి గిరితటి రాముఁడు
హృదయేశ్వరిఁ గూడి పలల మింపొదవంగా
నిది పక్వం బిది శుద్ధం
బిది రుచ్యం బని భుజించె నిష్టాగోష్ఠిన్. 2807

క. అలో భరతుని సేనల
కోలాహలములకు బెదరుఁగొని కుంజరముల్
దీలుపడి పఱవ రాఘవుఁ
డాలించెన్ వనమృగముల యలజడిఁ గనుచున్. 2808

క. విని రాముఁడు లక్ష్మణుఁ గని
"యనుజ! సుమిత్రాభిరామ! యదె గంభీర
ధ్వని యేమో భయదంబై
విన నయ్యెన్ నీవుగూడ విని పోల్చితివే! 2809

క. వనమదగజయూథంబులు
నెనుబోతులు సింగములును నెలుఁగులు జింకల్
వనిఁ జెదరి పాఱుచున్నవి
కనుఁగొంటివె రఘుకుమార! కారణ మేమో! 2810

క. ఏ రాజమాత్రుఁడో మఱి
యే రాజో వేఁట కిటకు నేతెంచెనొ? యే
క్రూరమృగ మైనఁ గానీ
గోరాడుచు నడవి మత్తుగొని రేఁగినదో! 2811

క. మృగములవలెనే యిచ్చటి
నగ తరు విహగములుగూడ నానాగతులన్
బెగడుపడి పఱచె; దీనికిఁ
దగు కారణ మేమొ తెలియఁదగు వేగముగన్." 2812

క. అని నంత లక్ష్మణుం డొక
ఘనపుష్పిత సాల మెక్కి కడ లరసి క్రమం
బున నుత్తరాభిముఖుఁడై
కనుఁగొనెఁ జతురంగబల నికాయము నెదురన్. 2813

క. పరికించి లక్ష్మణుఁడు రఘు
వరు నుద్దేశించి "యదిగొ! వచ్చుచునుండెన్
హరి రథ భట కరి పరివృత
వరవాహిని ఘోరభైరవధ్వానముతోన్. 2814

గీ. అనఘ! నీ వింక వేగంబ నగ్ని నార్పి
కుశలముగ దేవి జానకి గుహను జేర్చి
శర శరాసన కంచుక ధరుఁడ వగుచు
యుద్ధసన్నద్ధుఁడై నిల్చియుండు" మనిన. 2815

గీ. జనవరేణ్యుఁడు రఘురాముఁ డనుజుతోడ
సేన యెవ్వరిదో పరీక్షింపు మనినఁ
గాంచి సౌమిత్రి దావాగ్నికరణి మండి
పడుచు నగ్రజునిం గాంచి పలికె నిట్లు. 2816

క. "కైకకొడుకు భరతుం డభి
షేక మెలమిఁ గాంచి శత్రుశేషం బెందున్
లేకుండ రాజ్య మేలఁగ
నేఁకటుపడి వచ్చె మనల నిటఁ జంపుటకున్. 2817

క. అదిగో! శ్రీమంతంబై
విదితదృఢస్కంధ మగుచు విపులాగమ సం
పదఁ గోవిదారకేతన
ముదయార్కప్రభల మెఱయుచుండె రథముపైన్. 2818

క. కరితురగారోహకు లిటు
పఱతెంచుచు నున్నవారు ప్రధనోద్ధతి; న
య్యరులఁ సన్నద్ధులమై
ధరనో గిరినో వసించి తాకఁగ వలయున్. 2819

క. నీకును సీతాదేవికి
నాకు నెవనివలన నిట్టి నవఁత గలిగెనో
యాకోవిదారకేతనుఁ
గైకకొడుకు నెదురుకొందుఁ గదనతలమునన్. 2820

క. ఓ రఘువర! శాశ్వత మగు
నీ రాజ్యము నిటు త్యజించి యిడుమలఁ బడఁగా
గారణ మెవ్వఁడా భరతుఁడు
వైరియు వధ్యుండు నగు నవశ్యము నాకున్. 2821

గీ. కలుషచిత్తులు పూర్వాపకారు లైన
యరుల నిర్జించుటయె ధర్మ మగును గాన
నిట్లు సేనలతో వచ్చి యెదురుచున్న
భరతుఁ జంపుట నాకుఁ బాపంబు గాదు. 2822

క. కరితుండనిహతిఁ గూలిన
తరువవలెన్ మత్కరాసిధారఁ బడుసుతుఁ
భరతుఁ గని రాజ్యకాంక్షా
పరవశయగు కైక దుఃఖపడి చెడుఁ గాతన్. 2823

గీ. సకలబంధులతో పరిజనముతోడ
జెనఁటి కైకను గూడ నేఁ దునిమి వైతు
వీత కిల్బిషభారయై భూతధాత్రి
యింక సర్వతోభద్రాప్తి నెసఁగుఁ గాక! 2824

గీ. పరిభవక్రోధముల మది మఱఁగుపఱచి
యింతవఱకును నే సహియించియుంటి;
వరుగువారిన కసవుపై వహ్నిఁ బోలి
వాని నరిసేనపైఁ ద్రోసివైతు నింక. 2825

గీ. కదనరంగంబునను మహాకాలుఁ బోలి
పటుధనుర్ముక్తశరపరంపరల నిపుడు
శత్రుగాత్రంబులను జీల్చి చిత్రకూట
వనతలం బెల్ల రక్తవాహినుల నింతు. 2826

గీ. మామకోగ్రశరాహతి భూమిఁ బడిన
కరిపదాతితురంగాంగఖండములను
శ్వాపదంబులు వనచర జంబుకంబు
లీడ్చుకొని పోవుఁగాత యథేచ్ఛముగను. 2827

క. ఖర విశిఖ కార్ముకములకు
దురముల నప్పువడలేదు తొల్లి యొకపుడున్
భరతుని సబలున్ బొరిగొని
శరచాపఋణంబుఁ దీర్పఁ జాలుదు నిపుడున్." 2828

# 97-వ సర్గము

క. అని ఘనరోష వికంపిత
తనుఁడై గర్జించుచున్న తమ్ముని సుమిత్రా
తనయుని లక్ష్మణుఁ గని యి
ట్లనియెన్ రాఘవుఁడు సాంత్వనాలాపములన్. 2829

గీ. "ప్రాజ్ఞుఁ డున్నతకోదండపాణియైన
భరతుఁడె స్వయమ్ముగా నిట కరుగుదేరఁ
గార్ముకంబులతోడ ఖడ్గములతోడ
నెదురుకొని నిల్వ మనకుఁ బనేమి యనుజ! 2830

క. పితృనానతి దీర్చెద నని
వ్రత మూనిన నేనె యిటుకు వచ్చిన భరతున్
హతుఁ జేసి నిందపాల్పడి
క్షితితలరాజ్యంబు నెట్లు చేకొన నేర్తున్? 2831

గీ. ఇది హితం బిది యహిత మంచెఱిఁగి యెఱిఁగి
విష వికృత భక్ష్య సమితి సేవించినట్లు
సఖులఁ జుట్టాల వధియించి సంగ్రహించు
పాపసంపత్తి ననుభవింపంగ నొల్ల. 2832

గీ. సత్యము వచించుచుంటి శస్త్రంబు ముట్టి
తమ్ముఁడా! లక్ష్మణా! యెట్టిధర్మ మైన
నర్థకామంబులైన రాజ్యంబు నైన
మీ యభీష్టంబుకొఱకె నేఁ జేయువాఁడ. 2833

గీ. సాగరాంబరవిలసిత సకలధరణి
రాజ్యలక్ష్మి నాకెందు దుర్లభము గాదు;
కాని ధర్మవిరుద్ధమార్గమున నొదవు
నింద్రపద మైన నే నిచ్ఛయింపఁ జాల. 2834

క. అనుజా! మానధనా! విను
జనుతభరతునకు నీకు శత్రుఘ్నునకున్
మన మలరింపని యెంతటి
ఘనతరసుఖమైన నేనుఁ గాంక్షింపఁ జుమీ. 2835

సీ. రఘుకుల ధర్మకర్మరతుండు భరతుండు
భ్రాతృవత్సలుఁడు మత్ప్రాణసముఁడు
తమ్మునితో నయోధ్యకు వచ్చి నే జటా
వల్కలధారినై వనికి నిట్లు
సీతతో నీతోడ నేతెంచుటను విని
కడు జాలిఁజెంది దుఃఖమున మునిఁగి
ఘనరోషమునఁ దల్లి గైకను నిందించి
జనకుఁ బ్రార్థించి ప్రసన్నుఁ జేసి

గీ. ప్రేమ మీఱంగ రాజ్య మర్పించుకొఱకు
నన్ను దర్శింప వచ్చుచున్నాఁడు గాని
యతని కన్యథా చింత లేదని తలంతు
నార్య! పురుషవరేణ్య! వీరాగ్రగణ్య! 2836

గీ. మనల నిటుఁ జూడఁగోరి యా మాన్యచరితుఁ
డుచితసమయంబుననె వచ్చుచున్నవాఁడు
భరతు శంకించి యిటు భయపడఁగ నేల?
యెగ్గొనర్చెనె మన కాతఁ డెన్నఁడైన? 2837

క. భరతుని గూరిచి నీ విటు
పరుషాప్రియభాషణములఁ బలుకఁ దగదు తొం
దరపడి యిఁకఁ బలికిన నను
నిరసించుచునున్న యట్లె నే నెంతుఁ జుమీ! 2838

క. ఆపద లేవో యెపుడో
ప్రాపించుం గాక సుతుఁడు ప్రాణసమానుం
డౌ పితను గాని తమ్ముఁడు
ప్రోపుగొలుపు నన్నుఁ గాని పొరిగొనఁ జనునే! 2839

క. ధరణీరాజ్యనిమిత్తమె
పరుసము లిటు లాడెదేని భరతుం గని నీ
కొఱ కీ రాజ్యము నిమ్మని
యెఱిఁగించెద; నతఁడు దాఁటు డెపుడు మదాజ్ఞన్." 2840

ఆ. అనుచు ధర్మశీలుఁ డగు రాముఁడు వచింప
నతనిహితముకొఱకె వెతలఁ బడెడు
లక్ష్మణుండు ముల్కులం బోలి యా పల్కు
లాయములను గాఁడినట్లు దోఁప. 2841

క. విని సిగ్గువడుచు నాతం
డనఘుండగు రాముఁ గాంచి "యాత్మీయులతో
మన జనకుఁడు దశరథుఁడే
నినుఁ జూడఁగ వచ్చెనేమొ నేఁ డిటు" కనినన్. 2842

ఆ. చిన్నవోయి యున్న చిన్నితమ్ముని పల్కు
లాలకించి రాముఁ డాదరించి
"యగును మనలఁ జూడ నమ్మహాభాగుఁడే
యరుగుదెంచుచుండె నని తలంతు. 2843

క. అనుజా! సుఖముగఁ బెరిఁగిన
తనయులు వనవాసమునకుఁ దగ రని మరలన్
మనలఁ బురికిఁ గొనిపోవఁగ
జనకుం డిటువచ్చె ననుచు సంభావింతున్. 2844

క. కాదేని సీత నబలన్
గాదలి కోడలిఁ గుమారిఁ గానలఁ ద్రిప్పన్
రాదని యంతిపురికిఁ గొని
పోఁదలఁచియె వచ్చె నేమొ భూవరుఁ డిటకున్. 2845

క. అవె యమలము లుత్తమములు
పవనజవంబులు సుగోత్రభవములు ధరణీ
ధవుఁ డగు దశరథు రథ సైం
ధవములు రుచిరాకృతిం గనంబడుచుండెన్. 2846

క. శ్రీనిధి దశరథుపట్టపు
టేనుఁగు శత్రుంజయంబు హిమనగమువలెన్
సేనాముఖమున నల్లదె
కానంగా నయ్యె భద్రగమనోన్నతులన్. 2847

ఆ. జనకు రథముఁ గంటి జవనాశ్వముల గంటిఁ
గోవిదారపటముఁ గూడ గంటిఁ
గాని తేరఁ దండ్రిగారి శ్వేతచ్ఛత్ర
మిపుడు దోఁపకున్న దేమి చెపుమ? 2848

క. ఇమ్మహిజమ్మును డిగి యిటు
రమ్మా లక్ష్మణ! యటంచు రాముఁడు పలుకన్
సమ్మతి దిగ రణధీరుఁడు
తమ్ముఁడు కైమోడ్చి యన్నదండన నిలిచెన్. 2849

క. అనఘుఁడు భరతుం డచ్చట
జనరవ సంఘర్షణంబు సనదని దెలుపన్
విని సేనాపతి గిరిదరి
ఘనసేనావాస ముచితగతిఁ గల్పించెన్. 2850

క. కరి తురగ స్యందన జన
భరితంబగు భరతుసేన బహుశాంతముగా
గిరిచుట్టి సార్ధయోజన
పరిమిత ధరణీతలంబుఁ బట్టి యెసంగెన్. 2851

ఆ. స్వామి రాము సుప్రసన్నునిఁ గావింప
ధర్మపరత గడఁగి దర్ప ముడిగి
విజ్ఞుఁడైన భరతువెంట వచ్చిన సేన
చిత్రకూట వని వసించె నెలమి. 2852

## 98-వ సర్గము

క. పావన పదుఁడగు భరతుం
డా వనమున సేన నిలిపి యగ్రజుఁ బిత్రా
జ్ఞావర్తిఁ జూడఁ గాల్నడఁ
బోవుచు శత్రుఘ్నుఁ దమ్ముఁ బొడఁగని యనియెన్. 2853

చ. "అనుజ! వనేచరాన్వితుఁడవై మన యగ్రజు సన్నివేశమున్
గనుఁగొనిరమ్ము; సాయుధులు జ్ఞాతి సహస్రముతో గుహుండు వే
చని పరికించుఁ గాక! వనశైలము లేనును బాదచారినై
వని గురు విప్ర మంత్రి పురవర్యులతో వెదకంగ నేగెదన్. 2854

సీ. శాంతి గల్గునె నాకు జానకీ రాముల
నునుజు లక్ష్మణుఁ జూచునంతదాఁక
శాంతి గల్గునె నాకు సారసాక్షుండైన
యన్న యాననచంద్రుఁ గన్నదాఁక

శాంతి గల్గునె నాకు జనపాల చిహ్నిత
శ్రీరామ పదసేవఁ జేయుదాఁక
శాంతి గల్గునె నాకు స్వకులానుగతరాజ్య
పీఠ మగ్రజున కర్పించుదాఁకఁ

గీ. బూర్ణచంద్రాస్యుఁ బద్మాక్షుఁ బూజ్యు రాము
నెపుడు దర్శించు లక్ష్మణుండే ఘనుండు;
సాగరాంత మహీతల స్వామియైన
భర్తతో నున్న సీతయే భాగ్యరాశి. 2855

గీ. నందనమున గుబేరునిచందముననె
యి వ్వనిఁ రాఘవుఁడు వసియించుకతన
గోత్రరాజ మట్లీ చిత్రకూట నగము
ధన్యతమమును భాగ్యవంతంబు నయ్యె. 2856

గీ. దుష్ట సత్త్వ ప్రకీర్ణంబు దుర్గమంబు
నైన యీ చిత్రకూట మహావనంబు
ధార్మికాగ్రేసరుఁడు గుణధాముఁడైన
దాశరథి కాశ్రయం బౌట ధన్య మయ్యె." 2857

క. అని కొనియాడుచు భరతుఁడు
చనె పుష్పిత తరు వికీర్ణ సాను వనములన
జననాథు రామచంద్రుని
గనుఁగొన ప్రియజనముతోడఁ గాలినడలనే. 2858

ఆ. అట్టు లేగి భరతుఁ డా చిత్రకూటాద్రి
విరిసియున్న యొక్క తరువు దరిసి
యరసినంత రాము నాశ్రమానల ధూమ
కాండ మప్పు డతని కనులఁ బడియె. 2859

క. శ్రీమంతుడు భరతుం డా
ధూమము గని పరిజనంబుతో నచ్చటనే
రామవిభు డుండు ననుచు మ
హామోద రసాబ్ధి మగ్నుఁడై మైమఱచెన్. 2860

క. అనఘుఁడు భరతుం డటు స
జ్జనసేవితమైన రామచంద్రాశ్రమ మా
ఘనగిరిఁ గని పరివారము
వెనుక నిలిపి గుహునితోడ వెడలుచు వేడ్కన్. 2861

# 99–వ సర్గము

క. కను మదె యగ్రజు నాశ్రమ
మని శత్రుఘ్ననకుఁ జూపి యంత గురునికిన్
జనముల వెంబడిఁ గొనిరాఁ
జను మని యెఱిఁగించి తాను జనె మునుమున్నన్. 2862

గీ. భరతశత్రుఘ్ను లట్టులే ప్రభుని రామ
భద్రు దర్శింప వేడుకపడుచునున్న
యా సుమంత్రుఁడు శత్రుఘ్ను ననుసరించి
యనతిదూరంబుననె వేగ మరుగఁ దొడఁగె. 2863

గీ. అట్లు చనుచునె శ్రీమంతుఁ డగు భరతుఁడు
సుమహితములైన మున్యాశ్రమముల నడుమఁ
బ్రభుని శ్రీరామచంద్రుని పర్ణశాల
నతఁడు నివసించు నుటజంబు నపుడు గనియె. 2864

క. నిరతాగ్నిహోత్రములకున్
నఱికిన కట్టెలును పూజనములకుఁ బత్రాం
తరముల నినిచిన పువ్వులు
బరిసరమునఁ గాననయ్యె భరతుని కచటున్. 2865

ఆ. పథము దప్పకుండ పర్ణశాలకుఁ బోవ
గుఱుతుగాఁగఁ జెట్లకొమ్మలందు
రామలక్ష్మణులు తిరంబుగ నెడనెడ
నిడిన కుశలుఁ జీర లెదుటఁ దోఁచె. 2866

క. వడఁకించెడి చలి వాపఁగ
నడవిం గల మహిష గోగణాదులవలనన్
గడులై పొడమిన యేరుం
బిడకల గుట్టల నతండు పెడలం గనియెన్. 2867

ఆ. చనుచు నాతఁ డపుడు శత్రుఘ్ను సచివులఁ
బిలిచి "మనకు మౌని తెలిపినట్టి
మనికి యిదియె యిటకు మందాకిని సమీప
మందె యుండవచ్చు నని తలంతు. 2868

క. అదిగో! కంటిరె యాశ్రమ
పదమార్గము రేల నెఱుకపడ ఘనతరులన్
బొదలెడు వల్కలశకలతతి
నిది లక్ష్మణకృత మటంచు నే నూహింతున్. 2869

గీ. గిరితటంబుల మదకరుల్ ఘీంకరించి
ఘన రదాహతిఁ బోరిన కందువ లవె
తపసివరుల నిత్యాగ్నిహోత్రముల నుండి
చదలి కెగసెడి ధూమధ్వజంబు లవిగో! 2870

క. గురుసంస్కార మొనర్చెడి
పరమర్షింబోలు పూజ్యపాదకములునిన్
బురుషోత్తము రఘురాముని
దరిసింతుం గాత సమ్ముదంబున నటనే." 2871

క. అని వచియించుచు భరతుఁడు
చని చని యా గిరివరంబుసన్నిధి మందా
కిని దరిసి చూచి శత్రు
ఘ్నునిఁ గని యిట్లనియె వంతగూరిన మదితోన్. 2872

క. "అనుజా! చూచితె యక్కట!
జననాథుం డయ్యు రామచంద్రుఁడు విజనో
ర్విని గూరుచుండి యుండెన్
నను నేమనుకొందు నింక నా బ్రదుకేలా? 2873

క. నా మూలంబునఁ గాదే
కామ్యార్థము లుజ్జగించి ఘనతేజుండౌ
రామప్రభుఁ డిక్కానన
సీమన్ దుఃఖార్తుఁడై వసింపఁగ వలసెన్. 2874

ఆ. ఇట్టి లోకనింద నే భరింపఁగఁ జాల
స్వామి రాము సుప్రసన్నుఁ జేయఁ
బదముఁబట్టి యతని బతిమాలి మఱి మఱి
సీత కెఱిఁగ మనవి చేసికొందు." 2875

క. అని చింతించుచు దశరథ
తనయుఁడు భరతుఁ డటు లేగి తద్వనసీమన్
గనె రాముని పర్ణనికే
తనము న్నూతనము నంచితము శ్రీయుతమున్. 2876

సీ. ఘనసాల తాళాశ్వకర్ణాదిభూరుహ
పర్ణసంఛన్నమై పరఁగుదాని
విస్తీర్ణ మృదుల కుశాస్తరణంబుచే
సవనవేదిక యట్లెసంగుదాని

వరసర్పయుత భోగవతిఁ బోలి కనక కో
శాంచితాసిద్యుతి నలరుదాని
యరిదుర్గమం బయి యన్యమృగాలంఘ్య
మగు సింహగుహఁబోలి నెగడుదాని

ఆ. నింద్ర ధనువువలె నహీనసారంబులు
భారసాధకములు భర్మమయము
లైన కార్ముకముల హవణిల్లు దాని నా
పర్ణశాలఁ గనియె భరతుఁ డపుడు. 2877

క. అంగుళి సంత్రాణంబులు
బంగరుశిల్పములు గూర్పఁబడి చిత్రములౌ
రంగుల ఖేటంబులు నుటు
జాంగణమునఁ గాననయ్యె నా భరతునకున్. 2878

క. ఈశాన్యకోణమందుఁ బ్ర
కాశిత శిఖిశిఖలతోడఁ గ్రమనిమ్నంబై
వైశాల్యం బయి రామ ని
వేశంబున జాతవేదువేదిక దోఁచెన్. 2879

సీ. అజిన జటావల్కలాంచితపరిధానుఁ
బ్రజ్వలాగ్నిప్రభాభాసమానుఁ
గంఠీరవోన్నతస్కంధు మహాబాహు
నీరజాతాక్షు వినీలదేహుఁ
జతురంబుధి పరీత సర్వంసహానాథు
శాశ్వత బ్రహ్మతేజ స్సనాథుఁ
బితృవాక్యపాలన వ్రత నియమాచారు
నాగమ విహిత ధర్మావతారు

గీ. సతి మహీజతో ననుజ లక్ష్మణునితోడఁ
గలసి దర్భలు పఱచిన కటికనేల
నుటజతలమునఁ గూర్చుండియున్న రాము
నగ్రజుని భరతుం డట్టె యరసి యరసి. 2880

క. పొంగి పొరలు దుఃఖము నా
పంగా నోపంగ లేక భరతుఁ డపుడు క
న్నుంగవ నుష్ణాశ్రువు లొ
ల్కంగాఁ దడఁబడుచు నన్నకడకుఁ జనుచున్. 2881

క. సామంత సచివ గురుజన
ధీమంతులతోడఁ గొలువు దీర్పం దగు సు
శ్రీమంతుఁడు మా యన్న మ
హామృగ వనసీమ నుండెనా? యకటకటా! 2882

సీ. మృదులకౌశేయముల్ మెయి దాల్చు శ్రీమంతుఁ
డెట్టు లీ వల్కముల్ గట్టఁగలిగె
నెఱి సిగ విరిసరుల్ దుఱుము సుందరమూర్తి
యెట్టులీ జటలు వహింపఁ గలిగె
తావి మైపూఁతలఁ దనరారు సుకుమారుఁ
డెట్టు లీధూళి సహింపఁ గలిగె
నవనాళి ధర్మసంచయము గూర్చు మహేంద్రుఁ
డెట్టు లీ కటుదీక్ష పట్టఁగలిగె

గీ. సంతత సుఖార్హుఁడైన యీ జనవిభుండు
తపసియయ్యెను నా నిమిత్తమునఁ గాదె
యఖిలలోకనిందార్హుఁడనైన నాకు
హింసకుఁడనైన నాకు నింకేటి బ్రదుకు?" 2883

క. అని విలపించుచు భరతుఁడు
కనుదమ్ముల నశ్రులొల్కఁగా దీనుండై
తన యన్న యడుగుఁదమ్ములఁ
గని మ్రొక్కంబోయి వానిఁ గాన కిలఁ బడెన్. 2884

ఆ. భూరిబలుఁడు రాజపుత్త్రుండు భరతుండు
గాఢ దుఃఖబాష్పకంఠుఁ డగుచు
నన్న నొక్కసారి 'యార్యా!' యనుచుఁ బిల్చి
యవలఁ బలుకనేరఁ డయ్యె నార్తి. 2885

క. శత్రుఘ్నుండును రాము ప
విత్రాంఘ్రుల వ్రాలి మ్రొక్కి విలపింపఁగ నా
భ్రాతనురక్తుఁడు దమ్ముల
గాత్రాశ్లేషణ మొనర్చెఁ గన్నీ రొలుకన్. 2886

గీ. రామలక్ష్మణు లపు డా యరణ్యమందుఁ
బ్రియులగు సుమంత్ర గుహులతోఁ బేర్మి గలసి
కవి బృహస్పతులం గూడి దివి వెలుంగు
దినకర సుధాకరుల యోజఁ దేజరిలిరి. 2887

గీ. ఆ విశాలవనంబున హస్తియూధ
నాథులం బోలియున్న భూనాథసుతులు
నల్వు రటఁ గూడియుంటఁ గన్నారఁ గాంచి
హర్షబాష్పాంబునయనులై రచటి ఋషులు. 2888

# 100-వ సర్గము

ఆ. శిరమునందు జడలు చీరముల్ మెయిఁ దాల్చి
కేలు మోడ్చి నేలఁగూలియున్న
ప్రళయకాలసూర్యు పగిది దుర్దర్శనుం
డైన భరతు రాముఁ డట్టెచూచి. 2889

ఆ. వనటఁ జిక్కియున్న యనుజుని గుర్తించి
కరము సాచి యెత్తి కౌఁగిలించి
యంకమందుఁ జేర్చి యౌదల ముద్దిడి
రాముఁ డిట్టు లనియెఁ బ్రేమమీఱ. 2890

ఆ. "దవులనుండి పురికిఁ దరలి వచ్చిన నిన్నుఁ
గాంచఁ గంటి చాల కాలమునకు ;
సంతసంబె కాని జనకుని వీడి యీ
వనికి రాఁ బనేమి వచ్చె వత్స! 2891

ఆ. తండ్రి పుత్త్రశోకతప్తుఁడై దీనుఁడై
యుసురులను దృజించియుండఁడు గద!
జనకదత్తమైన శాశ్వతరాజ్యంబు
బాల్యవశత భంగపఱుపవు గద! 2892

క. ఏలిక సత్యపరాక్రమ
శీలుండగు జనకసేవ సేయుదు గద! య
శ్వాలంభరాజసూయ మ
ఖాలబ్ధయశోవిశాలుఁ డయ్య కుశలియే? 2893

ఆ. బ్రహ్మతత్త్వవేత్త బ్రహ్మవర్చస్కుని
వేదవిదుని పూజ్యపాదకమలు
నిద్ధధర్మనిరతు నిక్ష్వాకు కులగురు
ముని వసిష్ఠుఁ గొలుతె మున్ను వోలి. 2894

గీ. అమ్మ కౌసల్యకు సుఖంబె యా సుమిత్ర
సుప్రజావతి కుశలయే? క్షోణివిభుఁడు
దశరథునిదేవి కేకయతనయ యైన
కైక సుఖముగ నున్నదే? కౌతుకమున. 2895

క. వినయాన్వితుని బహుశ్రుతు
ననసూయుని బరమపావనాన్వయుని సుద
ర్శనుని సుయజ్ఞుని గురుసుతు
ననుఁగుఁ బురోహితునిఁ బ్రీతి నర్చింతు గదా! 2896

క. ఋతమతి వేదవిధిజ్ఞుఁడు
హుతవహసత్కార్యచయనియుక్తుండు పురో
హితసుతుఁడు సకాలముననె
కృతకృత్యంబులను నీకు నెఱిఁగించుఁ గదా! 2897

క. దేవ పితృ మాతృ గురులున్
భూ విబుధులు పితృసమానపూజ్యులు వెజ్జుల్
నీవలన నిత్యశుభ సం
భావితు లగుచున్నవారె భరతకుమారా! 2898

క. ఘనశస్త్రాస్త్రబలోన్నతు
జనసుతునిన్ రాజనీతిశాస్త్రనిధానున్
ధనురాచార్యు సుధన్వుని
ననయుఁడవై యాదరించి సన్మానింతే! 2899

ఆ. ఆత్మసములు శూరు లర్థశాస్త్రాభిజ్ఞు
లింగితజ్ఞులును జితేంద్రియులును
మహితవంశజులు సమర్థులౌ మంత్రులఁ
జేర్చి మంత్రరక్ష సేయుచుంటె? 2900

గీ. తమ్ముఁడా! రాఘవా! భూమిధవుల కెందు
శాస్త్రవిదులును సన్మంత్రచతురులైన
ప్రగ్గడలచేత రక్షింపఁబడుచునుండు
మంత్రమే కద విజయ సమంచితంబు. 2901

క. లోలుఁడవుగాక నిద్రకు
వేళకె మేల్కని నిశీథవేళలనె రహ
స్యాలోచన మొనరింతువె
వాలాయము నీ యమాత్యవర్యులతోడన్. 2902

క. ఒక్కఁడవె నిశ్చయింపక
పెక్కురతో మంతనమును బెట్టక యెపుడున్
జక్కని మంత్రము వెలికిన్
బొక్కింపక రక్షణంబుఁ బొనరించెదవే. 2903

క. సులభ ప్రయత్న సాధ్యము
నలఘు ఫలాభ్యుదయ మగు మహాత్కార్యంబున్
జలుపుదుగద శీఘ్రంబుగ
విలంబనముచేసి యదను విడఁబోవుఁ గదా! 2904

క. నీ వొనరించిన సుకృతులఁ
గావించుచునున్న కృతులఁ గని సామంతుల్
భావమున మెత్తురేగద
భావికృతులు వారి కెఱుకపడకుండుఁ గదా! 2905

ఆ. యుక్తివలనఁ గాని యూహలచేఁ గాని
యెట్టి యింగితములనేని గాని
నీవు మంత్రివరులు నెఱపిన మంత్రంబు
వెలికి దోఁపకుండ నిలుపుదు గద! 2906

క. కేవల మూర్ఖజనంబుల
వేవురినైనఁ ద్యజించి విబుధు నొకని సం
భావించి యాదరింతువె
కోవిదుఁ డాపదల మేలుగూరుచును గదా! 2907

అ. విభుఁడు మూర్ఖజనుల వేలకు వేలుగా
సంగ్రహించుకంటెఁ జతురు శూరుఁ
బ్రాజ్ఞు దక్షు నొకనిఁ బ్రగ్గడగ వరించి
యభ్యుదయ సమృద్ధినందుఁ గాదె! 2908

క. క్రమభంగము సేయక తర
తమము లెఱిఁగి భృత్యజనులఁ దగు తెఱఁగున ను
త్తమ మధ్యమాధమము లగు
సముచిత కృత్యముల నిలిపి సాగింతు గదా! 2909

గీ. పితృపితామహాకుల సమాగతులు హితులు
శుచియుతులు స్వార్థవిరహితు లచలమతులు
నైన సచివుల ముఖ్యకార్యములయందు
నుచితరీతి నియోగించుచుందువు గద! 2910

క. అనుజా! కైకేయిసుతా!
జనదుస్సహములగు కఠినశాసనములు నీ
వొనరించునెడ నమాత్యులు
మనవులు నయగతులఁ దెలిపి మరలింత్రు గదా! 2911

గీ. పతిత యాజకునిం దూఱు ప్రజలయట్లు
బలిమిఁగొను కాముకుని దిట్టు పడఁతు లట్లు
భూజనంబులు నిన్నాడిపోయునట్లు
పెచ్చుపన్నులఁ గోశంబుఁ బెనుపవు గద! 2912

క. కపటోపాయుఁడు శూరుఁడు
నిపుణుఁడు ప్రభుభక్తభృత్యు నిందారతుఁడన్
విపులశ్రీకాముఁడు నగు
కృపణున్ వధియింప కున్న నృపుఁ జంపుఁ జుమీ! 2913

క. మతిమంతుని ధృతిమంతుని
నతిశూరుని సత్కులీను నమలు సుదక్షున్
హితుని గ్రహియించి సేనా
పతిగా నియమించుకొంటె పావనచరితా! 2914

గీ. ఆహవవిశారదులు శూరు లధికబలులు
ప్రముఖులు పరీక్షితులునైన సమర జయుల
సైనికదళంబులను జేర్చి సత్కరించి
యుచితగతి గౌరవించుచు నుంటివి గద. 2915

క. బలములకు న్నాయకులకుఁ
దళపతులకు నెపుడు గడువు దప్పకయుండన్
నెలజీతంబులు బత్తెం
బులు నందంజేసి వారిఁ బోషింతు గదా! 2916

ఆ. బత్తెములును భృతులె బ్రదుకైన సైనికుల్
తరియొకించుకంత దప్పె నేని
నధిపునెడలఁ గుపితులై దుష్టచిత్తులై
చెట్ట లెన్నియైనఁ జేయఁ గలరు? 2917

ఆ. సమరధీరులైన జ్ఞాతిసుపుత్రియుల్
నిన్నుఁ బ్రేమఁ గొల్చుచున్నవారె?
యదనులందు నర్థమైన మానంబైన
నుసురులైన నొసఁగ నున్నవారె? 2918

క. శ్రుతిమంతుని దేశీయునిఁ
బ్రతిభావంతుని సమర్థుఁ బండితుని యథో
చిత వాగ్విలసితు నీతున్
హితు దూతగఁ జేసికొంటివే కద భరతా! 2919

క. వినుతుల * యష్టాదశ తీ
ర్థములన్ భవదీయ పంచదశతీర్థములం
గ్రమగతి ప్రత్యేక రహ
స్యముగ వినెదె ముగురు ముగురు చారులవలనన్. 2920

క. ము న్నొకపరి నీ చేతం
బన్నముపడి మరల వచ్చుఁ బగతు నబలుగా
నెన్నక నాతనిపై నొక
కన్నుంచి పరిస్థితులను గనుచుందు గదా! 2921

క. లోకాయతిక బ్రాహ్మణ
లోకుల ప్రతిబోధములకు లోఁబడవు గదా!
లోకాపకృతుల న య్యవి
వేకులు గావింత్రు తామె విజ్ఞుల మనుచున్. 2922

గీ. కుమతులగువార లుత్తమోత్తమము లైన
ధర్మసమ్మతముఖ్యశాస్త్రముల వీడి
తర్కరాద్ధాంతముల బుద్ధి తగులుపఱచి
బోధ లొనరించుచుందురు పొల్లునుడుల. 2923

---

* అష్టాదశతీర్థములు: 1. మంత్రి, 2. పురోహితుఁడు, 3. యువరాజు. 4. సేనాపతి, 5. ద్వారపాలకులు, 6. జ్ఞాతులు, 7. కారాగారపతులు 8. కోశాధిపతి, 9. నియోగులు, 10. ప్రాడ్వివాకుఁడు, 11. సేనానాయకుఁడు, 12. నగరపాలుఁడు, 13. కర్మాంతికుఁడు, 14. సభాపతి, 15. ధర్మాధికారి, 16. దండపాలుఁడు, 17. దుర్గపాలుఁడు, 18. రాష్ట్రాంతపాలకుఁడు. మొదటి మువ్వురుగాక తక్కినవారు స్వతీర్థములు.

సీ. తరతరంబుల మన తండ్రితాతలచేతఁ
బరిపాలనముచేయఁ బడినదాని
హస్త్యశ్వ భటశతాంగాకీర్ణ మగు దాని
ఘనదృఢద్వారయుక్త మగుదాని
నిరత స్వధర్మ తత్పరులైన కుల చతు
ష్టయసంతతులచే నెసంగుదాని
విజితేంద్రియులు ప్రభవిష్ణులౌ నార్య స
హస్రాళిచే ధన్య మైనదాని

ఆ. బహువిధంబులైన ప్రాసాదములతోడ
విబుధగణముతోడ వెలయుదాని
హర్షవిభవధామ నన్వర్థనామ న
యోధ్య నెపుడుఁ బ్రోచుచుందువు గద! 2924

సీ. హయమేధముఖ శతాహవకృతక్షేత్రంబు
సన్నివిష్టప్రజాసంకులంబు
ఘనదేవగృహ తటాక ప్రపా కలితంబు
కాంచన నవరత్న ఖనియుతంబు
ననిశ సమాజోత్స వానందధామంబు
హర్షితస్త్రీ పురుషాన్వితంబు
సమధిక పశుగణ సస్యసంపన్నంబు
జీవ నదీజల పావనంబు

గీ. వన్యమృగ చోరబాధా వివర్జితంబు
పాపరహితంబు మనుముఖ్యపాలితంబు
నైన మన దేశ మెల్ల సుఖావహముగ
నిఖిలసంప త్సమృద్ధమై నెగడుఁ గాదె! 2925

క. భరతా! కృషిగోరక్షణ
నిరతులు వైశ్యవరు లెల్ల నీకుం బ్రియులే
వరలుదురు వార్త వలననె
శరణ్యులగు ప్రజలు సౌఖ్యసంపన్నిధులై. 2926

ఆ. అట్టి వైశ్యజనుల యభిమతంబులుదీర్చి
కష్టములఁ దొలంచి కాతువు గద!
రాష్ట్రజనుల నెల్ల రక్షింపఁ జనుఁగదా
యరసి నృపుఁడు ధర్మపరత నెపుడు. 2927

ఆ. అంతిపురపుసతుల ననురక్తి నలరించి
యుచితరీతి వారి నోముదు గద!
వారిమాటనమ్మి వారికి నీ మది
నున్నగుట్టు చెప్పకుందువు గద! 2928

క. ఏనుఁగులు పుట్టి పెరిగెడి
కానల రక్షింతుగాదె గజలబ్ధికి నాఁ
డేనుఁగులఁ జేర్చి యుంచితె
పూనికఁ గరితురగవృద్ధిఁ బొనరించెదవే? 2929

ఆ. కాలమునకె మేలుకని యలంకృతుఁడవై
గురుజనాళితోడఁ గొలువుదీర్చి
యనుదినంబు నిన్నుఁ గనవచ్చు ప్రజకు ద
ర్శన మొసంగుచుందె సమయమునకు. 2930

క. చన విచ్చిన లోఁకువయగుఁ
గనులం బడనీయకున్నఁ గడు భయమగుఁ గా
వున భృత్యుల కెడనెడ ద
ర్శన మిచ్చుచు వారి నిలుపఁ జను ప్రభుఁ డాజ్ఞన్. 2931

ఆ. అఖిల దుర్గములు ధనాయుధ ధాన్యోద
కములతోడ శిల్పకరులతోడ
వీరభటులతోడ వివిధయంత్రములతో
నిండి రక్షణమున నుండును గద! 2932

క. నీ కోశంబున నాయము
సాకల్యముకాదె వ్యయము స్వల్పంబె కదా!
యే కడ నపాత్రదానము
గాకుండఁగఁ జూచుకొందుగద నీ ధనమున్. 2933

క. దేవ పితృదేవ ధరణీ
దేవాభ్యాగత సుహృత్సుధీనిధులకు యో
ధావళికి నీ ధనంబునఁ
గావింతువె వ్యయము తృప్తి గదురగ వత్సా! 2934

గీ. చోరుఁడని నేరమును మోపి సుమతి శుచినిఁ
గేవలార్యుని రచ్చ కెక్కించినపుడు
శిష్టధర్మవిధిన్ బరీక్షింపకుండఁ
గృపణవృత్తి వహించి శిక్షింపవు గద! 2935

ఆ. సాక్షు లున్నయపుడు స్వయముగా వేళకే
దొంగ సొత్తుతోనె దొరకినపుడు
ధన విలోభవశత దండింపకుండ నీ
వట్టివాని విడిచిపెట్టవు గద! 2936

క. సునిపుణులగు నీ మంత్రులు
ధనికునకు దరిద్రునకును దగ వగు నెడలన్
ధనికుని కిష్టము పేదకు
ఘననష్టము గూర్పఁబోరుగద లోభమునన్. 2937

ఆ. తప్పుసేయకుండ దండింపఁ బడిన ని
ష్కలుషచరితు వేడికంటినీరు
ప్రభుని సంతతులను బతుసంపదను గూడ
నీఱుసేయకుండ నిలువ దంద్రడు. 2938

క. బాలుర వృద్ధుల విద్యా
శాలుల ధన కనక వస్తుచయదానములన్
దేలించుచు నాదరమునఁ
బాలింతువె సుప్రసన్న భావముతోడన్? 2939

క. గురులఁ దపస్వుల వృద్ధుల
ధరణీసురవరుల దైవతముల నతిథులన్
బురచైత్యతరుల నెప్పుడుఁ
బరమం బగు భక్తియుక్తి భజియించెదవే! 2940

క. ధనమునకై ధర్మంబును
ధనమును ధర్మంబుకొఱకుఁ దనకుం బ్రియమౌ
ఘనతరకామేచ్ఛకునై
ధనధర్మంబులను జెఱుపఁ దగదు కుమారా! 2941

గీ. వరదుఁడగు నీవు సతముఁ ద్రివర్గములను
వేఱువేఱుగ విభజించి వేళ లెఱిఁగి
సార్థకంబుగ నా పురుషార్థములను
విజయశీలుండ వగుచు సేవించుచుండె? 2942

గీ. అఖిలశాస్త్రార్థవేదులౌ యవనిసురులుఁ
బౌరులును జానపదులును భక్తియుక్తిఁ
బ్రాజ్ఞశేఖరుఁడవు ధర్మపరుఁడ వైన
నీ శుభంబును గోరుచుండెదరు గాదె? 2943

సీ. అలసభావంబు దీర్ఘాలోచనము చేత
చిరకోపయుక్తి నాస్తిక్యబుద్ధి
యభ్యుదయక్రియానాచరణంబు ప్ర
మాద మజ్ఞులతోడ మంతనంబు
నింద్రియచాపల్య మేకచింతనము ను
త్తమజనంబులకు నదర్శనంబు
సర్వశక్తుల నొక్కసారిగా మార్కొంటు
నిశ్చితకార్యంబు నెఱపకుంటు

ఆ. మంత్రరక్షణంబు మఱచుట యనృతంబు
నాగ నెగడు పదియు నాల్గు రాజ
దోషముల నొకండు దొరయంగ నీయక
ప్రభుత నెఱపుచుండె భద్రగతిని? 2944

సీ. దశ పంచ వర్గ విద్యాత్రయమ్ములఁ జతు
స్సప్తవింశతివర్గ సద్గుణముల
నష్టవర్గ త్రివర్గాఖిలేంద్రియ జయో
పాయమ్ములను దైవపౌరుషముల
విద్యాత్రితయ సంధివిగ్రహమ్ములను యా
త్రాదండ ముఖ్యవిధానములను
కారణద్వయ దైవపౌరుషద్వయములఁ
బ్రకృతిమండల భేదపద్ధతులను

గీ. స్వయముగ నెఱింగి వానితత్త్వము గ్రహించి
సమయముం బట్టి తత్ప్రయోజనముఁ బట్టి
యుచితగతి నుపయోగించుచుంటివి గద!
రాజ్యసంరక్షణమునకై రఘుకుమార! 2945

క. నలుగురో ముగురో సచివులఁ
గలసియొ ప్రత్యేకముగ నొకండవు గానో
సలుపుదె మంత్రాలోచన
ముల శాస్త్రోద్దిష్టమార్గమును విడకుండన్. 2946

క. నీ వేదాధ్యయనంబును
నీ విభవప్రాభవములు నీ ప్రియసతులన్
నీ విబుధగోష్ఠియును నివి
నీ వలనన్ సఫలగతుల నెగడుం గాదే. 2947

గీ. సంతతాయుష్కరంబు యశస్కరంబు
ధర్మకామార్థకలితంబు శర్మదంబు
మదుపదిష్టంబు నైన యీ మహిపనీతి
ననుసరించుచునుంటె నిత్యంబు వత్స! 2948

ఆ. తండ్రి దశరథుండుఁ దాత ముత్తాతలు
నే నయప్రవృత్తిఁ బూనినారొ?
యట్టి భద్రవృత్తి ననుసరింతువె నీవు
రాజ్యపాలనమున రఘుకుమార! 2949

క. పరమాన్నభక్ష్యముల నొ
క్కరుఁడవె సేవింప కుందుగద! యే వేళన్
బరమాప్తబంధుజనములఁ
బురస్కృతులఁ జేసి తృప్తిఁ బొందింతు గదా! 2950

క. మతియుతుఁడుఁ బ్రాజ్ఞుఁడగు నర
పతి ధర్మాత్ముఁడయి ప్రజలఁ బాలించిన నీ
క్షితి కెల్లఁ బ్రభుండై శా
శ్వతముగఁ బరమందు స్వర్గసౌఖ్యము లందున్." 2951

# 101-వ సర్గము

ఆ. అనుచు బోధచేసి యా రామచంద్రుఁడు
భ్రాతృవత్సలుఁడని భరతు నెఱిఁగి
సంతసించి యంత సౌమిత్రియుం దాను
గలసి యతనిఁగూర్చి పలికె రట్లు. 2952

క. అన విని భరతుఁడు "గత ధ
ర్మునికి న్నాకేటి కిట్టి బోధనములు? జ్యే
ష్ఠుని వీడి మన కులంబునఁ
గనిష్ఠుఁ డెపుడైన రాజుగా నున్నాఁడే? 2953

గీ. సకలసంపన్న మగు నయోధ్యకును మరలి
రమ్ము నా వెంటఁ గరుణించి రఘువరేణ్య!
ఘన సనాతన ధర్మపాలన మొనర్చి
కులము వెలయఁ బట్టాభిషిక్తుండ వగుము. 2954

క. నరుఁ డనుకొందురు కొందఱు
ధరణీశుని, నేను ప్రభుఁడె దైవం బందున్;
బరమార్థధర్మయుత నృప
చరితము దివ్యం బమానుషం బగుఁ గాదే! 2955

గీ. అన్న! కేకయనగరి నే నున్నయపుడె
జానకిని నిన్ను లక్ష్మణుఁ గాన కంపి
సాధుహితుఁడు మహేంద్రుండు సవనకర్త
మన పిత దివంబునకు సేగె వనరి వనరి. 2956

క. అనఘాత్మ! లెమ్ము నీ వీక
జనకునకుఁ దిలోదకము లొసంగఁగ వలయున్
మన శత్రుఘ్నునితో నే
నొనరించితి మున్నె పితకు నూర్ధ్వక్రియలన్. 2957

గీ. ప్రియసుతుఁడు సేయు సత్క్రియల్ పితృజగమునఁ
దండ్రి కక్షయ ఫల మిదు సండ్రు బుధులు
పితకు నీ యెడ నెంతయో ప్రేమగాన
నతఁడు నీ చేఁతకే తృప్తి నందఁగలఁడు. 2958

క. జనకుఁడు నీ విరహార్తిఁ
నిను గూరిచి దుఃఖపడుచు నినుఁ గన్నారం
గనఁ గోరుచు నీ మాటలు
వినఁ గోరి స్మరించుకొనుచు విడిచెన్ దనువున్" 2959

# 102-వ సర్గము

చ. అని భరతుండు తెల్పిన మహాశనిపాతమువంటి దుఃఖ వా
ర్తను విని తండ్రిఁ బేర్కొని గతస్పృహుఁడై కరముల్ మొగిడ్చి పె
న్వనటఁ గలంగి రాముఁ డిల వ్రాలెఁ దటాలున వాడిగొడ్డటన్
దునిఁగిన పుష్పితద్రుమము దూలుచు నేలనుగూలు పోలికన్ 2960

ఉ. కూలము గ్రొచ్చి శ్రాంతిఁబడి సూరుకుఁజెందు గజేంద్ర మట్లు దుః
ఖాలసచిత్తుఁడై పడినయట్టి మహామహునిన్ మహామహీ
పాలకు రామభద్రుఁ గని భ్రాతలు సీతయు నార్తిఁ గుందుచున్
వైళమ మూర్ఛ దేర్చుట కొనర్చిరి శీతలవారిసేచనల్. 2961

ఆ. అంతలోన తెలివి నంది రామవిభుండు
తండ్రి ధరణినాథుఁ దలఁచి కొనుచు
ననుజు భరతుఁ గాంచి కనుల నశ్రుల నించి
పరమధర్మ మెంచి పలికె నిట్లు. 2962

ఆ. దైవవశతఁ జేసి దశరథేంద్రుఁడు మన
తండ్రి స్వర్గమునకుఁ దరలిపోయె
నట్టి ప్రభుఁడు విడిన యా యయోధ్యారాజ్య
మేల దగిన యాతఁ డెవ్వఁ డింక? 2963

ఆ. నన్నె తలఁచుకొనుచు నా తండ్రి మరణించెఁ
జెంతనుండి విధులు చేయనైతి
నెంతపాపజాతి నే నైతి నకట! నా
వలన నతని కేమి ఫలము గలిగె? 2964

గీ. భరత! శత్రుఘ్నుతో నీవు ధరణిపతికి
జనకునకుఁ బ్రేతసత్కృతుల్ జరుపుకతనఁ
బుత్త్రనామంబు సార్థకంబుగ నొనర్చి
యనఘుఁ డవును సిద్ధార్థుఁడ వైతి వోయి! 2965

గీ. అధ్యుఁ డెవ్వఁడు లేక చింతాకులయయి
యుర్విధవుఁ బాసి యున్న యయోధ్య కింక
వని నివాసాజ్ఞఁ దీర్చినవెనుక నైన
నే మనుచు వచ్చుటకు నుత్సహింపఁ గలను? 2966

క. అరిదమన! భరత! జనకుఁడు
పరమపదముఁ జేరె; నడవి పదునాల్గేండ్లున్
జరపి యయోధ్యకు వచ్చిన
బెరిమన్ నను నాదరించు పెద్ద లెవ రికన్? 2967

క. మును నా నడవడిఁ గనుఁగొని
జనకుఁడు సంతోషపడుచు శ్రవణసుఖముగా
నను మెచ్చి పలుకు పలుకులు
వినతుఁడనై యెవరివలన వినఁ గల నింకన్?" 2968

ఆ. అట్లు వగచి వగచి "హా సీత! నీ మామ
దశరథుండు కాలవశత నందె
నయ్యలేనివాఁడ వైతివి లక్ష్మణా!"
యనుచు రామచంద్రుఁ డంగలార్చె. 2969

ఆ. అగ్రజన్ముఁ డిట్టు లార్తిఁ గుందుచునుండఁ
గనులనీరు గ్రమ్మ ననుజవరులు
భ్రాత రాముఁ గాంచి "పరలోకసత్క్రియల్
జనకునకు నొనర్పు" మని వచింప. 2970

ఆ. అట్టి దుఃఖవార్త లాలించి జానకి
యధికదుఃఖకర్శితాత్మ యగుచు
నశ్రువారిపూర మక్షులు నిండంగ
నరయఁ జాలదయ్యె నాత్మవిభుని. 2971

ఆ. వనటఁ గుందుచున్న వైదేహిఁ గనుఁగొని
యుచితభాషణముల నూఱడించి
తండ్రిఁ గూర్చి యడలు తమ్ము లక్ష్మణుతోడ
నెలుఁగు సెదర రాముఁ డిట్టు లనియె. 2972

గీ. "తమ్ముఁడా! వేగ నుత్తరీయమ్ముతోడ
నింగుదీపిష్టమును దెచ్చి యిమ్ము నాకు;
స్వర్గమందును బూజ్యుఁడౌ జనకునకును
సలిలసత్క్రియల్ దీర్పఁ బోవలయు నిపుడు. 2973

క. చనుఁగాక సీత మున్నుగ
ననుజా! నీ వామెవెంట నరుగుము; నేనుఁ
వెనుకనె వచ్చెద నెంతటి
ఘనదారుణశోకదుఃఖగతి ప్రాప్తించెన్." 2974

మ. అని శోకింపఁగ రామభద్రుఁడు ప్రబుద్ధాత్ముండు వంశాను వ
ర్తనుఁడుఁ ధీనిధి శాంతమూర్తి నిశితప్రజ్ఞుండు దాంతుండు న
త్యనఘుండైన సుమంత్రుఁ డుమ్మలికతో నా రాఘవుఁ దేర్చి కే
ల్గొని మందాకిని పుణ్యతీర్థమునకుఁ గొంపోయె భద్రంబుగన్.

మ. అతికష్టంబున రాఘవుం డనుజుతో నర్థాంగితోఁ బార్శ్వ పు
ష్పితకాంతారము శుభ్రనీరము జవోపేత ప్రసాదంబు దు
ర్గతినిస్తారమునైన య న్నదిని మున్కల్ వెట్టి విధ్యుక్తి భూ
పతికిన్ భక్తి జలాంజలుల్ విడిచె నిష్పంకోపతీరంబునన్. 2976

క. విలపించుచు రాఘవుఁ డటు
సలిలాంజలు లొసఁగెఁ బితకు శమనుని దెసగా
నిలిచి పిత్రులోకమున నీ
జల మక్షయ మగునుగాక జనకా" యనుచున్. 2977

గీ. అంత మందాకినీతీర మధిగమించి
భ్రాతృసహితుఁడై రాముండు భక్తియుక్తి
గారపొడి రేగుపండ్లను గలిపినట్టి
పిండముల దర్భలం దుంచి పితఁ దలంచి. 2978

క. వనటం గుందుచు రాముఁడు
"జనకా! దీనిని గ్రహింపఁ జను నీ కెలమిన్;
దన కొదవిన యాహారమె
తన దేవత లారగింపఁ దగు దయతోడన్. 2979

ఆ. అనుచుఁ బిండదాన మట్లు తండ్రి కొనర్చి
జనవరుండు రామచంద్రమూర్తి
యా నదీతటంబు నల్లనఁ దరియించి
శైల మెక్కి పర్ణశాలఁ జేరి. 2980

ఆ. ప్రభుఁడు రాఘవుండు భరతలక్ష్మణులను
బట్టి కౌఁగిలించి వనవుచుండ
సీత శోకరవము భ్రాతల దుఃఖార్త
రవము గిరిగుహాళిఁ బ్రతిరవించె. 2981

క. దూరమున నుండి సైనికు
లా రోదన మాలకించి యగ్రజు కడకున్
జేరి భరతుండు పిత స్వ
ర్గారోహణవార్త వినిచె నని యెంచి రెదన్. 2982

క. సరగున శిబిరంబుల విడి
వర రథ కరి తురగ ముఖ్యవాహనములపై
భరతు బలంబులు సూటిగఁ
దరలి చనియె రామచంద్రదర్శనవాంఛన్.  2983

క. నరనాథుఁడు రాముఁడు వని
కరిగిన కాలంబు స్వల్పమైనం గానీ
చిరకాలముగా వగచుచుఁ
బరుగునఁ జని రతనిఁజూడ బ్రజ లుత్కంఠన్. 2984

క. అ న్నెలవున నటు గలిసిన
యన్నాదమ్ములను గాంచు నభిలాషముతోఁ
బన్నిన వాహనములపైఁ
గ్రన్ననవా రరిగి రవని గ్రక్కదలంగన్. 2985

ఆ. తురగ గజ శతాంగ ఖురనేమిఘట్టన
నపుడు తుములఘోష మవనిఁ దోఁచె
ఘనసమాగమాబ్ద గర్జారవంబుల
ఘోష మింట బోరుకొన్న యట్లు. 2986

ఆ. ఆ విరావమునకు నదలి య వ్వనినున్న
కరులు గరిణు లెల్లఁ బరుగువారె
వ్యాఘ్ర మహిష సర్పవానర వృకముఖ్య
జీవసమితియెల్లఁ జెదరిపోయె. 2987

క. కారండవములు హంసలు
సారంగ క్రౌంచములును జక్రపికము ల
య్యారవమును విని యులుకుచుఁ
బాఱెం దిక్కులనుబట్టి పరిపరిగతులన్. 2988

ఆ. అట్లు పరుగువారు నండజంబులతోడ
నింగి యెల్ల నపుడు నిండిపోయె;
ప్రభుని రాముఁజూడఁ బఱచుసైనికులతో
విపినభూమి వెల్లివిరిసిపోయె. 2989

ఆ. బలము లట్టు లేగి బరినేలఁ గూర్చున్న
యరివిరాము రాము నట్టెచూచి
కుటిలకైక దూఱి కుబ్జను దిట్టుచుఁ
బెగడి కనులనీరు పెట్టుకొనిరి. 2990

క. ఖిన్నతఁ గన్నీ రొలికెడు
న న్నరులం గాంచి రాముఁ డార్ద్రహృదయుఁడై
క్రన్ననఁ జని యాదరమునఁ
గన్న పితరులట్లు వారిఁ గౌఁగిటఁ జేర్చెన్. 2991

క. కొందఱి నాశ్లేషించుచుఁ
గొందఱు ప్రణమిల్లఁ బ్రీతి గొలుపుచు నపు డ
య్యందఱు హితబంధుల నభి
నందించెన్ రాముఁ డుచిత నయవర్తనలన్. 2992

ఆ. అప్పు డ మ్మహాత్ములైన రామాదుల
విపులశోకరవము వెల్లివిరిసి
ధరణిగిరుల దరుల దశదిశాంతరముల
మర్దళారవంబుమాడ్కి మొరసె. 2993

# 103-వ సర్గము

ఆ. అపుడు దశరథేంద్రు సతివల నెల్లర
వెంటఁగొని వసిష్ఠవిబుధవరుఁడు
విభుని రామచంద్రు వీక్షించు వేడ్కతోఁ
బర్ణశాలఁ గూర్చి పయన మయ్యె. 2994

ఆ. మందగమన లగుచు మందాకినీతీర
మార్గముననె వచ్చి మహిపమహిషు
లనిశ రామలక్ష్మణాభిషేచనపాన
సేవ్యఘట్టమునకుఁ జేరుకొనిరి. 2995

క. ఆ రేవు గాంచినంతనె
శ్రీరామునిమాత దుఃఖచింతాకులయై
నో రెండఁగ నిరుగన్నుల
నీ రొలుకఁగ నిట్లు తోడినెలఁతల కనియెన్. 2996

ఆ. దిక్కుమాలినట్లు దేశంబువీడి య
క్లిష్టకర్ము లయ్యుఁ గ్లేశపడుచు
మెలఁగు రామలక్ష్మణులకు నివ్వెసఁ దాన
మాడు తీర్థమిదిగో! చూడరమ్మ! 2997

క. నా కొడుకు రాఘవునికై
నీ కొడు కేమరకయుండ నిత్యము నీ మం
దాకిని జలముల నియ్యెడ
నే కొని చనుచుండు నంచు నెంతు సుమిత్రా! 2998

క. నీ కొమరుఁ డన్నకొఱకై
రాకొమరుం డయ్యుఁ జేయరాని పనులకై
మైకొనియె నక్కటా! యని
శోకింపకు గురులసేవ సుకృతమె కాదే! 2999

క. అనిశ సుఖోచితుఁ డగు నీ
తనుజన్ముఁడు లక్ష్మణుండు తన కొదవిన యీ
యనుచితకృత్యములన్ విడి
ఘనతరసౌఖ్యములఁ గాంచుగా కిఁక మీఁదన్ !" 3000

ఆ. అనుచు నపుడు కోసలాత్మజ యా దరి
దక్షిణాగ్రములగు దర్భలందుఁ
బెట్టియున్న గారపిండి పిండంబుల
నట్టెచూచి విహ్వలాత్మ యగుచు. 3001

క. వనటున్ రాఘవుఁ డవి తన
జనకునకున్ భక్తియుక్తి శాస్త్రోక్తముగా
నునిచిన పిండము లని నె
మ్మనమున గ్రహియించి తోడిమహిషుల కనియెన్. 3002

క. "శ్రీమహితేక్ష్వాకుకుల
స్వామికిఁ బూజ్యునకుఁ బితకు జగతీపతికిన్
రాముం డొసఁగిన పిండము
లీ మహిఁ బడియుండెఁ గంటిరే యిటు వీనిన్. 3003

క. దేవసముండు మహాత్ముఁడు
భూవల్లభుఁ డఖిలభాగ్యభోగోన్నతుఁడౌ
శ్రీవిభున కా నివేదన
మే విధమునఁ దగ దటంచు నే నెంతు మదిన్. 3004

గీ. చతు రుదధివేష్టితాఖిల క్ష్మావిభునకు
నయ్యఁ కర్పింపఁ దగిన రాజాన్నమె యిది ?
విభుని పితృసత్క్రియలఁ దీర్చు వెరవు లేక
యకట ! యెంతటి నిర్భాగ్యుఁ డయ్యె కొడుకు? 3005

గీ. గారపిండితోనె శ్రీరామచంద్రుండు
తండ్రి కిడిన పిండదాన మిట్టు
లరసియైన దుఃఖహార్తిఁ జేసి నా గుండె
వేయివ్రక్క లగుచు వ్రీల దేమి? 3006

క. మనుజుఁడు భుజించు నదె యా
తని దేవతలకును గూడఁ దగు నను శ్రుతి నా
కనుభవ మగుచున్నది పా
వనమును సత్యంబు హితము వాస్తవ మగుచున్." 3007

ఆ. అనుచు వనటఁ గుందు నా రామజనయిత్రి
నాశ్వసించి రాణు లామెఁ గూడి
యరిగి భూతలమున కవతరించిన దివ్య
మూర్తిఁ బోలు రామమూర్తిఁ గనిరి. 3008

గీ. అఖిలసామ్రాజ్యభోగభాగ్యముల వీడి
దీనుఁడై వనమందున్న సూనుఁ గాంచి
కనుల దుఃఖాశ్రుధారలు దొనలువార
గొల్లుమని యేడ్చి రెలుఁగెత్తి తల్లు లెల్ల. 3009

క. జననులను గాంచినంతనె
జనవల్లభుఁడైన రామచంద్రవిభుఁడు ది
గ్గన లేచి వారి శ్రీపద
వనజంబుల వ్రాలి భక్తి వందనము లిడెన్. 3010

ఆ. కనులఁ దుడుచుకొనుచుఁ గరపల్లవంబులఁ
దనయు రాము వెన్నుదట్టి నిమిరి
ధూళి దులిపి ప్రేమ దొలుకాడ మృదుసుఖ
స్పర్శ దేర్చి రతని జనను లెల్ల. 3011

క. రామవిభుని వెనువెంటనె
సౌమిత్రియు వగలుమిగుల జనముల విమల
ప్రేమమయపదము లంటి ప్ర
ణామంబుల నాచరించె నమ్రుం డగుచున్. 3012

గీ. రాణు లెల్లరు నపుడు శ్రీరామునట్లె
లక్ష్మణుని శుభలక్షణలక్షితాంగు
దాశరథిని గులాచారధర్మనిధిని
గారవించిరి కన్నులనీరు దుడిచి. 3013

క. అత్తటి సీతయు శోకో
ద్వృత్తిం గన్నీరు వెల్లివిరియంగా నా
యత్తలకు మ్రొక్కి వారలఁ
జిత్తములకు జాలిగదురఁ జెంతన్ నిలువన్. 3014

క. తనకోడలి దుఃఖార్తన్
వనవాసకృశాంగి దీనవదనన్ సీతన్
జనని సుతఁ బోలి యాలిం
గన మొనరిచి యిట్టు లనియె గౌసల్య దగన్. 3015

క. "జనకనృపతనయ జననా
థుని కోడలు సదమలచరితుం డగు శ్రీరా
ముని భార్యయైన నీ కీ
వనవాసక్లేశ మొంద వలసెనె సీతా! 3016

సీ. నడిమింటిప్రొద్దున మడుగునీటినిఁ బాసి
పొగిలెడు నెత్తమ్మిపూవులాగు
మిడియెండతాకున నుడుకారుకొలనిలో
పలఁ బల్లటిల్లు చెంగలువమాడ్కిఁ

గనటున నిలువెల్ల మసకలు గ్రమ్మంగఁ
బనదూలు నపరంజిపలకపగిది
కారుమబ్బులతెర కనుకట్టు గావింప
మాసిన నెఱచందమామరీతి

గీ. విన్ననై వసివాళ్వాడి వన్నెవాసి
కళదొఱంగిన నీ నెమ్మొగంబుఁ గన్న
నాశ్రయమె బుగ్గిగాఁ జేయు నగ్గిఁ బోలి
నన్ను దుఃఖంబు దహియించుచున్న దమ్మ!" 3017

క. అని యిట్లు కోసలాత్మజ
పనవుచు వాపోవుచుండ భరతాగ్రజుఁడౌ
ననఘుఁడు రాముఁడు చని తన
జననికి వందన మొనర్చె సద్భక్తిమెయిన్. 3018

క. సురవరుఁడు గురుని కెరఁగిన
సరణిన్ రఘువర్యుఁ డనలసదృశప్రభుఁడౌ
గురుఁడు వసిష్ఠుని పదపం
కరుహంబుల కెఱఁగి యతనికడఁ గూర్చుండెన్. 3019

క. తరువాత ధర్మనిరతుఁడు
భరతుఁడు ప్రెగ్గడలు సైన్యపతులు పురవరుల్
పరివేష్టింపఁగ జని సు
స్థిరమతిఁ దన యన్నసన్నిధిన్ వసియించెన్. 3020

ఆ. మౌనివేషుఁ డయ్యు మహితతేజుండైన
భ్రాత రాముచెంత భరతుఁ డంతఁ
గొలిచి యుండె నభిముఖుండయి కేల్మోడ్చి
వనజభవుని మ్రోల వజ్రిఁ బోలి. 3021

క. అనఘుఁడు భరతుం డన్నకు
వినతుండై యేమి విన్నవించునో యిఁక నం
చనితర చిత్తమున సభా
జన మప్పుడు వేచియుండె సముచితభంగిన్. 3022

క. ఋతమతి రాముఁడును మహా
మతియగు లక్ష్మణుఁడు ధర్మమతి భరతుండున్
హితవేష్టితులై మెఱసిరి
క్రతుసభ వహ్నిత్రయంబు కైవడి నచటన్. 3023

## 104-వ సర్గము

ఆ. అపుడు రామచంద్రు డంతరంగంబున
భ్రాతృవత్సలుఁ డని భరతు నెఱిఁగి
సంతసంబుతోడ సౌమిత్రియుం దాను
గలసి యతనిగూర్చి పలికె రిట్లు. 3024

క. "అనుజా! భరతా! నీ విటు
మునివేషముతోడ రాజ్యమును విడి వనికిన్
జనుదేరఁగఁ బనియేమో
వినఁ దలఁతు సవిస్తరముగ వినిపింపఁ దగున్." 3025

క. అని రాముఁడు ప్రశ్నింపగ
ననుజుఁడు భరతుండు వినతుఁడై సాంజలియై
తనవచ్చిన కార్యంబును
వినుపింపఁ దొడంగె నిట్లు విస్పష్టముగన్. 3026

ఆ. "ఆర్యవర్య! నిన్ను నడవికిఁ బంపించి
ప్రియకుమారవిరహపీడితుఁ డయి
తండ్రి దశరథుండు తపియించి తపియించి
చనియెఁ దనువు వీడి స్వర్గమునకు. 3027

క. అరిదమన! రామ! దశరథ
నరపతి మాయమ్మ ప్రేరణన్ మతిచెడి మీ
దరయక దుష్కృతి నొనరిచి
ధర నపయశ మందె యాతఁడుదానికి వశుఁడై. 3028

గీ. అంతసేసినయట్టి మా యమ్మ కైక
రాజ్యఫల మందఁగా లేక పూజ్యుఁడైన
విభుని ధరణీవిభుని వీడి విధవ యగుచు
నార్తిఁ బడి చెడి నిరయంబు నందుఁగాక! 3029

ఆ. ఆ నికృష్టచరిత కాత్మజుఁడైన నీ
దాసుఁడైన నన్ను దయ దలంచి
యవని కెల్ల నిపుడె యభిషిక్తుఁడవు గమ్ము
మఘవుఁబోలి రామ! యఘవిరామ! 3030

క. జననాయక! యీ మంత్రులు
ననాథలగు మాత లెల్ల నఖిలప్రజలున్
నిను నాశ్రయింప వచ్చిరి
మన మలరఁగ వీరికోర్కి మన్నింపఁ దగున్. 3031

గీ. అన్వయానుక్రమంబున నగ్రజుండ
వైన నీ వందఁ దగిన యీ యవనిరాజ్య
మఖిలధర్మజ్ఞుఁడైన నీ వధిగమించి
హితముగూర్పు మాశ్రితసుహృత్తతుల కెల్ల. 3032

క. రాజేంద్రుఁడ వగు నీచే
నీ జగతి సనాథ యగుచు నెసఁగుం గాతన్
రాజేందువికాసముచే
రాజిల్లెడు శారదీయరజని విధమునన్. 3033

ప్రగ్గడలను గూడి ప్రార్థింతు నీపాద
సరసిజముల కెఱఁగి శిరము వంచి
తమ్ము శిష్యుఁ బాదదాసు నన్ గరుణించి
చింతితార్థసిద్ధిఁ జేయుము ప్రభు ! 3034

పురుషోత్తమ ! మన పూర్వులుఁ
బరంపరగఁ గొలిచి వచ్చు ప్రకృతులపలుకుల్
పరిపాటించి వినందగుఁ
దిరస్కరణసేయఁ దగదు ధీరవిచారా !" 3035

అని యీగతిఁ బ్రార్థించుచు
ఘనభుజుఁ డగు కైకసుతుఁడు కన్నుల నశ్రుల్
దొనఁకాడ రామవిభుపద
వనజంబుల మరల వ్రాలి వందనము లిడెన్. 3036

మదగజంబుఁ బోలి మాటిమాటికిని ని
ట్టూర్పు లెగయ రోఁజుచున్నవాని
భరతు ననుగుఁదమ్ముఁ బట్టి కౌఁగిటఁ జేర్చి
యనునయమున రాముఁ డనియె నిట్లు. 3037

"అనఘవ్రతుఁడు కులీనుం
డనుపమ సత్త్వుండు విక్రమాదిత్యుండౌ
నినువంటి పురుషుఁ డఘముం
బొనరించునె తుచ్ఛరాజ్యమునకై యనుజా ! 3038

అరిసూదన ! నీ యెడలన్
బొరయంగాఁ బోవ దఘము బూనంతైనన్;
మరియాదగాదు బాలుని
కరణి జనని నిట్టు లీ వగౌరవపఱుపన్. 3039

క. నెఱపుము పితరుల యానతి
భరతా! నీ వనఘుఁడవును బ్రాజ్ఞుఁడ వగుటన్
గురుజనుల కిచ్చవచ్చిన
సరణి సతీసుతుల కాజ్ఞసలుపఁ దగుఁ గదా! 3040

క. పితరులకు సుతులు; పతులకు
సతులున్; గురులకును శిష్యసంతానము నీ
క్షితి నెట్లో యట్లె మన మను
మతితో గురుజనులయాజ్ఞ మన్నింపఁ దగున్. 3041

ఆ. వల్కలంబు లిచ్చి వని కంపుటకు నైన
వసనభూషణాదు లొసఁగి నన్ను
నవని నేలు మనుట కైనను దశరథ
జనవిభుండె ధర్మశాసకుండు. 3042

క. వరధర్మవేది వగు నో
భరతా! ధర్మజ్ఞుఁడైన ప్రభు జనకునెడన్
గురుభావ ముంచినట్టులె
పరమం బగు భక్తి జనని భజియింపఁ దగున్. 3043

ఆ. అట్టి ధర్మశీలు రగు తల్లిదండ్రులు
వనికిఁ జనుము రాఘవా! యటంచు
నానతీయ శిరమునందుఁ దాలిచి వచ్చి
యన్యథాకరింప నగునె నాకు? 3044

ఆ. ఏలఁ దగును రాజ్య మీ వయోధ్య వసించి
సకలసాధులోకసమ్మతముగ;
తల్లిదండ్రియాజ్ఞఁ దలదాల్చి నేనును
వల్కలములఁ గట్టి వని వసింతు. 3045

క. లోక మెఱుఁగ నిటు నీకుఁ
నాకు విభాగించి శాసనముఁజేసి ధరి
త్రీకాంతుఁడు జనకుఁడు సు
శ్లోకుఁడు వేంచేసె నాకలోకంబునకుఁ. 3046

క. లోకగురుఁడు ధర్మాత్ముఁడు
భూకాంతుఁడు తండ్రి నీకుఁ బూజ్యుం డగుటఁ
జేకొనుము విధిగ నాతఁడు
నీ కొసఁగిన భాగ మిపు డనింద్యచరిత్రా! 3047

ఆ. ఆ మహాత్ముజనకు నానతిఁ బాలింప
నేను బదియు నాలుగేండ్లదాఁక
దండకావనమునఁ దపసినై పితృదత్త
మైనభాగ మంది యనుభవింతు.” 3048

## 105-వ సర్గము

ఆ. అట్లు పురుషసింహు లగు రాఘవులు సుహృ
జ్జనముతోడ సచివసమితితోడఁ
జేరి ధర్మపరతఁ జింతించుచుండంగఁ
గష్టముగను రాత్రి గడచిపోయె. 3049

ఆ. ఆ ప్రభాతవేళ నందఱు నరిగి మం
దాకినీస్రవంతిఁ దానమాడి
వార్చివేల్చి మరలవచ్చి కూర్చుండిరి
పర్ణశాల రామభద్రుఁ గూడి. 3050

క. కిమ్మనక యెల్లరును మౌ
నమ్మును వహియించి యుండ నమ్రుం డగుచుఁ
దమ్ముఁడు భరతుఁడు గడు విన
యమ్మున నన్నఁ గని యిట్టు లనె నయసూక్తిఁ. 3051

ఆ. "అస్మదీయజనని యభిమతంబును దీర్ప
నాకు రాజ్య మిచ్చినావు నీవు;
దాసుఁడైన నేను దాని నీ కర్పింతు
నెదురులేక రామ! యేలుకొనుము. 3052

ఆ. వార్షికాపగా ప్రవాహవేగ చ్యుత
కూల మాఁ కగొనఁగఁ జాలనట్టు
లీ యనంతరాజ్య మీ యెడ భరియించి
యేలఁ జాలఁ డన్యుఁ డీవు దక్క. 3053

ఆ. తురగగతినిఁ జనఁగ ఖర మోపలేనట్లు
గరుడజవము కాకి గాంచనట్లు
క్ష్మాతలేంద్ర! నీకుఁ గల మహత్తరశక్తి
నేను బడయఁజాల నించుకైన. 3054

గీ. ఎప్పు డొరులకు నాశ్రయ మిడెడు ధన్యు
జీవితంబె సర్వోత్తమ జీవితంబు;
దినదినంబుఁ బరాశ్రయంబుననె గడపు
భాగ్యహీనుని దీనుని బ్రదుకు బ్రదుకె? 3055

చ. పురుషుఁడు నాటు ప్రోదిగనుమొల్క క్రమోన్నతి ప్రాను గట్టి వి
స్తరమయి గుజ్జులెక్కుటకు సాధ్యముగాని మహాగమై విరుల
విరివిగఁ బూచియుఁ దుది ఫలింపనియట్లుగు భర్తవయ్యు రా
జ్యరమ గ్రహించి యాశ్రితజనావళి నీ విపు డేలకుండినన్. 3056

ఆ. అరి విరామ! రామ! యవనినాథుఁడ వయి
సుప్రభావ గరిమ సూర్యుఁ బోలి
నేల నేలుచుండ నీ ప్రజావళి యెల్ల
నిన్నుఁ జూడఁ గోరుచున్నవారు. 3057

ఆ. కౌతుకమున సమదకరులు గర్జించుచు
వెంబడించుఁ గాత విభుని నిన్ను
వగపు దొలఁగి రాణివాసంపు గరితల
హృదయములకు శాంతి యొదవుఁ గాత!" 3058

క. పరమార్థసమన్వితముగ
భరతుఁడు రఘురాము నిట్లు ప్రార్థింపఁగ నా
గరజనులు సంతసంబునఁ
బుతే యనుచు నిచ్చమెచ్చి పొగడిరి భరతున. 3059

ఆ. అట్లు దుఃఖితాత్ముఁడై విలపించెడి
ఘనయశస్వి భరతు ననుజుఁ గాంచి
ధీనిధానుఁడైన ధీరుఁడు రాఘవుం
డాశ్వసించి యిట్టు లని వచించె. 3060

గి. "తమ్ముఁడా! జీవుఁ డెపు డస్వతంత్రుఁ డగుట
నిచ్చవచ్చినగతిఁ జరియింప లేఁడు;
కైవసముఁజేసికొని కాలకర్మగతుల
దైవమే త్రిప్పుచుండు నాతని సతమ్ము. 3061

క. కలిమికి వినాశ మంతం;
బలఘుతరోన్నతికిఁ బతన మంతంబు; ప్రియుల్
గలయుట కెడబా టంతం;
బిల జీవితమునకు మరణమే యంత మగున్. 3062

క. పరిపక్వఫలంబునకున్
దరువు దొఱఁగు భయమె సంతతము గల్గు క్రియన్
ధరణి జనించిన నరునకు
మరణం బగు నను భయంబె మఱి మఱిఁ దోఁచున్. 3063

గీ. గట్టి కంబాలకట్టిన యట్టి గృహము
కాలవశమున శిథిలమై కూలినట్లు
జనుఁడు వశుఁడయి తుదకు నాశంబు గాంచు
వరబలాఢ్యుఁ డయ్యును జరామరణములకు. 3064

గీ. జరగిపోయిన రాత్రి కమ్మఱఁగ రాదు;
శరధిఁ బడు యామునజలంబు తిరిగి రాదు;
అర్కఘృణులు వేసవి నీటి నార్చినట్లు
ప్రజల యాయువుల్ గొనిపోవుఁ బగలు రేయి. 3065

ఆ. ఏమిచేయుచున్న నెటు కేగి డాఁగున్న
నడఁగిపోవుచుండు నాయు వనెడు
నాత్మచింత మాని యన్యుల కష్టాలఁ
గూర్చి యెంతొ వంత గుందనేల? 3066

ఆ. కూరుచున్నచోటఁ గూర్చుండుఁ బరుగిడుఁ
బదములంటి వెంటఁ బరుగువారు;
సకల సమయములను జనునకు మృత్యువు
నీడవోలి కూడనే చరించు. 3067

క. తల నరిసిపోక గాయము
వలీపలితకలిత మగుచు వరుగై పోవన్
దలమగు జరచేఁ గృశుఁడై
కలఁగెడు నరుఁ డేమిసేయఁగా శక్తుఁ డగున్? 3068

ఆ. ఉదయభానుఁ గాంచి యుత్సాహపడుఁ గాని
యస్తతరణిఁ గాంచి యలరుఁ గాని
యనునిమేష మాయు వడఁగిపోవుచునుండె
నని యెఱుంగఁ డించుకైన నరుఁడు. 3069

క. ఋతువులు దిరిగిన కొలఁదిన్
గతమగు నాయువని నరుఁడు గ్రహియింపక యే
కుతుకపడుచుండు నవనవ
గతులన్ దోతెంచు ఋతుముఖంబులఁ గనుచున్. 3070

క. కడలి యలలఁ గాష్ఠంబులు
వడిఁ గలయుచు వీడునట్టి వడువున సిరులున్
బడఁతులు గొడుకులు బంధువు
లెడనెడఁ గలయుటయు విడుటయే ధ్రువ మవనిన్. 3071

క. మృతునికొఱ కేడ్చు నాతఁడు
బ్రతికింపఁగ నేరఁ డెన్నిపాటులు వడినన్
క్షితి జీవి కెందు స్వేచ్ఛా
గతియున్నదె తలఁచినట్లు గావించుటకున్ ? 3072

ఆ. దారిఁబోవునట్టి వారిఁ గన్గొను నాతఁ
డేను వత్తునంచు నేగునట్లు
తాత తండ్రు లేగు దారి తప్ప దటంచు
నెఱిఁగి చనఁగ మనుజుఁ డేడ్చుటేల ? 3073

ఆ. తిరిగిచూడ కుండఁ బఱచు వాహినిఁ బోలి
వడిగ వడిగ వయసు గడచిపోవుఁ
గాన నాత్మసుఖముఁ గాంక్షించు నాతండు
ధర్మ మాచరింపఁ దగు సతంబు 3074

క. మన జనకుండగు దశరథ
జనపాలుఁడు ధర్మపరుఁడు సవనము లెన్నో
యొనరించి సదక్షిణలుగఁ
జనియె దివంబునకుఁ బుణ్యచారిత్రుండై. 3075

సీ. ప్రజల బిడ్డలయట్లు భావించి పాలించి
యాత్మభృత్యుల ప్రేమ నాదరించి
యలఘు దక్షిణలతో యాగముల్ గావించి
పరమధర్మంబుఁ దప్పక చరించి
యాయురారోగ్యభాగ్యంబులు గడియించి
యఖిలభోగంబుల ననుభవించి
తన యశఃప్రభలచే దశదిశల్ వెలయించి
సాధుజనామోదచరితఁ గాంచి

గీ. సత్యశాసనుఁడై ధరాచక్ర మెల్లఁ
బెద్దకాలంబు భరియించి పేరుగాంచి
తను వెడలి దివ్యుఁడై స్వర్గమునకుఁ జనిన
జనకునిం గూర్చి దుఃఖింపఁ జనదు మనకు. 3076

క. శ్రుతుల స్మృతుల విధు లెఱిఁగిన
మతిమంతుఁడ వీవు చింత మానుము; ధీరో
న్నతునకు వగచుట బాష్పో
ద్గతుఁ డగుటయు నెందుఁ దగదుగాదే వత్సా! 3077

ఆ. వగపుమాని శాంతి వహియించి తమ్ముఁడా!
తండ్రిశాసనంబు తల ధరించి
య య్యయోధ్య కేగి యఖిలరాజ్యభరంబు
దలనుదాల్చి యేలఁ దగుదు వీవు. 3078

క. నరవరుఁ డార్యుఁడు సదమల
చరితుఁడు జనకుండు నా కొసంగిన యాజ్ఞన్
శిరసా వహించి నేనును
నరణ్యమున నుండుఁ దపసినై ధర్మవిధిన్. 3079

ఆ. తండ్రియాజ్ఞఁ దీర్పఁ దగు నీకు నాకు; నీ
వుర్వి నేలు మడవి నుందు నేను
పరసుఖమ్ముఁ గోరు నరుఁడు ధర్మాత్ముఁడై
జరుపవలయు నోర్మి గురుల యాజ్ఞ. 3080

క. పురుషశ్రేష్ఠుఁడ వగు నో
భరతా! మన జనకుఁడైన పంక్తిరథుని స
చ్చరితము మనమున నిడుకొని
ధరణిం బాలింపు మభిమతం బగు సరణిన్." 3081

ఆ. అని మహానుభావుఁడైన రామవిభుండు
తండ్రియాజ్ఞదీర్పఁ దప్ప దనుచుఁ
తనదు తమ్మునకును ధర్మార్థసమ్మత
హితమృదూక్తి నానతిచ్చె నపుడు. 3082

# 106 వ సర్గము

గీ. ధార్మికుండైన భక్తవత్సలుఁడు రాముఁ
డొత్తి యీ రీతి బోధించి యూరకుండ
నన్నఁ గని ధర్మయుక్తంబు లక్షణములు
నైన సూక్తుల భరతుఁ డిట్లని వచించె. 3083

క. "అరిమర్దన! నినుఁ బోలెడు
పురుషుం డెవ్వాఁడు గలఁడు భూలోకమునన్
దొరసెడు సుఖదుఃఖములన్
బొరయవు నిను హర్షశోకములు రఘువీరా! 3084

క. పెద్దలును నిన్ను బుద్ధిన్
బెద్దగఁ బూజింతు రైనఁ బృథుగౌరవ మా
పెద్దలయెడ నిడి వారల
యొద్దనె సంశయము లడుగు చుందువు నీవున్. 3085

ఆ. బ్రతికియున్నవాని ప్పారుఁడైన యాతని
నున్నదాని లేకయున్నదాని
సమతఁ గాంచఁ గలుగు సద్బుద్ధిగల యాతఁ
డనుతపింపఁ డెట్టి యాపదలకు. 308

క. ధీనిధి యాత్మనాత్మ
జ్ఞాని యయిన నిన్నువంటి సత్పురుషుండే
తానుగఁ గష్టంబులకు న
ధీనుండై యడలఁ దగునె ధీరవిచారా! 308

ఆ. సత్యశీలివీవు సర్వజ్ఞుఁడవు నీవు
విబుధసముఁడ వీవు వేత్త వీవు
సారమతివి నీవు సర్వదర్శివి నీవు
రఘుకులాబ్ధిచంద్ర! రాఘవేంద్ర! 308

ఆ. సకలసుగుణరత్నసంపన్నునకు నీకు
భవవినాశవిజ్ఞ పండితునకు
దుస్సహంబులైన దుష్టకష్టంబులు
పాలఁ బడుటఁ దగదు ప్రభువరేణ్య! 308

క. మా యమ్మ నా నిమిత్తం
బీ యఘ మిటు లాచరించె నే నేనసుఁడ;
న్యాయ మగు నిట్టి దుష్కృతి
నా యిష్టముగాదు కరుణ ననుఁ జూడఁ దగునే. 309

ఆ. పరమధర్మపాశబద్ధుండ నగుటచేఁ
బాపకృత్యమునకుఁ బాలుపడిన
దండనార్హయైన తల్లినిఁ దీవ్రమౌ
శాసనమునఁ జంపఁ జాలనైతి. 309

ఆ. సాధువంశభవుఁడు సత్క్రియానిరతుఁడౌ
దశరథేశ్వరునకుఁ దనయుఁడ నయి
లోకనిందితంబు లుప్తధర్మంబైన
కార్య మెట్లు చేయఁ గలుగువాఁడ? 3092

క. గురుఁడు క్రతుకర్తయును భూ
వరుఁడును వృద్ధుండు దివిజవరసముఁ డగుటన్
మరణించిన మన జనకున్
దిరస్కరిపంగఁ జాల నిందినసభలోన్. 3093

క. ఎఱిగినవా డెవ్వం డొక
తరుణికిఁ బ్రియ మాచరింప ధర్మార్థబహి
ష్కరణమగు నిట్టి పాపా
చరణము గావింపఁ గలఁడు సద్ధర్మనిధీ! 3094

ఆ. చేటుకాలమునకు చెట్టబుద్ధులు పుట్టు
నను సనాతనోక్తి నవనివిభుఁడు
ప్రజల యెట్టయెదుటఁ బ్రత్యక్ష మొనరించెఁ
గానిపని యొనర్చి కాలవశత. 3095

ఆ. కైక క్రోధకలన ఘనమోహవశమున
సాహసించి తండ్రి సలిపినట్టి
ధర్మరహితకృతిని దగురీతి గ్రహియించి
చిత్తగించి చక్కఁ జేయవలయు. 3096

ఆ. తండ్రిచేసినట్టి ధర్మాపచారంబు
సాధుసమ్మతముగఁ జక్కపఱుపఁ
బూనుకొన్నయట్టి పుత్త్రుఁడే పుత్త్రుఁడౌ
నట్లు తీర్పలేని యతఁడు సుతుఁడె? 3097

క. ఓ రాఘవ! నీ పట్టి యు
దారుఁడగు కుమారు డగుము; తండ్రి బుధాంగీ
కారంబుగాని దుష్కృతి
నేరక కావించెఁ బరిగణింపకు దానిన్. 3098

క. జనకాఖ్య నిలిపి కైకే
యిని నన్ను క్షమించి సకలహితబాంధవ భూ
జనయుతముగ నీ రాజ్యము
ననుకంపామతినిఁ బ్రోవ నగు నీ కనఘా! 3099

క. ఎక్కడ క్షత్రియధర్మం?
బెక్కడ కానన నివాస? మెక్కడ రాజ్యం
బెక్కడ వల్కలధారణ?
మక్కట! యీ వైపరీత్య మగునే నీకున్. 3100

ఆ. ధరణిభార మూని ధర్మశాసనమున
నెల్ల ప్రజల పేర్మి నేలుకొనుట
పట్టభద్రుఁ డగుటె ప్రథమధర్మంబు సత్
క్షత్రియునకు జ్ఞానధామ! రామ! 3101

గీ. క్షత్రియకులీనుఁ డెవ్వఁడు సాక్షాత్ఫలంబు
నృపతిధర్మంబు విడిచి యనిశ్చితంబు
ననుమితం బలక్షితము జన్మాంతఫలద
మైన మౌనిధర్మంబును బూనఁ గోరు? 3102

గీ. కష్టముం గూర్చు ధర్మమార్గమునె విధిగ
ననుసరించుట నీ యిష్ట మగున యేని
నర్హవిధుఁడ వయి నాల్గు వర్ణముల ధర్మ
పాలనముఁ జేయుటకు శ్రమపడఁగ రాదె? 3103

ఆశ్రమ చతుష్కమున గృహస్థాశ్రమమునె
ధర్మవిదులు గణింతు రుత్తమము గాఁగ;
నఖిలధర్మవిధిజ్ఞుఁడ వైన నీకు
నట్టి యాశ్రమమును వీడనాడఁ దగునె? 3104

వయసుచే బుద్ధిచే గుణచయముచేత
స్థితిగతులచేత నీ కంటెఁ జిన్నవాఁడ
నన్నిఁటఁ సమర్థు నగ్రజు నిన్ను విడిచి
ధరణిభారంబు నే నెట్లు తాల్పఁగలను? 3105

పితృపైతామహ మగు నీ
క్షితిరాజ్య మకంటకముగఁ జేకొని ధర్మ
స్థితిఁ బాలింపుము రామా!
హితులును బాంధవులు ప్రజలు నెల్లరు మెచ్చన్. 3106

పురజనులతోడ నిచటనె
గురుముఖ్యులు సకలమంత్రికోవిదఋత్వి
గ్వరు లిపు డభిషేకింతురు
ధరణీనాథునిగ నిన్ను దశరథరామా! 3107

భువనముల జయించి దివిజాభిషిక్తుఁడై
నాక మేలు విబుధనాథుఁ బోలి
ప్రకృతిగణముచేతఁ బట్టభద్రుండవై
యీ వయోధ్య కేగి యేలుము ప్రభు! 3108

పాలించుచు మిత్రుల; ని
ర్మూలించుచు శత్రుజనుల; మూఁడు ఋణములఁ
దేలించుచు ప్రజల న్నను
నేలందగు నీ వయోధ్య నినవంశమణీ! 3109

గీ. ఆర్య! నీ వభిషిక్తుండ వైనయంత
సంతసింతురు నీ సుహృజ్జనము లెల్ల
నీ పగతు రెల్ల నిపుడె భయోపహతినిఁ
బఱచెదరు గాత దశ దిశాంతరములకును. 3110

ఆ. లోకనిందలకును లోఁబడ్డ మా తల్లి
దుష్కళంక మెల్లఁ దుడిచి వైచి
పూజ్యపాదుఁడైన భూపతి మన తండ్రి
కఘము సోఁకకుండ నరయు మయ్య! 3111

క. తలమీఁదఁ బ్రణామంబులఁ
జలుపుచుఁ బ్రార్థింతు నిన్ను; సర్వేశుఁడు జీ
వులఁ బోలి నన్నుఁ జుట్టలఁ
జెలులన్ బురజనుల రక్షసేయుము రామా! 3112

ఆ. ఎంతవేఁడుకొన్న నీవు మన్నింపక
దండకాటవులకె తరలుదేని
నేను వచ్చువాఁడ నీ వెంట నంటి నీ
పదసరోజసేవ వదలకుండ." 3113

క. అని భరతుఁడు తల్లడమున
వినతుండై యట్లు తన్ను వేఁడుచు నున్నన్
ఘనధీరుఁడు రఘురాముఁడు
జనకాజ్ఞకు నెదురుతిరుగఁ జాలక యుండెన్. 3114

చ. కనికరముంచి విన్నపముఁ గైకొనఁ డన్న విచార మద్దిరా
జనకుని గీటుదాటఁడను సంతసమున మది నగ్గలింపఁగా
వినుతచరిత్రుఁడైన రఘువీరుని యద్భుతసుస్థిరత్వముం
గని యపు డొక్కసారిగనె కాంచిరి సభ్యులు ఖేదమోదముల్. 3115

ఆ. అశ్రునయన లగుచు నవశలౌ జనములు
నవని సురులుఁ బౌరు లట్లు వేఁడు
భరతుఁ బొగడి రామభద్రుఁ బ్రార్థించిరి
క్రమ్మఱంగఁ బురికి రమ్మటంచు. 3116

# 107-వ సర్గము

గీ. అంత శ్రీమంతుఁ డగు లక్ష్మణాగ్రజుండు
సకలబాంధవసహితుఁడై ప్రాంజలి యయి
మరల మరల వేఁడుచున్న భరతుఁ గాంచి
యనుపమామోదభరితుఁడై యనియె నిట్లు. 3117

గీ. వత్స! దశరథనరపాలవరునివలన
రాజ్ఞి కేకయపుత్త్రి గర్భమున నుండి
యవతరించిన నీవు నీ యట్టి సాధు
మతికిఁ దగినట్లె పలికితి శ్రుతిహితముగ. 3118

సీ. తమ్ముఁడా! మును మనతండ్రి హర్షమున నీ
జననిఁ బెండిలియాడు సమయమందె
యామె సంతతికి రాజ్యముఁ గూర్తు నంచు మీ
మాతామహునకును మాటయిచ్చె
నంతియకాక దేవాసురయుద్ధమం
దాత్మరక్షణకుఁ బ్రాపైన యట్టి
నీ తల్లి కైకపైఁ బ్రీతి నా దశరథ
ధరణీశ్వరుఁడు వరద్వయ మొసంగె

ఆ. నీవు రాజ్యమేల నేను గానల కేగ
నా వరద్వయమున నయ్యెఁ గాన
మనము విధిగ వాని ననుసరింపందగుఁ
దల్లిదండ్రులకు ముదంబు గూర్ప. 3119

ఆ. తండ్రిప్రభుని యాజ్ఞఁ దలఁదాల్చి నేను ల
క్ష్మణునితోడ జనకజాతతోడ
సత్యనిష్ఠఁ బూని జనవాక్యము గణింప
కేగుదెంచినాఁడ నిట్లు వనికి. 3120

ఆ. జననిఋణమునుండి జనకు ముక్తునిఁ జేయ
వసుధ నతని సత్యవాదిఁ జేయ
భరత! నీ వయోధ్యఁ బట్టభద్రుండవై
ప్రజల నేలవలయుఁ బ్రాభవమున. 3121

క. పున్నెములగూర్చి పితరుల
పున్నామ నరకవిముక్తిఁ బొందించు నతం
డెన్నఁగఁ బుత్త్రుం డగు నని
మున్నుగ యీ పుణ్యతీర్థమున గయుఁ డనఁడే 3122

క. కావుననే బహుపుత్త్రులు
గావలె నని కోరుచుంద్రు; ఘనకర్మతులం
దేవారలైన గయను య
థావిధి నొనరింత్రు పిండదానము శ్రద్ధన్. 3123

గీ. భరత! నీ వట్టి సత్పుత్త్రవరుఁడ వగుచుఁ
గన్నతండ్రికి స్వర్గసుఖంబు గూర్పఁ
దమ్ము శత్రుఘ్నుతో రాజధాని కేగి
ప్రభుఁడవై యేలవలయును బ్రజల నెల్ల. 3124

క. మానవపతియగు జనకుని
యానతి దలఁదాల్చి దండకాటవి కింకన్
జానకితో లక్ష్మణుతో
నేనుం జని పదియు నాలుగేండ్లు వసింతున్. 3125

ఆ. ఈ వయోధ్య కిప్పు డేగి ప్రభుండవై
యేలవలయుఁ గూర్మి నెల్లప్రజల;
నేను కాననముల కేగి ప్రభుండనై
యెల్ల జంతుచయము నేలువాఁడ. 3126

ఆ. ఎండ వేడిసోఁకకుండ నీ శీర్షంబు
వెల్ల గొడుగునీడ వెలయుఁ గాక
యా తపంబు సొరని యవనిజ చ్ఛాయలు
నాకుఁ జలువఁ గూర్చుగాక యింక. 3127

క. హితుఁడగు శత్రుఘ్నుండ
ప్రతిము పరాక్రముఁడు నీకు బాసట యగు; నా
కతని వలెనె లక్ష్మణుఁ డ
ద్భుతశస్త్రాస్త్రబలశాలి తోడై యుండున్. 3128

గి. నీవు శత్రుఘ్నుతోఁ గూడి నేల యేలు;
నేను లక్ష్మణుతోఁ గాన కేగియుందు;
మనము నల్వురు సుతులము జనకు సత్య
వాదిగాఁ జేయుదము మఱి వగవ వలదు." 3129

# 108-వ సర్గము

## జాబాలి రామునితో పలుకుట

క. అని భరతు నూరడించెడి
యనుపమ ధర్మజ్ఞు రాము నారసి యంతన్
ముని జాబాలి ప్రగల్భం
బున ధర్మవిరుద్ధవచనముల నిట్లనియెన్. 3130

క. "మామంచిమాటలాడితి
రామా! ధీరుండ వయ్యుఁ బ్రాజ్ఞుఁడ వయ్యున్
సామాన్యునివలె నీవ
ప్రామాణ్యంబైన పలుకు పలుకం దగునే? 3131

క. ఏవాఁ డెవనికి బాంధవుఁ?
డేవానికి నెవనివలన నేమిఫల మగున్?
జీవి యొకండై పుట్టును
జావుంగను నొకఁడె; వెంటఁ జనఁ డెవ్వండున్. 3132

ఆ. అట్లుగాన తల్లి యని తండ్రి యని భ్రాంతి
వెంబడించువాఁడు వెఱ్ఱివాఁడు
రామ! యరివిరామ! నామాట వినఁదగు
నెంచిచూడ నెవని కెవఁడు లేఁడు. 3133

ఆ. పయన మేగువాఁడు బసచేయు నొకచోటు
దాని వీడి మరలఁ దలపఁ బోవఁ;
డట్లె తల్లిదండ్రి యావాసము ధనంబుఁ:
గలసియున్న నుండు తొలఁగఁ దొలఁగు. 3134

గీ. పైతృకంబైన భాగ్యంబుఁ బరిహరించి
యడవిపాలయి కష్టంబు లందఁ దగదు;
రామ నినుఁ గోరుచున్నది రాజ్యలక్ష్మి
తొరగఁ బురి కేగి పట్టభద్రుండ వగుము 3135

గీ. రాజరాజాత్మజుఁడ వైన రామ! నీవు
ఘనతరములైన భోగభాగ్యముల నెల్ల
ననుభవింపంగఁ దగు నయోధ్యాపురమున
స్వర్గనగరంబునందు వాసవునిఁ బోలి. 3136

గీ. పంక్తిరథునకు నీకు సంబంధ మేమి?
ఎవరు నీ కాతఁ డాతని కెవరు నీవు?
నీ వొక ప్రభుండ వతఁ డొక భూ విభుండు
రామ! నా మాట విని స్వధర్మమునఁ జనుము. 3137

గీ. తండ్రి సుతునకు బీజమాత్రంబె యందె
భూతలంబున పురుషుని పుట్టువునకు
జనని ఋతుమతి గర్భకోశంబునందుఁ
గలయు శుక్లశోణితములే కారణములు. 3138

క. ఆ వసుధేశుం డెచటికిఁ
బోవఁ దగునో పోయె నటుకె పురుషుల కిది స్వా
భావికమ నీవు మిథ్యా
భావముఁ గూర్చుకొని బాధపడ నేమిటికిన్? 3139

క. ధనధర్మపరత మాత్రన
ఘనసుఖభోగముల విడిచి కష్టాధిక జీ
వనులై చచ్చి నశించెడి
జనులం గని నాకు నెంతో జాలి వొడమెడిన్. 3140

గీ. అష్టకాశ్రాద్ధ మనుచుఁ బ్రత్యాబ్దిక మని
యన్నమును వృథసేయుదు రజ్ఞజనము;
లరయుమో రామ చచ్చి చన్నట్టి యాతఁ
డెట్లు రాఁ గల్గు? నెట్లు భుజింపఁ గల్గు? 3141

క. ఒక్కఁడు భుజించినది యొం
డొక్కని క్షుద్బాధ దీర్ప నోపినయేనిన్
యెక్కడనో గలాతనికై
యిక్కడ పాథేయ మొరున కిడి కూర్పఁ దగుఁగ. 3142

క. దేవతలను బూజింపుము;
గావింపుము దానములను; గ్రతువులచే భూ
దేవతలఁ దనుపు మని మే
ధావులు విలిఖించి రిట్లు ధనలోభమునన్. 3143

గీ. అట్లు గాన ధీమంతుఁడవైన నీవు
కలదు పరలోక మని బుద్ధి దలపఁబోక
యనుభవింపుము ప్రత్యక్షమైన దాని
భ్రాంతిపడి పరోక్షములకై బాధపడకు. 3144

క. పురుషోత్తమ! నుతమతివై
భరతుని సంప్రార్థనంబు పాటించి ధరా
భరము వహియించి ప్రత్యు
త్తర మా విభవంబు గనుము జనసమ్మతిగన్." 3145

# 109-వ సర్గము

## రాముఁడు జాబాలికి బదులు పలుకుట

క. అని జాబాలి వచింపఁగ
విని సత్యవ్రతుఁడు రామవిభుఁడు స్వధర్మం
బును వీడక నిశ్చలుఁడై
మునిఁ గనుఁగొని యిట్టులనెఁ బ్రబుద్ధుం డగుటన్. 3146

క. "మునివర! నా ప్రియమునకై
వినిచిన నీ మాట లెల్ల విహితము లట్లే
కనఁబడు నహితములు నయా
ఖ్యను దాలిచి యున్న దుర్నయంబులు దలఁపన్. 3147

క. మరియాదలేని యాతఁడు
విరుద్ధచరితుండు పాపవృత్తకలితుఁడౌ
పురుషుం డెన్నటికిని న
త్పురుషులచే గౌరవంబుఁ బొందఁడు జగతిన్. 3148

క. పరిశుద్ధు నపరిశుద్ధుని
వరవంశప్రభవు హీనవంశోద్భవునిన్
బిఱికిని బరాక్రమాఢ్యునిఁ
జరితమె స్వాభావికముగఁ జాటుచు నుండున్. 3149

సీ. దుష్టవర్తనుఁడనై శిష్టునట్లు నటించి
యశుచినై శుచిమంతు నట్లు దోఁచి
వికృతభావుండనై సుకృతిభంగిఁ జరించి
యతికోపినై శాంతు నట్లు మెలఁగి
గతధర్మినై ధర్మరతులీలఁ గన్పట్టి
యవమతినై సాధు వట్టు లుండి
యవలక్షణుండనై యార్యాకృతిం దాల్చి
ఖలుఁడనై సుజనుని కరణిఁ బొలిచి

గీ. పరమధర్మసదాచారబాహ్యము లగు
నీ నుడులఁబట్టి చరియింతునేని నన్ను
భూరమణుఁ డంచు నెవఁ డింక గౌరవించు?
మహిపతి నటంచు నెవఁడు నా మాట వినును? 3150

ఆ. నీ ప్రబోధనమున నా ప్రతిజ్ఞను వీడి
యార్యధర్మపతితుఁ డగుదు నేని
ధరణిప్రజల కెట్లు ధర్మంబు బోధింతు?
నమరపదము నెట్టు లందఁ గందు? 3151

ఆ. ఇచ్ఛవచ్చినట్టులే సంచరించుట
జగతిజనుల కెల్ల సహజగుణము;
ధరణినాయకుండె ధర్మంబు దప్పినఁ
బ్రజలమాట వేఱె పలుక నేల? 3152

క. అభయదము సనాతన మగు
ప్రభువృత్తమె సత్య మగుట రాజ్యము సత్య
ప్రభవము; సత్యస్థితములు
త్రిభువనములు నట్టి సత్యదీక్ష విడుతునే! 3153

క. దేవతలును ఋషులును సం
భావింతురు సత్య మొకఁడె పరమార్థముగా
నే వేళ స్వర్గసౌఖ్యముఁ
బావనుఁ డగు సత్యవాది పడయుం గాదే! 3154

ఆ. జనులు సత్యవాదిఁ గని భీతిలుచు నుంద్రు
గరళపన్నగంబుఁ గన్నయట్లు
ధరణిలోనఁ బరమధర్మంబు సత్యంబు
సత్యపథము స్వర్గసాధనంబు. 3155

క. సత్యమె సాక్షాద్దైవము;
సత్యమె సౌభాగ్యరమకు సతతాశ్రయమౌ;
సత్యమె సర్వాధారము;
సత్యమునకు మించి లేదు సత్పద మెందున్. 3156

ఆ. దాన యాగ హోమ తపములు వేదముల్
సర్వసత్క్రియలును సత్యమందె
నిష్ఠితములు గాన నిత్యసత్యవ్రత
మూని మెలఁగ వలయు మానవుండు. 3157

క. నరపతియైనం గానీ
వరకులపతియైనఁ గాని వాస్తవ మరయఁగా
నిరయంబుగాంచు ననృతుఁడు
సురలోకసుఖంబుగాంచు సూనృతుఁ డెపుడున్. 3158

ఆ. సత్యవాది నగుచు సత్యవ్రతుండనై
మోహలోభవశతఁ మూఢునట్లు
మత్తునట్లు నీదుమాటలు పాటించి
తండ్రియాజ్ఞ నెట్లు దప్పనేర్తు? 3159

ఆ. అనృతవాది చపలుఁ డస్థిరహృదయుండు
జలుపు హవ్యకవ్యసంచయముల
దేవపితరు లనుమతించి గైకొన రంచు
విబుధు లాడుమాట వినఁగ లేదె? 3160

ఆ. అట్టి సత్యరూపమైన సద్ధర్మంబు
నాత్మమూర్తిగాఁగ నరయుచుంటి
నట్లుగానఁ బెద్ద లందఱివలె నేను
సత్యభరముఁ దాల్తు శ్రమల కోర్చి. 3161

క. క్రూరులు లుబ్ధులుఁ బాపా
చారులు నల్పులును గోరు క్షత్రియధర్మం
బే రోసెద; నది ధర్మా
ధారముగాఁ గానఁ బడు నధర్మముగాఁగన్. 3162

గీ. కాయికం బని మానసికం బటంచు
వాచికం బని త్రివిధమై తోఁచు నఘము;
తలఁపుచేత చేఁతలచేత పలుకుచేఁత
నుర్విజనులకుఁ బాపంబు లొదవుచుండు. 3163

క. క్ష్మాకాంత కీర్తికాంతయు
శ్రీకాంతయు సత్యవంతు సేవించెద రే
లోకమున నున్నఁ; గావున
మైకొనఁ దగు సత్యదీక్ష మానవుఁ డెపుడున్. 3164

క. నీవు పరమోత్తమము లని
భావంబున నెంచి నాకు భద్రము లంచున్
గావించిన బోధనము ల
ఘావిలము లయుక్తములు ననార్యము లెందున్. 3165

ఆ. జనకు నొద్ద నేను వనవాస మొనరింతు
నని ప్రతిజ్ఞ చేసి యరుగుదెంచి
యిపుడు తండ్రిమాట నెడవెట్టి భరతుండు
చెప్పినట్టు లెట్లు చేయఁ గలను? 3166

గీ. శపథ మొనరించితిని నాఁడు జనకు నాజ్ఞ;
సంతసించె నప్పుడు దేవి జనని కైక;
తల్లిదండ్రులఁ ద్రోసి సత్యంబు రోసి
యిపుడు తమ్మునికోర్కె నే నెట్లు తీర్తు? 3167

చ. కృత మకృతం బెఱింగి శుచివృత్తి నకృత్రిమమైన శ్రద్ధతోఁ
బితరుల దేవతావళులఁ బెద్దలఁ గంధఫలప్రసూన స
త్కృతులను దన్పుచున్ బ్రముదితేంద్రియవర్యుఁడనై సమంచిత
వ్రత మిత భోజినై విపినవాసిగ నే దినముల్ గమించెదన్. 3168

గీ. కర్మభూమిని జన్మంబుగన్న నరుఁడు
విడక శుభకర్మములను గావింపఁ దగును;
సోముఁడును బవనుండును శుచియుఁ గూడఁ
గర్మసత్ఫలభాగులుగారె జగతి? 3169

గీ. శత మఖంబులుచేసి నిర్జరవిభుండు
పరమపదమైనత్రివిష్టపంబు గాంచె
పరమఋషు లెల్ల నుగ్రతపం బొనర్చి
సౌరలోకసుఖంబులఁ జూఱఁగొనిరి." 3170

క. అని భీకరతేజుం డగు
జనపతినందనుఁడు రామచంద్రుఁ డపుడు న
మ్ముని నాస్తికవచనములకుఁ
గనలుచు న మ్మౌనిఁ గాంచి క్రమ్మఱ ననియెన్. 3171

గీ. "విమలధర్మంబు సత్యంబు విక్రమంబుఁ
బరమమగు భూతదయ ప్రియభాషణంబు
నతిథి దేవతాభూదేవతార్చనంబు
స్వర్గమార్గంబు లందురు సాధుజనులు. 3172

గీ. అట్లు గావున నీ పరమార్థ మెఱిఁగి
యేమరక భూమిసురు లెల్ల నేకమతిని
స్వస్వధర్మంబులను యథాశాస్త్రసరణి
నెఱపి కోరుచునుందురు పరమపదము. 3173

ఆ. దుష్టబుద్ధి వగుచు దుష్పథంబునుబట్టి
నాస్తికత వహించి నయము దప్పి
సంచరించు నిన్ను సన్నిధిఁ జేర్చిన
జనకుసేఁత నింద్య మని తలంతు. 3174

ఆ. చోరునట్టివాఁడె సుమ్మి బుద్ధుఁ డనంగ
నతనిమతము పరమనాస్తికంబు;
నరులు సంశయించు నాస్తికు చెంగటఁ
బండితుండు నిలిచియుండరాదు. 3175

క. నీకుం బూర్వులు శ్రేష్ఠు ల
నేకులు సత్కృతులఁజేసి యిహపరసుఖముల్
చేకొనిరి గాన విప్రులు
గైకొందురు శుభదము లగు క్రతుకర్మములన్. 3176

ఆ. సుజనసంగతులును శుభధర్మరతులు న
హింసకులును దాత లమలతేజు
లైన మౌనివర్యు లగ్రపూజార్హులై
వెలయుచున్నవారు విశ్వమందు." 3177

క. అని రోషమున మహాత్ముఁడు
ఘనబలుఁడగు రాముఁ డాడు కఠినవచనముల్
విని ముని సత్యాస్తికమతి
ననునయమున నిట్టు లనియె నార్యనుతముగన్ 3178

క. "నాస్తిక్యము బోధింపను
నాస్తికుఁడను గాను లోకమం దెయ్యదియున్
నాస్తికముగాదు నాస్తి
క్యాస్తిక్యము లుగ్గడింతు నయ్యెయెడలన్. 3179

ఆ. జనవరేణ్య! ధర్మసంకటకాలంబు
గలిగెఁ గాన నాస్తికంబులాడి
నినుఁ బ్రసన్నుఁ జేసి నీ మతి మరలింప
యుక్తు లిట్టు చెప్పియుంటి నింతె." 3180

# 110-వ సర్గము

మ. అని జాబాలి వినమ్రుఁడై పలుకఁగా నాలించి కోపంబు వా
యని రాముం గని య వ్వసిష్ఠుఁడు "కుమారా! నీ మతింద్రిప్ప ని
య్యనఘుం డిట్లు వచించె; లే దితనికి న్నాస్తిక్య; మీ లోకవ
ర్తన మాముష్మికలోకవృత్తమును వేద్యం బీ సుధీశాలికిన్. 3181

సీ. మనుజేంద్ర! సృష్టిక్రమంబు దెల్పెద విను
మఖిలంబు జలమయంబైన వేళ
నవ్యక్తమందు స్వయంభవుఁడై బ్రహ్మ
యఖిలదేవతలతో నవతరించి
యవని సృజించె; నయ్యాది జలంబుల మున్గ
శ్రీహరి యాదివరాహ మగుచు
భువి నుద్ధరించె; నప్పుడు బ్రహ్మ సుకృతులౌ
తనయులతో సర్వమును సృజించె;

గీ. నా పరబ్రహ్మవలన నిత్యాత్మకుండు
శాశ్వతుఁ డనంతుఁ డగు బ్రహ్మ జనన మందె;
నతనికి మరీచి యనెడి సుతుండు పుట్టె;
నా మరీచికి కశ్యపుం డవతరించె. 3182

గీ. అనఘుఁ డగు కశ్యపబ్రహ్మ కినుఁడు పుట్టె
నినున కగ్రప్రజాపతి మనువు గలిగె;
మనువిభునికి నిక్ష్వాకుండు దనయుఁ డయ్యె;
నతనికి సమృద్ధయగు భూమి పిత యొసంగె. 3183

గీ. వంశభూషణుఁ డిక్ష్వాకువరుఁడు తొల్లి
ప్రథమ విభుఁడై యయోధ్యాపురమ్ము నేలె;
నాతనికిఁ గుక్షి శ్రీమంతుఁ డవతరించెఁ;
గుక్షికి పరాక్రముండు వికుక్షి పుట్టె. 3184

గీ. ఆ వికుక్షికి నందనుం డయ్యె బాణుఁ:
డతని కనరణ్యుఁ డుదయించి యశము గాంచె;
నతని యేల్బడి నీతిబాధాళిఁ దొలఁగె;
సర్వసంపన్నమై యొప్పె క్ష్మాతలంబు. 3185

గీ. అట్టి యనరణ్యునకు సూనుఁ డయ్యెఁ బృథువు
వానికిఁ ద్రిశంకుఁ డను నరవరుఁడు పుట్టి
గాధిసుతుఁడు విశ్వామిత్రుకరుణచేత
సత్యమహిమచే బొందితో స్వర్గ మేగె. 3186

క. ఆ నరవరునకు ఘన తే
జోనిధి యువనాశ్వుఁ డనెడు సూనుఁడు పుట్టెన్
దానవు దుందుఁ దునిమి యా
మానవనాథుండు దుందుమారుం డయ్యెన్. 3187

క. అతనికి మాంధాతృ విభుం
డతనికిని సుసంధి పుట్టె; నా రాజునకున్
సుతులుగ ధ్రువసంధియు న
ద్భుతబలుఁడు ప్రసేనజిత్తుఁ బుట్టిరి వరుసన్. 3188

గీ. అందు ధ్రువసంధి కాత్మజుం డయ్యెఁ భరతుఁ
డతని కసితుండు పుట్టె; న య్యవనిపతికి
హైహయులుఁ తాళజంఘులు నధికధైర్య
శౌర్యులగు శశిబిందువుల్ శత్రు లైరి. 3189

గీ. అ య్యరుల నెల్ల నెదిరించి యసితనృపతి
విజితుఁడై పలాయితుఁడయ్యె విపినములకు;
నట విరక్తుఁడై యతఁ డొక్క యచలసీమఁ
దపసియై యుండె ప్రియసతీద్వయముతోడ. 3190

సీ. ఇటు లుండ నాతని యిరువురు దేవులు
గర్భంబుదాల్చి రా కాలమందు;
నం దొక్కరాణి భక్ష్యములతో సవతికి
గర్భనాశమునకై గరళ మొసఁగె;

గరళంబు దిన్న యా కాళింది హిమగిరి
కరిగి భార్గవుఁడైన చ్యవనుఁ గొలిచి
పూజలఁ దనియించి పుత్రవరముఁ గోర
య మ్మహామహిముఁ డ య్యతివఁ గాంచి

ఆ. దేవి! నీకు దివ్యతేజుండు ధార్మికుం
డరి నిషూదనుండు చిరయశుండు
వంశకర్త శీలవంతుండు పుట్టి యి
వ్వసుధ నేలు ననుచు వర మొసంగె. 3191

గీ. అప్పు డా రాజ్ఞి సమ్ముదితాత్మ యగుచు
మునికిఁ బ్రణమిల్లి సెల వంది మనికిఁ జేరి
యొక్కసుముహూర్తమందుఁ బయోజనేత్రు
వనజగర్భసమ ప్రభుఁ దనయుఁ గాంచె. 3192

క. ఆతఁడు గరళముతో సం
జాతుండై పొలుచు కతన సగరాహ్వయ వి
ఖ్యాతుఁ డయి యేలె ధర నే
కాతపవారణముగాఁ బ్రజావళు లలరన్. 3193

గీ. మఖనిమిత్తంబుచేత నాత్మజులచేతఁ
బర్వదివససముత్తుంగ భంగమాలి
కాతతులచేతఁ బ్రజలకు భీతిగొలుపు
జలధి ద్రవ్వించి మించిన సగరు డతఁడు. 3194

గీ. మహిపు డా సగరున కసమంజసుఁడను
నందనుఁడు గల్గినట్లు వి న్నాము మేము;
క్రూరకర్ము నా సుతు జనకుండు రోసి
యడవులకుఁ ద్రోసె బ్రదికియున్నన్నినాళ్ళు. 3195

గీ. అట్టి యసమంజునకుఁ బుట్టె నంశుమంతుఁ
డతనికి దిలీపుఁ డనియెడు సుతుఁడు గలిగె;
ఆ దిలీప భూపతికి మహాతపస్వి
ప్రథితచరితుండునగు భగీరథుఁడు పుట్టె. 3196

గీ. ఆ మహీజానికి కకుత్థ్సుఁ డవతరించె
నా యనఘుచేతఁ గాకుత్థ్సులైరి మీరు;
కొమరుఁడై పుట్టె రఘు; వా కకుత్థ్సపతికి
నతని వలననె రాఘవు లైరి మీరు. 3197

గీ. మాన్యుఁ డా రాఘవునకుఁ గల్మాషపాదుఁ
డని ప్రవృద్ధుం డనియుఁ బురుషాదుఁ డనియు
మఱియు సౌదాసుఁ డనియు నామముల వెలయు
దోర్బలపరాక్రముండు పుత్త్రుండు గలిగె. 3198

గీ. ఆతనికి శంఖణుఁడు సుతుఁడై జనించె
జనకుచే ససైన్యమ్ముగాఁ జంపఁబడియె
శంఖణునకు శూరుఁడు సుదర్శనుఁడు పుట్టె
నగ్నివర్ణుఁ డావిభునకు నాత్మజుండు. 3199

గీ. అగ్నివర్ణునకును సుతుఁడయ్యె శీఘ్రుఁ
డతనికి మరుండు జనియించె; న మ్మరునకు
సూనుఁడై జనియించెఁ బ్రశుశ్రుకుండుఁ
వాని కంబరీష ప్రభువరుఁడు పుట్టె. 3200

గీ. జనవిభుం డాతనికి శతసవనకర్త
సురవిభు నిభుండు నగు నహుషుండు పుట్టె;
నాతనికి సత్యపథవర్తి యమలకీర్తి
ధర్మమూర్తి నాభాగుండు దనయుఁ డయ్యె. 3201

క. అతనికి నజ సువ్రతులను
సుతు లిర్వురు గల్గి; రందు సుకృతాత్ముఁ డజ
క్షితిపతి దశరథుఁ గనె నీ
వతనికి నగ్రతనయుండ వైతివి రామా! 3202

క. నీ వితు జ్యేష్ఠుఁడ వైతివి
గావున నీ రాజ్యలక్ష్మి గైకొని ప్రజలం
గావుము జనకునికైవడి
నీ వంశాచార ధర్మనిష్ఠితమతివై! 3203

గీ. పావనేక్ష్వాకు వంశసంభవులలోన
జ్యేష్ఠసుతునకె పట్టాభిషేక మగును
జ్యేష్ఠపుత్త్రుఁ డుండంగఁ గనిష్ఠపుత్త్రుఁ
డుర్వి కభిషిక్తుఁ డగుట కర్హుండు గాఁడు. 3204

ఆ. రామ! కీర్తికామ! రఘుకుల సుస్థిర
ధర్మపథము నీవు దప్పరాదు;
రత్నగర్భ బహుళరాష్ట్రసంపన్నయౌ
ధరణి నేలుమయ్య! తండ్రిఁ బోలి." 3205

# 111_వ సర్గము

క. అని తెల్పి గురువసిష్ఠుఁడు
జకవర! కాకుత్స్థ! రామచంద్రా! జగతిన్
దన యాచార్యుఁడు జనకుఁడు
జననియుఁ బురుషునకు ముగురు సద్గురులు గదా! 3206

ఆ. జన్మకారణులగు జనకుఁడు జననియు
గురువు లగుదు రెందు పురుషులకును;
జ్ఞానదాయియైన యెసంగు నాచార్యుండు
పరమగురుఁడు కాఁడె నరుల కెల్ల. 3207

ఆ. నేను గురుఁడ నగుదు నీ తండ్రికిని నీకు
నా ప్రబోధమునను నడతువేని
నార్యులైన పూర్వు లనుసరించిన యట్టి
పథము దప్పిపోని ప్రభుఁడ వగుదు. 3208

క. శ్రీరామ! యీ సదస్యులు
పౌరులు క్షత్రియులు వైశ్యపౌరవరులు నీ
వారలు గావునఁ బెద్దల
దారి విడక వీరినెల్ల దయనేలఁ దగున్. 3209

ఆ. సాధుశీలురాలు సద్ధర్మపరురాలు
వృద్ధురాలు దల్లి విడువఁగూడ;
దిమెమాట విందువేని సత్పురుషుల
పాడిదప్పనట్టివాఁడ వగుదు. 3210

క. పరిపరి విధముల వేఁడెడి
భరతుని ప్రార్థనము సఫలపఱచెదవేనిన్
స్థిరధర్మపథము దప్పని
చరితార్థుఁడ వగుదు వీవు జననుత రామా!" 3211

చ. అని గురువాడు నిష్టవచనావళులన్ గ్రహియించి రాముఁ "డో
మునివర! పుత్త్రలబ్ధి కయి పూజలు యాత్రలు సువ్రతంబులుం
బొనరిచి సంతతిం బడసి పోషణ లాలన పాలనంబులం
దనిపెడి తల్లిదండ్రుల ఋణంబును పుత్త్రుఁడు దీర్పఁ గల్గునే? 3212

ఆ. ధర్మమూర్తియైన దశరథధారుణీ
జనవిభుండు నాకు జన్మదాత;
యట్టి తండ్రి యెదుట నాడిన సత్యంబు
దబ్బరగ నొనర్పఁ దగునె నాకు?" 3213

క. అని రాముఁడు నిశ్చయముగ
వినుచుట విని భరతుఁ డెంతొ వికలితమతియై
తనకడనున్న సుమంత్రుని
గని గాద్గద్యంబు గదురగా నిట్లనియెన్. 3214

క. "సూత సుమంత్రా! వేగమ
భూతలమున దర్భశయ్యఁ బూన్పుము సత్యం
బూతగ నటుఁ బడియుండెద
భ్రాత కటాక్షించి నా కభయ మిడుదాఁకన్. 3215

గి. అప్పు గుంజుకొనెడి యవనీసురునిఁ బోలి
తిండిలేక కన్నుదెఱవఁ బోక
స్వామి నాకు సుప్రసన్నుఁ డౌదాఁక నీ
పర్ణశాలముందుఁ బండియుందు." 3216

ఆ. అని వచించుమాట వినియు సుమంత్రుండు
కదలి చనక రాముఁ గాంచుచుండఁ
గుంది స్వయముగానె కుశలను గొనితెచ్చి
పఱచుకొని పరుండె భరతుఁ డందు. 3217

గి. రాజఋషిశేఖరుండైన రాముఁ డప్పు
డట్లు ప్రాయోపవిష్టుఁడౌ ననుజుఁ గాంచి
"భరత! నా కడ్డముగ నిట్లు పండియుంట
కేను చేసిన యపకార మేమి చెపుమ! 3218

క. జగతీసురుఁ డొక్కనికే
తగు నిటు సేయంగ నవనితల మేలంగాఁ
దగు క్షత్త్రియకులజున కిటు
దగునే గావింప? నిది స్వధర్మం బగునే? 3219

ఆ. లెమ్ము భరత! యింక లెమ్ము నరోత్తమా!
దారుణాచరణము దగదు నీకు;
వేగమే యయోధ్య కేగి పాలింపుము
పట్టభద్రుఁ డగుచుఁ బ్రజల నెల్ల." 3220

క. అని బోధించుచు నుండఁగ
వినియును భరతుండు శయ్యవీడక ప్రజలం
గనుఁగొని మీ రైనను బ్రా
ర్థన సేయరె రామవిభుని రమ్మని పురికిన్." 3221

చ. అన విని సభ్యు లెల్ల నపు డా భరతుం గని రాకుమార! రా
ముని మన మే మెఱుంగుదుము; పుట్టిన దాదిగ న మ్మహాత్ముఁడున్
దన జనకాజ్ఞ దప్పక యథావిధి దీర్పఁగ నిశ్చయించె; న
య్యనఘుని గ్రమ్మరింపఁ దరమా మముబోంట్లకు వట్టిమాటలన్?

క. *ఆ మాటలు విని రాముఁడు
ప్రేమంబున ననుజుఁ గాంచి "ప్రియులు సుహృత్తుల్
ధీమంతులు ధర్మజ్ఞులు
నే మనుచున్నారొ వింటివేకద భరతా! 3223

ఆ. విమలచరిత! భరత! వీరి వాక్యంబుల
నా వచించుభాషణముల నెంచి
సంప్రతించి లెమ్ము; జలముల నన్నును
సంస్పృశింపు మాత్మశౌచమునకు. 3224

---

* పాఠాంతరము:

క. అను మాటలు విని రాఘవుఁ
డనుజు భరతుఁ గాంచి ప్రియులు ప్రాజ్ఞులు సుహృదుల్
ఘనధర్మజ్ఞులు వీరలు
వినుచు వచనములను వింటివే కద వత్సా! 3223

క. అనినంతనె భరతుఁడు చ
య్యన లేచి జలంబుముట్టి యన్నను శ్రీరా
ముని సంస్పృశించి సభ్యులు
జనావళులు వినఁగ నిట్లు శపథము చేసెన్. 3225

ఆ. "తండ్రి నడుగలేదు ధరణిరాజ్యము నేను;
జనని నడుగు మనుచుఁ బనుపలేదు;
అనఘుఁడైన రాము వనవాసమునకు నా
యనుమతం బొకప్పుడైన లేదు. 3226

క. జనకాజ్ఞ దీర్చుటే త
ప్పనిసరి యగునేని రామభద్రునికై నే
వనిఁ బదునాల్గేఁ డ్లుండెద
నినుఁ డగుచు నయోధ్య నాతఁ డేలుం గాతన్." 3227

క. అను తమ్ముని వచనంబులు
విని రామవిభుండు మిగుల విస్మితుఁ డగుచుం
జనపదజనములుఁ బౌరులు
వినఁగా నిట్లనియె ధర్మవిశ్రుతఫణితిన్. 3228

ఆ. "బ్రదికియున్నవేళఁ బ్రభుఁడైన నా తండ్రి
యమ్ముదానిఁ; గొన్న యట్టిదాని
నతఁడు కుదువయుంచినట్టి దానిని మార్పఁ
దరముగాదు నాకు భరతునకును. 3229

ఆ. జనని కోరుకొనియె సత్యంబు చెల్లింపఁ
దండ్రి యానతిచ్చె ధర్మముగనె;
కాన నేను జేయు కాననవాసంబు
నన్యుఁ డొకఁడు చేయ నర్హుఁ డగునె? 3230

క. భరతుఁడు శాంతుం డనియును
గురుసేవానిరతుఁ డనియుఁ గూడ నెఱుఁగుదున్;
బరిశుద్ధాత్ముఁడు సూనృత
చరితుం డగు నితని కెందు జయ మగుఁ గాతన్. 3231

ఆ. వనమునుండి తిరిగి వచ్చి నేనుం గూడ
ధర్మశీలుఁడైన తమ్ముతోడఁ
బ్రమద మెసఁగ రాజ్యభారంబు వహియించి
ప్రజల నేలువాఁడఁ బ్రమద మెసఁగ" 3232

చ. అని భరతుం గనుంగొని మహాత్ముఁడు రామవిభుండు "వత్స! నీ
జనని వరంబు గోరుటయు సత్యరతుం డగు తండ్రి చేయు నా
జ్ఞను దలదాల్చి వచ్చితిని గాననసీమకు నిట్లు; నీవునుఁ
జనకు నసత్యవాదిగ నొనర్పక యాతనిమాట నిల్పుమీ! 3233

## 112-వ సర్గము

ఆ. అనుపమానతేజు లా భ్రాత లీ రీతిఁ
గూడి మాటలాడుకొనుటఁ గాంచి
సభను జేరియున్న సన్మునుల్ వెఱఁగంది
మేను పులకరింప మెచ్చుకొనిరి. 3234

ఆ. కంటఁ బడకయుండ మింటిపైనుండి ని
ర్జరులు దేవఋషులు పరమఋషులుఁ
గని మహాత్ములైన కాకుత్స్థకులుల నా
పూజ్యసోదరులను బొగడిరపుడు. 3235

ఆ. వీరి పలుకుభంగి వీరి సౌభ్రాతంబుఁ
జూడఁ జూడ నెడఁద సొగయుచుండె;
నలఘుధర్మవిక్రముల వీరిఁ గన్నట్టి
దశరథేశ్వరుండు ధన్యతముఁడు." 3236

ఆ. అనుచు హర్షచిత్తు లగుచు మహర్షులు
దశముఖాసురుని వధంబు దలఁచి
నరవరేణ్యుఁడైన భరతు నుద్దేశించి
హితమృదూక్తు లొలయ నిట్టు లనిరి. 3237

క. వరవంశజుఁడవు సదమల
చరితుండవు ప్రాజ్ఞుఁడవు యశస్వివి నీవో
భరతా! జనకుని సద్గతు
లరయఁ దలఁతువేని రామునాజ్ఞఁ జనఁ దగున్. 3238

గీ. జనకఋణముక్తుఁ డగు రామచంద్రమూర్తి
నరయఁ గోరుచునుందు మే మందఱమును;
బడఁతి కైకేయికిని ఋణపడని కతన
భరత! నీ తండ్రికి లభించెఁ బరమపదము," 3239

క. అని వా రంతర్హితులై
చనునెడ రాముండు వారి సాధువచనముల్
విని మెచ్చి యర్ఘ్యపూజలఁ
దనిపి యనిపె వినయవినమిత ప్రాంజలియై. 3240

క. భరతుం డపుడు నిరాశన్
గరచరణాద్యవయవములు గంపిలుచుండన్
నరవరుఁడగు శ్రీరాముని
కెఱఁగి యెలుఁగు దొట్రిలంగ నిట్లు వచించెన్. 3241

గీ. "రఘుకులోత్తమ! రాజధర్మంబు దలఁచి
యస్మదీయ వంశాచార మవధరించి
కరుణ ననుఁ గాంచి మా తల్లి కైకచేయు
ప్రార్థనంబును మన్నింప నగును నీకు. 3242

ఆ. ఈ యనంతరాజ్య మేకాకిగ భరించి
పౌరజానపదుల బంధుజనులఁ
బ్రగ్గడలను యోధపరివారముల నెల్లఁ
బాలనంబుసేయఁ జాల నేను. 3243

క. జననాథ! రామ! కృషికులు
ఘనుఁడగు పర్జన్యుఁ గోరు కైవడిని సుహృ
జ్జనములు బంధులు పౌరులు
నిన్నుఁ గోరుచునున్నవారు నృపవరు గాఁగన. 3244

గీ. ప్రాజ్ఞుఁడగు నీవు రాజ్యభారము వహించి
పాలనము సేయవలయు నీ ప్రజల నెల్ల;
నీ వయోధ్య యేలుటెగాదు నిఖిలజగతిఁ
గూడ రక్షింపఁ గలవు కాకుత్స్థతిలక!" 3245

క. అని ప్రార్థించుచు భరతుఁడు
జనవిభుఁడగు రామచంద్రుు చరణాబ్జములన్
దనశిరము మోవ మ్రొక్కుచు
వినయంబున మఱియు మఱియు వేడుకొనుటయున్. 3246

క. తామరసపత్రనేత్రుఁడు
శ్యామలదేహుండు సమద హంసస్వరుఁడౌ
రాముఁ డనుజు నొడి నిడుకొని
సామోక్తుల నిట్టు లనియె సహజప్రేమన్. 3247

గీ. "నీవు బుద్ధిమంతుఁడవు స్వభావముననె
మఱియు ప్రాజ్ఞుండ వైతివి గురుల శిక్ష;
నట్లు గావున భరత! యీ యఖిలరాజ్య
మరసి కాపాడుశక్తి నీయందుఁ గలదు. 3248

ఆ. ధర్మవేదులౌ ప్రధానులతోడను
హితులతోడ మంత్రితతులతోడ
మంతనంబుఁజేసి మహితకార్యంబుల
నెల్ల నిర్వహింపు మీవు వత్స! 3249

క. మున్నీరు మేరమీరిన
వెన్నెల జాబిల్లి పొత్తుపీడిన నివ మా
పున్నెపు వలిమలఁ బాసిన
నెన్నఁడు నా తండ్రి మాట నే జవదాటన్. 3250

ఆ. అనుజ! కృపణమతినొ యాశాభిరతినొ నీ
యనుఁగుఁదల్లి చేసినట్టి పనిని
మనసునందుఁ బెట్టుకొనఁ బోక యామెను
గన్నతల్లివలెనె గాంచు మయ్య." 3251

క. అని తెల్పెడి కౌసల్యా
తనయుని బ్రతిపత్సుధాంశుదర్శను రామున్
దినకరతేజోధామున్
గని భరతుఁడు గురు ననుజ్ఞ గని యిట్లనియెన్. 3252

ఆ. "రామ! నీ పవిత్రహేమపాదుకలను
నీ పదాంబుజముల నిలిపి యిమ్ము;
శుభము లొసఁగు నవియె త్రిభువనంబులకును
బాలనంబు సేయుఁ బ్రజల నవియె. 3253

క. అని నంతనె శ్రీరాముఁడు
దనపాదుకలందు నడుగుఁదమ్ముల నిడి య
ల్లన నరిగి వానిం గొను మని
యనుగుందమ్ముని కొసంగె నామోదమునన్. 3254

ఆ. భరతుఁ డపుడు రామపాదుకాయుగళికి
నధికభక్తిఁ బ్రణతు లాచరించి
యచటి సభ్యు లెల్ల నాలకించుచు నుండ
నన్న రాముఁ గాంచి యనియె నిట్టు. 3255

చ. "నరనుత సచ్చరిత్ర! రఘునందన! యీ పదునాలుగేడులున్
బురమును జేరకే జడలుపూని ఫలాదుల నాహరించి యు
ర్వర శయనించుచుండెద భవత్పునరాగమ మెంచుకొంచు; నీ
పరమపదాంకితంబులగు పావలె రాజ్యముసేయు నంతకున్. 3256

క. పదునాల్గేండ్లును గడచిన
తుది గడె నీ దర్శనంబు దొరకక యున్నన్
వదలెదను మేను తావక
పదపద్మధ్యానమునను పావకశిఖలన్." 3257

ఆ. అనిన రామచంద్రుఁ డట్లు నే వచ్చెద
ననుచు మెచ్చి యతని నాదరించి
కరయుగంబు సాచి భరత శత్రుఘ్నుల
నెలమిఁ గౌగిలించి యిట్టు లనియె. 3258

క. "భరతా! జననిం గైకను
బరమ దయం గనుము కోపపడ కెన్నండున్
గురుజనపూజావ్రతమున్
మఱవకుమీ సీతతోడు నా తోడు సుమీ!" 3259

క. అని యానవెట్టి రఘుకుల
వననిధి సోముండు రామవల్లభుఁ డంతన్
గనుదమ్ముల నశ్రులొల్కఁగ
ననుజన్ముల ననునయించి యనిపెం జాలిన్. 3260

ఆ. ధర్మవేది సుప్రతాపుఁడౌ భరతుఁ డా
పాదుకార్చనంబు భక్తిఁ జేసి
తలను దాల్చి రాము వలగొని చని భద్ర
కరిశిరమునఁ బాదుకలను నిలిపె. 3261

ఆ. ఆ హిమాద్రిఁ బోలి యాత్మధర్మస్థిరుం
డైన రామచంద్రుఁ డర్హ రీతిఁ
గురుల మంత్రివరులఁ బురజనంబుల బంధు
జనుల నాదరించి యనిపె నపుడు. 3262

క. కనుగవ లశ్రువు లొలుకఁగఁ
దనయుని వీడ్కొనఁగ లేక తల్లులు వగవన్
వనరుచు రాముఁడె వారల
ననునయమున ననిపి చనియె నాశ్రమమునకున్. 3263

## 113-వ సర్గము

స. అంత నా భరతుండు హర్షంబుతో రాము
పావలఁగొని శిరసా వహించి
శత్రుఘ్నుతోఁ గూడ స్యందనారూఢుఁడై
గురుమహీసురమంత్రివరులు మున్నుఁ
దమ తమ వాహనోత్తమముల నరుగంగఁ
బరివారజనముతో బయలువెడలి
చిత్రకూటు పవిత్ర శిఖరికి వలఁగొని
బహుధాతు చయమణిప్రభలఁ గనుచు

ఆ. మఘువు దెసఁగఁ జనుచు మందాకినీనదిఁ
జేరి యచటి కనతిదూరముననె
యబ్జగర్భతుల్యుఁ డైన భరద్వాజ
మౌనివరుని యాశ్రమంబు గనియె. 3264

క. నరనుతుఁ డగు భరతుం డపు
డరదము డిగి కాలినడనె యాశ్రమపదమున్
దరిసి యట మౌనిఁ గని త
చ్చరణసరోజముల కెఱఁగె సద్భక్తి మెయిన్. 3265

క. భరతాగమమున నపు డా
పరమమునీంద్రుండు హర్షభరితుం డగుచున్
"నరవర! కృతకృత్యుఁడవై
మరలితె శ్రీరామచంద్రు మన్ననఁ గంటే." 3266

క. అని కుశలప్రశ్నంబును
బొనరించుచు నాదరించు మునిభగవానుం
గని భరతుఁ డెల్లవృత్తము
వినిచెన్ సంక్షేపసరణి వినమితశిరుఁడై. 3267

క. గురుఁడును నేనును బ్రియమున
ధరణీభరంబూని ప్రజలఁ దనుపు మటంచున్
బరిపరివిధముల వేఁడఁగ
స్థిరచిత్తుఁడు రాముఁ డిటు వచించె గురునకున్. 3268

ఆ. "నాకుఁ దండ్రి పదియు నాలుగు వర్షముల్
గాన నుండు మనుచు నానతిచ్చెఁ;
బాలనం బొనర్తుఁ బ్రాణపదంబుగా
నా ప్రతిజ్ఞ నిశ్చయం" బటన్న. 3269

క. గురుఁ డపుడు రాముఁ గనుఁగొని
"భరతాగ్రజ! నీ సువర్ణపాదుక లిమ్మా!
ధరణీరాజ్యముఁ బ్రజలం
బరిపాలింపంగ ననియె ప్రతినిధు లగుతన్." 3270

గీ. అనిన రాముండు ప్రాఙ్ముఖుం డగుచు నిలిచి
యడుగుఁదమ్ములఁ బాదుకల్ దొడిగి విడిచి
యుర్వి పరిపాలనంబున కూర్తఁగాఁగ
నాకు వాని నొసంగ నానంద మంది. 3271

క. ఆ పురుషోత్తము వీడ్కొని
శ్రీపాదుకలన్ గ్రహించి సిద్ధార్థుఁడనై
తాపసవర! యిప్పు డయో
ధ్యాపురికిం బోవుచుంటి నాత్మీయులతోన్." 3272

క. అని భరతుఁడు శుభవార్తన్
వినిచిన విని సర్వలోకవిశ్రుతయశుఁ డ
మ్మునిశేఖరుఁ డాతని కి
ట్లనియెన్ శుభసూక్తు లొలయ నానందమునన్. 3273

ఆ. "జనవరేణ్య! సాధుచరిత! పావనశీల!
నీరు పల్లమునను జేరినట్లు
పరమ గురుజన ప్రపత్తి ని న్నెనయుట
యబ్బురంబె? సహజ మగును గాని. 3274

ఆ. ధర్మశీలుఁడవును ధర్మవేత్తవు నైన
నిన్నుఁ బుత్త్రకునిగఁ గన్నకతన
న మ్మహానుభావుఁడగు దశరథుఁడు నీ
జనకుఁ డమృతుఁడై యశంబుఁ గాంచె. 3275

క. అని తన్ను మెచ్చి పొగడెడి
మునిచరణంబులకు మ్రొక్కి ముదలం గొనుచున్
వినతుఁడయి యతని వలఁగొని
చనె భరతుఁ డయోధ్యకపుడు సచివసహితుఁడై. 3276

క. కరితురగరథంబులపై
వరశకటప్రముఖ వివిధవాహనములపై
భరతుని ఘనతరవాహిని
చనె నాతనివెంట రాజధానిముఖముగన్. 3277

క. క్రమముగ చనిచని వారలు
యమునానది నుత్తరించి యమలజలాంచ
త్కమల కుసుమ సంసంగన్
గమనీయతరంగ గంగఁ గనిరి ముదమునన్. 3278

ఆ. భరతుఁ డపుడు బంధు పరివార యుతముగా
విమల సలిల జాహ్నవిని దరించి
శృంగిబేరపురముఁ జేరి క్రమంబుగాఁ
జనుచు భరతుఁ డెదుటఁ గనె నయోధ్య. 3279

ఆ. కన్నతండ్రిలేక యన్నరక్షణలేక
విన్ననగు నయోధ్య వికృతిఁ గాంచి
ఖిన్నుఁ డగుచు నొగల నున్న సారథిఁ జూచి
యెలుఁగుసెదర భరతుఁ డిట్టు లనియె. 3280

క. "పోడిమిసెడి యుత్సాహము
వీడి యయోధ్యాపురంబు విధ్వస్తంబై
పాడుపడినట్టు లున్నది
చూడు మదే యెట్టయెదుట సూత! సుమంత్రా! 3281

## 114-వ సర్గము

గీ. ధరణికాంతుఁడు సత్కీర్తిధాముఁడైన
భరతుఁ డప్పుడు దశదిశాంతరము లొలసి
శ్రావ్యరథఘోషణంబు లెసంగుచుండ
శీఘ్రగతి నయోధ్యాపురిఁ జేరుకొనియె. 3282

గీ. చర దులూక బిడాల నిస్వనిత మగుచు
మానవేభసంచారవిహీన మగుచుఁ
బ్రభ దొఱంగి చీఁకటిగ్రమ్మ బహుళపక్ష
యామినిం బోలి కనుపట్టె నపు డయోధ్య. 3283

సీ. కుజ సమాక్రాంతయై నిజతేజము దొఱంగి
హిమకరు నెడయు రోహిణినిఁ బోలి
యుష్ణాల్పసలిలయై యుత్తప్తవిహగయై
జలజంతులీనయౌ ఝరిని బోలి
కదనాహత తురంగ గజపరివారమై
శిథిలోపకరణమౌ సేనఁ బోలి
పెనుగాలితాఁకున ఫేనంబుతోఁ బొంగి
విరిగిన మున్నీటి తరఁగ బోలి

ఆ. యాజ్యహోమకలన నర్చులు దీపింప
నల్లసిలి హవిష్యహోమమునను
బ్రభ దొఱంగియున్న పావకశిఖఁ బోలి
యా యయోధ్య చిన్నవోయి యుండె. 3284

ఆ. పాననిరతులైన ప్రజల సందడిలేక
ముంగిళులను నలుకు మ్రుగ్గులేక
పగిలి చెదరిపడిన పాత్రలు గల మధు
ప్రపనుబోలియుండె పట్టణంబు. 3285

ఆ. యజ్ఞపరికరములు యాజకులును లేక
శ్రౌతమంత్రహోమరవము లేక
నివురు గ్రమ్మియున్న సవనాంత్యవేదిక
కరణి పురము తేజు దొఱఁగి యుండె. 3286

సీ. జాతిరత్నప్రభాచాక చక్యములేని
క్రొంగొత్తముత్యాలకోవఁ బోలి
హీనపుణ్యమున స్వస్థాన విభ్రష్టమై
ధరఁ బ్రభచెడిపడ్డ తారఁబోలి
మధుపగీతులు పుష్పమంజరులును లేక
వసివాడు నాషాఢవల్లిఁ బోలి
జలధరసంఛన్న శశితారకం బయి
నిర్గతతేజమౌ నింగిఁ బోలి

గీ. యెండవేడిమిచే జల మింకిపోవఁ
గలువ లుడివోవ జలజంతు లలసిపోవఁ
బాడువడి కానఁబడు నడబావిఁ బోలి
రూపు సెడియుండె నపు డయోధ్యాపురంబు. 3287

క. ఆతప తప్తంబై మై
పూఁతలు సడలంగ విగత భూషణ మగుచున్
బ్రేతకళ లొలుకు దేహము
భాతిన్ గనుపట్టుచుండె పట్టణ మెల్లన్. 3288

ఆ. వానకారులందు వరుసలై మిన్నెల్ల
దొరయు నల్లమబ్బు తెరలఁ జిక్కి
మినుకు మినుకు మనెడు నినుని కాంతినిఁబోలి
సిరి తొలంగి యుండెఁ బురవరంబు. 3289

ఆ. పగులువారు నేలఁ బగిలిన కుండలు
క్షీణజలము లగుచుఁ జెదరియుండఁ
గూలిపడిన పానశాలల పోలిక నయో
ధ్యాపురంబు చెన్నుదఱిగియుండె. 3290

ఆ. అహవమున డస్సి యారోహకునిచేత
విడువఁబడి కలంగి బడుగువారి
విగతభూష యగుచు నొగులు గోడిగఁ బోలి
తేజు దక్కియుండె రాజధాని. 3291

క. శరసంధానముచేసిన
వరకోదండంబు శత్రువరుచేఁ దెగుటన్
ధర జాఱిన జ్యావల్లిం
బురుడించి యయోధ్య యపుడు పొలుపరి యుండెన్. 3292

క. నరనుత చరితుఁడు భరతుం
డరదంబున నుండి పురము నాకృతిఁ గనుచున్
దురగముల నడపు సూతున్
బరికించి వచించె నిట్లు భావము చెదరన్. 3293

సీ. వరగీతవాద్యనిస్వనములు పురమందు
మున్నట్లు వినరాకయున్న వేమి?
యగరుధూపంబులు నాసవగంధంబు
లలరు నెత్తావులు వొలయ వేమి?
కరితురంగశతాంగ వరవాహన ధ్వనుల్
వీనులవిందు గావింప వేమి?
సురుచిర మాలికాంబర భూషణాఢ్యులై
జను లుత్సవంబులు సలుప రేమి?

గీ. వార్షికాసారమున మాగువారు శుక్ల
రజనివలె నున్నయది నగరం బదేమి?
యడవులంబట్టి చన్న మా యన్నతోనె
పురవరశ్రీలుఁ బోయెఁ గాఁబోలు సూత! 3294

ఆ. భ్రాత రామవిభుఁడు పండుగువలె నీ య
యోధ్య కేగుదెంచి యుండు టెపుడొ?
యడరు వేసఁగిని నవాబ్దంబు గన్నట్టు
లతనిఁ గాంచి పౌరు లలరు టెపుడొ? 3295

క. తరుణవయస్కులు సుమనో
హారభూషణభూషితాంగు లగు నగరజనుల్
గరువంబునఁ దిరుగాడమిఁ
బురవీథులు చిన్నవోయి పొలుపరి యుండెన్." 3296

ఆ. భరతుఁ డట్లు చింతపడుచు సింహములేని
గిరిగుహాంతరంబు కరణి నున్న
జనక రహిత రాజసౌధంబు దరి కేగి
తేరు డిగ్గి లోనఁ జేరుకొనియె. 3297

ఆ. భాస్కరుండు కానఁ బడక సుపర్వులు
దిగ్గవిడిచినట్టి దినముఁ బోలి
ప్రభ దొఱంగియున్న ప్రభుసంతి పురిఁ గాంచి
భరతుఁ డెంతొ దుఃఖపడియె నపుడు. 3298

## 115-వ సర్గము

క. అంతట భరతుఁడు జనుల
నంతిపురి న్విడిచి శోక మాపఁగలే కా
క్రాంతాశ్రునయనుఁడై ధీ
మంతుల గురులఁ గని యచలమతి నిట్లనియెన్. 3299

క. "నే మిమ్ము వీడి నంది
గ్రామంబున కేగియుండి రామవిరహ చిం
తామితదుఃఖము నోర్చెద
సేమంబుగ నన్ను యిటకుఁ జేరిన దాఁకన్. 3300

క. నరవరుఁడు మృతుం డయ్యెను;
గురుఁడగు మా యన్న వనులకుం జనియుండెన్;
నిరుపమ యశుఁడగు నాతఁడె
ధరణీరాజ్యంబు నేలఁదగు ప్రభుఁడు గదా!" 3301

క. అను భరతుని శుభసూక్తుల
విని గురుఁడును మంత్రివరులు విస్మితులై యో
యనఘ! నినువంటి యాతని
కనురూపము లిట్టినుడువు లగునగు ననుచున్. 3302

ఆ. భ్రాతృవత్సలుఁడవు బంధుప్రియుండవు
నఖిలధర్మరతుఁడవైన నీవు
భక్తియుక్తిఁ బలుకు భాషణంబులను గా
దనఁగ నెవ్వఁ డోపు? వినుతచరిత!" 3303

ఆ. అనుచు వార లట్లు వినుతింప ముదమంది
యంతిపురికి నేగి యనుజుతోడఁ
దల్లులకును మ్రొక్కి యెల్లర సెలవంది
భరతుఁ డరద మెక్కి పయన మయ్యె. 3304

క. ముందుగ గురు భూమీసుర
సందోహము గదలఁ బ్రాగ్దిశా ముఖముగ నా
స్యందనము నడప సూతుఁడు
నందిగ్రామమున కరిగె నరవరుఁ డంతన్. 3305

క. భరతుని వెనుకనె రథ గజ
తురగావళితో భటాళితో సైన్యముతో
బురజనులుఁ జానపదులు
నరిగిరి నాహూతు లయ్యు నందఱు గుములై. 3306

ఆ. భ్రాతృభక్తుఁడైన పరమధర్మాత్ముండు
భరతుఁ డపుడు రామపాదుకలను
శిరమునందుఁ దాల్చి చేరె నందిగ్రామ
మునకుఁ బ్రజలు దన్ను వినుతిసేయ. 3307

ఆ. అట్లు చేరి భరతుఁ డరదంబు డిగి గురుఁ
గాంచి రామపాదుకలను జూపి
"అన్న నాకు విధిగ నప్పగించిన రాజ్య
మివియె ధర్మభంగి నేలఁ గలవు." 3308

ఆ. అనుచుఁ బ్రజలఁ గాంచి వనరుచు నాతండు
ప్రభుఁడు రాము కనకపాదుక లివె;
వెల్లగొడుగుపట్టి వీవుఁడు చామర;
లివియె మేలుఁగూర్చి యేలు మనల. 3309

క. ఈ నిక్షేపము నాకుఁ
క్ష్మానాథుఁడు రాముఁ డొసఁగెఁ గరుణాళుండై
యీ నిధి నేఁ గాపాడెదఁ
గాన విడిచి నగరి కతఁడు క్రమ్మరుదాఁకన్. 3310

ఆ. అడవినుండి రాఘవుఁడు వచ్చినంతనే
మరల నతని దివ్యచరణములకు
స్వయముగానె వాని సంయోజన మొనర్చి
మ్రొక్కి సుకృతి నగుదు ముదము గదుర. 3311

ఆ. అంత నతనిరాజ్య మాతని కర్పించి
భర విముక్తి గాంచి భక్తితోడ
గురునిఁబోలు రామచరణముల్ గొలుచుచు
పాప సమితి నెల్లఁ బాపికొండు. 3312

ఆ. రామచంద్రవిభుఁడు రాజ్యాభిషిక్తుఁడై
నెల్లప్రజలు నలర నేలుచుండ
నవని రాజ్యవిభవ మంతటి కంటె నే
నధికయశము ముదము నందఁ గలను." 3313

క. మానితయశుఁడగు భరతుఁడు
దీనుండై యిట్టు లార్తిఁ దెలిపి మునివరేః
సేనలతో మంత్రులతో
నా నగరినె యుండి రాజ్య మరయుచునుండెన్. 3314

ఆ. భ్రాతరాకఁ గోరి భరతుఁ డా రామాజ్ఞ
పాలనంబుసేయఁ బ్రతినఁ బూని
యతని పాదుకలకె యభిషేక మొనరించి
కొలిచి విధులఁ దెలుపుకొనుచు నుండె. 3315

క. ఈ విధి తా ప్రతినిధియై
సేవకుఁడై కానుకలు విశిష్టక్రియలున్
బావలకు నివేదించుచుఁ
బావనమతి నేలుచుండె భరతుం డవనిన్. 3316

## 116-వ సర్గము

క. భరతుఁడు పాదుకలం గొని
యరుగన్, శ్రీరామచంద్రుఁ డా పుణ్యవనిన్
ధరణిజతో లక్ష్మణుతోఁ
బరమమునులఁ గొలుచుచుండె భక్తినియుక్తిన్. 3317

క. గిరిపుణ్యాశ్రమముల రఘు
వరు నాశ్రయ మంది యున్న వాచంయము లా
సురభీతి నప్పు డొండెడ
కరుగన్ దలపోయుచుండి రన్యోన్యంబున్. 3318

ఆ. వారి బొమ్మనుడుల వారి కన్సన్నల
వారి మంతనముల వైఖరులను
దెలిసి సంశయించి కులపతి దర్శించి
యంజలించి రాముఁ డనియె నిట్లు. 3319

క. "మునిభగవానుఁడ! నా వ
ర్తనమున నెపు డైన సుంత త ప్పగపడెనే?
వనవాసులగు మహర్షులు
ననుఁ గని బెగడొందఁ గారణం బెయ్యదియో! 3320

క. తమ్ముఁడు లక్ష్మణుఁడు ప్రమా
దమ్మునఁ జేసెనొకో తనకుఁ దగని చెడుపనిన్;
మిమ్ము ననుఁ గొలుచు నా సతి
య మ్మహిజ ననద్దమూపెనా మీ యెడలన్." 3321

క. నా విని వృద్ధుఁడె కాక త
పోవృద్ధుండైన మౌని భూతదయాళున్
భూవిభు రాముని సన్నుతి
గావించుచు నిట్టు లనియెఁ గంపితగళుఁడై. 3322

ఆ. "సుభగచరిత! నిరతసువ్రత! యగు సీత
ధర్మపథ మొకింత దప్పిచనునె?
యందుఁ బూజనీయులైన మౌనీంద్రుల
సేవలం దుపేక్ష సేయునోయి? 3323

ఆ. ఈ మునీంద్రు లెల్ల నీ మూలమునఁ దమ
కసురబాధ గలుగు ననుచు వెఱచి
గుంపుగూడి నిన్నుఁ గూర్చియే యిట్టు లొం
డొరులు చెప్పుకొనుచు నున్నవారు. 3324

చ. నరవర! రావణానుజుఁ డనంత బలాఢ్యుఁడు దుర్జయుండు ము
ష్కరుఁ డఘువర్తనుండు మదగర్వితుఁడు న్నరభోజనుండు నౌ
ఖరుఁ డను రక్కసుండు నినుఁ గన్గొని యోర్వక యి వ్వనంబులన్
దిరుగుచు నేఁచుచుండెను మునిప్రకరంబుల నిర్విశంకుఁడై. 3325

సీ. ఆశ్రమస్థుల నెల్ల నదలించు చున్నారు
బహుళోగ్రవికృతరూపములఁ దాల్చి
అగ్నిహోత్రంబుల నార్పుచునున్నారు
పలల శోణితములఁ బాఱఁజల్లి
హవ్య కవ్యంబుల హరియించుచున్నారు
భవ్యాశ్రమముల భీభత్సుచేసి
జపనిష్ఠులనుబట్టి చంపుచు నున్నారు
మదగర్వమున మించి మత్సరించి

గీ. నీవు వచ్చినదాదిగా నీ వనముల
ఖరునితోఁ గూడి యున్న రాక్షసులు మునుల
పట్టి పల్లార్చి బాధలఁ బెట్టుచుండి
రేమిచెప్పుదు నింక శ్రీరామచంద్ర! 3326

క. కావున మునీంద్రు లెల్లరు
నేవనినో దైత్యబాధ కెడమై యుండన్
భావించి నన్ను ప్రేరణ
గావించుచునున్నవారు కాతరమతులై. 3327

క. ఆ యఘువర్తను లెపుడో
యీ యాశ్రమములకుఁ గూడ నేతెంచి మమున్
మాయింతురు నిశ్చయ మిది
యీ యడవిన్ విడిచిపోవ నెంచితి మనఘా! 3328

క. మున్నిట్టి యాశ్రమపద
మి న్నెలవున కెంతొ దవుల నీప్సితఫల సం
పన్నంబై భద్రంబై
యున్నది మే మటకె పోయి యుందుము మరలన్. 3329

ఆ. దురితచరితుఁడైన ఖరుఁడు నీకుం గూడఁ
జెడుగుఁ జేయవచ్చుఁ జేరి యిటకు;
నట్లుగాన నీకు నభిమత మగునేని
రమ్ము మమ్ముఁ గూడి రామచంద్ర! 3330

క. శరచాప ధరుఁడవైనన్
పరబలఖండన కృపాణబాహుఁడవైనన్
దరుణీమణితో నీ భూ
ధరమున నీ వొంటి నుండఁ దగదు కుమారా!" 3331

క. మునిపతి యీ గతిఁ దెలుపుచు
జనపతి వేఁడుకొనుచున్న సమ్మతిలక యా
తని ననునయించి వీడ్కొని
చనె న య్యాశ్రమమువీడి జడదారులతోన్. 3332

చ. మును లటు లేగువేళ రఘుముఖ్యుఁడు రాముఁడుగూడ వెంబడిన్
జని యభినందనాద్యుచిత సత్కృతులం బొనరించి వారి వీ
డ్కొని యుటజంబుఁ జేరుకొని కొన్నిదినంబు లట న్వసించె నె
మ్మనము గలంగుచుండినను మౌనులపైఁ గల గౌరవంబునన్. 3333

# 117–వ సర్గము

## రాముఁ డత్రిమహామునిని దర్శింప నేగుట

క. తనుఁ గనుఁగొన ననుజన్ములు
జనములు వచ్చుటయు మునులు చనుటయు సేనల్
వనమెల్లఁ జెఱచుటయు స్మృతి
నెనసి వగంగూర్చ రాఘవేంద్రుం డంతన్ 3334

క. ఆ యెడ నుండం జాలక
ప్రేయసియగు సీతతోడఁ బ్రియులక్ష్మణుతో
శ్రీయుతుఁడు రాఘవుఁడు చనె
నా యత్రిమహామునీంద్రు నాశ్రమమునకున్. 3335

ఆ. మిత్రతేజుఁడైన యత్రిమునీంద్రుండు
దనకుఁ బ్రణతులైన దాశరథులఁ
బుత్త్రులట్లు దనిపి భూజాత సీతను
గన్నతల్లిఁ బోలె గారవించి. 3336

ఆ. తానె స్వయముగానె దశరథరాముని
నతిథిసత్కృతుల సమాదరించి
యనఘు లక్ష్మణుని మహాభాగయగు సీత
నమృతభాషణముల నాదరించె. 3337

ఆ. అంత న మ్మునీంద్రు డర్ధాంగితోఁ గూడి
వారి నెల్ల విధుల గౌరవించి
యద్భుతప్రభావ ననసూయ సేవింప
ధరణిజాత కప్పు డెఱుకపఱచి. 3338

సీ. "శ్రీరామ! యీ ధర్మచారిణి యనసూయ
మత్సహధర్మిణి మహితచరిత
దశవర్ష దుర్భిక్ష దగ్ధజీవుల నెల్ల
మనుపంగ దన తపోమహిమఁ జేసి
గంగాతరంగిణిఁ బొంగించి భువి నెల్ల
ఫలపూర్ణసస్యసంపదల నించె
నయుత వర్షములు మహాతపం బొనరించె
మునుల తపోవిఘ్నములఁ దొలంచెఁ

గీ. గృచ్ఛ్రచాంద్రాయణాది కోత్కృష్టనియమ
సువ్రతంబులఁ బుణ్యంబుఁ జూఱఁగొనియె;
దశవిభావరు లేకరాత్రముగఁ జేసి
దేవతాళికి నెల్ల సంతృప్తిఁ గూర్చె. 3339

ఆ. అఖిలలోకపూజ్యయైన యీ యనసూయ
తల్లివంటి దగును దనయ! నీకు
జనకరాజపుత్త్రి! సాధ్వి యీ దేవికిఁ
జిత్తమలర సేవఁ జేయుఁగాక!" 3340

క. అని మేలు దెలుప రాముఁడు
విని సీతం గాంచి "వింటివే ముని నుడువుల్
దనియింపుము సంసేవల
ననసూయం బరమమంగళాకాంక్షలతో." 3341

చ. అని విభుఁ డానతీయ జనకాత్మజ యమ్మునిగేహినిం దప
స్విని వలితాంగకన్ బలితశీర్షజఁ గంపితదేహ వృద్ధ సా
ధ్విని ననసూయ నంచితగతిన్ దరిసించి ప్రదక్షిణించి వం
దన మొనరించె భక్తి నిజనామనివాసము లుచ్చరించుచున్. 3342

ఆ. అట్లు వినత యగుచు నవనిజ మునిపత్ని
సేమ మడుగ సంతసించి యామె
ధర్మచారిణియగు ధరణిజఁ గనుఁగొని
హర్ష మెసక మెసఁగ ననియె నిట్లు. 3343

గీ. "భాగ్యవశమున జానకీ! బంధుజనుల
నాత్మగౌరవభోగభాగ్యముల వీడి
విపినవాసావరుద్ధుఁడౌ విభునిఁ గూడి
యడవి కేతెంచి తెంత ధర్మాత్మ వమ్మ! 3344

క. నగరస్థుఁడో వనస్థుఁడొ
యగుణుండో సుగుణమణియొ యఘవర్తనుఁడో
యగుఁ గాక మగఁడు; దైవం
బుగ నాతనిఁ గొలుచు సతికిఁ బుణ్యము లొదవున్. 3345

ఆ. కాముకుండు ఖలుఁడు గడుబేదయైనను
బతియె దైవతంబు పడఁతులకును;
దపముఁ బోలి సంతతముఁ దన్నుఁ గాపాడు
భర్తకంటెఁ బ్రాణబంధుఁ డెవఁడు? 3346

ఆ. కామవశతఁ జేసి కలుషచరిత్రలై
పరపురుషులఁ గోరు తరుణు లెల్ల
నిట్టి ధర్మ మెఱుఁగ కిందు దుష్కీర్తియు
నందు రౌరవంబు నందుచుంద్రు. 3347

గీ. మంచిచెడ్డ లెఱింగిన మహితమతులు
వరగుణోపేతలైన నీవంటి సతులు
ధర్మపథవర్తినులగు యుత్తములఁ బోలి
యమరలోకసుఖంబుల నందఁ గలరు. 3348

క. కావున సహధర్మిణివై
నీ వెప్పటియట్ల నాథునిం బ్రియమారన్
బావనచరితల వడువున
సేవించుచుఁ గీర్తి సుఖముఁ జెందుము సీతా!" 3349

# 118-వ సర్గము

## సీత అనసూయతోఁ బలుకుట

క. అనసూయ యిట్లు తెలుపఁగ
ననసూయామతి గ్రహించి యపనిజ యి-మెన్
మన మలరఁగ వినుతించుచు
ఘనభక్తినియుక్తి మెల్లఁగా ని ట్లనియెన్. 3350

గీ. "దేవి! నీవంటి మహిమాఢ్య కీ విధమగు
విమల ధర్మప్రబోధంబు వింతగాదు;
పతియె దైవంబు సతికను పరమధర్మ
మేను గూడ నెఱింగిన దానునమ్మ! 3351

ఆ. అగుణియైనఁ గొలువఁ దగుఁ బతిన్ సతి యున్నఁ
బితరు లట్లు మిగులఁ బ్రియతముండు
సుస్థిరానురాగి సుగుణుండు సుభగుఁడౌ
విభుని రాము నెట్లు విడువఁ గలను? 3352

గీ. తల్లి కౌసల్యనుం బోలి దశరథేశు
కాంత లందఱ నొకరీతిఁ గాంచునతఁడు
తండ్రి యరగంటఁ జూచిన తరుణినైన
జననిగాఁ గొల్చు నీ రామచంద్రవిభుఁడు. 3353

గీ. విజన భయదాటవుల కేను వెడలునాఁడు
దేవి మా యత్త కౌసల్య దెలిపినట్టి
పరమధర్మంబు లెల్ల నెప్పటికిఁ గూడ
నిలిచియే యుండునమ్మ! నా నెమ్మనమున. 3354

ఆ. నా వివాహవేళఁ బావకు సన్నిధిఁ
గన్నతల్లి నాకుఁ గఱపినట్టి
యార్యసమ్మతంబులగు సతీధర్మంబు
లుల్లమందు నిల్చియుండె నమ్మ! 3355

క. క్రొత్తలుగ నిప్పు డవి నీ
యుత్తమబోధనలచే సముజ్జ్వలితములై
చిత్తమున మెఱసె; సతికి జ
గత్తునఁ బతిసేవకంటె గలవే పదముల్? 3356

క. సావిత్రి మున్ను భర్తను
సేవించియె యిహపరములఁ జిరయశ మందెన్;
నీ వట్టులె పతిఁ గొలుచుచు
దేవీ!పొందితివిగాదె దివ్యపదంబున్. 3357

గీ. సతులతో నుత్తమోత్తమచరిత యైన
దేవతాకాంత రోహిణీదేవి ప్రాణ
పతిని జంద్రునిఁ బాసి నభఃపదమునఁ
గానవచ్చునె యొక క్షణమైనఁ గాని. 3358

క. పతిసేవ దృఢవ్రతలగు
సతు లెల్లరు నాత్మపుణ్యసంపన్మహిమన్
క్షితిఁ గీర్తిఁ గాంచి సర్వో
న్నతి వెల్గుచు నున్నవారు నాకపదమునన్." 3359

క. అని వినయంబునఁ దెలుపఁగ
ననసూయాదేవి పరమహర్షాత్మికయై
జనకజ మూర్ధాఘ్రాణం
బొనరించి వచించె నిట్టు లుత్సాహమునన్. 3360

గి. సాధుసమ్మతములు మనోజ్ఞంబు లగుచు
యుక్తియుక్తంబు లైన నీ సూక్తులు విని
నేను సంప్రీతి నందితి; నీకు నేది
ప్రియమొ వచియింపు మిపుడ తీర్చెదను సీత! 3361

## అనసూయ సీత కంగరాగాదుల నిచ్చుట

క. "విప్పగు దృఢనియమంబుల
గొప్పతపము చేసి చూఱఁగొంటి మహిమ నీ
విప్పుడు గోరున దేమో
చెప్పుము నెరవేర్తు నో శుచిస్మితవదనా!" 3362

ఆ. అని వచింప సీత యాశ్చర్యభరితయై
మృదుల మందహాస వదన యగుచు
"నంబ! మంచిమాటయంటి వంతియచాలు
నన్నియును లభించినట్లె నాకు." 3363

క. అన విని ధర్మనిరతయగు
ననసూయాదేవి మఱియు హర్షాన్వితయై
"తనయా! నా యానందం
బును సార్థకపఱచుకొందుఁ; బొందుదుఁ దృప్తిన్. 3364

క. సదమలచరితా! సీతా!
యిదె దివ్యప్రసవమాల్య; మిది యనులేపం;
బిదె యంగరాగ; మిదె మదుఁ;
గిదె భూషాతతి గ్రహింపు మిచ్చెద నీకున్. 3365

క. జానకి! యివియెల్లను నీ
మేనికిఁ దేజంబుగూర్చు; మే లొసఁగూర్చున్;
వీనిని నిత్యము దాలిచి
నీ నాథుని శ్రీసనాథునిం జేయఁగదే!" 3366

ఆ. అనుచుఁ బ్రేమమీఱ ననసూయ యొసఁగిన
యంగరాగభూషణాంబరముల
దివ్యపుష్పమాల్యభవ్యలేపనముల
నంజలించి సీత యందుకొనియె. 3367

ఆ. అట్లు స్వీకరించి యతిభక్తితోఁ దన
సేవసేయుచున్న సీతఁ గాంచి
ఘనతపోనిధాన యనసూయ ప్రియమున
నామె నాదరించి నడిగె నిట్లు. 3368

గీ. "అనఘుఁడగు రాఘవుండు స్వయంవరమున
నిన్ను గ్రహియించె నని మున్ను విన్నదాన;
సీత! నీ పెండ్లిచరిత యథాతథముగ
నిపుడు వినఁ గోరెదను వచియింపు మమ్మ!" 3369

క. అనినంతనె యా జానకి
యనసూయకు ధర్మనిరత కనఘచరితకున్
దన కల్యాణచరిత్రము
వినిపింపం దొడఁగె నిటు సవిస్తరభంగిన్. 3370

## సీత తన కల్యాణచరితము ననసూయకు విన్నవించుట

క. "వీరుఁడు క్షత్త్రియధర్మా
చారుఁడు మిథిలేశ్వరుండు జననుతుఁడు మహా
ధీరుఁడు జనకుఁడు ధర్మో
దారుండై యేలుచుండె ధరణీతలమున 3371

ఆ. యజ్ఞశాలకొఱకు నా ప్రభుం డొకనాఁడు
నేల దున్నుచుండఁ జాలునుండి
యుర్విఁ జీల్చుకొనుచు నుద్భవం బంది నే
నతని కాత్మజాత నైనదాన. 3372

గీ. ఓషధుల నెల్లఁ బిడికిట నుంచి ధాత్రి
నంకురారోపణముసేయు నా ప్రభుండు
మన్నుగ్రమ్మిన మెయినున్న నన్నుఁ గాంచి
యద్భుతానందపరవశుఁ డయ్యె నపుడు. 3373

క. అనపత్యుండగు జనకుం
డనుకంప న్నను నిజాంక మందు స్వయముగా
నునుచుకొని ప్రేమభావం
బునఁ గన్నకొమార్తెగాఁగ బుద్ధిఁ దలంచెన్. 3374

గీ. అప్పు డంతరిక్షమునుండి "యవనినాథ!
ధర్మకలన నీ కీ బిడ్డ తనయ యయ్యె"
ననుచు నాకాశవాణి యత్యద్భుతముగ
మానవాతీతసూక్తుల నానతిచ్చె. 3375

క. మి న్నట్లు పలికినంతన
యన్నరపతి ధర్మమూర్తియైన మహీశికిన్
న న్నియ్యఁగ నాయమయును
గన్నమ్మయ పోలి పెంచె గారాబమునన్. 3376

గీ. అంత నల్లారుముద్దుగా నంతిపురని
బెరిగి పెండిలియీడునఁ దిరుగుచున్న
నన్నుఁ గని చింతపడసాగెఁ గన్నతండ్రి
ధనవినాశంబుగన్న పేదయును బోలి. 3377

ధరణిం దనయలఁ గాంచిన
పురుషుఁడు పురుహూత తుల్యపూజ్యుండైనన్
సరివారల గౌరవారలఁ
దిరస్కృతుల నందవలయు దీనుం డగుచున్. 3378

అట్టి ఘటన తనకు నచిరకాలముననే
గలుగు ననుచు దుఃఖజలధి మునిఁగి
తరణిలేని నరునికరణి నా జనకుండు
దీరమునకుఁ జేర నేరఁ డయ్యె. 3379

ఉర్వీనాథుఁ డపు డయోనిజ నగు నాకుఁ
దగినవరుని గూర్పఁ దలఁచి తలఁచి
యట్టి ప్రభుని నెందు నరయఁ జాలక స్వయం
వరమహోత్సవంబు జరుప నెంచె. 3380

వరుణుఁడు మును వరధనువున్
దరుగని దొన లిచ్చె జనకునకు మఖవేళన్
బరువగు నా విల్లెత్తఁగ
శరముదొడుగఁ దరముగాదు జగతిజనులకున్. 3381

అపుడు మిథిలేశ్వరుఁడు నా స్వయంవరమున
కెల్ల నృపుల రావించి యా విల్లు చూపి
దీని నెక్కిడు వీరపృథ్వీవరునకుఁ
దనయ నిచ్చెద ననుచు సత్యంబుఁ జేసె. 3382

భరమున గిరినిభమగు నా
శరాసనము గదపనైనఁ జాలక భూమీ
శ్వరు లా ధనుర్వరంబున
కెఱఁగి చనిరి విన్న నగుచు నిరవుల కంతన్. 3383

ఆ. కాల మట్లు గడువఁ గౌశికమునితోడ
రఘువరేణ్యుఁడైన రామభద్రుఁ
డనుజుఁడైన లక్ష్మణునిఁ గూడి వచ్చె నా
జనకుఁ డాచరించు జన్నమునకు. 3384

ఆ. అపుడు జనకుచేత నర్చితుఁడై మౌని
యెలమి రామలక్ష్మణులను జూపి
దాశరథులు వీరు ధరణీశ! నా ధను
ర్వరముఁ జూడ నిటకు వచ్చినారు. 3385

క. జననాథ! దివ్యమగు నా
ధనువున్ రామునకుఁ జూపఁ దగు నని తెలుపన్
విని జనకుఁడు దెప్పించెన్
దనభృత్యుల నంపి తత్క్షణంబున దానిన్. 3386

గీ. ఘనబలుండగు రాముఁ డా కార్ముకమును
క్షణములో నెత్తిపట్టి సజ్యంబు చేసి
పూరణముచేయుచో నడుమునకు విరిగి
యది యశనిపాతరవముతో నవనిఁ బడియె. 3387

గీ. సత్యవాదియౌ జనకుఁ డా క్షణమె నన్ను
నతని కర్పింప జలపాత్ర మందుకొనఁగఁ
దండ్రియానతి గొనకుండఁ దా గ్రహింపఁ
జాల నని తెల్పె శ్రీరామచంద్రు డపుడు. 3388

గీ. అంత నా జనకుం డయోధ్యాధినాథు
దశరథుని వృద్ధు రప్పించి తదనుమతిని
రామునకు నన్ను లక్ష్మణస్వామి కపుడె
యూర్మిళను మత్సహోదరి నొసఁగెఁ బేర్మి. 3389

క. ఈ రీతి స్వయంవరమున
శ్రీరామునిదేవి నగుచు స్థిరచిత్తముతో
నా రాముని దైవంబుగ
నారాధన సేయుచుంటి ననురక్తి మెయిన్." 3390

# 119-వ సర్గము

ఆ. అనుచు విశదపఱుప ననసూయ ధర్మజ్ఞ
య మ్మనోజ్ఞవృత్త మాలకించి
సీతఁ గౌఁగిలించి శీర్షంబు మూర్కొని
హిత సుభాషితముల నిట్టు లనియె. 3391

క. "ప్రత్యక్షరపదమధురం
బత్యంతశుభావహంబు ననఘంబును సం
స్తుత్య మగు నీ స్వయంవర
సత్యచరిత వింటినమ్మ! జనకతనూజా! 3392

సీ. శ్రీమంతుఁడైన నభోమణి శుభకర
యామిని కల్పించి యస్తమించె
దినమెల్ల మేఁతకై తిరిగి గూండ్లకుఁ జేరు
విహగస్వనంబులు వినఁగ వచ్చె
స్నానార్ద్రదేహులై సలిలపూరిత కమం
డలులయి వచ్చుచున్నారు మునులు
విధ్యుక్తముగ ఋషుల్ వేల్చు నగ్నులఁ బొగల్
గ్రమ్ముచుండెఁ గపోతకంఠకాంతి

గీ. స్వల్పపత్రంబులైన భూజములుగూడఁ
గ్రమ్ముకొని దట్టమైనట్లు గాన వచ్చె
హెచ్చుగా వృక్షములులేని యిచటఁ గూడ
దెసలు గానరాకున్నవి తిమిరవశత. 3393

క. తిరుగాడుచుండె రజనీ
చరసత్త్వము లిందునందు సమవేతములై
పరమతపోవనమృగములు
పరుండియున్నాయవి వేదిపదముల నిదురన్. 3394

క. సీతా! చుక్కలతోడన్
రాత్రిరి యేతెంచె నంబరంబున నదిగో!
శీతాంశుఁడు జ్యోత్స్నా వి
ద్యోతితుఁడై కానవచ్చుచుండె నుదితుఁడై. 3395

క. నే మెచ్చి సెల వొసంగితి
నీ మృదుమధురోక్తి యెలమి నించె న్నాకున్
రామవిభు సేవ సేయఁగ
భూమిజ! నీ వతని కడకుఁ బొ మ్మింక వెసన్. 3396

ఆ. సీత! నీకు నేనుఁ బ్రీతిమై నిచ్చిన
నవ్యదివ్యభూషణముల నెల్ల
నేను జూచుచుండఁగా నిచ్చటనె దాల్చి
నాకు సంతసం బొనర్పు మమ్మ!" 3397

క. అన నల్లె యలంకృతయై
యనసూయకుఁ బ్రణత యగుచు నవనిజ యపు డ
మ్మునిపత్ని సెలవు గైకొని
చనియెన్ శ్రీరాముకడకు సమ్మోదమునన్. 3398

క. ఆ నగలు దాల్చి వచ్చిన
జానకి దర్శించి రామచంద్రప్రభుఁడున్
మానసమున ననసూయా
నూనప్రియసత్కృతికి సముత్సుకుఁ డయ్యెన్. 3399

ఆ. మౌనిపత్ని యిడిన కానుకలం గూర్చి
ధరణిజాత సర్వ మెఱుకపఱుప
మనుజదుర్లభంబు లని రామలక్ష్మణుల్
మిగుల మెచ్చుకొనిరి నగలఁ గాంచి 3400

ఆ. పూర్ణచంద్రముఖుఁడు పురుషోత్తముఁడు రాముఁ
డచటి మునుల యర్చ లందుకొనుచుఁ
దనివి గాంచి పుణ్యదాత్రియౌ నా రాత్రి
యత్రి యాశ్రమంబునందుఁ గడపె. 3401

ఆ. వేగినంతఁ గల్య విధుల నిర్వర్తించి
ధర్మనిరతులైన దాశరథులు
అగ్నికృతులఁ దీర్చి యాసీనులై యున్న
మౌనివరుల కెఱఁగి పైనమైరి. 3402

ఉ. అత్తఱి న మ్మునుల్ దశరథాత్మజు రామునిఁ గాంచి "యిచ్చటన్
నెత్తురుద్రావు సత్త్వము లనేకము లున్నవి మానవాశనుల్
మత్తిలి యేమఱిల్లు మునిమండలిఁ జంపుచునున్నవారు రా
జోత్తమ! యి మ్మహోగ్రవనినుండి చనందగు జాగరూకతన్. 3403

ఆ. మునులు పండ్లు కందమూలముల్ గొనితేరఁ
బోవుచుండునట్టి త్రోవ యిదియె;
యీ పథంబుఁబట్టి యీ వప్రముత్తత
దండకాటవులకుఁ దరల వచ్చు." 3404

ఆ. అనుచు నంజలించి యా మౌనిశేఖరుల్
స్వస్త్యయనముచేసి సాగనంప
వనముఁ జేరె రాముఁ డనుజుతో సీతతో
జలదమండలమును సవితఁబోలి. 3405

అయోధ్యాకాండము సంపూర్ణము

